సి.పి. బ్రౌను

# తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు

C.P. Brown

విద్యార్థుల కోసం ప్రత్యేకంగా సవరించబడినది



Specially revised for Students

# TELUGU-ENGLISH DICTIONARY

సి.పి. బ్రౌన్

# తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు

*(విద్యార్థుల కోసం ప్రత్యేకంగా పరిష్కరించినది)*

ఎడిటరు :

డాక్టరు వెలగా వెంకటప్పయ్య పిహెచ్.డి.

**నవరత్న బుక్ హౌస్**

28-22-20, రహిమాన్ వీధి, అరండల్‌పేట, విజయవాడ - 2

సి.పి. బ్రౌన్
**తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు**

ఎడిటరు :
డాక్టరు **వెలగా వెంకటప్పయ్య**, పి.హెచ్.డి.



డి.టి.పి. :
**లిల్లీ గ్రాఫిక్స్, తెనాలి.**

Rs. 600-00

ముద్రణ :
**పరమేశ్వరి ఆఫ్‌సెట్ ప్రింటర్స్,**
విజయవాడ - 520 002.

# విషయ సూచిక

# మనవి

తెలుగు సూర్యుడు అన దగిన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ – ఒక ఉన్నతోద్యోగిగా భారతదేశంలో అడుగు పెట్టారు. తన శక్తియుక్తులు, తన సంపద పూర్తిగా తెలుగు భాషకోసం వినియోగించారు. నిస్తేజంగా ఉన్న తెలుగు భాషకు జవజీవాలు కల్పించారు. శిధిలమై పోతున్న పలు రాత ప్రతులకు తిరగరాయించారు. కొన్ని ముద్రించారు. కొన్ని స్వయంగా సిద్ధం చేశారు. వీటిలో బ్రౌన్ తెలుగు – ఇంగ్లీషు, ఇంగ్లీషు – తెలుగు నిఘంటువులు ప్రధానమైనవి. దాదాపు 150 సంవత్సరాల కిందట తొలి ముద్రణ జరిగినా – ఇప్పటికీ వీటి అవసరం ఉందని గమనించి అతి స్వల్ప సవరణలతో 1903లో వెలువడిన ప్రతిని పునర్ముద్రిస్తున్నాం.

బ్రౌన్ నిఘంటువు చాల విస్తృతమైనది. వాడుకలో గల పదాలను నిఘంటువులలో చేర్చిన తొలి నిఘంటువు. ఈ ఘనత బ్రౌన్‌కే దక్కుతుంది. దీంతో బాటు – అనేక ప్రయోగాలు, ఉదాహరణలు హెచ్చు పదాలకు ఇవ్వడం వలన – ఈ నిఘంటువు బాగా విస్తరించింది. ఈ నిఘంటువు ముఖ్యంగా విద్యార్థులకు ఉపకరించాలనే సదుద్దేశంతో కొద్దిపాటి మార్పులు చేయడం జరిగింది.

1 మౌలిక పదాలు దాదాపు యథాతథంగా ఉంచాం. విదేశీ ఉద్యోగుల కోసం ఉద్దేశించిన తెలుగు పదాలకు ఆంగ్లంలో ఇచ్చిన ఉచ్ఛారణలను తొలగించాం.

2 అంతేగాక విద్యార్థులకు అనవసరం అని భావించి సైనికులకు, ఓడలకు, సముద్రానికి, మిలటరీకి సంబంధించిన పదాలు, అశ్లీలమైన పదాలు తొలగించడం జరిగింది.

3 ఇందు కొన్ని పదాలు అనగా – శలవు బదులు సెలవు అని మార్చడం జరిగింది. ఇంకా పలు వాడుక పదాలు స్వీకరించడం జరిగింది.

ఈ నిఘంటు పునర్ముద్రణలో ఎనలేని సాయం అందించిన పాలడుగు వెంకట్రామయ్యగారికి, సహజకవి అయినాల మల్లేశ్వరరావుగారికి కృతజ్ఞతాభివందనాలు తెలియ జేస్తున్నాను.

ఈ గ్రంథాన్ని విద్యార్థిలోకం సమాదరిస్తుందని నా ఆకాంక్ష

వెలగా వెంకటప్పయ్య
ఎడిటరు

# సి.పి బ్రౌన్ (1798 - 1884)

## తెలుగువారికి ప్రాతః స్మరణీయులు

భారతదేశ చరిత్రలో ఆంగ్లపాలనా కాలం అనటం కంటే ఆంగ్లపాలకుల దోపిడీ కాలం అనటం సమంజసంగా వుంటుంది. రాజకీయ బలాన్ని మరింత లాభాలకు వినియోగింపవలెనన్నదే నాటి కంపెనీ ప్రభుత్వ లక్ష్యం. మరు భూములలో మంచినీటి బావులవలె కొందరు ఆంగ్లేయులు భారతీయ సంస్కృతిని నాగరికతను అర్థం చేసుకుని మనకు మహోపకారం చేశారు. వారిలో తెలుగు ప్రజలకు సంబంధించినంతవరకు చిరస్మరణీయులు నలుగురు.

1. ఆనాడు దత్తమండలాలుగా పేరుగావించిన రాయలసీమ జిల్లాల మొదటి కలెక్టరుగా, ఈ ప్రాంతంలో శాంతిభద్రతలను నెలకొల్పి, పాళెగాళ్ల అరాచకాలను అణచివేసి, 'మండ్రోలయ్య'గా ప్రజల మన్ననలందుకున్న వారు సర్ థామస్ మన్రో.
2. మన దేశ చరిత్రకు కావలసిన ముడి సరుకును కైఫియత్తుల రూపంలో అందించిన మహనీయులు కల్నల్ కాలిన్స్ మెకెంజీ.
3. అపారమైన కృష్ణా, గోదావరీ జలాలకు అడ్డంగా ఆనకట్ట నిర్మింపజేసి తెలుగు ప్రజలకు అన్నదాతగా విఖ్యాతుడైనవారు సర్ ఆర్థర్ కాటన్.
4. మినుకుమినుకు మంటున్న తెలుగు వాఙ్మయ దీపాన్ని స్నేహసిక్తం చేసి, ప్రజ్వలింప చేసిన ఆంధ్రభాషోద్ధారకులు సి.పి. బ్రౌన్.

ఈ నలుగురు కారుమేఘాల్లో మెరుపుల్లాంటి మహనీయులు.

ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తండ్రి రెవరెండ్ డేవిడ్ బ్రౌన్ క్రైస్తవ మత ప్రచారకుడిగా 1786 లో కోల్‌కతా వచ్చారు. హిందూ మతాచారాలను అవగతం చేసుకొనే లక్ష్యంతో భారతీయ భాషలను సేర్చుకున్నారు. ప్రాచ్యభాషా సంస్కృతులపట్ల ఆదరాభిమానాలు కలవారు డేవిడ్ బ్రౌన్.

డేవిడ్ బ్రౌన్, కౌలే దంపతుల రెండవ కుమారుడిగా సి.పి. బ్రౌన్ 1798 నవంబరు 10వ తేదీన కోల్‌కతాలో జన్మించాడు. తండ్రి మరణం తర్వాత బ్రౌన్ కుటుంబం ఇంగ్లాండుకు వెళ్ళిపోయింది. ఇండియాలో, ఈస్టిండియా కంపెనీ ఉద్యోగానికి మొదటి మెట్టుగా బ్రౌన్‌ను లండన్ (హెర్ట్‌ఫర్డ్) లోని హెయిల్ బరీ

కాలేజీలో చేర్పించారు. ఈ కాలేజీలో సంస్కృతం బోధించేవారు. సంస్కృతంలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు 'బంగారు పతకాలు' యిచ్చేవారు. ఆ పతకం అంచు చుట్టూ "తత్ సుఖం సాత్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజం" అన్న సంస్కృత సూక్తి ఒకవైపు, మరోవైపు 'శ్రీవిద్యావరాహ' అని చెక్కబడి వుండేది. ఆవిధంగా బ్రౌన్ సంస్కృతాభ్యాసం సాగించి బంగారు పతకం పొందారు.

కంపెనీ ప్రభుత్వం బ్రౌన్ సోదరులిద్దరినీ ఎన్నుకొని బెంగాల్ సర్వీసుకు, మద్రాను సర్వీసుకు ఎంపిక చేసింది. తెలుగు వారి అదృష్టం కొద్దీ సి.పి. బ్రౌన్ మద్రాసుకు కేటాయింపబడ్డారు.

1817 లో ఆగస్టు 4వ తేదీన బ్రౌన్ మద్రాసులో కాలు పెట్టాడు. అప్పటికి ప్రపంచంలో తెలుగు భాష ఒకటి వుంది అనేది కూడా అతనికి తెలియదు. అప్పటికాతని వయసు పందొమ్మిదేళ్ళు. ఫోర్ట్‌సెంట్ జార్జి కాలేజీలో శిక్షణ కోసం చేరారు. వెలగపూడి కోదండరామ పంతులు వద్ద తెలుగు అక్షరాలు నేర్చుకొన్నారు. పదహారు నెలల్లో తెలుగులో మంచి ప్రావీణ్యం సంపాదించారు. తెలుగు నేర్పే పండితులకు ఇంగ్లీషు బొత్తిగా తెలియని రోజులవి.

1820 లో సర్ థామస్ మన్రో మద్రాసు గవర్నరుగా చేరారు. కంపెనీ ఉద్యోగులందరూ దేశ భాషలలో ప్రావీణ్యం సంపాదించాలనీ, ప్రజలు భాషలోనే ప్రభుత్వ వ్యవహారాలను సాగించాలని ఆదేశించారు. మన్రో తన 'కాన్వొకేషన్' ఉపన్యాసంలో చేసిన ప్రబోధం బ్రౌన్ మనసులో మంత్రోపదేశంగా నాటుకొన్నది.

1820 ఆగస్టులో బ్రౌన్ కడపలో ఉద్యోగజీవితం ప్రారంభించారు. కడప కలెక్టరుకు అసిస్టెంటుగా వుండేవారు. అప్పటి కలెక్టరు హన్‌బరి తెలుగులో అనర్గళంగా మాట్లాడేవారు. ఆయనలాగా మాట్లాడాలని నిశ్చయించుకున్నారు బ్రౌన్.

1820 – 22 చివరి వరకు కడపలో పనిచేశారు. కొంతకాలం మచిలీపట్నం, గుంటూరు, చిత్తూరు, తిరునల్వేలి మున్నగు చ్లోట పనిచేశారు. 1826 – 29 మధ్య కడపలో మరోసారి ఉద్యోగం చేశారు.

తెలుగు సాహిత్యానికి సుక్షేత్రమైన కడపలో ప్రధాన కార్యస్థానాన్ని నెలకొల్పారు. ఆయన పలు చోట్ల పని చేసినా ఎక్కడా స్థిరాస్తి సంపాదించలేదు. కడపలో పెద్ద బంగళా, తోట కొన్నాడు. అప్పట్లో అతని వేతనం 5 – 6 వందలకు మించదు.

బంగాళాలో పెద్ద గ్రంథాలయం నెలకొల్పారు. సొంత డబ్బుతో పండితులను నియమించారు. బంగళాను 'సాహిత్య కర్మాగారం' గా రూపొందించారు.

అవిద్య తాండవం చేస్తున్న కాలమది. చదువుకొన్న తెలుగు యువకులు చాలా అరుదుగా వున్న కాలమది. 1821 లో కడపలో రెండు పాఠశాలలు ప్రారంభించారు. ఉచితంగా తెలుగు, హిందుస్తానీలలో చదువు చెప్పించారు. ఆ పాఠశాలలో దేశీయ ఉపాధ్యాయులను నియమించారు. విద్యార్థులకు ఉచిత భోజన సౌక్యరం కల్పించారు.

కడపలోని బంగళా, తోట వ్యవహారాలన్నింటినీ బ్రౌన్‌కు అత్యంత విశ్వాస పాత్రుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి చూచుకొనేవారు. బ్రౌన్ ఎక్కడ పనిచేస్తున్నా కడపలోని బంగళా, తోట, గ్రంథ పరిష్కరణ, గ్రంథ సేకరణ మున్నగు విషయాలను కృష్ణారెడ్డి ద్వారా జాబుల మూలంగా తెలుసుకొనేవారు.

మచిలీపట్నంలో కూడా రెండు పాఠశాలలను ప్రారంభించారు. అక్కడ కూడా ఉచిత భోజన వసతి కల్పించారు.

1824 లో అబేడుబాయ్ రాసిన "హిందూ మేనర్స్, కస్టమ్స్ అండ్ సెర్మనీస్" పుస్తకం చదువుతుండగా వేమన ప్రస్తావన కన్పించింది. వేమన పట్ల శ్రద్ధ పెరిగింది. వేమన పద్యాలు గల తాటాకు ప్రతులెన్నో తెప్పించారు. మచిలీపట్నం కోర్టు పండితుడు తిప్పాభట్ల వెంకట శివశాస్త్రి. వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి ఆ దశలో సాహిత్య విద్యా గురువులయ్యారు. వేమన పద్యాలకు అర్థతాత్పర్యాలు బోధించారు. తెలుగు వ్యాకరణ, ఛందస్సూత్రాలు నేర్చుకొన్నాడు బ్రౌన్.

1825 లో రాజమండ్రికి బదిలీ అయి ఆంధ్ర మహాభారతం చదవసాగారు. అప్పకవీయం, కవిజనాశ్రయం మున్నగు వాటిని జీర్ణించుకున్నారు. తెలుగు భాషా సాహిత్యాల అధ్యయనం ముమ్మరంగా సాగించారు. అగ్గి పురుగులకు ఆహుతి కానున్న తెలుగు కావ్యాల రాత ప్రతులను సేకరించారు. కొంత డబ్బుతో పండితులను, రాయసగాళ్ళను పెట్టి కావ్య పరిష్కరణ, శుద్ధప్రతులు తయారు చేయించారు. ఆంధ్ర మహాభారతాన్ని, భాగవతాన్ని పరిష్కరింప చేసి అచ్చు వేయించినవారు బ్రౌన్. 'నిలువ నీడ లేకుండా పోయిన తెలుగు సరస్వతిని ఆహ్వానించి, తన బంగళాలో ఒక సాహిత్య పర్ణశాల ఏర్పరచి, ఆ వాగ్దేవిని నిండు ముత్తైదువ లాగా నడయాడేటట్లు చేయగలిగారు బ్రౌన్' అన్నారు పరిశోధన సాహసి బంగోరె.

తెలుగుదేశాన్ని ముఖ్యంగా రాయలసీమను కృంగదీసిన కరువులెన్నో వచ్చాయి. వాటిలో ధాత కరువు (1876 - 77) అంతకుముందు వచ్చిన నందన కరువు (1832-33) మహాఘోరమైనవి. నందన కరువునే 'గుంటూరు కరువు'గా చరిత్రకారులు చిత్రించారు. కరువు పరిస్థితులను గురించి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి రాసిన జాబులోని పదజాలం ప్రభుత్వానికి నచ్చలేదు. కరువు (ఫ్యామిన్) అన్న పదానికి బదులుగా 'కొరత' (స్కేర్సిటీ) అని రాయమన్నారు. బ్రౌన్‌ను ప్రభుత్వం మందలించింది. కరువు కాలంలో గుంటూరు జిల్లాలో ఎన్నో గంజి కేంద్రాలు ఏర్పాటు చేయించి ప్రజలను ఆదుకొన్నారు.

1835 - 38 మధ్య సెలవుపై లండన్ వెళ్ళారు. అక్కడ కూడా విశ్రాంతి లేకుండా తెలుగు భాష కొరకు శ్రమించారు. 'ఇండియ హౌస్ లైబ్రరి'లో గుట్టలుగా పడివుండిన దక్షిణ భారత భాషల గ్రంథాలు (లిఖిత ప్రతులు) 2106ను మద్రాసు గ్రంథాలయానికి పంపారు. తిరిగి వచ్చిన తర్వాత వసుచరిత్ర - మనుచరిత్రలకు వ్యాఖ్యలు రాయించారు. కళాపూర్ణోదయం, పల్నాటి వీర చరిత్ర మున్నగు 25 ప్రబంధాలను పరిష్కరింపజేశారు. సంస్కృత గ్రంథాల సేకరణ, పరిష్కరణ చేశారు. దాదాపు రెండు వేల వేమన పద్యాలను సేకరించి వాటిలో 693 పద్యాలను ఇంగ్లీషులోకి అనువాదం చేసి అచ్చు వేయించారు. అలా వేమన పద్యాలకు ప్రపంచంలో విస్తృత ప్రచారం కావించారు.

ఇదంతా పండిత భాషకు సంబంధించిన కృషి. ప్రజా భాషకు మరింత ఎక్కువ కృషి చేశాడు. ప్రజల నోళ్ళలో నానుతూ వచ్చిన చాటువులను, సామెతలను, కథలు, గాథలు, పలుకుబడులను సేకరించాడు. తెలుగు నేర్చుకోదలచిన ఆంగ్లేయుల కోసం ఎన్నో వాచకాలు, వ్యాకరణ గ్రంథాలు రాశాడు. అన్నిటి కన్నా మిన్నగా చెప్పవలసిన పని, నిఘంటు నిర్మాణం. తెనుగు - ఇంగ్లీషు, ఇంగ్లీషు-తెనుగు నిఘంటువులు రాశారు. ఈనాటికీ అవి ప్రామాణికంగా వున్నాయి. జిల్లా నిఘంటువు రాశారు. తెలుగు సాహిత్యం గురించి శిల్పము, జ్యోతిష్యము, కలిశకం, హిజరి మున్నగు వాటిపై పెక్కు వ్యాసాలు రాశారు. రాజుల యుద్ధము అను అనంతపురం చరిత్ర తాతాచారి కథలు, పంచతంత్ర కథలు యిలా ఎన్నో రచనలు చేశారు.

బ్రౌన్‌కు ఆనాటి పండితులు, యితరులు రాసిన జాబుల సంపుటాలు 20కి పైగా వున్నాయి. ఒక్కొక్క సంపుటంలో 400 పేజీలున్నాయి. ఇవన్నీ మద్రాసు ప్రభుత్వ

ఓరియంటల్ మేనుస్క్రిప్టు లైబ్రరీలో వున్నాయి. వీటిలో విలువైన చారిత్రక విషయాలున్నాయి. ప్రతి పైసాను కూడబెట్టి తన కింద పనిచేసే పండితులకు నెలనెలా జీతాలిచ్చేవాడు. ఆర్థికంగా కటకటలాడుతున్నా పుస్తకాల సేకరణ, ప్రచురణ పథకాలను నెలనెలా వందలు ఖర్చు చేసేవాడు. చివరికి 60 వేల రూపాయలు అప్పులు చేశాడు. ఇందులో సగం వడ్డీ –ఇదంతా తెలుగు భాషోద్ధరణ కోసమే. చివరి దశలో అప్పులన్నీ తీర్చారు. బ్రౌన్ మానవతావాది. ప్రతి నెలా 100 – 130 మంది గుడ్డి, కుంటి వారికి సాయం చేసేవారు. అప్పులు చేసి జైలుపాలైన పదుకొండు మందిని 355 రూపాయలిచ్చి విడిపించారు. ఒక దశలో నెలకు సగటున రు.500 రూపాయలు దానధర్మాలకు ఖర్చు చేసేవాడు. కడపలో జరుగనున్న సహగమనాన్ని ఆపు చేయించారు.

ఆంధ్ర సాహిత్యాన్ని ప్రజ్వలింపచేసిన బ్రౌన్ దొర సేవను ప్రశంసిస్తూ, నాటి పండితులు. అద్వైత బ్రహ్మశాస్త్రి యిలా అన్నారు.“సరస్వతికి ప్రస్తుతమందు తమరు ఒకరే నివాసస్థానముగా కనబడుతున్నారు. ఎక్కడ ఏ ఏ విద్యలు దాచబడి వున్నవో అవి అన్నీ తమంతట తామే తమ సన్నిధికి వస్తూ వున్నవి ... తమరు పుచ్చుకొన్న ప్రయాసల వల్ల తేలిన పరిష్కార గ్రంథములు ఆ కల్పాంతమున్ను తమ యొక్క కీర్తిని విస్తరిస్తూ వుంటవి.”

తెలుగు భాషా సాహిత్యల సముద్ధరణ కోసం నిర్విరామంగా కృషి చేసిన సి.పి.బ్రౌన్ 1854 లో పదవీ విరమణ చేసి లండన్‌లో స్థిరపడ్డారు. లండన్ యూనివర్సిటీలో తెలుగు ప్రొఫెసర్‌గా కొంతకాలం పనిచేసి 1884 డిసెంబర్ 12న ఎనభై ఏడవ ఏట కన్ను మూశారు.

క॥ నూరార్లు లెక్క సేయక
పేర్లందిన విబుధ జనుల బిలిపించుచు వే
మార్లర్థ మిచ్చు వితరణి
ఛార్లేసు ఫిలిప్స్ బ్రౌన్ సాహెబు కరుణన్

**- జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

# అనుబంధం - I

## బ్రౌన్ సేకరణల కాలక్రమ సూచి

★ 1825 ఆంధ్రశబ్ద చింతామణి - ఆంగ్లానువాదం (1237) బ్రౌన్ దీనిని 23-7-1825న మళ్ళీ 25-9-1827న రెండుసార్లు అనువదించారు. - అముద్రితం.

★ 1825 జిల్లా నిఘంటువు

★ 1827 ఆంధ్ర గీర్వాణ ఛందము, చెన్నై. ఇది 1977 లో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారిచే పునర్ముద్రితం - ఛందోగ్రంథం.

★ 1827 Notice regarding the names used in the Indian Zodiac MJLS, 1827 No.33 వ్యాసం.

★ 1828 Hindu Sculpture : Asiatic journal, London 1828 V.No.Edition. మొదట ఇది మదరాసు గెజెట్‌లో ప్రకటించినప్పుడు తన పేరు వేసుకోలేదు.

★ 1828 Sutte Prevented. Asiatic Journal, London 1828 V.No.Edition. ఇది కూడా మొదట మదరాసు గెజెట్‌లో ప్రకటించినప్పుడు తన పేరు వేసుకోలేదు.

★ 1829 Verses of Vemana, Moral religious and satirical. Madras, 1939 పునర్ముద్రితం, తెలుగు కావ్యానువాదం

★ 1830 Essay on Trade మద్రాసు గెజెట్‌లో ముద్రించబడింది.

★ 1837 A familiar Analysis of Sanscrit prosody, London, 1869లో లండన్ లోనే ఇది మళ్ళా ముద్రించబడింది. ఛందోగ్రంథం.

★ 1838 'లూకా రాసిన శుభవర్తమానము, మద్రాసు (లూకా సువార్తకు తెలుగు అనువాదము క్రైస్తవ మత సంబంధి.

★ 1839-40 Essay on the Language and Literature of the Telugus,

(ఈ వ్యాసం మొదట Madras Journal of Literature and Science లో రెండు భాగాలుగా 1839 జూలై అక్టోబరు సంచిక లోను, 1840 అక్టోబరు-డిసెంబరు సంచికలోను ప్రకటించారు.)

★ 1840 A Grammar of the Telugu Language - Madras 1857లో చెన్నై మళ్లా ముద్రించబడింది. వ్యాకరణ గ్రంథం

★ 1840 (Jan) Essay on the Creed and Customs and Literature of Jangams; అను పేరుతో Journal of Royal Asiatic Society లో మళ్ళా ప్రకటించారు – వ్యాసం.

★ 1840 (Apr) Notice regarding the sects of Hindu called Tengala and Vadagala - MJLS వ్యాసం.

★ 1840 (Jul) Notice of Some Roman Catholic Books Existing in the Telugu Language MJLS – వ్యాసం.

★ 1840 (Oct) Account of the Basava Purana, the principal book used as religious code by the Jangas MJLS-వ్యాసం.

★ 1840 (Oct) Notice regarding mss in England MJLS కుచేలోపాఖ్యానం.

– ప్రభుని 3 ఆశ్వాలసాలకృతి, చెన్నై – పరిష్కృతం.

★ 1841 నలచక్రవర్తి కథ–రాఘవాచారి కృత ద్విపద కావ్యం, చెన్నై, పరిష్కృతం

★ 1841 Dialogues in Telugu and English for the learners with a grammatical analysis, Madras. ఇది 1853లో మరోసారి చెన్నైలో ముద్రించబడింది. – వాచకం.

★ 1841 సీతాకళ్యాణము, గరుడాచలము తెలుగు యక్షగానములు – చెన్నై

★ 1842 హరిశ్చంద్ర కావ్యము (ద్విపద) గౌరన కృతి– చెన్నై. నవనాథచరిత్ర నుంచి కూడా కొంత భాగం దీంతో కలిపి ముద్రించారు. (పరిష్కృతం)

★ 1843 ఆదిపర్వము (నన్నయ ఆంధ్ర మహాభారతములోనిది.) పరిష్కరణం

★ 1844 వసుచరిత్ర రామరాజ భూషణుని ప్రబంధం జూలూరి అప్పయ్య వ్యాఖ్యానం సహితం – చెన్నై, పరిష్కృతం. 5. 3.

★ 1844 హైదరు చరిత్ర. మరాఠీ గ్రంథానికి తెనుగు అనువాదం. పరిష్కర్త వేటూరి ప్రభాకరశాస్త్రి ఆంధ్రపత్రిక (దినపత్రిక)లో వరుసగా 5–3–1944 నుంచి ప్రకటించారు. 1956లో (...నిడుదవోలు వెంకటరావు గారు) చెన్నై.

★ 1844 Accounts of the Tribes of Maharatta Brahmins; a translation of Maharatta Documents of the Mackenzie MSS.MJLS

★ 1847 (Dec) On the numerals of Balaams name `Christian Observer London - వ్యాసం.

★ 1847 Translation of the Telugu introduction to catalogue of Telugu and Sanscrit MSS in the possession of C.P Brown MJLS 1847 No.33 వ్యాసం.

★ 1849 వైజయంతీ విలాసం – సారంగు తమ్మయ్య కృతి. వ్యాఖ్యాన సహితం–పరిష్కృతం.

★ 1849 Memoirs of Hyder Ali and Tippu Sultan,Madras - మరాఠీ నుంచి లఘు వివరణలతో ఇంగ్లీష్‌లోనికి చేసిన అనువాదం.

★ 1850 కవి రత్నాకరము (సంస్కృతం – తెలుగు లిపి) చెన్నై. పరిష్కృతం 1865లో రెండో ముద్రణ.

★ 1850 Cycle of Table o Hindu and Mahomedan Chronology, Madras. 1851 కీర్తనలు LXVII (చంపూకావ్యం) చెన్నై క్రైస్తవ మత సంబంధి.

★ 1851 మనుచరిత్ర – అల్లసానిపెద్దన కృతి. జూలూరి అప్పయ్య వ్యాఖ్యాన సహితం. చెన్నై – పరిష్కృతం.

★ 1852 జిల్లా నిఘంటువు – మద్రాసు

★ 1852 'బ్రౌణ్య ఇంగ్లీష్ – తెలుగు నిఘంటువు' – మద్రాసు (ఇది 1895లో యం. వెంకటరత్నంగారిచే పరిష్కరించారు. 1974 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారిచే మళ్ళా ముద్రింపబడింది.

★ 1852 'బ్రౌణ్య తెలుగు – ఇంగ్లీష్ నిఘంటువు' చెన్నై (ఇది 1903 లో చెన్నై యం. వెంకటరత్నం W.H. Campbell, కందుకూరిగార్ల సంపాదకత్వంలో పరిష్కరించారు.

★ 1852 'నిస్తర రత్నాకరము' The Jewel Mine of Salvation' ఇది ఒక అజ్ఞాత కవి రాశారు. క్రైస్తవ మత సంబంధమైన పద్యకావ్యం. దీనినే పెంపుచేసి తమిళంలో కూడా ముద్రించారు.

★ 1852 'A catalogue of Irregular Verbs in English Language' - Chennai (వ్యాకరణ గంథం)

★ 1852 English Translation and Exercises and documents printed in the Telugu Reader - Chennai (ఈ వాచకం 1865-67లో రెండోసారి ముద్రించబడింది.)

★ 1852 The Telugu Reader ఆంధ్ర మార్గదర్శి - తెలుగు రీడరు - చెన్నై (ఈ వాచకం కూడా 1865-67లో మళ్ళా ప్రకటించబడింది.

★ 1852 Three teatises on Mirasi Right by F.W. Ellis, Lt.col Blackburne, Sir Thomas Munroe with the remarks made by the Hon. Madras Court of directors 1822 & 1824.

★ 1852 Vakyavali or Exercises in Idioms - English and Telugu, Chennai (ఇవి సంస్కృత ఛందస్సులో కూర్చబడి తెలుగు లిపిలో ప్రకటించబడ్డాయి. (క్రైస్తవ మత సంబంధం.)

★ 1853 The Wars of Rajas - Madras అనంతపురం రాజుల చరిత్ర తెలుగు నుంచి ఇంగ్లీష్‌లోకి అనువదించిన బడింది. The annals of Hande Anantapuram అనే పేరుతో, ఇది గురజాడ అప్పారావుగారి పరిష్కరణతో మళ్ళా ముద్రించారు.

★ 1853 'పాలు చరిత్ర' తెలుగు లిపిలో ఉన్న సంస్కృత పద్య కావ్యం. క్రైస్తవ మత సంబంధి. చెన్నై.

★ 1854 బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటువు - చెన్నై (ఇది 1903 లో చెన్నై మహావాది వెంకటరత్నం, H.H.Campbell, కందుకూరి గారి సంపాదకత్వంలో పరిష్కరించారు. 1996లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్ వారిచే బ్రౌణ్య-తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువుతో కలిపి తిరిగి ముద్రించారు.

★ 1855 తాతాచారి కథలు, గురుజాడ అప్పారావు గారు దీనిని పరిష్కరించగా చెన్నైలో 1926లో వావిళ్ల వారిచే ప్రకటితం. 1951లో మళ్లా ముద్రించారు. 1974లో బంగోరె గారిచే చెన్నైలోనే మరోసారి ప్రకటించారు.

| | |
|---|---|
| ★ 1855 | మిరాశీవాదము – చెన్నై (ఇది తెలుగులో రచింపబడి, ఇంగ్లీష్ లోనికి అనువదింపబడింది. |
| ★ 1855 | English and Hindustani phrasealogy or exercises in Idioms of English and Dakshini - Hindustani - Chennai (వ్యాకరణ గ్రంథం). |
| ★ 1859 | The experience of A. Nicholas' (Edited in English verse London (క్రైస్తవ మత సంబంధం) |
| ★ 1861 | A Titular Memory - London (ఇది చారిత్రకం – ప్రస్తుతం అలభ్యం, దీనిని డాక్టరు. కొత్తపల్లి వీరభద్రరావుగారు పేర్కొన్నారు. సి.పి. బ్రౌన్ పుట 260. |
| ★ 1863 | Carnatic Chronology, London (ఇది చారిత్రకమే) |
| ★ 1864 (Jul) | Telugu Spells MJLS కడప క్రిమినల్ డాక్యుమెంటులకు తెలుగు నుంచి ఇంగ్లీష్ లోనికి అనువాదం. |
| ★ 1866 | Some Account of the Literary life of Charles Philip Brown. London (Resvised edition.London - 1872) దీనిని నిడదవోలువారు తెలుగు లోకి అనువాదం చేసి 1963 మే నెల భారతి మాసపత్రికలో ప్రకటించారు – స్వీయ చరిత్ర. |
| ★ 1871 | On Malabar, Coramandal Qulion etc.JRAS, London |
| ★ 1871 | Essays on the creed and customs of Jangams,JRAS, London. |
| ★ 1909 | Popular Telugu Tales by Tatachari, Chennai (ఇది తాతాచారి కథలకు ఇంగ్లీషు అనువాదం) |
| ★ 1953 | వాణీవిలాసవనమాలిక (టేకుమళ్ళ రంగసాయి)కు ఇంగ్లీషు వ్యాఖ్యానం, చెన్నై. |
| ★ 1967 | Verses of Vemana in Telugu orginal with English renderings, Andhra Pradesh Sahitya Academy - 1977 లో పునర్ముద్రితం. |
| ★ 1973 | "Sumati Satakam" in Telugu original with English Renderings by C.P. Brown - Andhra Pradesh Sahitya Academy (ఈ తెలుగు అనువాదానికి సంపాదకుడు – డాక్టర్ సి.ఆర్.శర్మ. |

# అముద్రితాలు - వివరాలు తెలియనివి

1. అమరకోశం – (సంస్కృతం) తెలుగు వ్యాఖ్యాన సహితం – చెన్నై ముద్రించబడింది, కాని కాలం ఎప్పుడో తెలియదు.
2. అహల్యకథ – పద్మపురాణం ఆంగ్లానువాదం – అముద్రితం.
3. అహల్య వృత్తాంతం – దశావతార చరిత్ర లోనిది – ఆంగ్లానువాదం అముద్రితం. కవిజనాశ్రయం – ఆంగ్లానువాదం.
4. కవి శిరోభూషణం – ఆంగ్లానువాదం.
5. పదనిధి (D.1385) : ఈ నిఘంటువును 1841లో రాశారు. అముద్రితం.
6. ప్రభులింగలీల – ద్విపద కావ్యం (3వ ఆశ్వాసంలోని ఒక భాగానికి చేసిన ఇంగ్లీషు అనువాదం.
7. బాల సరస్వతీయం – ఇంగ్లీషు అనువాదం.
8. భగవద్గీత – (సంస్కృతం – తెలుగులిపి) ఈ పరిష్కృత గ్రంథం చెన్నైలో ప్రచురించారు. కాలం ఎప్పుడో తెలియదు.)
9. 'రేఫఱకారవచ్చుబ్దజ్ఞాపక లోకోపకారము (R-597R, 1209D, 2154) అముద్రితం.
10. "A summary of and an explanatory note in English on *Vani Vilasa Vanamalika* (A Telugu metrical encyclopedia of Hindu literature) of Tekumalla Ranga Sayi. ఇది ప్రచురణ తెలియని వ్యాసం.
11. 'Common Prayer Book' ఇది చెన్నై లో ముద్రించారు. కాలం ఎప్పుడో తెలియదు క్రైస్తవ మత సంబంధం. (సమగ్ర ఆంధ్రసాహిత్యం – 9వ సంపుటం – కుంఫిణీయగం) – ఆరుద్ర.

***- జానమద్ది హనుమచ్ఛాస్త్రి***

*సి.పి. బ్రౌన్ చరిత్ర, 1992 నుండి*

# అనుబంధం - 2

## బ్రౌన్ జీవిత కాలానుక్రమణిక

★ 1798 నవంబర్10 రెవరెండ్ డేవిడ్ బ్రౌన్ (ఫ్రాన్సిస్) కౌలే దంపతుల రెండో కుమారుడుగ జననం – కోల్‌కతా.

**డిసెంబర్ - 2** బాప్టిజం (మత స్నానం)

★ 1812 జూన్ 14 తండ్రి మరణం, తల్లి, ఇతర కుటుంబ సభ్యులతో లండన్‌కు పయనం.

★ 1814 జనవరి 19 హెయిల్‌బరి కళాశాల ప్రవేశం, రెండేళ్ళ చదువు

★ 1816 జూన్ 30 రైటర్ పదవి, ఇచ్చి చెన్నైలో సివిల్ సర్వీస్‌కు కేటాయింపబడటం.

★ 1871 ఆగస్టు 3/4 చెన్నైలో అడుగుపెట్టడం.

ఆగస్టు 13 ఫోర్ట్‌సెంట్ జార్జి కళాశాలలో ప్రవేశం, తెలుగు, మరాఠీ చదవటం.

★ 1820 జూన్ కళాశాల నుండి ఉత్తీర్ణత, సర్‌థామస్ మన్రో స్నాతకోపన్యాసంతో ప్రభావితుడు కావటం.

ఆగస్ట్ కడప కలెక్టరుకు అసిస్టెంటుగా నియామకం.

★ 1821 కడపలో రెండు ఉచిత పాఠశాలలను ప్రారంభించి, తెలుగు హిందుస్తాని భాషలను బోధించటం.

★ 1822 జిల్లాకోర్టు రిజిస్ట్రారుగ మచిలీపట్నంకు బదిలీ.

★ 1823 జడ్జిగారి సెలవు ఖాళిలో తాత్కాలికంగా జడ్జి బాధ్యతలు, కోర్టు నాజర్‌తోపాటు మరికొందరు ఉద్యోగులను సస్పెండ్ చేయటం (తర్వాత ఈ సస్పెన్షన్ ఉత్తర్వులను ప్రభుత్వం రద్దు చేయటం).

| | |
|---|---|
| ★ 1824 | వేమనను గుర్తించటం; ఆబేదుబాయ్ రచించిన గ్రంథంలో వేమన ప్రస్తావన చూశారు; వేమన పద్యాల తాళపత్ర ప్రతుల సేకరణకు పూనుకోవటం; పద్యాలను చదివి,అనువాదానికి ఉపక్రమించటం. పాఠ్యభాగంలో ఎదురైన సమస్యల పరిష్కారం కోసం తెలుగు ఛందస్సు పట్ల అభిరుచి కలగటం. |
| ★ 1825 | రాజమండ్రి కలెక్టరుకు హెడ్ అసిస్టెంటు, మేజిస్ట్రేట్‌గా బదిలీ. సాల్ట్‌దరోగా ఉద్యోగి గవర్రాజును లంచం తీసుకొన్నాడన్న నేరంపై బర్తరఫ్ చేయటం (తర్వాత ప్రభుత్వం ఆ ఉత్తర్వులను రద్దు చేసి, దరోగాను మళ్ళీ ఉద్యోగంలో నియమించటం. |
| ★ 1825 డిశంబర్ | తెలుగు ఛందోగ్రంథం రాతప్రతిని, ప్రచురణార్ధం కాలేజి బోర్డుకు సమర్పించటం. |
| ★ 1826 | కడప జిల్లా కోర్టు రిజిస్ట్రారుగా బదిలీ, కొంతకాలం అసిస్టెంట్ జడ్జి, జాయింట్ క్రిమినల్ జడ్జిగా పని చేయటం, కంబంలోని ఆగ్జిలియం కోర్టు జడ్జిగా వెళ్ళుట. |
| ★ 1827 | తెలుగు ఛందస్సు పై అతని మొదటి పుస్తకం చెన్నై కాలేజి ప్రెస్‌నుంచి వెలువడటం. |
| | కాలేజి తెలుగుశాఖను ప్రధానంగా తెలుగు సంప్రదింపు గ్రంథాలయాన్ని నెలకొల్పటం. |
| ★ 1828 | కాలేజి ప్రింటింగ్ ప్రెస్ అభివృద్ధికి ప్రతిపాదనలు చేయటం. కడపలో బంగళా కొనటం, ఆ బంగళాలో తాను సేకరించిన రాతప్రతులను, గ్రంథాలయాన్ని నెలకొల్పటం, నేటివ్ పండితుల నివాసానికి, గ్రంథ పరిష్కరణ శుద్ధప్రతులు తయారీ, కావ్యాలకు వ్యాఖ్యానాలు మొదలైన వాటికి సౌకర్యాలను ఆ బంగళాలో ఏర్పరచటం. |
| ★ 1829 | వీరి రెండో పుస్తకం 'వేమన పద్యాలు' కాలేజి ప్రెస్‌నుంచి వెలువడటం. |

| | |
|---|---|
| ఫిబ్రవరి 17 | తిరుచినాపల్లిలోని ప్రొవిన్షియల్ కోర్టాఫ్ ఆపీల్ సర్క్యూట్ (సదర్న్ డివిజన్) రిజిస్ట్రారుగా బదిలీ. తెలుగు నిఘంటువు తాలూకు రాతప్రతి ప్రచురణ కొరకు కాలేజి బోర్డుకు పంపటం – వారు దానిని ఎటూ తేల్చక మూలన వేయటం. |
| డిసెంబర్ 11 | రాజమండ్రి అసిస్టెంట్ జడ్జి అండ్ జాయింట్ క్రిమినల్ జడ్జిగా బదిలీ. |
| ★ 1832 డిసెంబర్ | గుంటూరు జిల్లా ఆక్టింగ్ జడ్జిగా చేరడం – గుంటూరు కరువు కాలంలో. |
| ★ 1833 మార్చి19 | చిత్తూరు జిల్లా ఆక్టింగ్ జడ్డిగా బదిలీ – నెలలోపునే రాజమండ్రి ఆగ్జిలియరి కోర్టుకు బదిలీ – రాజమండ్రి – మచిలీపట్నం. |
| | డివిజన్‌లో ఉద్యోగం. మచిలీపట్నంలో తెలుగు ముద్రణశాల స్థాపించే ప్రయత్నం – జయప్రదం కాలేదు. |
| ★ 1834 అక్టోబర్ | చట్ట సంబంధమైన సమస్యల వలయంలో ఇరుక్కొని, కొన్ని ఫోర్జరీలు, కూట సాక్ష్యాల కేసులపై ఇచ్చిన తీర్పులు సరిగా లేవన్న కారణంగా 'డిస్మిస్' కావటం. |
| నవంబర్ 14 | బ్రౌన్ తన డిస్మిసల్ ఉత్తర్వులపై చేసిన అపీలును తిరస్కరించటం. డిస్మిసల్ ఉత్తర్వులను ప్రభుత్వం ఖాయం చెయటం. |
| నవంబర్ 26 | లండన్ కోర్టు ఆఫ్ డైరెక్టర్సుకు – మళ్ళీ ఉద్యోగంలో నియమించే విషయంపై అపీలు. |
| డిసెంబర్ 2 | మూడేళ్ళ సెలవు, ఏడాదికి 500 పౌండ్ల జీతంతో మంజూరు – ఇంగ్లాండుకు ప్రయాణం. |
| ★ 1835 | లండన్‌లో తన తెలుగు వ్యాకరణం, తెలుగు నిఘంటువుల పనిచూస్తూ తన ఎనిమిది సంపుటాల నిఘంటువు మొదటి రాతప్రతిని పూర్తిచేయటం.రాయల్ ఏషియాటిక్ సోసైటి వారికి రెండు ఆంధ్రవర్ణ చిత్రాలను బహూకరించడం. |
| | ప్రొఫెసర్ రోసెన్ సలహాలపై సంస్కృత ఛందస్సుపై రాసిన బ్రౌన్ వ్యాసం ఏసియాటిక్ జర్నల్ (1837) లో ప్రచురణ. |

| | |
|---|---|
| 1836 | ఆక్స్‌ఫర్డ్‌లో ప్రొఫెసర్ విల్సన్‌కు అతిథిగా ఉండటం. ఇండియా ఆఫీసు లైబ్రరిలో ఉన్న దక్షిణ భారత భాషల్లో రాతప్రతుల పరిశీలన విభజన ముసాయిదా క్యాటలాగ్ తయారుచేసి ఇచ్చినందుకు 1837 మార్చిలో బోర్డు ఆఫ్ డైరెక్టర్సు బ్రౌన్‌కు తమ అభినందనలు తెలపటం. |
| ★ 1837 ఆగస్ట్ | ఇండియాకు తిరుగుప్రయాణం. ఓడలో కాల్డ్వెల్ తో పరిచయం – ఆ జీవమైత్రి ఏర్పడటం. |
| ★ 1838 జనవరి 7 | చెన్నైలో అడుగుపెట్టడం |
| జనవరి 23 | ప్రభుత్వ పర్షియన్ అనువాదకుడిగా నియమించబడటం. |
| మార్చి 2 | కాలేజ్ బోర్డు, నేటివ్ ఎడ్యుకేషనల్ కమిటీ ఆక్టింగ్ సెక్రెటరీగా నియామకం కొత్త నిబంధనలు తెలుగు అనువాదప్రతి ప్రచురణ. |
| ★ 1839 జనవరి 22 | చెన్నైలోని సదర్ అండ్ ఫౌజ్ అదాలత్ కోర్టులకు ఆక్టింగ్ రిజిస్ట్రారు. |
| మే 20 | ఆక్టింగ్ సూపరింటెండెంట్ ఆఫ్ గవర్నమెంట్ లాటరీస్, చెన్నై జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్ పత్రికకు కో ఆర్డినేటరు తెలుగు భాషా సాహిత్యాలను గురించి బ్రౌన్ రాసిన వ్యాసాలు వెలువరించటం, వేమన పద్యాల విస్తృత ఎడిషన్ వెలువడటం. |
| ★ 1840 ఏప్రిల్ 7 | సివిల్ ఆడిటర్ అండ్ సూపరింటెండెంట్ ఆఫ్ స్టాంప్స్‌గా ఛార్జీ తీసుకోవటం. |
| ★ 1841 ఆగస్టు 31 | ఆక్టింగ్ పోస్ట్‌మాస్టరు జనరల్. ఆలిండియా గ్లాసరీకి అనుబంధంగా దక్షిణ భారతంలోని రెవెన్యూ, జ్యుడీషియల్ పదాల పట్టిక తయారు చేయమని ప్రభుత్వాదేశం. రాఘవాచార్యుల 'నలచక్రవర్తి కథ – నవనాథ చరిత్ర నుంచి సేకరించిన గౌరన హరిశ్చంద్ర కావ్యం – చాల శతకాలు, యక్షగానం, సీతాకల్యాణం వగైరాలను అనతికాలంలో, స్వీయ పర్యవేక్షణ క్రింద అచ్చువేయటం. |

★ 1843 సెప్టెంబర్ 29 మద్రాసు యూనివర్సిటీ బోర్డు ఆక్టింగ్ సెక్రటరి. ఆంధ్ర మహాభారతంలోని ఆదిపర్వం బ్రౌన్ సంపాదకీయ పర్యవేక్షణలో, చెన్నై విద్యాకళా ప్రెస్ (మాపతి మొదలారిగారి)లో ముద్రితమై వెలువడటం.

★ 1844 ఉచితంగా తెలుగు తమిళం ఇంగ్లీషు నేర్పటానికి పాఠశాల ప్రారంభించటం (కొంతకాలం తర్వాత ఈ పాఠశాల నిర్వహణ బాధ్యతను ఒక క్రైస్తవ పెద్దమనిషికి అప్పగించటం. వసుచరిత్ర – వ్యాఖ్యాన సహితంగా అచ్చువేయటం. బ్రౌన్ తన తెలుగు – ఇంగ్లీషు, ఇంగ్లీషు – తెలుగు నిఘంటువులను ఎస్.పి.సి.కె.తో ఒడంబడిక కుదుర్చుకొని ముద్రణ ప్రారంభించటం.

★ 1845 జనవరి 27 మద్రాసు లిటరరీ సొసైటి వారికి తన సొంత గ్రంథాలయంలోని దేశభాషల్లో 2440 రాతప్రతులు (తాటాకు ప్రతులతో పాటు) బహూకరించడం.

★ 1846 జులై 3 పోస్ట్‌మాస్టర్ జనరల్‌గా పూర్తి బాధ్యతలు స్వీకరించడం, ప్రభుత్వ తెలుగు అనువాదకుడు కావడం.

ఆగస్ట్ 4 ఎడ్యుకేషన్ కౌన్సిల్ సభ్యుడు కావడం.

★ 1847 చెన్నైలో హిందూ క్రైస్తవ తగాదాలు ముమ్మరం – బ్రౌన్ పోస్ట్‌మాస్టర్ జనరల్‌గా బాధ్యతల నిర్వహణ విషయంగా లెవిన్ ఆరోపణలు. మద్రాస్ 'అట్లాస్'లో ఒక ఆకాశ రామన్న వ్యాసం రాశాడని ఆరోపణ వచ్చింది.

★ 1849 హైదరాలి మెమోయిర్స్ ఆఫ్ టిప్పు సుల్తాన్ పరిష్కృత పుస్తక ప్రచురణ !

★ 1850 1751–1850 – ఎఫిమిరన్ ప్రచురణ – సైక్లిక్ టేబిల్స్ ఆఫ్ హిందూ మహమ్మడన్ క్రొనాలజీ.

★ 1851 మనుచరిత్ర వ్యాఖ్యాన సహితంగా ముద్రణ.

| | |
|---|---|
| ★ 1852 మార్చి 29 | ఫస్ట్ క్లాస్ సివిల్ సర్వీస్ హోదా పొందటం, తెలుగు వాచకాలు మూడు భాగాల ముద్రణ; జిల్లా నిఘంటువు,<br>వాక్యావళి ప్రచురణ. |
| ★ 1853 | 'రాజుల యుద్ధాలు' డైలాగులు (2వ ఎడిషన్) ప్రచురణ |
| ఏప్రిల్ 16 | మెదడువాపు వ్యాధికి గురికావటం – పక్షవాతం; సెలవుపై నీలగిరిలో విశ్రాంతి.<br>భాషాశాస్త్రవేత్త అయిన మిషనరీ జెర్నాల్డ్ ష్మిడ్‌ను కలుసుకోవడం – అతని తమిళ రచనల పునర్ముద్రణకు ఆర్థికంగా తోడ్పడటం – బెంగళూరు, మైసూరు – శ్రీరంగపట్నం సందర్శన. |
| ★ 1854 | మే 1వ తేదీనుంచి పదవీ విరమణ చేయటానికి ప్రభుత్వం నుంచి సమ్మతిపొందటం. ఏటా 920 పౌండ్ల పెన్షన్‌తో ఉద్యోగ విరమణ.<br>అతని రెండు నిఘంటువులు మిశ్రభాషా నిఘంటువూ, ప్రచురణ. |
| ★ 1855 | తాతాచారి కథలు – మిరాశివాదం గ్రంథాన్ని ఇంగ్లీషు తర్జుమాతో ప్రచురించటం. |
| జూన్ | లండన్‌కు ప్రయాణం. |
| ★ 1856 | ఇండియాలో అచ్చవుతున్న తన తెలుగు వ్యాకరణ (పరివర్ధిత ప్రతి) గ్రంథానికి లండన్‌లో పీఠిక రాసి మద్రాసుకు పోస్ట్‌పార్సెల్ ద్వారా పంపటం. బ్రౌన్ తెలుగు వ్యాకరణం మలి ముద్రణ వెలువడటం. |
| ★ 1859 | 'నికలస్ అనుభవాలు' ముద్రణ. |
| ★ 1860 | భారతదేశంలో 1857 తిరుగుబాటు గురించి 12 పట్నాలలో ఉపన్యాసాలివ్వటం – (తేదీలు – ఉపన్యాస పాఠ్యభాగాలు సేకరించవలసి ఉంది). |
| ★ 1863 | కర్నాటిక్ క్రోనాలజి ప్రచురణ (సైక్లిక్ టేబిల్స్ – సవరించబడిన ప్రతి). |

★ 1865 లండన్ యూనివర్సిటీలో తెలుగు ప్రొఫెసర్ కావటం (నియామకం తేది నిర్ధారణ కావలసి ఉంది).

★ 1866 బ్రౌన్ తన ఆత్మకథను ప్రైవేట్ సర్క్యులేషన్ కోసం ముద్రించటం.

★ 1869 ఐ.సి.యస్ పరీక్షలకు తెలుగు పరీక్షాధికారిగా నియుక్తుడు కావటం; గోల్డ్‌స్టకర్ ఒత్తిడి పై 'సంస్కృత ఛందస్సు' అన్న తన గ్రంథాన్ని సవరించి వెలువరించటం.

–తెలుగు వ్యాకరణం ఇంకోసారి సవరించటం. నవంబరులో మూడో ఎడిషన్ ముద్రణకు ప్రతిని సిద్ధపరచటం

–ప్రతి దినం తన నిఘంటువులలో విస్తృతంగా చేర్పులను, మార్పులను (ఇన్టర్ లీవ్ చేసిన ప్రతులలో) కావిస్తూ బాగా పెంచటం.

★ 1871 బ్రౌన్ వ్యాసాలు రెండు రాయల్ ఏషియాటిక్ జర్నల్ ప్రచురణ.

★ 1872 సవరించిన 'ఆత్మకథ' ప్రచురణ.

★ 1884 నవంబర్ 3 వీలునామా తయారు.

1884 డిసెంబర్ 12 అస్తమయం.

★ 1885 మార్చి–3 వీలునామాలో పేర్కొన్నట్లు రాతప్రతుల గ్రంథ భాండారం, కొన్ని ప్రైవేట్ పత్రాలు లండన్‌లోని ఇండియా ఆఫీసుకు తరలింప బడటం, శతాబ్దం తర్వాత తిరుపతిలో తెలుగు అధ్యయనానికి వినూత్న స్ఫూర్తి దాయకం కావటం.

ఆధారం : (Literary Autobiography of C.P.Brown) Sri Venkateswara University publication, Triupati, 1978 - pp 19-23)

––0––

# నిఘంటు నిర్మాణము

బ్రౌన్‌దొర రచనలలో ఆంధ్ర పండిత లోకమును విశేషముగ ఆక్షరించినవి ఆయన నిఘంటువులు. ఆయనకు నైఘంటికునిగ వచ్చినంత పేరు ఇంక దేనివలనను రాలేదు. ఆయన వ్రాసిన వాచకములు, వ్యాకరణము ఆంధ్ర పండితలోకమున అంత ప్రశస్తి సంపాదింపలేదు. అవి, ఆంధ్ర భాష నభ్యసింపగోరు పాశ్చాత్యులకును, ఆంగ్లమునభ్యసింపగోరు దేశీయులకు ఉపయోగపడుటకై వ్రాసినవే గాని, ఆంధ్ర పండితుల కొరకుగాదు. పై గ్రంథములకున నిఘంటువులకు వచ్చినంత పేరు రాకుండుట కిదియే ముఖ్యకారణము.

ఈయన నిఘంటువులు పండిత పామర రంజకములు. అకారాదిగా తెలుగునకు నిఘంటువును కూర్చుటలో ఆయన మొదటివాడు కాకపోయినను, ఆయన నిఘంటువులు నాటికి నేటికి కూడ వైశిష్ట్యమును కలిగియున్నవే. కొన్ని విషయములలో మార్గదర్శకములే. అవి వ్యావహారిక భాషావాదులకు, గ్రాంథిక భాషావాదులకును గూడ కావలసినవే. బ్రౌన్‌దొర నిఘంటువులకు ముందే సుప్రసిద్ధముగనున్న నిఘంటువు, 1821 లో "కాంబెల్" దొర ప్రచురించినది. అక్షర క్రమముగ నున్న నిఘంటువులలో ఇది ప్రథమ నిఘంటువని జయంతి రామయ్య పంతులుగారి అభిప్రాయము[1]. కాని "జెంతూ వకాబ్యులరీ" అనుపేర నిఘంటువు వంటిదొకటి విలియమ్ బ్రౌన్ 1817 – 1818 లో ప్రకటించారు.

బ్రౌనుదొర నిఘంటువులకన్న ముందే యున్న నిఘంటువులలో, జె.సి.మారిన్ దొర కూర్చినదొకటి. దీనిని కాలేజీ బోర్డువారు 1835 – 1839 సంవత్సరముల నడుమ ప్రచురించిరి. ఇది ఉత్తమ శ్రేణికి చెందినదైనను, బ్రౌనుదొర దీని నెందులకో పేర్కొనలేదు. బ్రౌన్ దొరకు ముఖ్యముగా సాయపడిన నిఘంటువులు రెండట. మొదటిది "కాంబెల్ దొర" నిఘంటువు. రెండవది "విల్సన్" దొర ప్రకటించిన సంస్కృత నిఘంటువు. నిఘంటు నిర్మాణ విషయమున రెండవది బాగుగ తోడ్పడినదట.

---

1 తెలుగులో మొట్టమొదట నిట్టి యక్షర క్రమ నిఘంటువు కూర్చిన యాతడు ఏ.డి. కాంబెలు అను నాంగ్ల పండితుడు" – జయంతి రామయ్యపంతులు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు ; పీఠిక: పుట – 2, పీఠికాపురము: 24 – 3 – 1936).

బ్రౌన్‌దొర పేర్కొనిన తెలుగు నిఘంటువులలో ముఖ్యమైనది, మచిలీపట్టణము నకు చెందిన మామిడి వెంకయ్య (1764 – 1834) గారి ఆంధ్ర దీపిక. ఇది 1806 నాటికే పూర్తిచేయబడినదట. తెలుగు కావ్యములలో ఉపయోగింపబడిన పదములు మాత్రమే ఇందుకలవనియు, వ్యావహారిక భాషజోలికి ఇది పోలేదనియు బ్రౌనుదొర వ్రాసెను[2].

ఆంధ్ర భాషార్ణవము, దానివంటివే పద్యములలోనున్న ఐదు నిఘంటువులను అకారాదిగా కూర్చి, బ్రౌనుదొర ఉపయోగించుకొనెను. కాని ఈ నిఘంటువులలోని పదజాలమునందు క్రియల కంత ప్రాముఖ్యము లేదనియు, క్రియలే ఏ భాషకైనను ప్రాణమువంటివనియు బ్రౌనుదొర అభిప్రాయముపడెను[3]. అవికాక, ఆంధ్రభాషా భూషణము[4], ఆంధ్రనామ సంగ్రహము[5], కర్కంబాడి నిఘంటువు[6], ఒరంగల్లు

2. "The Dipica, ఆంధ్ర దీపిక, A Dictionary of Telugu explained in Telugu written by మామిడి వెంకయ్య at Masulilpatnam. It was completed in the year 1806. The Dipica gives a mere selection of the words used in Telugu poetry.The ordinary Telugu of common life is but slightly noticed." (C.P.Brown's Telugu - English Dictionary ; page VIII; 1852 Edition.) ఈ విషయమై ఇతర వివరములకు, తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము : కొత్తపల్లి వీరభద్రరావు ; హైదరాబాదు. ద్వితీయ ముద్రణ, 1986. పుటలు – 232 నుండి 235 వరకు చూడవచ్చును.

3. *"The Andhra Bhasharnavam* ఆంధ్రభాషార్ణవం, a vocabulary of synonyms, in verse. This and five more similar works have been rearranged alphabetically at my desire. All the native vocabularies are deficient in verbs whereas verbs are the native vocabularies are deficient in verbs whereas verbs are the most delicate and peculiar parts of the language,'(Ibidem; page VII)

4. *"Andhra Bhasha Bhushanam* ఆంధ్ర భాషా భూషణము a vocabulary of Synonymes,in verse." (Ibidem ; page VII)

5. "A vocabulary written in verse." (Ibidem; page VII)

6. "The కర్కంబాడి నిఘంటు an alphabetical glossary, framed at my desire : it contains all the words found in the ఆంధ్రనామసంగ్రహం, in the ఆంధ్రనామశేషం, in the వెంకటేశ నిఘంటు and in the సాంబ నిఘంటు." (Ibidem; page X)

పదజాలము[7] – ఆయనకు బాగుగా ఉపయోగించినవి. ఈ కర్కంబాడి నిఘంటువు అనేకములగు నిఘంటువుల చేరికవలన ఏర్పడినది. దీని యందు ; ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రనామశేషము, వేంకటేశ నిఘంటువు సాంబ నిఘంటువు, విష్ణు ఆంధ్రము[8] మొదలగు వాటిలో గల పదజాలమంతయు కలదట. దీనిని బ్రౌన్‌దొరయే సిద్ధము చేయించెను. ఇంక ఒరంగల్లు పదజాలము (ఒరంగల్లు దేశీయ తెలుగులు) అనునది మామిడి వెంకయ్యగారి ఆంధ్ర దీపికకు పరిశిష్ట భాగము కావచ్చుననియు, దానికర్త పేరు తెలియుట లేదు గాని, వెంకయ్య గారే దానిని కూడ చేసియుండవచ్చునియు బ్రౌనుదొర వ్రాసెను.

ఇవిగాక కన్నడ[9], తమిళ[10], వంగ[11], సంస్కృత[12] భాషల నిఘంటువులను గూడ పరీక్షించి, తనకు పనికివచ్చునంతవరకు బ్రౌనుదొర వాటిని గూడ వినియోగించుకొనెను. వృక్షశాస్త్రము మొదలగు శాస్త్రములకు సంబంధించిన పదముల అర్థములను వ్రాయుటకు, ఆయా శాస్త్రములకు సంబంధించిన ఆంగ్ల, సంస్కృత నిఘంటువులను పరిశీలించెను. ఉదాహరణముగ మనము "క్వాథ శాస్త్రము"[13] అను వృక్షశాస్త్ర సంబంధమైన పదములుగల "పదజాలము" ను గ్రహింపవచ్చును ఇట్టి శాస్త్రములకు సంబంధించిన పదములు, దేశీయ

7. " The ఒరంగల్లు Orangallu Glossary : this is alphabetically arranged, and is a supplement to Mamidi Vencanna's Andhra Dipica : it is anonymous: and probably is the work of the same author. The only title is దేశీయ తెలుగులు that is, local words, or dialects. But it explains many expressions used in the leading poems." (Ibidem; page XI)
8. *"Vishnu Andhram,* A glossary, included in the karkambadi Nighantu": (Ibidem; page XIV)
9. *"Kannadi English Dictinary* by Reeve. (Ibidem; page X)
10. *Rottler's Dictionary, Tamil and English Dictionary* (Ibidem; page XII)
11. Haughton's Dictionary, Tamil and English (Ibidem; page IX)
12. శబ్దకల్పద్రుమ by Radha Kanta Deva (వంగలిపి) (Ibidem; page XII)
13. "The క్వాథశాస్త్రం A Botanical Vocabulary in Sanscrit with Telugu synonymes". (Ibidem, page XIII)

పండితులలో కూడ కొందరికి తెలియవని బ్రౌనుదొర వ్రాసెను[14]. నిఘంటువు సాధ్యమైనంతవరకు సంపూర్ణముగా నుండవలెనను ఆయన పట్టుదలయే ఈ కృషికి మూలము.

ఈ విధముగ వివిధ భాషల నిఘంటువుల నుండి, శాస్త్రముల నుండి, అంతకు పూర్వమున్న ఆంధ్రభాషా నిఘంటువుల నుండి పదములను కృతజ్ఞతతో గ్రహించుటయేగాక, తాను స్వయముగ మహాపండితుల సాయముతో తెలుగులోని ఆ ఉద్గ్రంథములను చదివి, వానిలోని వివిధ పదములనన్నంటిని ఎత్తి వ్రాసికొని, తన నిఘంటు నిర్మాణమునకు సామగ్రిని కూర్చుకొనెను. ఈ సందర్భమున వ్రాయుచు, విశేషముగ పరిశ్రమ జరుగని భాషకు నిఘంటువును నిర్మించునపుడు, సులభముగ తప్పుదారి త్రొక్కుట జరుగునని వ్రాసెను[15]. ఇట, బ్రౌనుదొరకు 1825లో భారతము చదువుచున్నప్పుడు కల్గిన అనుభవమును గూర్చి తెల్పుట అప్రస్తుతము కాదు. ఆయనకు భారతము చదువుటయందు తోడ్పడిన విద్వాంసుడు, కష్టమైన పదములకు వ్యావహారికాంధ్రమందు గాని, సంస్కృతములోగాని, హిందీలోగాని అర్థము చెప్పెడి వాడట[16]. ఆ పదమునకు ఆయర్థము బ్రౌనుదొర వ్రాసికొనెడివాడు. ఆ పదమే గ్రంథమందు మరల రాగా, ఆ పండితుడు దానికి సందర్భాను సారముగా అర్థము చెప్పుచ్చువచ్చెడివాడట! కొంతసేపటికి, ఒకే పదమునకు పరస్పర విరోధములగల అర్థములు రాగా బ్రౌనుదొర అతనిని "ఏమిటి ఈ వింత ?" అని ప్రశ్నించెనట! అందులకా పండితుడు, "అయ్యా, మీరిలా నేను చెప్పినదంతా వ్రాసుకొంటూ, చివరికి నన్నిలా నిలదీసి అడుగుతే నేనేమి చేస్తాను ఒక వేళ మీరడిగిన మాటకు నాకు అప్పుడర్థం తెలియకపోవచ్చు. లేదా సమానార్థక పదం ఏదీ అప్పటికప్పుడు తట్టకపోవచ్చు", అన్నాడట! అప్పుడు బ్రౌనుదొర నవ్వి "మరి, మీరిలా నన్ను తప్పుదారి తొక్కించడం భావ్యమా" అన్నాడట! కాని, ఈ క్రింది వాక్యము – ఆ పండితుని గురించియే బ్రౌనుదొర అన్నది – ఆయన సహృదయతకు తార్కాణము. "The pandit was a sound scholar but not accustomed to construing."

---

14. "Some Telugu words which I have copied from the glossaries marked ABA, (ఆంధ్ర భాషార్ణవము) or Kark. (కర్కంబాడి) or Q (క్వాథశాస్త్రం) are unknown to learned nanves". (Ibidem, page XII)

15. "He who writes a Dictionary of an unexplored language is offen misled."

16. "My learned assistant gave the meaning in colloquial Telugu, or Sanscrit or Hindi."

ఈ కార్యమున తనకు సాయము చేసిన పండితులను గురించి బ్రౌనుదొర "వారికి సంస్కృత వ్యాకరణము పరిచితము. కాని, వారి మాతృభాషకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానము చెప్పుటకు వారికంత సంసిద్ధతలేదు". అని వ్రాసెను[17]. ఈ దురవస్థకు కారణము, "సంస్కృతంవస్తే తెలుగువచ్చినట్లే", అను దురభిప్రాయము పండితులలో, కొందరి యందు ప్రబలి యుండటయే ! ఈ అభిప్రాయము ప్రబలుటకు ముఖ్య కారణము, తెలుగు తత్సమపదబహుళ మగుట కావచ్చును !

అనేకములగు వ్యయప్రయాసలకోర్చి, బ్రౌనుదొర తన నిఘంటువులను సిద్ధము చేసెను. ఇంగ్లీషు – తెలుగు నిఘంటువునకు సంబంధించిన ప్రణాళిక 1832 లోనే సిద్ధమయినను, అచ్చువేయుట ప్రారంభించునప్పటికి, అంతయు, మరల వ్రాయవలసి వచ్చెనట[18] 'షేక్స్పియరు' మొదలైన ఆంగ్ల ఉద్గ్రంథములను క్షుణముగ అంతకుపూర్వమే చదివి యుండటచే, తానా పనికి సిద్ధముగనే యుంటినని ఆయన వ్రాసెను[19]. తనతోటి పనివారు కూడ, తనకు ఆంగ్ల సాహిత్యమునందున్న పాండిత్యమును మెచ్చుకొని, తనకు "బైబులు", "షేక్స్పియరు", "మిల్టనులు"లు ; వచ్చినట్లున్నదని పలికెడివారని కూడ బ్రౌనుదొర వ్రాసెను[20]. ఈ ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు కూర్చుటలో ఆయన ముఖ్యోద్దేశము, ఆంగ్ల సాహిత్యము మనవారికి అందుబాటులోనికి రావలెననునది[21]. ఇట్టి సదుద్దేశముతో శ్రమించి, ఉద్దేశ సాఫల్యమును పొందెను.

---

17. "These intructors were familiar with Sanscrit Grammar, but were less ready to solve questions as to the syntax of their mother - tongue."
18. "....Completed the rough sketch of the English - Telugu Dictionary in 1832.... This seemed to be ready, yet in printing it I caused the whole to be rewritten....."
19. "I had been prepared by my previous study of Shakespeare and other English Classics."
20. "My fellow labourers the Brahmans, remarked that I seemed to have the Bible, Shakespeare,and Milton by heart."
21. "This work may render English literature accessible to all the Hindus who fill the Indian peninsula." (తెలుగు వారికి పర్యాయపదముగ 'హిందు' పదమును బ్రౌనుదొర చాల చోట్ల వాడెను.)

ఈ ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు ప్రథమ ముద్రణము, ఫిబ్రవరి 1845 లో ప్రారంభింపబడి మార్చి 1853 లో పూర్తి [22] అయినదట ! దీని ముఖపత్రములిట్లున్నవి[23].

[పుట I]

# బ్రౌణ్య ఇంగ్లీషు నిఘంటు

## ENGLISH - TELUGU

## DICTIONARY

## MADRAS

Printed at the Christian Knowledge Society' s Press,

Church Steet, Vepery.

1853

[పుట II]

## WORKs PUBLISHED BY

## Mr. Brown.[24]

[పుట III]

## A DICTIONARY, ENGLISH AND TELUGU Explaining

---

22. "I began printing it in Feb, 1845 and it was completed and published (one Volume. Royal Ocatavo, in 1300 pages) in March 1835".

23. బ్రౌనుదొర ప్రచురించిన గ్రంథములను (అవి అన్ని గ్రంథాలయముల లోను లభింపవు) చాలమందికి చూచుటకు అవకాశము లేదు గనుక, ముఖ పత్రరచనయైనను, ఇట్లున్నదని తెలిసికొనుటకు వీలుగా, చూపుటయైనది.

24. పై శీర్షిక క్రింద ఒక పుస్తకముల పట్టిక ఈయబడినది. వీటిలో కొన్ని, అయన అప్పటికి ప్రచురించినవి, కొన్ని ప్రచురింపనున్నవి.

The English Idioms And Phrases
In Telugu,
With the Pronunciation of
English Words.
Prepared by
CHARLES PHILIP BROWN
Of The Madras Civil Service,
Telugu Translator To Government,
Senior Member of the College Board, Etc.

--- -----

MADRAS :
Printed At the Christian Knowledge Society's Press
Church Street, Vepery.
1852

ఈ నిఘంటువు బ్రౌన్‌దొర యొక్క తక్కిన నిఘంటువులవలెనే విశేష ప్రఖ్యాతిని ఆర్జించినది. దీని సాయముతో ఎందరో – బ్రౌన్‌దొర ఆశించినటుల – ఆంగ్లభాష సభ్యసించి ఆ సాహిత్యమును చవిజూచి యుందురు. దీని ఉపయోగము కాని, విశిష్టతకాని నేటికిని తగ్గిపోలేదు. వ్యావహారిక భాష ప్రాబల్యమును పొందిన ఈ దినములలో, వ్యావహారిక భాషాపదములు విశేషముగనున్న బ్రౌనుదొర నిఘంటువులు, మన కింకను మిక్కిలి ఉపయోగకారులు, ఉపాధేయములు.

ఈ నిఘంటువు యొక్క ద్వితీయ ముద్రణము 1895 లో జరిగినది. బ్రౌనుదొర కీర్తిశేషుడైన (1884) తరువాత పదనొకండవ సంవత్సరమున ముద్రింపబడిన దీనిని ప్రెసిడెన్సీ కాలేజీలో ఇంగ్లీషునకు అసిస్టెంటు ప్రొఫెసరయిన ఎమ్. వెంకటరత్నం, బి.ఏ., గారు సంస్కరించి, విపులీకరించిరి. దీనియందు "బ్రౌనుదొర సాహిత్య జీవితము" (లిటరరీ లైఫ్) ముద్రింపబడినది. ఈ వ్యాసమును మిత్రుల ప్రోత్సాహమువలన, తాను ఇండియాను

విడిచి (1855లో) పోవుటకు ముందు బ్రౌనుదొరయే వ్రాసెనట! కాని, దీనిని ప్రచారమునకై అచ్చువేయలేదు. గనుక, ఈ వ్యాసములలోని విషయములు బహిరంగ పరుపక "కాలేజీ బోర్డు" వారును జాగరూకత వహించిరి[25]. ఆయన చనిపోయిన తరువాత అచ్చు వేసిన, ఈ నిఘంటువు ద్వితీయ ముద్రణమున, దీనిని కూడ ప్రచురించిరి.

తెలుగు – ఇంగ్లీషు నిఘంటువు కూడ, దాని తోబుట్టువగు ఇంగ్లీషు – తెలుగు నిఘంటువుతో సమానమైన ప్రాముఖ్యముగలదే. దీనిని బ్రౌనుదొర తాను తెలుగు నేర్చుకొనుచున్న దినములలో తనకు సాయముగనుండుటకు సిద్ధము చేసి కొనెనట[26]. దీనిని అచ్చువేయవలెనను సూచన 1844 వ సంవత్సర ప్రారంభముననే, వచ్చెనట! ఆ సంవత్సరము మధ్యభాగమున అచ్చుపని ప్రారంభింపబడెను. ఎన్నో మార్పులు, దిద్దుబాట్లు కూడ చేయవలసి వచ్చెనట! నూటికంటె ఎక్కువ మంది తెలుగు గ్రంథకర్తలిందు ఉదాహరింపబడిరి. ప్రతి ఉదాహరణమును పరిశీలించి, నిర్ణీత స్థానములో దానినాయన ఉంచెను[27], బ్రౌనుదొర వ్రాయసగాండ్రనుపెట్టి, తన పర్యవేక్షణముక్రింద పనినంతపూర్తి చేసెను. ఉదాహరించిన భాగము లేయేగ్రంథములందలియోసరిగా పరీక్షించి,

25. "On the eve of leaving India, their late learned colleague was induced by his friends to complle some details of his own literary life. But as this narrative was not printed for publication the Board do not deem it proper to make free with its contents" - D.F. Carmichael, Secretary, Board of Examiners' office, March 23rd, 1858. (preface to a Catalogue Raisonnee of Oriental Manuscripts in The Library of The College, 1857; page XXIII)

    ఈ సాహిత్య జీవిత చరిత్రకు సంబంధించిన ఇతర వివరములు, ఈ పుస్తకము (సి.పి. బ్రౌను) లోనే పుట – 119 లో కలవు.

26. "The present Dictionary was written to assist in learning the Telugu Language." (Telugu-English Dictionary, 1852; page IV.)

27. "In the beginning of 1844 I received a proposal to print my Telugu and English Dictionary. The printing commenced in the middle of the year but I soon found that the work required revision and correction. More than one hundred Telugu authors were quoted, every quotation was to be verified, trancribed and inserted."

నిఘంటువున నిలిపెను. నిరాధారములగునవేవియు నందులేవు. ఇట్టి ఋజుత్వము, నిష్కర్ష లేనిచో పరిశోధకులకు లాభముగాని ఉండదు. అందుచేతనే ఉత్తమ పరిశోధకుడగు బ్రౌనుదొర తన వ్రాతలకు రుజువులను చూపించుచు వచ్చెను[28]. నిఘంటువులో పేజీ ఒక్కంటికి పది మొదలు ఇరువదివరకు తెలుగు కవుల రచనల నుండి యుదాహరణములు కలవనియు,వాటి నన్నింటిని తానే స్వయముగ గ్రహించితిననియు,తనయొద్దనున్న పండితులు, వాటిని అచ్చునకు సిద్ధము చేసిరనియు ఆయన వ్రాసెను[29], దీనిని బట్టియే, ఆయనకు ఆంధ్రభాషలో గల పాండిత్యము, ఆంధ్రసాహిత్యముతో గల పరిచయము స్వయంవ్యక్తమగుచున్నది గదా! ఈ నిఘంటువు ముఖపత్రమునకును, ఇంగ్లీషు – తెలుగు నిఘంటువున కున్న ముఖపత్రమునకు భేదమంతగా లేదు[30].

ఈ రెండు నిఘంటువులును జోడుగా పెరిగినవి. రెండును ఇంచుమించుగ ఒకేసారి అచ్చొత్తింపబడినవి. ఒక నిఘంటువున కై ఎత్తి వ్రాసికొనినవి,కొన్ని ఉదాహరణలు, రెండవదానికిని ఉపయోగించెడివట! ఈ విధముగా రెండింటిని సమకాలీనముగ బ్రౌనుదొర పెంచుచువచ్చెను[31]. వ్రాయసగాండ్రను పెట్టి, కంపోజిటర్లు కూర్చగలిగినంత వేగముగను తాను వారికి పని చెప్పుచుండెడి వాడట[32].

తెలుగు ఇంగ్లీషు నిఘంటువులో బ్రౌనుదొర చేసిన ముఖ్యమైన మార్పుహల్లులతో ప్రారంభించు పదముల యొక్క స్థానమునకు సంబంధించినది. నాడు మనకున్న అకారాది

28. "In the, as in my Grammar I have endeavoured to adduce proofs of every statement."

29. There are from ten to twenty quotations from Telugu authors, in each page. This part of the work was executed by my own pen; my learned and laborious assistants transcribed them for the press, but seldom supplied one from their own reading."

30. "A DIctionary, Telugu and English, explaining The Colloquial style used in Business,And the poetical Dialect, with Explanation in English And in Telugu, 1852. ఇది కాక మిగిలిన భాగమంతయు రెండింటికిని సమానమే.

31. "Some qutations selected for one Dictionary will also fit for the other, and whenever I met with suitable phrases I noted them in each, thus building up both at the same time."

32. "I employed Brahman copyists, and supplied work as fast as the compositors could set is up."

నిఘంటువులలో ' క చ ట త ప 'అను వర్గక్రమమున పదములన్నియు నుండుటయు, ప్రతివర్గమునకు అక్షరక్రమము తప్పకుండుటయు, ప్రతి అక్షరమునకును గుణితము అచ్చుల క్రమమున వచ్చుచుండుటయు, మనకు తెలిసినది. బ్రౌనుదొర నిఘంటువున ఈ క్రమమున పాటింపబలేదు. ఒక వర్గములోని వివిధాక్షరములతో – అనునాసికాక్షరమును విడిచి – ప్రారంభించు పదజాలమునంతయు, అకారాది అచ్చుల క్రమమున ఒక చోటనే ఇచ్చుట ; బ్రౌనుదొర చేసిన ముఖ్యమైన మార్పు [33]. ఇట్లు చేయుటవలన, నిఘంటువు నుపయోగించుట సులభమగునని బ్రౌనుదొర ఊహ, 'య ర ల వ' లు వేరువేరుగ కలవు. మరల 'శ, ష , స' లను కలిపినాడు. ఈ ఏర్పాటువలన – కోత, గోత్రము, ఘోణి – మొదలగు పదములు ఒక దాని తరువాత ఒకటి ఒకే శీర్షిక (కో, ఖో, గో, ఘో) క్రింద వచ్చినవి[34]. అటులనే – జిగి, చిగురు, జిఘాంసుడు – మొదలగు పదములును[35] శాతము, షాడబము, షాతాని[36] మొదలగు పదములును ఇటులనే[37].

ఈ విషయమును పురస్కరించుకొని, బ్రౌనుదొర తన తెలుగు – ఇంగ్లీషు నిఘంటువు 'ఉపోద్ఘాతము'న సుదీర్ఘముగ వ్రాసినదానికి క్రింది అనువాదము : "ముప్పది సంవత్సరముల క్రిందట నేను తెలుగు కావ్యములు చదువుచున్నప్పుడు, 'గ' తో ప్రారంభించిన పదములు (గోరువంటివి) చాలసారులు రాగా, మా గురువుగారు నన్ను 'ఆంధ్ర దీపిక' లో ఆ పదమునకై 'కోరు' క్రింద చూడుమని చెప్పుచుండిరి. 'జ' మొదటి అక్షరముగ (జెలంగు) కల పదములు 'చ' క్రింద కనబడుచుండెడివి. 'ద' తో ప్రారంభించు పదములు, వాటి చిత్తమువచ్చినట్లు, 'త' తో ప్రారంభించెడివి, దోవ, తోవ[38]. రెండును 'రోడ్డు' నకు పదములే. 'పులి' అనగా పులి గదా! కాని సమాసములలో

33. కఖగఘ, కాఖాగాఘా, కిఖిగిఘి – మొదలగునవి.

34. Telugu - English Dictionary, 1852 - page; 287.

35. Telugu - English Dictionary, 1852 - page; 330.

36. Telugu - English Dictionary, 1852 - page; 1050.

37. "I have made an improved arrangement of the consecutive initial consonants : uniting such as in Telugu are commutable." (Ibidem, page IV)

"This difficulty may eventually be removed by classing the commutable letters together as 'U' and 'V' have long been mingled in the English Dictionary" (ఆంధ్ర గీర్వాణచ్ఛందము సి.పి.బ్రౌను – 1827. "On Orthography, Spelling, etc.")

38. తోవ, త్రోవ, దోవ N.S Way Road, Way or Means. (Ibidem, page 465)

'ప' అను అక్షరము 'బ' గా మారి 'బెబ్బులి' అను రూపము వచ్చుచున్నది. 'శ' తో ప్రారంభించు కొన్ని పదములు 'స' తో కూడ వ్రాయవచ్చును గదా. ఈ సంశయమునుండి నన్ను పెద్దలు కూడ విముక్తుని చేయలేదు.నేను వారినడిగినప్పుడు, "రెండు విధములుగను వ్రాయవచ్చును" అనుచుండిరి. చివరకు, నిఘంటువు రమారమి సగమువరకు పూర్తి అయిన తరువాత మార్పును అంగీకరించు ప్రథమాక్షరములు గల పదములను కలిపివేసి, మరల నిఘంటువును వ్రాసి, ఈ సంశయమును తొలగించి వేసితిని."

"ఇక్కడ ఒక ఉదాహరణను ఇచ్చెదను. 'దీపిక' లో 'దువాలించు'[39] అను క్రియ ఒకటి కలదు. కొందరు కవులు దీనిని 'త' తో ప్రారంభింపగా, కొందరు 'ధ' తో ప్రారంభించిరి. కనుక, ఈ క్రియ నిఘంటువులో మూడుచోట్ల కనబడవలసి వచ్చును. కాని, ప్రథమాక్షరములను కలుపుటవలన, శ్రమ లేకుండ అవి కనబడును. ముందుముందు, వీనిని విడదీసి చూపవలెనని ఎవరైనను అనుకొనినను అది అంత కష్టముకాదు. కాని, అట్లు చేయుటవలన భాషను నేర్చుకొను ప్రారంభకునకు కష్టమగును. తెలుగులో కొంత కృషి చేసినవారి కందరకును, నేను చేసిన మార్పులోని విలువ తెలియగలదు. పూర్వపద్ధతిలో పండితులకే సంశయము కలిగెడిది. ఇప్పుడు మార్గము సుగమమైనది"[40].

ఈ పద్ధతి దేశీయులైన పండితుల ఆదరాభిమానములను అంత దూరగొన్నటుల లేదు. బ్రౌనుదొర కాలమునను పండితులందరును ఈ పద్ధతిని ఆదరించినట్లులేదని, ఆయన వ్రాసిన క్రింది వాక్యములే తెలియజేయుచున్నవి. "ఈ నిఘంటువు విషయమున నాకు నా పండితుల సమ్మతి ఉన్నది. కాని కొందరు పండితులు (శాస్త్రులు) నా వర్ణ క్రమ పద్ధతిని అంగీకరింపలేదు"[41].

బ్రౌనుదొర తరువాత, నైఘంటికులు ఈ పద్ధతిని అంతగా ఆదరింపలేదు. నిఘంటువులో ఆయన వ్యావహారిక పదములను – ఉచ్చరించెడి రీతిగానే– చేర్చుట, పండితులకు నచ్చినట్టులేదు. తరువాతి నైఘంటికులలో బ్రౌనుదొరను తీవ్రముగ

39. తువాళించుట, ధువాళించుట V.N.To leap, To dance. (Ibidem, page 462)

40. Ibidem; preface; pase IV

41. "...In composing this work Ihave had the approbation of many learned assistants.But some (sastris) scholars have disapproved the spelling here exhibited." (Ibidem; page V)

విమర్శించినవాడు శ్రీశంకరనారాయణ. అతడు తన ఇంగ్లీషు – తెలుగు నిఘంటువులలో[42], "on the contrasts between English and the Indian vernaculars and a common Alphabet for the different languages of India" అను శీర్షిక క్రింద వ్రాయుచు ; బ్రౌనుదొర కు తెలుగు సంధి సూత్రములు బాగుగా తెలియవు అనుట మొదలుకొని, అతడు వ్యావహారిక పదములకు తన నిఘంటువులో స్థానమిచ్చి, తెలుగును పాడు చేసినాడన్నంతవరకు; విమర్శించెను. ఇటుల విమర్శించినను, బ్రౌనుదొర నిఘంటువులను ఉపయో గించుకొను విషయములలో శ్రీశంకరనారాయణ వెనుకాడినట్లు లేదు. ఈ తీవ్ర విమర్శకు కారణము. బ్రౌనుదొర వ్యావహారిక భాషకు తన నిఘంటువున అతి ప్రముఖ స్థానమిచ్చుటయే కావచ్చును. శ్రీశంకరనారాయణకు కోపకారణమైన వ్యావహారిక పదములలో కొన్ని క్రింద నిచ్చుచున్నాను – అరయ్యో ఆంధ్రుణ్ని, ఒప్పుకోవడము. పధ్నాలుగు, అదీ నేను.

ఏది ఎట్లున్నను, తన నిఘంటువు పండిత పామర జనోపయోగము కలదిగా నుండవలెనని ఆయనాశించెను గాని వేరుకాదు. కేవలము ఛాందసులైన పండితుల మెప్పు పొందవలెనని ఆయన ఎన్నడును కృషిచేయడు. ఆయున విదేశస్థుడగుట ఇట్టి సందర్భములలో ఆయనకు ఉపకారకమయ్యెను. దేశీయ పండితులలో కొందరును పట్టిబంధించి బాధించు సంప్రదాయ శృంఖలములు ఆయనకంటలేదు. కనుకనే ఆయన పామరులను, వారి భాషను ఈసడించలేదు. విశాలదృషి గల విజ్ఞాని గనుక, పండితుల ప్రతిభను గుర్తించి, వారినెన్నండును తూలనాడలేదు. ఈ తటస్థదృష్టి, అతనికి కలుగుటకును; దానిని నిలుపుకొన గలుగుటకును, అతడు విదేశస్థుడగుట మిక్కిలి అక్కరకు వచ్చినది.

వీలున్న చోటులందెల్ల అతడు ప్రజల భాషకు ప్రాముఖ్యమిచ్చుచునే యుండెను. నిజమైన విద్వాంసులు, సాహిత్య ప్రియులు, తన ఉద్యమములో బాసటగా తనకు నిల్చిరని అతడే వ్రాసెను. సాధారాణముగా పద్య కావ్యములలోను, వ్యవహారమునందును

42. An English - Telugu Dictionary By P. Sankaranarayana publlished by V. Ramaswamy Sastrulu & Sons. 1923. ఈ ముద్రణమునకు డాక్టరు.జి.వి. సీతాపతిగారు సంపాదకులు. సంపాదకులు preface లో, "This edition of Sankaranarayana's English - Telugu Dictionary is the first edition published after the lamented death of the author ....." అని వ్రాసిరి. దీనియందు; శ్రీశంకరనారాయణ మూలగ్రంథము నుండి, పై శీర్షిక గల వ్యాసమును తీసి పునర్ముద్రించిరి.

ఉపయోగింపబడు పదములు కాక, మారుమూల పదములనువాడుచు, అందులకు గర్వించుచు విఱ్ఱవీగు విద్వాంసుల నాతడు గౌరవింపలేదు[43]. వారివలన నుపయోగములేదని అతడెరుంగును.

తన నిఘంటువులు సాధ్యమైనంతవరకు పూర్ణముగ జీవద్భాషకు పరిపూర్ణ నిఘంటువు అనునది ఉండదని అతనికి తెలియను నుండుటు చేయవలసిన కృషినంతను బ్రౌనుదొర చేసెను. కొన్ని పదములకు అర్థవివరణ పండితులచే చేయించియు, వారు నిర్ణయములను సంపాదించి తన నిఘంటువునందు కూర్చుకొనెను ఈ సందర్భమున ఒకటి, రెండు ఉదాహరణలకు పరీక్షింపవచ్చును.

ఆ రోజులలో మదరాసులో సుప్రసిద్ధులగు ఆంధ్రులలో ముఖ్యుడు ఏనుగుల వీరస్వామయ్యగారు (1780 ప్రాంతము 3–10–1836)ఈతడు చెన్నపట్టణములో, ఇప్పటి హైకోర్టుకు పూర్వమున్న సుప్రీమ్‌కోర్టులో తెలుగు, అరవము, ఇంగ్లీషు భాషలలో "దుబాసి". బ్రౌనుదొరకు స్నేహితుడు. ఈతడు 1880 – 1881 సంవత్సరాల నడుమ (18 – 5 – 1830 నుండి 3 –9 –1831 వరకు) కాశీయాత్ర చేసెను. ఆ చరిత్ర చక్కని వ్యావహారిక భాషలో లేఖలరూపమున తన మిత్రుడగు శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్లకు వ్రాసెను. ఇది "కాశీయాత్ర చరిత్ర " అను పేర ఇప్పటికి మూడుసార్లు ముద్రింప బడినది.[44] ఈ విధముగా గ్రంథకర్తగా కూడ పేరుపొందిన "వీరాస్వామయ్యగారిని, బ్రౌనుదొర తన తెలుగు – ఇంగ్లీషు నిఘంటువులో ఇంద్రాణివల వర మొదలగు పదముల అర్థ వివరమునకు ప్రమాణముగ గ్రహించెను.

"ఇంద్రాణి – Name of the wife of Indra; A sort of bracelet, Orangallu Glossary; 'Dowager' a Bramin widow, Enugula, 28th July 1830 "[45]

43. "Instead of that found in poems and used in life they (sastris) wish us to practice style : which is admired because conceited and far from clear. such refinements are disregarded by men of real learning, who are therefore considered vulgar by some who are inferior in sound scholarship."

(preface : page V - *Telugu - English Dictionary 1852.*)

44. కాశీయాత్ర చరిత్ర. ప్రథమ ముద్రణము 1838 లో శ్రీనివాసపిళ్ళగారి బాధ్యతను జరిగినది. ద్వితీయ ముద్రణము 1869 లో 'గవర్నమెంటు వారి ఉత్తరువు'చే జరిగినది. తృతీయ ముద్రణము 1941 లో జరిగెను. తృతీయ ముద్రణ భారమును శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారు వహించిరి.

45. Telugu - English Dictionary; page 80.

"పలవర – The name of a certain tree much cultivated in the neighbourhood of the Hyderabad for its fruit. పలవని ఆకులు .its leaves, are used to manure land. See decription in the Kasi Yatra, date 7th September, 1830.[46]

విక్రమార్కుని కథలు (1819) పంచతంత్రము (1834) తెలుగు వ్యాకరణము (1836) మొదలగు గ్రంథములను వ్రాసిన, "చెన్న పట్టణ పాఠశాలలో ఆంధ్రభాషకు మొదటి యుపాధ్యాయుండైన"[47] రావిపాటి గురుమూర్తిశాస్త్రి గారు (1770–1836) బ్రౌనుదొరకు గురుతుల్యుడు. అతడు బ్రౌనుదొరకు కొన్ని కఠిన పదముల అర్థవివరణము చేయుచుండి దూరమున నున్నచో వివరణము జాబుమూలముగ కూడ పంపుచున్నట్లు తెలియుజేయు లేఖ నొకదానిని, ఉదాహరణగా ఇచ్చుచున్నాను.

(1827 నవంబరు 22 తేదీని రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు బ్రౌనుదొరకు వ్రాసిన లేఖకు నకలు).[48]

*"మహారాజు రాజ శ్రీ ఛా.పి. బ్రౌనుదొరవారి సముఖానకు – ఆశ్రితుడు రావిపాటి గురుమూర్తిశాస్త్రి అనేకములైన సలాములు చేసి వ్రాసుకొన్న విజ్ఞాపన పత్రిక–*

*తమరు అలవోక – డాబాలు అనే శబ్దములకు అర్థము వ్రాసి పంపించుమని వ్రాయించినారు. అలవోక శబ్దమునకు స్వేచ్ఛ – అనిచ్ఛ – అప్రయత్నతము – ఆశ్రమము – కారణము –అని నానా అర్థములు వున్నవి. ఆయా స్థలములకు తగినట్లుగా చెప్పుకోవలసినది.*

*డాబాలు అనేది డాబా అనేదానికి బహువచనాంతము. డాబా అనగా వెండితోగాని బంగారుతోగాని చేసిన మొలత్రాడు యొక్క బిళ్ళ. ఉత్తరదేశములో బంగారుతోగాని వెండితోగాని చేసిన మొలత్రాడు నాలుగైదు వరుసలుగా చుట్టి అతికించి బిళ్ళలు వేసి మొలను ధరించడము కద్దు. అటువంటి త్రాడు డాబా మొలత్రాడు అని చెప్పబడుచున్నది.*

---

46. Telugu - English Dictionary ; page 564.
47. రావిపాటి గురుమూర్తిశాస్త్రి 'తెలుగు వ్యాకరణము' ప్రథమ ముద్రణము (1836) పీఠికలోని వాక్యము. ఈ వ్యాకరణము A.D.Camp bell దొరకు అంకితమీయబడినది.
48. రావిపాటి గురుమూర్తిశాస్త్రి 'తెలుగు వ్యాకరణము'నకు 1951 వ సంవత్సరములో ముద్రణము పీఠికలో ఈ లేఖ ముద్రింపబడినది.

*కాలేజీవారు కోరిన 500 రూపాయలు పుస్తకముల వైనం నాకు యెంత మాత్రమున్న్రూ తెలియదు. చిత్తగించవలెను. ఇది గాక తమరు హంసవింశతిలోని కొన్ని పద్యాలకు శబ్దార్థమున్న్రూ తాత్పర్యమున్న్రూ వ్రాసి పంపించుమని వ్రాయించినారు. తోచినమట్టుకు వ్రాసియిందులో బిడాయించి సముఖానకు పంపించినాను. చిత్తగించ వలెను. నేను నడుచుకోగలందుకు ఆజ్ఞాపత్రిక దయచేయించవలెను. ఇది అనేకములైన విజ్ఞాపనములు.*

*రా. గురుమూర్తిశాస్త్రి*

చెన్నపట్నం
1827 నవంబరు 22 తేది.

ఈ విధముగ లేఖల మూలమున తనకు కావలసిన శబ్దములకు అర్థవివరణము తెప్పించుకొనియు, విద్వాంసులైన తన మిత్రుల గ్రంథములనుండి ప్రయోగములను గ్రహించుయు, బ్రౌనుదొర తన నిఘంటువున కొక వైశాల్యమును కల్పించుకొనెను. సమకాలికులగు పండితుల ప్రయోగములను గౌరవించి, వానికి తన నిఘంటువు స్థానమిచ్చి; సమకాలమువారి రచనలను గౌరవించుటలో దోషములేదను సంప్రదాయమునొక దానిని నెలకొల్పెను.

1855లో తాను మనదేశమునువిడిచి ఇంగ్లండు వెడలిపోయినను, బ్రౌనుదొర ఈ రెండు నిఘంటువులను మరచిపోలేదు. తనకు ఆరోగ్యగము సరిగలేకున్నను, వయస్సు మళ్ళినను తన కృషిని మానలేదు. వీలుచిక్కినప్పుడెల్ల, వానిని సవరించుచునేయుండెను. క్రొత్త క్రొత్త పదములను చేర్చుచునెయుండెను. జీవద్భాషకు శాశ్వతమైన నిఘంటువనునది ఉండజాలదనియు, భాషతోబాటు నిఘంటువును, వ్యాకరణమును మార్పులను పొందుచుండవలెను పరమ సత్యము అతనికి తెలియనిదికాదు. లండనులో తనకు తీరిక దొరికినప్పుడెల్ల తన నిఘంటువులకును, వ్యాకరణమునకును అతడు చేర్పులు, మార్పులు చేయుచునే యుండెనట. దీని వలన అవి మొదటికంటె రెట్టింపు పెరిగినవని ఆయనయే వ్రాసెను.[49]

49. "I resumed Telugu reading, merely carrying on the work then I happened to be in London and at leisure. I daily made additions in the Dictionaries, and the Grammar, which are now more than doubled."

బ్రౌనుదొరకు, నిఘంటువులకు క్రొత్త పదములను అందిచ్చుటలో ఒక ఫ్రెంచి – తెలుగు నిఘంటువు, మిక్కిలి ఉపయోగించెనట. దాని నాతడు 1855 లో ఇంగ్లండు పోవువరకు పరిశీలించుటయే జరుగలేదట! 1700 ప్రాంతమున మన దేశమున కృషిచేసిన మిషనరీలు తమిళ – ఫ్రెంచి; తెలుగు – ఫ్రెంచి నిఘంటువులను కూర్చిరట. ఆ నిఘంటువులలో తెలుగు – ఫ్రెంచి నిఘంటువునకు Dictionare Telongou ou Badaga అని పేరట. దీనిలో వ్యావహారిక భాషాపదములే విశేషముగ కలవని బ్రౌనుదొర వ్రాసెను ఈ నిఘంటువును సిద్ధపరచిన మిషనరీలు తమ పేరులను ఇయ్యలేదట. దీనినుండి బ్రౌనుదొర వేయివరకు పదబంధములను గ్రహించెనట.[50]

ఇంగ్లీషు – తెలుగు; తెలుగు – ఇంగ్లీషు నిఘంటువులను కూర్చుటలో బ్రౌనుదొర మహాప్రతిభను చూపుటయేగాక; దూరదృషిని, హృదయ వైశాల్యమునుగూడ ప్రకటించెను. తన రచనలు, “ముఖ్యముగ తెలుగు నేర్చుకొనువారికి” ఉపయోగపడవలెనను ఉద్దేశముతో వ్రాసినను; వానికి విశేషవ్యాప్తి, తెలుగు వారిలోకూడ వచ్చుటకు ముఖ్యకారణము వాటి పాండిత్య ప్రౌఢిమ.

దేశభాషలలో కృషిచేయు విదేశస్థులు, ఆయా భాషల సహజ ప్రకృతులను అర్థముచేసికొని కృషిచేయవలెనేగాని, ఆ భాషల ప్రకృతులనే మార్చవచ్చని కృషిచేయుట కష్టమనికూడ అతడు గ్రహించినాడు. ఏ భాషనైనను మార్చగలిగి నారు, అన్యులు కారను చరిత్ర సత్యమును బ్రౌనుదొర ఎన్నడును మరువలేదు. తెలుగులో తానెంత కృషిచేసినను, ఎంత పాండిత్యమును సంపాదించినను, ఎన్ని గ్రంథములు రచించినను; ఈ భాష విషయమున “తుది మాట” తెలుగు ప్రజలదే అను పరమసత్యమును గుర్తించియే బ్రౌనుదొర తన కృషిని చేసెను. తన కృషి ఫలించుటకై, అతడనేకుల సలహాలను స్వీకరించెను పండితుల భాషను పామరుల భాషను సమానముగనే గౌరవించి ఆదరించెను.

50. The French Missionaries who laboured about A.D.1700 wrote a French - Tamil Dictionary and another lexicon Telugu and French... The authors have not given their names : l observe that they were indefatigable in recording colloquial dialect alone. l never saw this work until ! returneeed to England in 1855. it supplied more than a thousand phrases."

అహంకారమును విడిచి ప్రజల యొద్దనుండి వారి అభిప్రాయములను గ్రహించి వానిని మన్నించెను. తన నిఘంటువులలో, తెలుగు ప్రజలకు సులభముగా అర్థముకాని. నూతమున పదములను – అనావశ్యకమైనప్పుడు, కేవల పాండిత్య ప్రకర్షకై – సృష్టింపలేదు తన 'ఎల్లలను' తాను గుర్తించి కృషిచేసిననాడు గనుకనే బ్రౌనుదొర శిష్టులలో విశిష్టుడు[51].

నిఘంటువులలో ఆంగ్లము నభ్యసింపగోరు తెలుగువారికి వీలగునట్లు, మార్పుల నెన్నింటినో చేసెను. కొన్ని ఇంగ్లీషు పదములకు తెలుగులో అర్థమును వ్రాయుచు; అర్థము బాగుగా అగుటకు, తెలుగువారికి బాగుగా తెలిసెడి, వారి సాహిత్యమునుండియే ఉదాహరణలిచ్చి, నిఘంటువు విశేషముగ నుపయోగకారి యగునట్లు చేసెను[52] చేసిన కృషివలన ఎంత ఎక్కువమంది ఉపయోగమును పొందుదురు, అని ఆలోచించి బ్రౌనుదొర గ్రంథములను రచించెనుగాని, స్వీయపాండిత్య ప్రకటనకై కాదు. ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు పీఠికను మనము జాగరూకతతో పరీక్షించినయెడల, బ్రౌనుదొర తెలుగు భాషలో ఎంతటి నిశితమైన పాండిత్యము కలదో స్వయంవ్యక్తమగును. ఆంగ్ల భాషా సంపర్కమువలన తెలుగు భాష మారుచున్నదనియు, ఈ మార్పు సహజమేయనియు; అంతకు పూర్వము ముస్లిము ప్రభుత్వ కాలమునగూడ తెలుగు భాష , పాలకుల భాషను బట్టి మార్పులను జెందినదనియు వ్రాసి తన చరిత్ర దృష్టిని చూపెను. ఈ ఆంగ్ల భాషా సంపర్కమువలన ఎన్నియో పదములు తెలుగులోనికి వచ్చి చేరుచున్న వనియు, పండితులు

51. "..... But I have avoided al fabricated words and meanings: I have never admitted a new Telugu phrase with out duly warning the reader. To coin a new phrase is easy: but no foreignnner has the power to give it currency. Iam not one of those who fancy that we can alter or improve the languages used in India."

*(English - Telugu Dictionary - Preface; page - 5)*

52. "Writing particularly to assist Hindus, I have given some minute explanations which Englishmen may deem superfluous. But to the Hindu they are advantageous.Elsewhere (as under the word Humour) I have alluded to such Telugu authors and phrases as seemed ueful."

*(English - Telugu Dictionary - Preface : page - 5)*

ఆంగ్ల పదములను ఒల్లక, తత్సమ పదములను సృషించి వాడుచున్నను, ప్రజలు మాత్రము ఆంగ్ల పదములనే ఉపయోగించుచున్నారనియు బ్రౌనుదొర వ్రాసెను.[53] దీనిని బట్టి, బ్రౌనుదొర నాటికి, వ్యావహారికాంధ్రమందు ఆంగ్ల పదములు బాగుగ సిర్ధపడినట్లెంచ వచ్చును.

"ఆంగ్ల భాషాపఠనము హిందువుల మనోవికాసమునకు మార్గము కాగలదు" అని వ్రాసిన బ్రౌనుదొర, తన కృషికి గల చరిత్రలోని స్థానమును పూర్ణముగ గ్రహించినాడనియే చెప్పవలెను. తన కృషి సార్థకమగునుగాని వ్యర్థము కాదని గ్రహింపగలిగిన దూరదృష్టి అతనిది.

బ్రౌనుదొర యొక్క నిఘంటువులను ఎవరెట్లు విమర్శించినను, అతని నిష్కాపట్యమును, సత్యనిష్ఠను శంకించువారుండరు. ఒక యుగసంధిలో అతడు కృషిచేసి, దాని ఫలితముగ ఒక సమన్వయ ప్రధానమైన దృక్పథమును పండిత పామరులలో ప్రచారమునకు తెచ్చెను. తరువాత నైఘంటికులు – అంగీక రించినను, అంగీకరింప కున్నను – బ్రౌనుదొరకు, అతని నిఘంటువులకు ఎంతయో, ఋణపడి యున్నారు.[54] కాని మనవారికి ఋణగ్రస్తులగుట తెలిసినట్లు, కృతజ్ఞతను తెలియజేయుట అంతగా తెలియదు గనుక, తరువాత నైఘంటికులలో అనేకులు బ్రౌనుదొరను "ఉపయోగించు

53. "Under the Musulman rule, Telugu , Kannadi and Tamil were filled with Arabic words. At present these are retained and many English expressions are added......I am aware that the Hindus prefer using the English word without any translation. They have lately fabricated a few words from Sanskrit. Thus they speak of a president as *Agrasanadhipati,* and of a Secretary as *Caryadarsi.* At present the Telugu used in conversation and business is becoming more thickly sprinkled with English words." (Ibidem, preface. page - 5.)

54. "శబ్దరత్నాకరమునకు బ్రౌణ్య నిఘంటువే ఆధారము" – కళాప్రపూర్ణ శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు – విమర్శనము – 12–8–1939) ఈ వ్యాసము శ్రీవారి సార్మక సంచికయందు (ప్రతిభ, సంపుటి–) ప్రకటింపబడినది కూడ. అందుపై వాక్యము 41 వ పేజీలో గలదు.

కొనని", మాటాడక మిన్నకుండిరి. ఏది ఎట్లయినను బ్రౌణ్య నిఘంటువులు [55] తరువాత బయలుదేరిన నిఘంటువులలో, బ్రౌణ్యము నుపయోగించుకొననిది [56] లేదని చెప్పిన సత్యదూరము కాదు.

జగత్ప్రసిద్ధములైన ఈ రెండు నిఘంటువుల తరువాత చెప్పుకొనవలసిన నిఘంటువుల నింకను కొన్నింటిని బ్రౌనుదొర కూర్చెను. కృషి విషయమునను, పాండిత్య విషయమునను పై వాని కేమాత్రమును ఇవి తీసిపోవు. వీనిలో 'మిశ్రభాషా నిఘంటువు' ఒకటి బ్రౌనుదొర ప్రతిభకు తార్కాణముగ నున్నది. ఇట్టి నిఘంటువు నొకదానిని కూర్చవలెనను భావము కలుగుటలోనే అతని వైశిష్ట్యమును. భావమును క్రియగా ప్రవర్తింపజేయుటలోనే అతని ప్రతిభా ప్రాగల్భ్యమును కానవచ్చును. దీనిలో తెనుగు, పర్షియను లిపిలో వ్రాత ఆంగ్లలిపిలో పర్షియను ఉచ్చారణ, ఇంగ్లీషులో అర్థము – ఇవిగాక తెలుగులో ఆ పదమునకు అర్థవివరణము. "తెలుగు భాషనుండి కాలక్రమమున ఈ అన్యభాషా పదములు తొలగించుటకు వీలుగా, ప్రతి పదమునకును పర్యాయపదముగ తెలుగు పదమును ఇచ్చితిని"[57] అని వ్రాసిన బ్రౌనుదొర తెలుగు భాషాభిమానమును ఏమని కొనియాడుదుము.

ఈ మిశ్రభాషా నిఘంటువు (A Dictionary of the Mixed Dialects and Foreign words used in Telugu ) 1854లో ముద్రింపబడినది[58] పీఠిక తరువాత, దీనిలో "ఆంధ్రాక్షరము"లను గూర్చిన దీర్ఘవ్యాస మొకటి కలదు. ఆంధ్ర వ్యాకరణమును

---

55. "... Was written at the request of the Society for promoting Christain Knowledge and is printed at their expense." *( Telugu - English Dictionary ; Preface - page V)*

56. "ఈ నిఘంటు నిర్మాతలు (శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు) బ్రౌణ్య నిఘంటువు ప్రమాణముగా స్వీకరించినారు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను." శ్రీగిరి రామమూర్తి పంతులుగారు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు – విమర్శనము – ప్రతిభ, సంపుటి – 20వ పేజీ).

57. To each word in this vocabulary I have appended a Telugu synonyme. This will help those who wish to get rid of these foreign words." (Dictionary of Mixed Telugu , 1854 - Preface; page IV).

58. "This Dictionary is printed aat the expense of the Society for promoting Christian Knowledge." (Ibidem : Preface, page IV)

ఇది ప్రథమ వాచకముగ గ్రహింపవచ్చునని బ్రౌనుదొర వ్రాసెను. అతడు వ్రాసిన తెలుగు వ్యాకరణము రెండవ ముద్రణమునుండి ఇది కొలది మార్పులతో గ్రహింపబడినదట.[59] ఈ భాగమును చదువుచున్నప్పుడు: బ్రౌనుదొరకు గల తెలుగు భాషా పాండిత్యమేగాక, అతని సమన్వయ దృష్టి , మన సంఘ సంప్రదాయములను గూర్చి అతనికి గల విజ్ఞానము మనలను ఆశ్చర్యచకితులునుగ చేయకమానదు. మన ఆచార వ్యవహారములతో, మంచి చెడ్డలతో అతనికి గల సానుభూతి మనలనాతవిని గౌరవింపచుట్లుచేయును.[60]

ఈ నిఘంటువును కూర్చుటలో అతని ముఖ్యోద్దేశము; ముస్లిముల పరిపాలన వలన, తెనుగు భాషలోనికి వచ్చి చేరిన అన్యదేశ్యములను అర్థ వివరణముతో చూపుటయే. అరబ్బీ, పారసీక, ఉర్దూ భాషలోని పదములనేగాక, ఇతర భాషలనుండి కూడ తెలుగులోనికి వచ్చి చేరిన పదములనుగూడ అతడు గ్రహించెను.

బ్రౌనుదొర – న్యాయస్థానములలోను వాణిజ్య కేంద్రములలోను విరివిగావాడబడు ఈ "మిశ్రమ భాషను" ను ; లా – లాటిన్ (Law - Latin) తోను, లా – ఫ్రెంచి (Law - French) తోను పోల్చి ; వాక్యనిర్మాణ విషయములోను, కారకమునందును ఈ భాషకును "తెనుగు"నకు పోలిక చాల తక్కువ అని చెప్పుచు – ఈ ఉదాహరణను ఇచ్చెను. "ఈ నంబరులో డిఫెండంటు సమ్మను చూచి సైను or – దస్థత్) చేసి వాయిదాచొప్పున కోర్టులో హాజరు అయి ఆన్సరుయియ్యకపోయినందున యిందులో యెక్సపార్టి దర్యాప్తు చేయవలెనని ప్లేంటిఫ్ ప్లీడరు మోళను చేసినాడు గనుక ఆ మోళను రికార్డులో దాఖలు (or ఫయిలు చేసి అందులో దర్ఖాస్తు చేసిన చొప్పున నడిపిచేలాగున ప్రోసీడింగుసులో ఆర్డరుయెంటరు చేయడం అయినది."[61]

---

59. " These remarks are reprinted with some amendations, from the second Edition of the Telugu Grammar." (Ibidem - page XXVIII)

60. "The native tutors also complain that English pupils touch their mouths with their hand : and then defile books with hands thusdirtied. Hindus hold spittle in abomination. We should respect their prejudices, and treat them kindly." (Ibidem - page X - Foot Notes)

61. Ibidem - Preface: page III (ఇదీ మచిలీపట్టణము 'కోర్టు జర్నలు' నుండి సంగ్రహింపబడినది.

ఈ నిఘంటువు తన తెలుగు – ఇంగ్లీషు నిఘంటువునకు పరిశిష్ట భాగము వంటిదనియు, సాధారణముగా ప్రజలు వాడుచున్న పదములేగాని, వాడుకలోలేని “అన్య దేశ్యము” లిందు లేవనియు బ్రౌనుదొర, ఈ నిఘంటు పీఠికలో[62] వ్రాసెను అవసరము లేనప్పుడు మాటలలోగాని, వ్రాతలోగాని ఈ “మిశ్రభాష” నుపయోగించుట మంచిది కాదనియు, సాధ్యమైనంతవరకు దీనిని పహరింపవలెననియు[63] వ్రాసిన బ్రౌనుదొరయొక్క ఆంధ్రభాషాభిమామును గూర్చి వేరగా నొక్కి చెప్పవలెనా!

ఈ నిఘంటు నిర్మాణములో ఆయనకు బాగుగా తోడ్పడినవి (1) ఆయనే ఎనిమిది వాల్యూములలో సేకరించియుంచిన జాబులు;(2) వాల్యూములలో నున్న “స్థానిక చరిత్రలు”[64]. వీని సాయముతోను, తాను కోర్టు వ్యవహారములలో నున్నప్పుడు సేకరించిన “రికార్డు”లతోను, ఈ నిఘంటువును బ్రౌనుదొర చక్కగ కూర్చెను.

ఈ పెద్ద నిఘంటువులేగాక, తాను వ్రాసిన వాచకాదులందు; చిన్న నిఘంటువులను, “పదజాలముల” ను ఎన్నింటినో బ్రౌనుదొర తెలుగు నేర్చుకొనగోరు వారికి వీలుగనుండుటకై ముద్రించెను. తెలుగు భాషలో కృషిచేయ నెంచువారికి ఏ కష్టమును – తనకు మొదట కలిగిట్లు – కలుగకుండుటకై ఎంతవరకు శ్రమింపవచ్చునో అంతవరకును ఈయన కష్టపడి పనిచేసెను. ఆ పని, ఉత్తమ గ్రంథముల రూపమును పొందినది.

ఇవిగాక, జిల్లాలలో జరుగు కార్యకలాపములకు సంబంధించిన పదజాలము గల, జిల్లా నిఘంటువు (1852) నొకదానిని బ్రౌనుదొర ప్రకటించెను. ఆయన చేసిన పనులలో ఇది అత్యల్పమైనదైనను, దీనిమిద విమర్శమాత్రము కఠినముగ వచ్చినది.

62. "......froms a requisite supplement to a Dictionary of the Telugu language : and it contains only those phrases which are current among the natives." (Ibidem - preface; page III)

63. "....But in talking and writing Telugu we ought to avoid this mixed dialect." (Ibidem - preface : page IV).

64. Ibidem - preface ; page IV.

తరువాత ఇది విల్సన్ దొరయొక్క "కోర్టు – రెవెన్యూ పదముల పట్టిక" లో 1855 లో విలీనమైనదట.[65]

బ్రౌనుదొర ఆంగ్ల నిఘంటువునకు గూడ ఒక అనుబంధమును కూర్చెను డాక్టరు జాన్సన్ యొక్క నిఘంటువును తీసికొని అచ్చు కాగితముల నడుమ తెల్ల కాగితములు వేయించి సిద్ధముచేసిన ప్రతిలో, ఎన్నో క్రొత్త ప్రయోగములను – టాడ్, వెబ్టర్, క్రైగ్ మొదలగువారు చూపక విడిచిన వాటిని – సేకరించి వ్రాసియుంచెనట.[66] దీనిని బట్టి ఆయనకు స్వభాషయైన ఆంగ్లమున ఎంతటి పాండ్యము కలదో వ్యక్తమగుచున్నది. ఆయన మన దేశమునకే రాకయుండిన స్వభాషకే సేవచేసి, ఆంగ్ల సాహిత్యమున శాశ్వత కీర్తి నార్జించి యుండెడివాడు. ఆయన కీర్తికి ఎక్కడైనను అడ్డము లేదు. కాని, ఆయన ఇచ్చటకు రాకున్నచో మన భాషా సాహిత్యములకు, ఆయన ప్రతిభతో గూడిన సేవ లభించెడిది కాదు.

ఇంతేకాక "ఫ్లెమింగ్", "టిబిన్" లు కూర్చిన ఫ్రెంచి నిఘంటువునకు కూడ నూటికంటె ఎక్కువగ పదములను చేర్చెనట.[67] చిన్ననాటనే ఆయన నేర్చిన "ఫ్రెంచిభాష", ఆయనకీ విషయమునను, బాగుగా తోడ్పడినది.

---

65. "I added a fourth volume called the Zillah Dictionary giving in the English Character all the words that occur in Zillah business' in India. I regretted this thing. It was the puniest of my work, and the oniy volume which was peevishly criticised. It was after - wards Merged in Wilson's Glossary of Judicial and Revenue Terms, 1855......."

66. "At leisure, I also prepared an appendix to the English Dictionary. Taking a quarto copy of Samuel Johnson's work inter leaved, I collected a series of quotatins, both ancient and modern, which even Todd, Webster, and Craig had overlooked." (ఈ వ్రాత ప్రతి తనకు లభింపలేదని, 'ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు' ద్వితీయ ముద్రణమును సంస్కరించిన ఎమ్. వెంకటరత్నంగారు వ్రాసిరి.)

67. "I further made some hundred additions to Fleming's and Tibbin's quarto French Dictionary."

ఈ విధముగా బ్రౌనుదొర సర్వతోముఖ ప్రజ్ఞను చూపి, కృషి చేసెను గనుకనే, ఆయన ధైర్యముగ, "నేను ఒక్కరికొరకే శ్రమింపలేదు"[68] అని వ్రాయగలిగెను.వ్రాసినది సార్థకమును గూడ.

కాని, ఇంచుమించుగ, భారతదేశములోని సమస్తభాషలతోను పరిచయమున్న బ్రౌనుదొర[69], తెనుగు భాషను తన అభిమాన భాషగ స్వీకరించి కృషిచేయుట మన భాషకు జరిగిన మహోపకారము పురాణోక్తులలో చెప్పవలెనన్న – భాషాయోషల విషయమైన ఆయన దక్షిణ నాయకత్వము, ఆంధ్రభాషను పట్టమహిషిని చేసికొని గాని "తృప్తాస్మి" అనలేదు – అనవలెను ! ఇట్టి మహానుభావుని కృషిలో, కొన్ని లోపములున్నవని అనువారును లేకపోలేదు. దోషములును లోపములును అందరికిని గలవుగాని, ఇంత కృషిచేసిన ఘనత మాత్రము అందరికిని లేదు. "ఏకోహి దోషోగుణ సన్నిపాతే నిమజ్జతి".

***– కొత్తపల్లి వీరభద్రరావు***

సి.పి.బ్రౌను దొర చరిత్ర గ్రంథం నుండి పునర్ముద్రితం.

––0––

---

68. "I did not labour forone tribe alone."

69. Distinguished by his attainments in nearly every other language of India, whether vernacular or classical, Mr. Brown partlcularly attached himself to the study of Telugu" - D.F.Carmichael, Secretary, Board of Examiners' Office March 23rd, 1858. (preface to a Catalogue Rasonnee of Oriental Manuscripts in the Library of the College, 1857.)

[దీనిలో ఉదాహృతములైన ఇంగ్లీషు భాగములు (వేరుగా చెప్పనివి) some *Account of the Literary life of C.P.Brown* నుండి సంగృహీతములు.)

# ద్విభాషా నిఘంటువులు

## తెలుగు - ఫ్రెంచి - తెలుగు

క్రీస్తుకుపూర్వం 326లో అలెగ్జాండర్ తో ప్రారంభమై అప్పటి నుంచీ మనదేశంపై విదేశీయుల దండయాత్రలు జరుగుతూనే ఉన్నాయి. చాల మంది యీ దండయాత్రలలో మన దేశంలోని సిరిసంపదలను కొల్లగొట్టుకు పోయారు. కాని 18 వ శతాబ్దంలో వచ్చిన పోర్చుగీసువారు, ఇంగ్లీషువారు సంస్కృతీ సంపదకు నిలయమైన మన దేశంలో తిష్టవేసి వారి ప్రభావాన్ని మనపై రుద్దడానికి ప్రయత్నించారు. 1741 లో ఫ్రాన్సు ప్రభుత్వం భారత దేశంలో డూప్లేను గవర్నరుగా నియమించాక ఫ్రెంచివారు మన దేశంలో విరివిగా ప్రవేశించి భారతీయ భాషల అధ్యయనాన్ని ప్రారంభించారు. వారి అవసరాలకోసం అస్తవ్యస్తమైన రీతిలో తెలుగు ఫ్రెంచి; ఫ్రెంచి తెలుగు రెండు నిఘంటువులను తయారుచేశారు. ఇందు మొదటిదాన్లో 12,500 పదాలు, రెండోదాన్లో 14,800 పదాలు ఉన్నాయట. ఈ నిఘంటువులను గురించి సి.పి.బ్రౌన్ యిలా రాశారు.

"This dictionnaire Telogou et Francios .... was written in or about the year 1794 ...... I bought this volume in London for 25 shillings. It is worthless ..... had it any value, it is completely superseded by Mr Campbell's *Telugu & English Dictionary*; in which work it was made use of. The spelling in wretched....."

ఈ నిఘంటువుల రాత ప్రతుల నేడు భారతదేశంలో లభ్యం కావడంలేదు. బహుశా లండన్‌లోని యిండియా ఆఫీస్ గ్రంథాలయంలో ఉండవచ్చు. ఇచట బ్రౌన్ రాతప్రతుల సంచయాన్ని కూడ భద్రపరిచారు.

## తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులు

బుడతకీచు వారిని క్రమంగా తరిమివేసి ఇంగ్లీషువారు 18వ శతాబ్ద అంతానికి మనదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. 1773లో భారతదేశంలో బ్రిటిషు గవర్నరు జనరల్ పరిపాలన ఆరంభమయ్యింది. ఇచట పాలనా వ్యవహారాలు నిర్వహించేందుకు ఆంగ్లేయులు భారతదేశానికి వేల సంఖ్యలో వచ్చారు. మనలో ఒకరుగా మెలిగేందుకుగాను వారు భారతీయ భాషలను నేర్చుకోడానికి నిర్ణయించారు. వారికోసం 1812లో చెన్నైలో

ఫోర్ట్ సెయింట్ జార్జి కాలేజీ స్థాపించారు.అలెగ్జాండర్ డంకన్ క్యాంబెల్ యీ కాలేజి బోర్డు సభ్యుడుగా ఉంటూ 1813లో తెలుగు వ్యాకరణం తయారుచేశాడు. దీనికి యఫ్. డబ్ల్యు. ఇల్లిన్‌తో బాటు ఉదయగిరి వెంకట్రామయ్య, వేదం పట్టాభిరామశాస్త్రి సాయం చేశారు. శాస్త్రిగారు ధాతుమాలను తయారుచేశారు. ఈ కళాశాల మెకంజీ రాతప్రతులను సేకరించడానికి ప్రోత్సహించింది. కాలేజీ బోర్డు క్యాంబెల్‌ను ఒక నిఘంటువును తయారు చేశారు. ఆ ఆదేశం మేరకు క్యాంబెల్ తెలుగు ఇంగ్లీషు నిఘంటువును తయారు చేశారు. ఇది 1821 లో తొలిసారిగా ముద్రితమైనది. 1848 లో పునర్ముద్రించారు. వాడుకలో గల తెలుగు పదాలు గూడ యిందు ప్రవేశించాయి. దీని నిర్మాణానికి ఆంధ్ర దీపిక కర్త మామిడి వెంకటార్యులు (వెంకయ్య) సాయం చేశారని తెలుస్తుంది.

ఇంతకు ముందే,అంటే 1818 లో ఉత్తర సర్కారులలో సివిల్ సర్వీసు ఉద్యోగిగా పనిచేసిన విలియం బ్రౌన్ 'ఎ వొకాబులరీ ఆఫ్ జెంటూ అండ్ ఇంగ్లీషు' అనే నిఘంటువును తయారుచేశారు. పోర్చుగీసువారు తెలుగు భాషను జెంటూ లాంగ్వేజ్ అనేవారు. సి.పి. బ్రౌన్ ఆ పదాన్ని నిరసించి 1854 నించీ "తెలుగు" పదాన్ని వాడుకలోకి తెచ్చారు. ఈ నిఘంటువులో తెలుగువారు ఇంటా బయటా వాడుక చేసే పదాలే గాక కోర్టులలో, కచేరీలలో వాడుక చేసే కుంఫిణి, వారంటు, రిజిస్ట్రారు, ఫీజు, సమ్మన్లు, కంప్లెయింటు, మొదలైన ఆంగ్లపదాలు,మహన్సులు. మారీపత్తు, ఇజాణ,యిజాఫా, ఫారీఖత్తు మొదలైన ఫార్మీ, తుర్కీ భాషా పదాలు చేర్చారు. వాడుకలోని 'ఋ' కారం యిందు తొలగించారు.

గత శతాబ్ది మధ్యభాగంలో పలువురు బ్రిటీషు ఉద్యోగులు తెలుగు భాషపై మక్కువను చూపారు. ఈస్టిండియా కంపెనీలో అనువాదకుడుగా ఉంటున్న మోరిస్ 1835 లో తెలుగు ఇంగ్లీషు నిఘంటువును అనుభవరీత్యా ప్రకటించాడు. 1817 లో కంపెనీ ఉద్యోగిగా ప్రవేశించి సి.పి.బ్రౌన్ తెలుగు భాషపై విశేషమైన శ్రద్ధాసక్తులు కనబరిచాడు. 19 సం. వయస్సులోనే 'హిబ్రూ, అరబిక్, పర్షియన్, గ్రీసు, లాటిన్ భాషలు నేర్చిన ప్రతిభాశాలి విశాలపరిధిలో బ్రౌన్ తెలుగు, ఇంగ్లీషు నిఘంటువును తయారుచేసి 1844 లో ముద్రణను ప్రారంభించి, 1852లో పూర్తి చేశారు. ఆ తర్వాత దీనిలో ఎన్నో కొత్తపదాలు, కొత్త అర్థాలు చేర్చి దాదాపు రెండింతలు చేశాడు. దీని గురించి బ్రౌన్ తన స్వీయచరిత్రలో 1860 లో యిలా రాసుకున్నారు.

"I daily made additions to the Dictionaries, and the Grammer, which are now more than doubled. Those I set down in the last fifteen years may be more valuable; they are certainly more numerous. This part of the work will therefore be acceptable to learned readers. I also made many additions and corrections in the learned.

**Wilson's Glossary of Judicial and Revenue Terms".**

ఈ గ్రంథం తాలూకు సంస్కరించిన ప్రతి నేటికి కూడా లండన్‌లోని ఇండియా ఆఫీస్ గ్రంథాలయంలో ఉన్నట్లు 1937 లో ప్రచురించిన జి.ఆర్. కాయే రాత ప్రతుల సూచీని బట్టి తెలుస్తుంది.ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు మాత్రం బ్రౌన్ తెలుగు – ఇంగ్లీషు నిఘంటువును 1852 లోని ప్రతిని యథాతథంగా పునర్ముద్రించారు. యీ దిగువ ప్రత్యేకతలు కలిగి ఉంది.

1. ఇందు గ్రంథస్థమైన పదాలతో బాటు వాడుకలలో గల పదాలు కూడా కలిగి ఉంది.
2. అవసరమైన చోట పూర్వకవి ప్రయోగాలు ఆరోపాలతో సహా చూపారు.
3. పదాలకర్థాలు గ్రంథాల నుండేగాక వాడుకనుంచి గూడ స్వీకరించారు.

బ్రౌన్ నిఘంటువు యిచ్చిన స్ఫూర్తితో రెవరెండ్ ఫీటర్ పెర్సివల్ 1862 లో తెలుగు ఇంగ్లీషు నిఘంటువును తయారుచేశారు. 1879 లో పెద్దాడ చిట్టి రామయ్య తెలుగు ఇంగ్లీషు దీపికను, హోర్లర్స్ 1900 లో తెలుగు యింగ్లీషు నిఘంటువును తయారుచేసి ముద్రించారు. హోర్లర్స్ నిఘంటువులో బైబిల్ పదాలు ఎక్కువగా ఉన్నట్లు తెలుస్తోంది. అదే సంవత్సరంలోనే నాటినుంచీ నేటివరకు విశేష ప్రచారంలో వున్న పావులూరి శంకరనారాయణ తెలుగు ఇంగ్లీషు నిఘంటువు వెలువడింది. 1927 నుంచీ దీన్ని వావిళ్ళ వారు ప్రచురించారు. 1953 లో దీన్ని ఎస్.నారాయణ అయ్యంగారు పరిష్కరించారు.దీనిలో ఎన్ని లోపాలున్నా దీనికి గల వాడుక అపారం.పిదప అరెస్టు పి.గెలెటీ తెలుగుపదాలను సైతం రోమన్ లిపిలో మార్చిన తెలుగు నిఘంటువును. ఆక్సుఫర్డు యూనివర్సిటీ ప్రెస్ 1935 లో ప్రచురించింది.ఈ నిఘంటువు విదేశీ ఉద్యోగులకు బాగా ఉపయోగపడింది. 1979 లో కర్నూలులోని బాలసరస్వతి బుక్‌డిపోవారు ప్రచురించారు. ఇలా ఉండగా లిఫ్‌కో వారు 1995 లో తొలుత

ప్రచురించిన  ది గ్రేట్ లిఫ్‌కో ఇంగ్లీషు – ఇంగ్లీషు –తెలుగు నిఘంటువులో తెలుగు ఉచ్చారణ కలిగి విశేష ప్రాచుర్యంలో వుంది. లిమోన్ కాలిఫోర్నియా యూనివర్శిటీ శాస్త్రవేత్త వి.రావు, వేమూరు ఇంగ్లీషు – తెలుగు & తెలుగు – ఇంగ్లీషు నిఘంటువును తయారుచేశారు. 2002 లో ఢిల్లీలోని ఏషియన్ ఎడ్యుకేషనల్ సొసైటీవారు ప్రచురించారు. జె.పి.ఎల్. గ్విన్ రూపొందించిన ఆక్స్‌ఫర్డు తెలుగు – ఇంగ్లీషు డిక్షనరీ 1991లో తొలుత ముద్రితమై 2009లో పునర్ముద్రణకు నోచుకుంది.

## ఇంగ్లీషు - తెలుగు నిఘంటువులు

ఇంగ్లీషు తెలుగు నిఘంటువులు ఇంగ్లీషు చదువుకొనే తెలుగువారికోసం ఏర్పడ్డాయి. అందుచేత ఈ ప్రచురణలో కొంత ఆలస్యం జరిగింది. ఈ పనికి గూడ కంపెనీ ఉద్యోగులే ముందుబాట చూపించారు. జాన్ కార్నిక్ మారిస్ తయారు చేసిన ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు మొదటి భాగం 1825లో అచ్చయింది, రెండోభాగం 1839 లో అచ్చయింది. ఈ పెద్ద నిఘంటువు తెలుగు భాషతో పరిచయం ఏర్పాట్లు చేసుకుంటున్న విదేశీయులకు గూడ బాగా ఉపకరించింది. ఆ తర్వాత 1853 లో తనదైన ఒక మార్గంలో ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ ఇంగ్లీషు నిఘంటువును వెలువరించారు. ఇందు ఆంగ్ల పదాలకు ఉచ్చారణ, పదబంధాలు కూడ చేర్చారు. దీనిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1974 లో పునర్ముద్రించారు. రెవరెండ్ పీటర్ పెర్సివల్ వారు 1866 లో ఆంగ్ల తెలుగు డిక్షనరీని వెలువరించారు. సంస్కృతాంధ్రాంగ్ల భాషల్లో ఉద్దండ పండితుడు పావులూరి శంకరనారాయణ, యస్. రామానుజంచెట్టిగారి ప్రోత్సాహంతో ఇంగ్లీషు – తెలుగు నిఘంటువును సిద్ధం చేశారు. 1897 లో తొలిసారిగా అచ్చయింది. ఆ తర్వాత వావిళ్ళవారు ప్రచురించారు. ఈ నిఘంటువు బహుళ ప్రచారాన్ని అందుకుంది. అనుబంధంలో వైద్య, శరీరశాస్త్ర, సామాన్య శాస్త్రాలకు సంబంధించిన పదాలు, గ్రీకు లాటిన్ భాషల్లో నుంచి యింగ్లీషులోకి వచ్చిన పదాలు చేర్చారు. 1936 నుంచి యీ నిఘంటువును మీడియమ్ సైజులోనూ, జమ్ సైజులోనూ వెంకట్రామా అండ్‌కో వారు ప్రచురించారు. సాహిత్య రత్నాకరుడైన నందిరాజు చలపతిరావు 1900లో ఇంగ్లీషు తెలుగు నిఘంటువును ప్రచురించారు.

ఈ పెద్దలు చూపిన మార్గంలో ఎన్.వి.రాఘవాచార్యులు, డి. త్రివిక్రమరావు, డాక్టరు చల్లా రాధాకృష్ణశర్మ, పింగళి లక్ష్మీకాంతం ప్రభృతులు తయారు చేసిన ఇంగ్లీషు, తెలుగు నిఘంటువులు వెలువడ్డాయి. హైస్కూలు, కాలేజి విద్యార్థుల కోసం బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు కూర్చిన ఇంగ్లీషు – తెలుగు, ఇంగ్లీషు – తెలుగు– హిందీ, తెలుగు – ఇంగ్లీషు, హిందీ – తెలుగు నిఘంటువులను ఎమెస్కోవారు ప్రచురించారు. 1924 లో మాక్మిలన్‌వారు ప్రచురించిన ఇంగ్లీషు, తెలుగు నిఘంటువులో ఒక ప్రత్యేకత ఉంది. ఇందు ఆంగ్ల పదాలను సర్కారు, రాయలసీమ ప్రాంతాలలో వాడుకలో ఉండే తెలుగు అర్థాలు ఆయా ప్రాంతాలలోని పండితుల సాయంతో చేర్చబడ్డాయి. దీన్నొక ఆంగ్ల ఉద్యోగి సిద్ధంచేశారు. తెలుగు అధికారిక ఆంగ్లపదాలకు తెలుగు సమానార్థకాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించి ఆ పనిని సులువు చేయడానికి దోహదం చేసింది. ఇటీవల ప్రచురించిన ఇంగ్లీషు, తెలుగు నిఘంటువులలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తరపున ప్రకటించిన, బోయి భీమన్న, డాక్టరు పి.ఎస్.ఆర్. అప్పారావు, డాక్టరు అడపా రామకృష్ణరావులు సిద్ధంచేసిన సమానార్థ వ్యతిరేకార్థ పద నిఘంటువు ప్రత్యేకంగా ప్రశంసింపదగినది. ఇందు సుమారు 750 ప్రధాన ఆరోపాలకు (ఎంట్రీస్) సమానార్థాలు వ్యతిరేకార్థాలు ఇవ్వబడ్డాయి.

తదుపరి శంకరనారాయణ ఇంగ్లీషు – ఇంగ్లీషు – తెలుగు నిఘంటువును ఆవంచ సత్యనారాయణ గారు పరిష్కరించి, పలు అనుబంధాలు చేర్చగా దీన్ని విజయవాడ, విక్టరీ పబ్లిషర్స్ 2005 లో తొలి ముద్రణ జరిగింది. తదుపరి దాదాపు ప్రతి ఏటా పునర్ముద్రిస్తున్నారు. ఈ కోవలో వచ్చిన మరో మంచి ఇంగ్లీషు – తెలుగు నిఘంటువు న్యూ ఎడ్వాన్స్డు డిక్షనరి. దీన్ని ముసునూరి వెంకటేశ్వరరావు సిద్ధపరిచారు. విజయవాడ, వి.జి.ఎస్.బుక్స్ లింక్స్‌వర్క్ 2008లో తొలుత ప్రచురించారు. జె.పి.ఎల్. గ్విన్ తయారు చేసిన ఆక్స్ఫర్డు తెలుగు, ఇంగ్లీషు డిక్షనరీ 2009లో పునర్ముద్రితమైనది. దీని తొలిముద్రణ 1991.

ఇప్పటికీ అముద్రితంగా ఉన్నవాటిలో పి.బి. బెంజిమన్ భారతి సచిత్రంగా, శాస్త్ర, సాంకేతిక పదాలను గూడ చేర్చి రూపొందించిన సింప్లిఫైడ్ డిక్షనరీ విలువ తక్కువదిగాదు. దీని రాతప్రతి హైదరాబాదులోని భారత గుణవర్ధక సంస్థ గ్రంథాలయంలో

ఉంది. ఈ నిఘంటువు అత్యంత ప్రయోజనకరంగా ఉంది. సాహిత్యంలో మకుటాయమానంగా విరాజిల్లుతోంది. పైన ఉదహరించిన నిఘంటువులు గాక మరికొన్ని గూడ వెలువడ్డాయి.

## తెలుగు - సంస్కృతం నిఘంటువులు

అసాధారణమైన శబ్ద పరిపుష్టి గల సంస్కృత భాష ఒకప్పుడు తెలుగు ప్రభువులకు రాజభాషగా ఉన్నప్పటికీ, దాదాపు వెయ్యి సంవత్సరాల నుంచీ క్రమంగా వాడుకలో లేకుండా పోయింది. అంతమాత్రాన దీన్ని మృతభాష అనరాదు. కాని సంస్కృతభాషకు సాహిత్య గౌరవం ఎప్పుడూ పతాకస్థాయిలోనే ఉంటుంది. భారతీయులు, భారతీయ సంస్కృతి ఉన్నంతకాలం అదేస్థాయిలో నిలుస్తుంది. ఇది చారిత్రక సత్యం. తొలి తెలుగు మహాకావ్యం సంస్కృతం నుంచి సంగ్రహపరచి అనువాదం చేసిన నాటినుంచి నేటివరకు సాహిత్యపరంగా తెలుగువారికీ సంస్కృతానికీ సన్నిహిత సంబంధం ఉంది. సంస్కృతభాష తెలుగుసీమలో ఇతోధికంగా గౌరవింపబడుతున్నది. కాశీ కృష్ణాచార్య వంటి ఉద్దండ పండితులు సంస్కృత భాషను విశేషంగా ప్రచారం చేశారు. విద్యార్థులకోసం తొలిసారిగా ఆంధ్ర-సంస్కృత నిఘంటువును సిద్ధంచేసి 1949లో ప్రచురించారు. ఇటీవలే పుల్లెల శ్రీరామచంద్రుడు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి తయారుచేసిన ఆంధ్ర-సంస్కృత పర్యాయ పదాలు ఇచ్చారు. తత్సమ పదాలను గ్రహింప లేదు. ఈ రెండు నిఘంటువులు తెలుగునుంచి సంస్కృత పర్యాయపదాలు తెలుసుకోడానికి ఉపకరిస్తున్నాయి.

## సంస్కృతం - తెలుగు నిఘంటువులు

సంస్కృతం తెలుగు ద్విభాషా నిఘంటువులను రెండు రకాలుగా విభజింప వచ్చును. సంస్కృత నిఘంటువులకు తెలుగు టీక, తాత్పర్యాలు సమకూర్చబడినవి. సాధారణంగా ఇవి లౌకిక భాషలో వెలువడిన శ్లోక నిఘంటువులు. పదానుక్రమణిక గ్రంథాంతంలో లేదా గ్రంథారంభంలో ఉంటుంది. ఇవి మొదటి తరగతికి చెందినవి. కేవలం తెలుగువారిని దృష్టిలో పెట్టుకొని అకారాది క్రమంలో తయారు చేయబడిన సంస్కృతాంధ్ర నిఘంటువులు రెండో తరగతికి చెందినవి. నేటి కాలానికి అకారాది నిఘంటువులే బహుళ ప్రచారంలో ఉన్నాయి. శ్లోక రూపంలో గల సంస్కృత నిఘంటువులలో అమరానికి సంస్కృతంలో పలు వచ్చాయి. వాటి ఛాయలో తెలుగులో

దామరపు వెంకట సుబ్బశాస్త్రి 'కళానిధి తిరువెంకటార్య' తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్య, సరస్వతి వెంకట సుబ్బశాస్త్రిలు టీకలు రాసి అధ్యయనం సులభం చేశారు. అమరంలోని పదాలను అకారాదిగా కూర్చి సంస్కృతాంధ్రాలలో వ్యుత్పత్తులు, పర్యాయపదాలు ప్రతిదానిని సూచిస్తూ కొత్తపల్లి సుందరరామయ్య 1915లోనే అకారాద్యమర నిఘంటువును సిద్ధం చేశారు. ఇది గాడేపల్లి కుక్కుటేశ్వరరావుగారి పరిష్కరణతో ప్రచురణ జరిగినట్లు తెలుస్తుంది.

ఆ తర్వాత పర్యాయ పద సంచయాలు కలిగిన మేదినీకోశం, ధనంజయ నిఘంటువు, నానార్థ రత్నమాల, విశ్వకోశము, వైజయన్తి, హారావళి మొ॥ శ్లోక నిఘంటువులకు టీకలు, గ్రంథాంతాలలో అనుబంధంగా అకారాది పట్టికలు సంతరింపబడ్డాయి. టీకలలోని తెలుగు అర్థాలు ద్విభాషా నిఘంటువుల అవసరాన్ని కొంతవరకు తీర్చాయి. మరొక దశలో శబ్దార్థ కల్పతరు, సర్వశబ్ద సమ్బోధివ్యాఖ్యాయమ్ నిఘంటువులకు కూడ తెలుగు అర్థాలు చేర్చడం వలన మరింత ప్రయోజనకరంగా ఉన్నవి. పైగా ఈ నిఘంటువులన్నీ తెలుగు లిపిలోనే ఉండడం వలన తెలుగు భాషకు మరింత చేరువుగా ఉన్నాయనే భావన కలుగచేస్తున్నాయి.

కోల్‌కత్తా నుంచి 1821–57 మధ్య కాలంలో ఎనిమిది సంపుటాలలో ప్రచురించిన రాజా రాధాకాంతదేవుని శబ్ద కల్పద్రుమమ్ తొలి అకారాది సంస్కృత నిఘంటువుగా కొందరు పేర్కొనడం జరిగింది. ఇది వాస్తవం కావచ్చు. కాని 1818లోనే సాగర తీరంలోని మచిలీపట్నానికి చెందిన మామిడి వెంకటార్యులు (వెంకయ్య) శబ్దార్థ పరిష్కరణతో ముద్రణకు నోచుకోలేదు. వెంకటాచార్యులు చూపిన మార్గంలో పిదప పా.ప. శ్రీనివాస రామానుజాచార్యులు, మంసు వెంకయ్యశాస్త్రి, ఉత్పల వేంకట రంగాచార్యులు తయారు చేసిన సంస్కృతాంధ్ర నిఘంటువును వావిళ్లవారు 1942లో తొలిసారిగా ప్రచురించారు. దాదాపు ఇదే తీరులో వెచ్చా వెంకటరామయ్య సంస్కృతాంధ్ర నిఘంటువు తయారైనది. ములుకుట్ల నాగభూషణశాస్త్రులు దేవతలు, నవగ్రహాలు, పంచభూతాలు, భూమి మొదలైన విషయాలపై గల పదాలను సంస్కృత పదోక్తిలో తెలుగు అర్థాలలో వివరించారు. ఈ విధంగానే భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి సంస్కృతాంధ్ర సంఖ్యార్థ బోధిని 1924లో వెలువడింది. ఈ సంకేత నిఘంటువులు పునర్ముద్రణ కావలసిన అవసరం ఎంతో ఉంది.

## తెలుగు - హిందీ

చిరకాలంగా ఉత్తర భారతంలో ఉర్దూపదాలు ఎక్కువగా గల హిందూస్థాని భాష ప్రచారంలో ఉండేది. జాతీయోద్యమదినాలలో దానిలో సంస్కృతం, ఫార్సీ, అరబ్బీ, తుర్కీపదాలు హెచ్చుగాకల భాషను హిందీ అని పిలవడం ప్రారంభించారు. 1906లో వినాయక్ దామోదర్ సావర్కార్ నాయకత్వంలో స్ఫూర్తిని ప్రగహించిన భారతీయ విద్యార్థిదళం, అభినవభారత్ సంస్థ హిందీని జాతీయ భాషగా చేయాలని కోరాయి. 1917 నుంచీ గాంధీజీ హిందీ ప్రచారాన్ని ప్రారంభించారు. హిందీ ప్రచారం జాతీయోద్యమంలో ఒక భాగంగా రూపొందింది.

1918 ఇండోర్‌లో జరిగిన అలహాబాద్ హిందీ సాహిత్య సమ్మేళన వార్షికోత్సవాల సందర్భంగా హిందీని దేశవ్యాప్తంగా ప్రచారం చేయడానికి రూపకల్పన చేయబడింది. అదే సంవత్సరం దక్షిణభారత హిందీ ప్రచారసభ స్థాపనతో దక్షిణ రాష్ట్రాలలో హిందీ ప్రచారానికి అకురార్పణ ఏర్పడింది. తదనుగుణంగా తెలుగుదేశంలో పలుచోట్ల హిందీ పాఠశాలలు ప్రారంభమైనాయి. గ్రంథ ప్రచురణకు మార్గం ఏర్పడింది. ఈ తరుణంలో జంధ్యాల శివన్నశాస్త్రి తెలుగు హిందీ నిఘంటువును సిద్ధం చేశారు. అది బాగా ప్రచారంలోకి వచ్చి విద్యార్థులకు బాగా ఉపయోగపడింది. ఏ.సి. కామాక్షీరావు తయారు చేసిన తెలుగు–హిందీ కోశ్‌ను దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు ప్రచురించారు. జాతీయవాది కోమండూరి శఠగోపం వాడుకలో గల లోకోక్తులను చేర్చి 1954లో ఆంధ్ర–హిందీ నిఘంటువును ప్రచురించారు. ఇటీవలి కాలంలో ప్రయాగ హిందీ సాహిత్య సమ్మేళనం అయాచితుల హనుమచ్ఛాస్త్రిచే తయారు చేయించిన తెలుగు– హిందీ శబ్దకోశ్ ప్రత్యేకంగా పేర్కొనదగినది. ఇందు పదబంధాలు, సామెతలు, వ్యాకరణ నియమాలు అనుబంధంలో చేర్చబడ్డాయి. ఈ నిఘంటువులన్నీ ముఖ్యంగా అధ్యయన, అధ్యాపనలలో మాత్రం ఉపాధ్యాయులకు, విద్యార్థులకు హెచ్చుగా ఉపయోగిస్తున్నాయి.

వాస్తవం ఆలోచించినట్లయితే హిందీ తెలుగు నిఘంటువుల ప్రయోజనం కూడ పైరీతికే పరిమితం చేశారు. గాంధీజీ ఆదేశానుసారం జంధ్యాల శివన్నశాస్త్రి 1922లో దక్షిణ భారత హిందీ ప్రచార సభ తరపున హిందీ తెలుగు నిఘంటువును లోకానికి అందించారు. ఆ తర్వాత వెలువడిన ఎ.సి. కామాక్షీరావు రాయల హిందీ తెలుగు

శబ్దకోశము, సాగి సత్యనారాయణ శబ్దసింధు, చావలి సూర్యనారాయణమూర్తి సచిత్ర హిందీ తెలుగుకోశ్, పొక్కులూరి రామచంద్రశర్మ హిందీ తెలుగు కోశ్ ప్రజాదరణను పొందాయి. హిందీ రాజభాషగా రూపొందాక భారతీయ భాషల్లో సాధారణంగా ఉపయోగించుకోవడానికి వీలయ్యే పదాలను "హిందీ వర్డ్స్ కామన్ టు ఇండియన్ లాంగ్వేజెస్" పేరుతో భారత విద్యా, విజ్ఞాన పరిశోధన మంత్రిత్వశాఖ ప్రచురించింది. ఇది మిక్కిలి ప్రయోజనకరమైన నిఘంటువు. హిందీ భాషా వ్యాప్తికి జాతీయ సమైక్యతా భావాలను ప్రోదిచేయడానికి వినియోగపడే కరదీపిక.

## తెలుగు - ఉర్దూ నిఘంటువులు

తెలుగునాట బహమనీ రాజులు, కుతుబ్‌షాహీ రాజులు, అసఫ్ జాహీ రాజులు ఉర్దూ భాషా సాహిత్యాలను బాగుగా పెంచి పోషించారు. గత శతాబ్దిలో క్రైస్తవ మిషనరీలు గూడ ఉర్దూ భాషకు మిగుల సేవచేశారు. తెలుగు భాషకు బ్రౌన్‌వలె ఉర్దూభాషకు డాక్టర్ గిల్‌క్రిస్ట్ నిఘంటు, వ్యాకరణాదులను సంతరించారు. భాషకు నూతన పరిపుష్టిని తీసికొని వచ్చారు. ఉర్దూ భాష నేడు భారతదేశంలో ఏ ఇతర భాషకు తీసిపోని సాహిత్య ప్రతిపత్తిని కలిగియున్నది.

తెలుగుదేశంలో తెలంగాణా ప్రాంతం ఉర్దూ భాషకు పురిటిగడ్డ. నిజాం కాలంలో తెలుగువారు సైతం ఉర్దూనే మొదటిభాషగా పాఠశాలలో చదివేవారు. పాలనా వ్యవహారాలన్నీ ఉర్దూలోనే సాగుతూండేవి. ఆ సమయంలో ప్రజల అవసరాలను తీర్చేందుకు తెలుగు ఉర్దూ – తెలుగు నిఘంటువులు కొన్ని ప్రచురణ కావడం సహజం. తాడికొండ తమ్మారెడ్డి దేశాయి తొలిసారిగా 1906లో శబ్దార్థ చింతామణిని సిద్ధం చేశారు. ఇందు హిందీ పదాల ఉచ్చారణ కూడ వివరింపబడింది. 1854లో తెలంగాణాలో ప్రసిద్ధులు అయితంరాజు కొండలరావు తెలుగు హిందూస్థానీ నిఘంటువు, ఉర్దూ భాషకు అపారమైన సేవచేసిన స్వచ్ఛంద సంస్థ అంజుమన్ తరక్కీ ఉర్దూ కె.గోపాలకృష్ణారావు చేత తెలుగు ఉర్దూ నిఘంటువును, బిరుదురాజు రామరాజు చేత ఉర్దూ – తెలుగు నిఘంటవును సిద్ధం చేయించింది. ఈ రెండూ తెలుగు భాషకు దీప్తి నిచ్చే మణిదీపాలు. ఈ ప్రయత్నాలకు ముందు గత శతాబ్దంలో 1894 లో వెంకట సింహదరీ గజపతిరాజూ వాత్స్యాయన్ బహర్ ఉల్ లుగాత్ పేరుతో ఉర్దు – తెలుగు పదావళిని సంతరించారు. ఈ దశాబ్ద తొలిపాదంలో దత్తాత్రేయ నీల్ కంఠ్ పాండవీ తయారుచేసిన ఉర్దూ

తెలుగుకోశం గూడ బాగా ఉపయోగపడింది. ఒక పరిమితమైన ప్రాంతంలో గల తెలుగువారికీ, తెలుగు భాషపై అభిమానం గల మహమ్మదీయులకు నిఘంటువులు ప్రయోజనకరంగా ఉన్నాయి.

## మరికొన్ని భాషల నిఘంటువులు

తెలుగుతో ఇంగ్లీషు, హిందీ, సంస్కృతం, ఉర్దూ మొదలైన భాషలు కలిసి ద్విభాషా నిఘంటువులు అనేకం ప్రకటించటమే గాక తమిళం, మరాఠీ, కన్నడ, సవర్, రష్యన్ భాషల్లో యీ కోవకు చెందిన కొన్ని నిఘంటువులు గూడ ప్రచురించారు. ఇది తెలుగు భాషా విస్తృతికీ, తెలుగువారి ప్రభావానికి ప్రత్యక్ష నిదర్శనం. దాదాపు నూటయాభై సంవత్సరాల క్రితం సిద్ధం చేయబడిన శ్రీకోశం తొలి తమిళ తెలుగు నిఘంటువని డాక్టరు చల్లా రాధాకృష్ణశర్మ అభిప్రాయం ! ఇది అముద్రితం. దీని రాత ప్రతి ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారి గ్రంథాలయంలో తాళదళ గ్రంథ విభాగంలో ఉన్నట్లు తెలుస్తూంది. అకారాది క్రమంలో కూర్చిన యీ నిఘంటువులో తమిళ పదాలు గూడ తెలుగు లిపిలోనే యివ్వబడ్డాయి. కందాళై శేషా చార్యులు ద్రావిడాంధ్ర నిఘంటువులో శ్రీవైష్ణవ పదజాలం హెచ్చుగా చేర్చబడింది. బి.ఎన్. కృష్ణస్వామి అయ్యర్ విద్యామాలిక పేరుతో కూర్చిన తెలుగు తమిళ నిఘంటువు అట్టే ప్రచారంలో లేదు. గత శతాబ్ది తుది పాదంలో మహారాష్ట్రతో సాహిత్య రీత్యా మనకు దగ్గర సంబంధం ఉండేది. అనేకమైన మరాఠీ నవలలు యీ శతాబ్ద తొలి పాదంలో తెలుగులోకి రావడం యిందుకు ప్రబలమైన ఉదాహరణ. త్యంబర్ గోవింద్ కిరానే ఉపయుక్త శబ్దసాగర్ సంగ్రహ్ పేరుతో తెలుగు మరాఠీ నిఘంటువును కూర్చారు. ఆంధ్ర, కన్నడ ఉభయ భాషల్లో ప్రవీణుడు కె.సుబ్బరామప్ప ఒక కన్నడ-తెలుగు ద్విభాషా నిఘంటువును సాహిత్య అకాడమీ తరపున రూపొందిస్తున్నారు. ఇటీవలి కాలంలో సోవియట్ విజ్ఞాన సర్వస్వ కార్యాలయం, మాస్కోలో ప్రకటించిన తెలుగు రష్యన్ నిఘంటువు ప్రత్యేకంగా ప్రశంసింపదగినది. దీనికి సంపాదకులు ఉప్పల లక్ష్మణరావు. దీనికి అనుబంధంగా సోవియట్ ప్రజలకోసం రాసిన సంక్షిప్త తెలుగు వ్యాకరణం ఉపయుక్తంగా ఉంది. ఇటీవల తెలుగు అకాడమీ తెలుగు - ఫ్రెంచి నిఘంటువును, తెలుగు - కన్నడ నిఘంటువులను ప్రచురించింది. బహు భాషా నిలయమైన భారతదేశంలో యీ నిఘంటువులు ఎంత ఎక్కువగా ప్రచురణ జరిగితే అంత మంచిది.

## పలుభాషల నిఘంటువులు

తెలుగుభాషా ప్రగతి ద్విభాషా నిఘంటువులతోనే ఆగిపోలేదు. మూడు నాలుగు భాషల మొదలుకొని పదహారు భాషల మేరకు కోశాలు ప్రచురణ కావడం ఆనందింపదగిన విషయం. 1890 లోనే తెలుగు – హిందీ ఫార్సీభాషలు గల త్రిభాషా మంజరిని ఈమని సీతారామస్వామి కూర్చారు. తెలుగు హిందుస్థానీ ఇంగ్లీషు తమిళ భాషలకు సంబంధించిన నాలుగు భాషల నిఘంటువును దాసరి లక్ష్మణస్వామి ప్రచురించారు.ముఖ్యంగా తెలుగు తమిళం 'మలయాళం' కన్నడం మొదలైన ద్రావిడ భాషలకు సంబంధించి థామస్ బరో, ఎం.బి.ఎమెనో సిద్ధం చేసిన వ్యుత్పత్తి పదకోశం ద్రవిడియన్ ఎటిమోలాజికల్ డిక్షనరీ, ఆర్.ఏ. సేతుపిళ్లై తదితరులు కూర్చిన ద్రావిడ భాషాసామ్య పదకోశం ద్రవిడియన్ కంపేరిటివ్ వొకాబ్యులరీ, తెలుగు వ్యాకరణ విపులీకరణలో జీవితమంతా కృషిచేసిన వఝల చిన సీతారామస్వామిశాస్త్రి ద్రావిడభాషా సామ్యములు మొదలైన గ్రంథాలు ద్రావిడభాషా వికాస, విస్మృతులను శాస్త్ర బద్ధంగా నిరూపించిన వెలుగు దీపికలు, తెలుగు ప్రజలు ఆదరించాల్సిన గ్రంథరాజాలు.

## పదసూచికలు

ఆంధ్ర నామసంగ్రహము, ఆంధ్ర నామశేషము మొదలైన పద్య నిఘంటువులను వల్లించడం ద్వారా తెలుగు భాషను గాని యితర ప్రాంతీయ భాషలను గాని నేర్చుకుంటున్న తరుణంలో పదసూచికలు (ఒకాబ్యులరీస్) విశేషంగా ప్రచురితమయ్యాయి. ఇందులో వాడుకలోగల పదాలు, వాటికి ఒకటి రెండు అర్థాలు మాత్రం ఉంటాయి. ఇతర భాషల్లో వ్యవహారంలో గల పదాలను సులభంగా గ్రహించడానికి యివి ఎంతగానో ఉపయోగ పడతాయి. తెలుగులో ముద్రణతో గ్రంథాలు వస్తున్న తొలిరోజులలో 1841 లో ఇంగ్లీషు తెలుగు ఒకాబ్యులరీని కంపెనీ ఉద్యోగి జె. నికోలస్ కూర్చారు. ఆ తర్వాత తెలుగునకు, యితర భాషలకు సంబంధించిన అనేక పదసూచికలు వచ్చాయి. వాటిలో రంగాభట్ల గున్నయ్యశాస్త్రి ఇంగ్లీషు – తెలుగు – ఒరియా ఒకాబ్యులరీ, యం. మొదలియార్ గారి శబ్దార్థచంద్రిక, పీటర్ పెర్సివల్ హిందూస్థానీ ఇంగ్లీషు తెలుగు ఒకాబ్యులరీ ముఖ్యమైనవి. వీటిలో హెచ్చుభాగం గత శతాబ్ది పాదంలో వెలువడినవి. విదేశీ పాలనా ప్రభావం హెచ్చుగా

ఉండటంచేత నాడు ప్రతిసూచికలోనూ ఇంగ్లీషు భాషకు స్థానం ఉండడం గమనించదగిన విషయం. ఈ పదసూచికలే తెలుగులో బృహత్తరమైన ఈ నిఘంటువులు తయారుకావడానికి దోహదం చేశాయి.

## సమగ్రాంధ్ర నిఘంటువులు

వివిధ శాఖలలో పెరుగుతున్న విజ్ఞానాన్ని అనుసరించి నేడు ఐదు విషయాలపై సమగ్రాంధ్ర నిఘంటువుల అవసరం కనిపిస్తోంది.

1. భాషా సాహిత్యాలు
2. సామాజిక శాస్త్రాలు
3. మానవీయ శాస్త్రాలు (ఇతరాలు)
4. శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాలు
5. సమాచార సాంకేతిక విజ్ఞానం

సమగ్రమైన తెలుగు నిఘంటువును భాషా విషయంలో తయారు చేయడానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ముందుగా పద ప్రయోగ కోశాలు, మాండలిక పదకోశాలు, వృత్తి పదకోశాలు, సిద్ధం చేయిస్తూ ఉంది. ఇవన్నీ శాస్త్రీయ దృషితో తయారు చేయ సంకల్పించిన నిఘంటువుకు ముడి సరుకుగా వినియోగిస్తాయి. ఇవి లేనిదే సమగ్రమైన రీతిలో నిఘంటువు తయారు చేయడం దుర్లభం. తెలుగు అకాడమీ ఇన్టర్, డిగ్రీ తరగతులో ఉపయోగించే పదజాలాన్ని చాలవరకు సిద్ధం చేసింది. ఈ పదజాలానికి వివరణలు సిద్ధంచేసి, సచిత్రంగా సమగ్రంగా సామాజిక శాస్త్రాలలో, మానవీయ శాస్త్రాలలో, శాస్త్ర సాంకేతిక విజ్ఞానాలలో నిఘంటువులు పూర్తిగా ప్రకటిస్తే మానవాళికి, మహోపకారం చేసినట్లవుతుంది.

(తొలి ప్రపంచ మహాసభల (1975) సందర్భంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన **తెలుగు నిఘంటు వికాసం**రచన వెలగా వెంకటప్పయ్య గ్రంథం నుండి స్వీకరించి పలు సవరణలు చేయడమైనది.)

——0——

# *PREFACE TO THE TELUGU - ENGLISH DICTIONARY*

The Indian Peninsula is Principally inhabited by the Telugu, Tamil, Kannadi and Malayalam nations. South of the town of Madras the language is Tamil : to the north and north - west, Telugu is used.Circles drawn on the map around Kadapa, Rajamahendravaram, and Kondapilli, the radius of each extending to Madras, will sufficiently shew the wherein the Hindus speak Telugu.

Hindustani is spoken by those Mahomedans who are scattered among the Hindus. Few of the Hindus can speak HIndustani : and every native Musulman learns the vernacular of those among whom he resides. Musulmans of education correspond only in persian. Others employ Hindu scribes who can write nothing but their mother tongue.

The Mahabharaat and the Ramayanam were translated into Telugu in the days of Vishnu Vardhana (A.D.1120)seven centuries ago. Telugu had at that day attained the highest degree of vigour. But all the poems of a yet earlier age are lost.

The Peninsular languages are in grammar and idiom entirely separate from Hindustani : which however they often resemble in the arrangement off words.But during the long regin of the Musulmans some thousands of Aradic and persian words became naturalized in the southern tongues.Of these I have prepared a separate dictionary.At present many Hindustani phrases are disappearing, and English words are used instead.

Sanscrit is to the Southern tongues, what Arabic is to Hindustani, or Latin is to English : the source of learning, the favourite pursuit of scholars, the fountain of scientific phraseology.But the grammer of Telugu is independent of Sanscrit.Few Telugus or Tamils are well versed in Sanscrit : and we meet some Tamils who, however thoroughly skilled in sanscrit are unable to writen read, speak Telugu.

To these statements it may be replied that surely Telugu poetry abounds with sanscrit words. True : and English poetry abounds with Latin words.Yet an Italian or spaniard, however familiar with Cicero, would unless he had studied English, find Milton unitelligible.

Every hour we pass in reading Sanscrit is a gain to us in learning Telugu : and yet few of our country men who are acquainted with Telugu have ever studied Sanscrit. Those who learn Hindustani acknowledge the utility of knowing Arabic : yet few have made Arabic a preliminary to studying Hindustani.

Several Sanscrit words appear in this volume which are not found in any Sanscrit lexicon. And some Sanscrit words have new interpretations. These are supported by quotations from Sanscrit authors.

Among the manuscripts perused, some were Glossaries of old local dialects : with explanations in Telugu or Sanscrit. I have generally printed these unaltered : an English translation was needless.

The alphabet used by the Telugus and the Kannadis is alike : but the letters vary in shapes as widely as French varies from English manuscript..

In southern India the Sanscrit manuscripts (some very ancient) are in the Telugu and Cannadi characters; or in *"Grandham"* (Tamil) ; or in Malayalam. the Devanagari character is known to few persons. To write the vernaculars in the devanagari character is as difficult as it is to write English in Greek characters.

Each of the Southern languages has a poetical and a vernacular dialect :which vary as widely as Saxon varies from English. Yet the grammatical principles raraly differ. In English we fancy that we used but one dialect. Yet (unless he has previously been taught to construe it,) where shall we find a Hindu, however accomplished in English, able to read and understand a page of Marmion or childe Harold ? I have not met with a single Bramin who could at sight rightly understand every column of an English newspaper. I do not undervalue the scholarship of the Hindus : with their limited means they have done excellently. Few of us have a moderate acquaintance with their tongues, while thousands of them have a respectable acquaintance with English. If we possessed their patience and determination in acquiring knowledge, we should think less lightly of their proficiency.

I have made an improved arrangement of the consecutive initial consonants : uniting such as in Telugu are commutable. Few Sanscrit words are affected by this principle : which exists in Welsh and in all the languages of the Celtic family.

Thirty years ago, in reading Telugu poetry I often met with a word beginning with G (as goru) and was directed by my learned tutor to seek it in the Andhra Dipica under Koru. An initial J (as jelungu) as to be found under ch. words beginning with D might at pleasure begin with T. Dova and tova equally mean a road. puli is a tiger : but in compounds P changes into B and it became beb - buli. And some words that begin with sh may be as well written with S. From this uncertainty the learned seldom relieved me : on being asked, they often reply that either spelling may be used. At last I removed the uncertainty by transcribing the Dictionary, when nearly half complete, and mingling those initials which are changeable.

I will here add an instance. In the Dipica there is a verb Duvalincu. Now some poets spell this with an initial T; others with Dh.Accordingly this word might appear in three different pages : whereas by mingling the initials, the they are at once found without trouble. Should any future editor prefer separating the commutable letters, this can easily by done ; but it will inconvenience the learner. Every man who markes real progress in Telugu will I think see value of the present arrangement.Under the old system the scholars were often at a loss. Now the path is clear.

Printing has been used among the Tamils for more than a century. Among the Telugus it commenced about the year 1806 but made little progress until 1830. About 1835 some of the Telugu and Sanscrit poems were printed at Madras. At present many volumes continually issue from Telugu presses managed by Hindus alone. There are at least eigth such presses at work, besides those which are under the management of Englishmen.s Native news papers, both Telugu and Tamil, exist : but are ill supported unless they deal in vituperation regarding points of religion or caste.

The present Dictionary was written to assist myself in learnings the Telugu language. For on leaving College in the year 1820 I was sent by Sir Thomas Munro, then Governor, to a Telugu District and was obliged to learn the language of the populace. I was employed for more a vocabulary of the expressions which daliy occured in conversation or correspondence. I had intercourse with all classes, from the learned pandit or raja, to the illiterate prosecutor or prisoner. Tradesmen, doctors,

hunters and sailors, poets and painters all became my instructors as they fell in my way. Gradually I was encouraged to study the easier authors and subsequentil the better poets. In their writings I obtained solutions of many difficulties in grammar and idiom; and though the task occupied several years I think the object was worth the trouble of attainment.

As I proceeded, I felt the want of explanatory commentaries : and there fore employed learned men to frame such for me in their native Telugu. some of these have been printed, and others are ready for publication.

From the information collected I prepared the statements now published. Of the authors quoted, a list is subjoined.

At the end of my Telugu Reader. I have printed a "Little Lexicon" like the one appended to Dalzell;s Analecta Graeca. It is intended to aid mere beginners : but is not an abridgement of this Dictionary.

Every Dictionary when first printed is liable to errors and oversights. Ihave therefore given in the Supplement such emendations or improvements as occurred.

Every Dictionary when first printed is liable to errors and oversights. I have therefore given in the Supplement such emendations or improvements as occurred.

This Dictionary was written at the request of the Society for Promoting Christain Knowledge and is printed at their expense. I desire to tender my hearty acknowledgments to that Venerable body for thus producing a work which otherwise might not perhaps have been printed.

In composing this work I have had approbation of many learned assistants. But some (sastris) scholars have disapproved the spelling here exhibited. Instead of that found in poems and used in ordinary life they wish us to practice a pedantic style; which is admired because conceited and far from clear. Such refinements are disregarded by men of real learning, who are therefore considered vulgar by some who are inferior in sound scholarship.

## *EXPLANATION OF SOME GRAMATICAL EXPRESSIONS*

*A star denotes that the word is derived from Sanscrit : being either *Tatsama or Tadbhava.*

*Tadbhava* తద్భవ. A Telugu word derivedd from Sanscrit, but much altered, is denominated *Tadbhava:* thus పంక్తి panct i h becomes బంతి banti, 'a line'. ద్వీపః dw i pah 'an island' becomes దీవి di vi. So in English from ratio, satio, traditio, we have the words reason, season, treason. If a word is only altered in the termination (as, రాజః r a jah becoming రాజు r a zu, మనిషిః manishih, మనిషి minishi.) this is denominated తత్సమ tasama or equivalent. Thus the Latin words ratio,natio, become in English ration, nation, Some Sanscrit words (like some Latin or Greek wods in English) are used with out any alteration.

K. signifies 'Karnataca కర్ణాటిక the language usually called కనడ Kanada, కన్నడి Kannadi, or "Canarese."

Padap. That is పాదపూణకకం a word or phrase inserted, in verse, merely to fill the metre.

P|| participle.

"Root in A" - or "Infinitive in A." Verbs have, an Infinitive in Damu, as చేయడము ch e ya damu, రావడము ra va - damu, ఉండడము unda - dam : and by dropping damu, the forms చేయ, రావ, వుండ are the "Roots in A". They can add the adverbial signగా as చేయ గా, రాగా, ఉండగా.

G.,D., I., L., denote Genitive, Dative, Instrumental, and Locative cases.

Error for ........... Some words are spelt in two methods. Thus ఉప్పరగించుట is by the learned written ఒప్పరగించుట; the popular spelling is therefore designated an "error for' another mode.

Metr. gr.(metri gratia) this mark denotes that the spelling is changed to suit the metre.

Mid. The Middle voice, ending in కొనుట; as చేసుకొనుట, ఉండుకొనుట.

# PREFACE

THIS is a NEW EDITION of the Late C.P BROWN'S well - known Telugu - English Dictionary, thoroughly revised and brought up to date. The chief features of the work are as follows :-

1. All the latest and best sources of information have been utilised in its preparation, especially as regards the Scientific Terms.Various Government publications such as the Fauna of British India edited by Dr. Blanford, Dr. Wattss Dictionary of the Economic products of India, and the Madras Manual of Administration, have been laid under contribution.
2. All words used in Telugu, both literary and colloquial, from whatever language they may have come, are given in the body of the work, so as to render the age of any other book of reference superfluous.
3. All the words are given in Romanized spelling, so that the work may be utilised by scholars outside india for indological studies.
4. Cognate and compound words are grouped together under a headword so as to afford a greater facility for the study of the Telugu language, and are printed in bold type.
5. Wherever possible,, the derivations of words are given, and similar forms in other languages are indicated. Many words given as native in Telugu Dictionaries are traced to a foreign origin.
6. Many quotations from the Telugu classics which seemed unneceswsary have been left out and several new ones have been added.

In addition to the works named above, the Editors have freely made use of Mr. Brown's own MS. notes kindly lent to the S.P.C.K by the authorities of the India Office Library. Sitara macharlu's Telugu Dictionary published by the Madras school Book and Vernacular Literature society has also been very largely made use of in preparing this edition. Quotations made from it are indicated by the references given in Telugu characters. the Editors are also indebted to serveral friends for valuable assistance readily rendered.

26 th August, 1903. Madras.

The Editors

(మహావాది వెంకటరత్నం, డబ్ల్యు.హెచ్.కాంప్‌బెల్, కందుకూరి వీరేశలింగం)

# *INTRODUCATION*

TELUGU, which is one of the South India Vernaculars, belongs to the Dravidian group off Languages. A semi - circle drawn with Rajahmundry as centre and the distance between it and Madras as radius, covers, roughly speaking, the greater portion off the country in which it is spoken by about 25 millions of people. It is spoken and written in its purity along the coast strip between Nellore and Vizagapatam and in the four districts of the Madras presidency included within those limits, Beyond this area it contains an admixture of Tamil in the south, of Kanarese in the west, of Mahrati in the west and north - west, and of Uriya in the north.

Telugu is closely allied to Tamil, Kanarese and Maliyalam, words of Dravidian origin occuring in all these languages without any great difference of form. The original Dravidian speech seems to have split up into these languages about the time when the modern Teutonic languages such as English, Dutch and German were formed out of their parent tongue. Tamil is probably nearer to the original tongue than any other member of the group, and as it has preserved the older forms of the Dravidian roots a knowledge of it is essential to the proper study of the south Indian languages.

It is doubtful if any of the Dravidian races had a knowledge of the art of writing prior to the Aryan invasion, and certainly none of them can boast of a literature older than the 8th or 9th century A.D. In Telugu there is no work extant older than the translation of the sanskrit Maha Bharata. which is supposed to have been made in the 11th century A.D. but bears traces of having been expanded in subsequent times. The style of this translation, which is quite modern, is accepted as a standard of classical Telugu.As the perfect style of the book could not have been developed all at once, it is hardly possible to avoid the conclusion that there must have been not a few earlier and less polished works which have since perished. There is indeed a tradition that when Vasishnavaism supplanted Saivaism in the country, all the older literature was destroyed.

In the formation of modern Telugu, four strata are distinctly visible. The lowest of these consists of the pure Telugu element. This is of the deepest interest to the student of language at present, as it has as yet been but little worked by scholars. A careful study of the Telugu words reveals to us much of the life and thought of the ancient Dravidians

**ఉజ్జీవనము** *n.* : Animating, inspiring with life. Revival. జీవనము, బ్రతుకు. **ఉజ్జీవించు** *v.a.* : To live. జీవించు.

**ఉజ్జృంభితము** *adj.* : Bursting forth, betrayed, as any passion.

**ఉజ్జ్వలము** *adj.* : Radiant, splendid. వెలుగునది.

**ఉజాడ** *adj.* : Depopulated, waste, deserted. పాడైన. ఆ గ్రామము ఉజాడై నది the village was depopulated.

**ఉజయబోడ** *n.* : Starboard. కుడిపక్క. (a sea phrase).

**ఉజ్జ** *n.* : A guess, estimate., ఉహ. ఉజ్జగొను *v.t.* : To guess. ఊహించు.

**ఉజ్జగించు** *v.a.* : To cease from, lay aside, leave, abandon, desist from. విడిచిపెట్టు. **ఉజ్జగిల్లు** *v.i.* : To avoid. to pass. గతించు.

**ఉజ్జనము** *n.* : The act of giving up, abandonment. విడుపు. ఉజ్జనచేయు *v.t.* : To giveup విడుచు.

**ఉజ్జాయించు** *v.i.* : To guess. ఊహించు. ఉజ్జాయింపు *n.* : Conjecture, guess, estimate.

**ఉజ్జువకల్లు** *n.* : Pumice stone. A stone thrown up by a volcano.

**ఉజ్ఝిత** *adj.* : Left, abandoned.

**ఉటంకము** *n.* : Summing up, a summary. టూకి, సంగ్రహము, ఉటంకి *adj.* : Clever, active, ready, nimble, brief. **ఉటంకించు** *v.a.* : To note, make a note or abstract of; to note down as a memorandum.

**ఉటజము** *n.* : A hermitage : a cell formed of leaves. పర్ణశాల, ఆకుటిల్లు.

**ఉట్టి** *n.* : A fibrous network sling, in which pots, & c., are suspended from the beams of the house.

**ఉట్టిచీల** *n.* : A rivet. రెండు కొనలందును తలగల చీల.

**ఉట్టిపడు** *v.n.* : To start forth. To be manifested, as a passion. ఉన్నట్లుండి కలుగు, అతిశయించు.

**ఉట్టు** *n.* : Salt land; land fit for the manufacture of salt. ఉప్పుపట్టి, ఉప్పుపఱ్ఱ ఉట్టు (for పుట్టు) v.n. To be born. To flow. కారు.

**ఉట్రవడియము** *n.* : A rich dish, a kind of pilao of rice and spices. వాని సొమ్ము ఉట్రవడియముగా నోట్లోవేసి కొన్నాడు. he took that man's property as quietly as he would have eaten his dinner.

**ఉట్లతద్దె** or **ఉట్లపండుగ** : A feast. See ఉట్టి and తద్దె.

**ఉట్లబొడ్డి** or **బొద్ది** *n.* : A certain plant.

**ఉఠాణి** *adj.* : Great, high. గొప్ప, ఎత్తైన, ఉన్నతము.

**ఉఠావుఠి** or **హుఠా హుఠి** *n.* : Hastiness. అతిత్వర, ఉఠావుఠిపయనము a forced march. ఉఠావుఠిగా వచ్చి చేరిన they arrived in a great hurry.

**ఉడత** : same as ఉడత.

**ఉడవ** *n.* : A sort of fish, a species of Zues.

**ఉడాయించు** *v.i.* : To run away.

**ఉడికిలించు, ఉడికిలు** : See under ఉడుకు.

**ఉడిగము** : Same as ఊడిగము.

**ఉడిగిపోవు** or **ఉడిపోవు** : Same as ఉడుగు.

**ఉడుకాడు** *v.t.* : To plague, tease, chaff. ఉడికిలించు.

**ఉడుకు** *v.n.* : To boil, to bubble with heat, to see to be hot, feverish from heat, to boil with rage.

**ఉడికిలించు** *v.t.* : To irritate, to make ones' blood boil. To distress or hurt one's feelings, to annoy.

**ఉడుకువ** : See under ఉడుగు.

**ఉడుగర** *n.* : A gift, a present, any present given to a bride or bride-groom during the celebration of their marriage. కట్నము.

**ఉడుగు** *v.n.* : To fall away, grow thin, lean or emaciated, decrease, to be cast off, to be removed as a stone or chain : to be exhausted. కానుపు ఉడిగినది breeding has ceased.

**ఉడుత** or **ఉడత** *n.* : A squirrel. ఉడుత భక్తి the squirrel's devotion.

**ఉడుపకుక్క** *n.* : A hound that hunts after iguanos.

**ఉడుపము** *n.* : A float or raft తెప్ప.

**ఉడుపు** *n.* : A suit of clothes; a dress.

**ఉడుపు** *v.a.* : To efface, to turn out, to do away with, to wipe away, remove. To leave to stop or cease. ఉడుగజేయు, ఉడిగించు.

**ఉడుపుష్పము** *n.* : The scentless chins rose. *Hibiscus Sincensis.* అశోకము, దాసనము.

**ఉడుము** *n.* : The iguana గోధ; గోధిక. ఉడుప పిల్ల the young iguana. ఉడుము పోయినా చెయ్యి వదిలించుకొని రావలెను. if you catch an iguana, you are lucky if you get your hand off it.

**ఉడువు** : another form of ఉడుగు.

**ఉడువు** *n.* : A lunar mansion, a star. నక్షత్రము. ఉడుపతి or ఉడుపుడు : The lord of the stars, i.e., the moon. చంద్రుడు.

**ఉడుసర** *n.* : A kind of plant. వాయసి.

**ఉడ్డ** or **ఉడ్డా** *n.* : Four, a parcel or pack of four, నాలుగు; an assemblage or collection, a heap or pile. రాశి. ఉడ్డాచేయు *v.a.* : To collect in a heap or crowd.

**ఉడ్డాడించు** *v.t.* : To plater, play back-wards and forwards. ఉడ్డాడు *v.i.* : To be confounded, to be con-fused. కలతనొందు.

**ఉడ్డీనము** *n.* : Flying, soarding. ఎగురుట.

**ఉడ్డుకుడుచు** *v.n.* : To be out of breath, to be suffocated. To be at one's wits' end ఊపిరి తిప్పుకొనలేక బాధపడు.

**ఉణుజు** *n.* : A kind of fish.

**ఉతక** *n.* : The pivot under a door. ఉతక యెత్తు to lift a door off its hinges. See ఉత్తరాసి.

**ఉతుకు** *v.a.* : To wash, as cloth. ఉదుకు. To thrash. ఉతకడానికి వేయు to send clothes to be washed.

**ఉత్కంఠ** *n.* : Great eagerness. తహవా, వేగిరపాటు.

**ఉత్కంటము** *adj.* : Abundant, excessive. అధికమైన.

**ఉత్కరము** *n.* : A mass or heap. సమూహము, రాశి. మానవోత్కర ములు crowds of men.

**ఉత్కర్షము** *n.* : Excellence, superiority. శ్రేష్ఠత, మేలు.

**ఉత్కలము** *n.* : The country of Orissa.

**ఉత్కలిక** *n.* : Desire, longing. కోరిక, ఉత్కంఠ, ఉత్కలుడు *n.* : An eager or clever man దురంధరుడు, నిర్వాహకుడు.

**ఉత్కలితము** *n.* : Geometric progression. సంకలితము arithmetical progression.

**ఉత్కారము** *n.* : Winnowing ధాన్యమును తూర్పెత్తుట.

**ఉత్కృష్టము** *adj.* : Superior, great, fine, grand. గొప్ప శ్రేష్ఠము ఉత్కృష్టదశ good fortune, high station. గొప్పదశ. ఉత్కృష్టమైన బాధ terrible suffering.

**ఉత్కోచము** *n.* : A bribe లంచము.

**ఉత్క్రమణము** *n.* : Going up : setting out. మీదికిపోవుట. ప్రాణోత్క్రమణ దశలో at the moment the soul leaves the body.

**ఉత్క్రోశము** *n.* : The ospray, or sea eagle.

**ఉత్తిదేక్షప్తము** *adj.* : That which is thrown up. ఎగజిమ్మబడిన. **ఉతేక్షపము** *n.* : Tarowing up in tragments. ఎగజిమ్ముట.

**ఉత్త** *adj.* : Empty, mere, bare, plain, actual, just, simple; idle, naked, vain, useless, in jest, not serious, not in earnest, false. ఉత్తప్పుడు on common occasions, in general.

**ఉత్తండములు, ఉత్తండాలు** *n. plu.* : A sort of gold necklace, worn by women.

**ఉత్తంభితము** *adj.* : Planted, set. పాదుకొన్న, నిలుపబడిన. Lengthened. పొడిగింపబడిన.

**ఉత్తంసము** *adj.* : An earring : a tire or tiara. పూగమ్మ, సిగబంతి. ఉత్తంసితము *adj.* : Set or worn as a crown.

**ఉత్తప్తము** *adj.* : Dried. n. Dried flesh.

**ఉత్తమ** *n.* : An excellent good woman.

**ఉత్తమము** *adj.* : Excellent. best, virtuous, chief, principal, first.

**ఉత్తర** *n.* : The 12th lunar mansion. The daughter of the King of Vira, the 26th mansion

**ఉత్తరంగము** *n.* : An arch over the door frame. గడపమీది కమ్మి.

**ఉత్తరక్రియ** *n.* : A funeral rite, obsequies. చచ్చిపోయినవారికి చేసెడి అపరక్రియలు.

**ఉత్తరణము** *n.* : Passing, crossing దాటుట.

**ఉత్తరము** *n.* : An answer, a reply. A letter or epistle. The north. A command. **ఉత్తర ప్రత్యుత్తరములు** letter and reply, correspondence. ప్రశ్నోత్తరములు question and answer.

**ఉత్తరము** *adj.* : Secondary subsequent, following after. మీదిది. ఉత్తర భాగము the sequel or supplement. **ఉత్తర రామాయణము** the sequel to the Ramayana **ఉత్తరసాక్షి** a subscribing witness.

**ఉత్తరవాదము** *n.* : Responsibility, security. ఉత్తరవాదముచేయు to hold one responsible. **ఉత్తరాది** *n.* : One who is responsible or answerable.

**ఉత్తరాషాఢ** *n.* : The 21st of the lunar mansions.

**ఉత్తరాసంగము** *n.* : A cloak : an upper or outer garment. ఉత్తరీయము.

**ఉత్తరాసి** *n.* : A hole in the lintel and still or below the doorway, in which are inserted the pivots upon which the door turns. తలుపుతిరిగే కూసము.

**ఉత్తరించు** *v.a.* : To cross or pass over. To amputate : to divide cloth into separate pieces, to refund, repay, restore. ఉత్తారకుడు *n.* : One who helps one to cross. A saviour, a deliverer. దాటించువాడు, రక్షకుడు.

**ఉత్తరిగ** *n.* : A kind of necklace. ఒక విధమైన సరము.

**ఉత్తరీయము** *n.* : A cloak, an upper garment. పై బట్ట.

**ఉత్తరుడు** *n.* : Name of the son of Virata (See Bharata). ఉత్తరకుమార ప్రజ్ఞలు vain bragging like that of ఉత్తరుడు. ఉత్తరకుమార ప్రజ్ఞలు పలుకువాడు he is a mere braggart.

**ఉత్తరువు** *n.* : An answer, a reply, an order, a command, permission, leave. ఉత్తరువుచెప్పు *v.n.* : To answer or reply.

**ఉత్తరేణు** or **ఉత్తరేణి** or **ఉత్తరేను** *n.* : The plant termed or, the Prickly Chafflower ఉత్తరేణిముల్లు a bur that sticks to the clothes.

**ఉత్తలము** *n.* : Fear, dread, terror, distress, agitation, trouble. భయము, దిగులు, వెరపు, అధైర్యము. Haste. త్వర. ఉత్తలపడు or ఉత్తలమొందు To be in trouble or agitated. **ఉత్తలపాటు** *n.* : Disquiet, distress.

**ఉత్తానము** *adj.* : Not deep. Turned on one's back, lying supinely, reclining. లోతులేని, వెలికిల తిరిగిన. **ఉత్తానశయుడు** *n.* : One who lies on one's back.

**ఉత్తాలము** *adj.* : Long : formidable. ఉత్తాలవాలుడు he of the formidable sword. ఉత్తాలపడు to hurry, to be precipitate. తొట్రుపాటునొందు.

**ఉత్తి** *n.* : An equal. A substitute. ఈడు, ప్రతినిధి, (Jai. Bhari.i)

**ఉత్తీర్ణము** *adj.* : That which is crossed over. దాటబడిన.

**ఉత్తుంగము** : High, tall : big, projecting. పొడుగైన.

**ఉత్తుడు** *adj.* : A fit person. తగినవాడు. భార. అను.

**ఉత్థానము** *n.* : Rising : effort : an army, war. ఉత్థాపనము *n.* : Rising : erection. లేపుట. ఉత్థాపనములేని impotent. మృతశోత్థాపనము resurrection. పునరుత్థానము resurrection.

**ఉత్పతనము** *n.* : Flying, soaring. Birth, production. ఎగురుట, పుట్టుక.

**ఉత్పత్తి** *n.* : Birth, creation, production, origin. పుట్టుక, ఉత్పత్తిచేయు To produce, create, fabricate. **ఉత్పత్తియగు** *v.n.* : To be born, created, formed, framed.

**ఉత్పన్నము** *adj.* : Born. పుట్టిన.

**ఉత్పలము** *n.* : A waterlily, a blue lotus. కలువ. ఉత్పలమాల The name of a particular metre in verse.

**ఉత్పాటనము** *n.* : Rooting out, eradication. పెరికివేయుట. ఉత్పాటించు *v.a.* : To root out or eradicate. పెరికి వేయు. **ఉత్పాటితము** *adj.* : Eradicated, rooted up.

**ఉత్పాతము** *n.* : A prodigy, a preternatural phenomenon such as an earthquake, a comet, or an abnormal birth. ఉత్పాతపిండము a wonderful genious. త్రివిధోత్పాతములు marvels or signs in air, earth, and heaven.

**ఉత్పాదించు** or **ఉత్పాదిల్లు** *v.n.* : To be born, to rise, to spring from a source. కలుగు, పుట్టు. **ఉత్పాదితము** *adj.* : Produced, effected, generated, begotten కలిగింపబడిన.

**ఉత్ప్రాసము** *n.* : Satirical speech. పరిహాసపు మాట.

**ఉత్ప్రేక్ష** *n.* : Hyperbole, rhytorical sublimity, high flown language, Poetical ecstacy, Apostrophe. ఉత్ప్రేక్షించు and t. To apostrophise, or describe hyperbolically.

**ఉత్ఫుల్లము** *adj.* : Expanded, or blown as a flower. వికసించిన.

**ఉత్రాసి** *n.* : The upper hinge of door, a pivot on which the door turns. Same as ఉత్తరాసి. The lower hinge is called ఉతక.

**ఉత్సంగము** *n.* : The lap, the front of the thigh. Association, union. ఒడి, తొడ, కూడిక.

**ఉత్సన్నము** *adj.* : Rooted up, desroyed, decayed, ruined. పెల్లగింపబడిన.

**ఉత్సర్గము** or **ఉత్సర్జనము** : Yielding, rilenquishment quitting విడుపు, Common సామాన్యము.

**ఉత్సవము** *n.* : A feast, festivity, merriment. నేత్రోత్సవము a feast for the eyes.

**ఉత్సహించు** or **ఉత్సాహించు** *v.i.* : To attempt. యత్నించు To triumph, to rejoice. సంతోషించు. **ఉత్సాహము** n. Perseverance. Alacrity.

**ఉత్సుకము** *adj.* : Strenuous, zealously active. Earnest, zealous. ఉత్సాహము గల.

**ఉత్సృష్టము** *adj.* : Abandoned, left. విడువబడిన.

**ఉత్సేకము** *n.* : Increase, pride; sprinkling water అతిశయము, గర్వము, ప్రోక్షణము. **ఉత్సేకించు** *v.i.* : To be full, to increase. అతిశయించు.

**ఉత్సేధము** *n.* : Height, elevation, loftiness. పొడవు, ఎత్తు.

**ఉదంచనము** *n.* : An earthen cover for a pot. మూకుడు.

**ఉదంచితము** *adj.* : Thrown up, tossed. Worshipped, honoured. Fine, grand, splendid విజృంభించిన.

**ఉదంతము** *n.* : A message. Tidings. వృత్తాంతము, సమాచారము.

**ఉదక్** *n.* : North. ఉత్తరదిక్కు *adj.* : Northern. ఉత్తరపు.

**ఉదకము** *n.* : Water. నీళ్లు.

**ఉదగ్రము** *n.* : High Fearful. పొడవైన, భయంకరమైన.

**ఉదధి** (ఉద water + ధి Place.) : The sea. సముద్రము ఉదపానము *n.* : A well. నుయ్యి.

**ఉదయము** *n.* : Birth పుట్టుక. The rising of the sun or other heavenly bodies, the morning ఉదయాన in the morning.

**ఉదరము** *n.* : The belly, the centre; లంబోదరుడు the corpulent being, a title of Ganesa.

**ఉదరు** *v.i.* : To be afraid, to be alarmed. ఉదరిపడు *v.n.* : To start or be alarmed. అదరిపడు, ఉలికిపడు.

**ఉదర్కము** *n.* : Future or remote consequence, భవిష్యత్ ఫలము; future time. రాగలకాలము.

**ఉదస్తుడు** *adj.* : He who is expelled, humbled or shamed; an exile; నిరాకరింపబడినవాడు; తొలగింపబడినవాడు.

**ఉదాత్తము** *n.* : A sort of quaver used in reading the Veda. ఉదాత్తము *adj.* : Generous, liberal, noble, glorious.

**ఉదానము** *n.* : Air that rises in the throat. కంఠమందలి గాలి.

**ఉదారుడు** *n.* : A liberal or splendid man, a generous ఇచ్చువాడు.

**ఉదాసీనము** *n.* : Bullying, rejection, disregard. ఉదాసీనపు మాటలు, abusive language.దుర్భాషలు. **ఉదాసీనుడు** *n.* : A stranger.

**ఉదాహరణము** *n.* : An example, instance, or illustration of any rule or precept. ఉదాహరించు *v.a.* : To instance, mention.

**ఉదితము** *adj.* : Spoken, said. Risen, produced. చెప్పబడిన, పుట్టిన.

**ఉదియ** *n.* : An attempt. యత్నము, రామా. అర : ఉదియగొను *v.t.* : To try. యత్నించు.

**ఉదిరి** *adj.* : Fine, pure. Refined. తప్తము, ఉదిరి బంగారు fine gold అపరంజి. ఉదిరి నెత్తమ్ములు lilies. ఉదిరి కౌగిటన్ in a sweet embrace ఉదిరి గొను *v.i.* : To be hot, to melt తపించు.

**ఉదిల** *n.* : Trouble, grief, regret. పరితాపము. Discouragement, timidity, cowardice. పిరికితనము, అధైర్యము. ఉదిలకొను *v.i.* : To be afraid. భయపడు; to lose heart, to grieve, to regret పరితపించు.

**ఉదీచి** *n.* : The north. ఉదీచీనము or ఉదీచ్యమా adj. Northern.

**ఉదీర్ణము** *adj.* : Generous, noble, great. ఉదారము, గొప్ప.

**ఉదుంబరము** *n.* : The glomerous fig tree, మేడిచెట్లు.

**ఉదుకు** : Same as ఉతుకు.

**ఉదుటు** or **ఉదుటుతనము** *n.* : Bigness, vigour, weight. ఉద్ధతి *adj.* : Big, vigorous, fine. ఉద్ధతము.

**ఉదురు** *adj.* : Insolent. ఉదురు మిడుకు a fool. దుర్వినీతుడు.

**ఉద్గతి** *n.* : Birth, production, పుట్టుక.

**ఉద్గమము** *n.* : Birth, production. flight. పుట్టుక, ఎగవు. **ఉద్గమించు** *v.i.* : To fly. ఎగయు.

**ఉద్గాఢము** *adj.* : Much, excessive, deep. అధికము.

**ఉద్గాత** *n.* : One who directs the SamaVeda ceremonies in a sacrifice. యజ్ఞమందు సామవేదమును నడపువాడు.

**ఉద్గారము** *n.* : Vomiting, belching, emitting, exuding, gushing. కక్కుట, తేపు, ఉద్గారించు *v.a.* : To vomit, to belch, emit. కక్కు.

**ఉద్ఘాటనము** *n.* Breaking. ఛేదించుట, *n.* : To break, open. ఛేదించు.

**ఉద్ఘాతము** *n.* : Beginning. Striking. ఆరంభము, దెబ్బ.

**ఉద్ఘోషము** *n.* : Cry మొర. ఉద్ఘోషించు *v.i.* : To cry. మొరపెట్టు.

**ఉద్ద** *adj.* and *adv.* : Much, very. మిక్కిలి High or long. ఎత్తైన, పొడవైన.

**ఉద్దండము** or **ఉద్దండత** *n.* : Violence, fierceness, as of heat. ఎక్కువయినది. ఉద్దండముగా fiercely, hotly.

**ఉద్దము** *n.* : Height, length. ఉద్దములు or ఉద్దాలు *n.* : Shoes, slippers. పాదరక్షలు.

**ఉద్దరి** *n.* : A steep bank : నదిలో దిగుటకు యుక్తముకాని దరి. ఉద్దరువు (ఉద్ద + అరువు.) *n.* : Mortgage of a crop not yet raised.

**ఉద్దాముడు** *n.* : An irresistible man. నిరంకుశమైన శక్తిగలవాడు. An independent man. స్వతంత్రుడు.

**ఉద్దారి** *n.* : A superintendent. విచారణ కర్త.

**ఉద్దాలు** : See under ఉద్దము.

**ఉద్ది** *n.* : A match, an equal, a rival. Rivalry, equality. A bank or dam

with a channel on it, into which water is pumped to be conveyed to higher lands. The name of a certain tree. జత, సమానము. ఉద్దిచూపు to rival ఉద్దులు equals సమానులు.

**ఉద్దియ** *n.* : A trial, attempt. యత్నము. ఉద్దియుచేయు to try. యత్నించు.

**ఉద్దిష్టము** *adj.* : Designed, mentioned. ఉద్దేశింపబడినది.

**ఉద్దీడు** : Same as ఉద్దికాడు. See under ఉద్ది.

**ఉద్దీపకము** *adj.* : Inflaming, lighting. వెలిగించునది.

**ఉద్దీపనము** *n.* : Burning. వెలుగుట.

**ఉద్దులు** *n.* : The grain called black gram. మినుములు.

**ఉద్దేశము** *n.* : Intent, design. గురి, ఉద్దేశించు *v.i.* : To intend, design. ఉద్దేశ్యము. *adj.* : Thus which is intended.

**ఉద్ధతి** *n.* : Rudeness, arrogance. గర్వము, ఉద్ధతుడు.

**ఉద్ధరణ్** *n.* : A little spoon used in worship.

**ఉద్ధరించు** *v.a.* : To raise, lift, set up, support, up-hold, re-establish, restore, rescue, deliver, preserve, protect. పైకెత్తు, కాపాడు.

**ఉద్ధవము** *n.* : A festival. a holiday పండుగ.

**ఉద్ధారణము** or **ఉద్ధారణ** or **ఉద్ధారము** *n.* : Lifting up, Protection, Sustaining, Rescuing, delivering, releasing, restoring.

**ఉద్ధురము** *adj.* : Weighty, firm బరువైన, నిలకడైన.

**ఉద్ధూతము** *adj.* : Driven up, shaken off, scattered, removed. మీది కెగరగొట్టబడిన, పోగొట్టబడిన.

**ఉద్ధృతము** *adj.* : Raised, drawn up. పైకెత్తబడిన, చేదబడిన.

**ఉద్బుద్ధము** *adj.* : Awakened, excited, reminded తలపునకు వచ్చిన, తెలుప బడిన, లేవబడిన, ఉసికొలుపబడిన.

**ఉద్భటము** *adj.* : Great, exceeding హెచ్చు అయిన.

**ఉద్భవము** *n.* : Birth, production, emanation. పుట్టుక. ఉద్భవించు or ఉద్భవిల్లు *v.i.* : To be born or produced. పుట్టు.

**ఉద్భాసితము** *adj.* : Splendid, glorious. ప్రకాశితము.

**ఉద్భిజ్జము, ఉద్భిత్తు, ఉద్భిదము** *n.* : Sprouting, germinating, shooting. భూమిని భేదించుకొని పుట్టునది. **ఉద్భేదము** adj. Breaking or bursting through, as a shoot through the ground. పుట్టిన.

**ఉద్యమము** *n.* : An attempt యత్నము. **ఉద్యమించు** *v.i.* : To attempt.

**ఉద్యానవము** *n.* : A royal garden, వెడలించుట.

**ఉద్యాపనము** *n.* : Sending out. park.

**ఉద్యుక్తము** *adj.* : Attempted. Zealous, resolved, ఉద్యుక్తుడు He who is

ready or prepared. యత్నించువాడు, సిద్ధముగా నున్నవాడు. అక్కడికి పోవలెనని ఉద్యుక్తుడై being about to go.

**ఉద్యోగము** *n.* : An attempt, endeavour, under taking; enterprise, exertion; activity. యత్నము a profession, employment, occupation, calling, mission, office, or situation.

**ఉద్రేకము** *n.* : Increase, excess. అతిశయము. ఉద్రేకించు *v.i.* : To increase. అతిశయించు. ఉద్రిక్తము *adj.* : Distinct : increased.

**ఉద్వర్తనము** *n.* : Any unguent applied to the body before bathing. నలుగుపిండి.

**ఉద్వాసనము** *n.* : Expulsion, exile. ఉద్వాసించు or ఉద్వాసనము చేయు v.a. To expel. అగ్నిని ఉద్వాసనము చేయుట to banish the regent of fire out of flame.

**ఉద్వాహము** *n.* : Marriage. పెండ్లి.

**ఉద్విగ్నము** *adj.* : Disturbed, discomposed, disquieted, affected with fear or sorrow. ఆకులితమైన, కలవరముగానుండే.

**ఉద్వృత్తము** *adj.* : Potent, irresistible ill, behaved, proud గర్వించిన. ఉద్వృత్తి Might; misbehaviour గర్వము.

**ఉద్వేగము** *n.* : Anxiety. agitation. వెరపు.

**ఉద్వేలము** *n.* : Excess, fastness. అధికము. **ఉద్వేలము.** *adj.* : Extreme, vast, prodigious. ఉద్వేల తరమైన very vast.

**ఉద్రము** *n.* : An otter. నీరుపిల్లి.

**ఉనికి** or **ఉన్కి** *n.* : Being, existence. Stay, dwelling, home, place, residence, state, condition. ఉండుట, స్థితి, స్థానము మాటాడకునికి remaining silent. హితవుగాకునికి his not being friendly.

**ఉనుచు** : Same as ఉంచు.

**ఉన్నతము** *adj.* : Tall, high, lofty. ఉన్నతి n. Tallness, height. Increase, advancement, prosperity, rising, ascending. పొడవు, అతిశయము, ఔన్నత్యము.

**ఉన్నమితము** *adj.* : Raised, high, exalted. పైకెత్తబడిన.

**ఉన్ని** *n.* : Wool. గొర్రెబొచ్చు.

**ఉన్నె** for **ఉండునా** : is it likely to be so ?

**ఉన్మత్తము** *adj.* : Mad, foolish, tipsy. వెర్రెత్తిన. **ఉన్మత్తుడు** *n.* : A madman, a fool. మిక్కిలి మదించినవాడు. **ఉన్మదుడు** *adj.* : Proud, spirited.

**ఉన్మాథము** *n.* : A trap, a snare. బోను, గాలము.

**ఉన్మీలనము** *n.* : Opening, expanding. వికసించుట, తెరచుట. **ఉన్మీలితము** *adj.* : Opened, blooming, opening. వికసించిన.

**ఉన్ముఖము** *adj.* : Looking up, facing, fronting. మీదుచూచునది. ఉన్ముఖత్వము *n.* : Tendency, inclination.

**ఉన్మూలము** *n.* : Radical. or from the root వేరుతెగిన. ఉన్మూలముగా radically. by the roots. **ఉన్మూలించు** *v.t.* : To root up, eradicate.

**ఉన్మేషము** *n.* : Opening, blowing as a flower. వికాసము. నవనవోన్మేషముగా with increasing delight.

**ఉపకంఠము** *n.* : Contiguity, nearness. *Adj.* : Near, proximate. దాపైన.

**ఉపకథ** *n.* : An episode.

**ఉపకరణము** *n.* : An instrument, implement, apparatus, an appendage. సాధనము. **ఉపకరించు** *v.a.* : To be of use, benefit, do good to. ఉపకారము *n.* : Beneficence, kindness, obligation.

**ఉపక్రమము** *n.* : Beginning or commencement. A skilful plan. ఉపాయ మెరిగి ప్రారంభించుట.

**ఉపక్రోశము***n.* : Censure, blame. నింద.

**ఉపగూహనము** *n.* : An embrace. ఆలింగనము.

**ఉపగ్రహము** *n.* : A satellite.

**ఉపఘ్నము** *n.* : A prop : a trellia for creepers to grow over. సమీపా శ్రయము, ప్రాకు.

**ఉపచయము** *n.* : Increase, heap, excess. వృద్ధి.

**ఉపచరించు** *v.a.* : To serve, be friend. To help (at tale), to tend, wait upon. సేవించు, సమ్మానించు. **ఉపచారము** *n.* : Service or waiting upon. Kindness, good officers, attendance ఊడిగము.

**ఉపజాతి** *n.* : A sub-class. జాతిలో చేరిన భాగము.

**ఉపజీవి** *n.* : A dependent. ఒకరినను సరించి జీవించువాడు, ఆశ్రితుడు, తత్పాదపద్మోపజీవి his humble servant.

**ఉపతాపము** *n.* : Grief, weariness; disease, trouble. సంతాపము, రోగము.

**ఉపత్యక** *n.* : Low land. The foot of a hill. కొండదగ్గరి నేల.

**ఉపద** *n.* : A present or gift. కానుక.

**ఉపదంశము** *n.* : A relish, a pickle or condiment. ఊరగాయ. A painful venereal disease కొరుకురోగము.

**ఉపదేశము** *n.* : Teaching, instruction, guidance, practical observations. హితవచనము Initiation, confirmation in the creed : **ఉపదేశించు** *v.a.* : To teach, guide. initiate, prompt. **ఉపదేశకుడు** or **ఉపదేష్ట** *n.* : A teacher ఉపదేశించువాడు.

**ఉపద్రవము** *n.* : Trouble, annoyance, plague, affliction. Danger, injury, harm. అపాయము. ఉపద్రవపుపని a dangerous business.

**ఉపధ** *n.* : (In gram.) the penultimate letter. కడపటి అక్షరమునకు ముందరి అక్షరము.

**ఉపధానము** *n.* : A pillow or cushion. తలగడ.

**ఉపనయనము** *n.* : Investiture with the sacred thread. The initiation rite in the twice-born castes among the Hindus. వడుగు.

**ఉపనిధి** *n.* : A secret hoard. మిక్కిలి రహస్యముగా దాచిన సొమ్ము.

**ఉపనిషత్తు** *n.* : An Upanishad, a philosophical disquisition attached to the Vedas.

**ఉపనీతుడు** *n.* : One initiated into the twice born castes వడుగైనవాడు. See ఉపనయనము.

**ఉపన్యసించు** *v.a.* : To keep. ఉంచు To detail, inculcate amplify.

**ఉపన్యాసము** *n.* : Dwelling on a subject; as exposition, a lecture.

**ఉపపట్టణము** *n.* : A suburb.

**ఉపపతి** *n.* : One who keeps a woman. విటుడు, రంకుమగడు.

**ఉపపదము** *n.* : An affix in grammar.

**ఉపపన్నుడు** *n.* : An opulent man. ఉపపత్తికలవాడు.

**ఉపపురాణము** *n.* : A minor Purana. See పురాణము.

**ఉపప్లవము** *n.* : A calamity. ఉపద్రవము, చంద్రాదిగ్రహణము, రాహువు.

**ఉపబర్హము** *n.* : A pillow. తలగడ.

**ఉపబలము** *n.* : Aid, సహాయము. ఉపబలమైన conductive to.

**ఉపబృంహణము** *n.* : Increase, prosperity చక్కగా పెరుగుట, వృద్ధి.

**ఉపభోగము** *n.* : Enjoyment, use, అనుభవము.

**ఉపమ** *n.* : A resemblance, a simile. Also skill నేర్పు. **ఉపమరి** Clever, ready at expedients. **ఉపమానము** *n.* : A comparison, simile.

**ఉపయుక్తము** *adj.* : Convenient, fit, disposable, serviceable. ఉపయోగమయిన. **ఉపయోగము** *n.* : Use, advantage, benefit.

**ఉపరి** : See రతి.

**ఉపరి** *adj.* : Over, above. ఉపరిరయితు *n.* : A tenant at will పాయకారి.

**ఉపలక్షణము** *n.* : ఉపలక్షించు. *v.s.* : To survey, to observe. చూచు.

**ఉపలబ్ధి** *n.* : Acquirement, gain, knowledge పొందుట, తెలివి.

**ఉపలము** *n.* : A stone, a jewel, a rock. వర్షోపలము a hailstone భూతలసమోపలము a rock even with the surface of the ground.

**ఉపలాలనము** *n.* : Lulling, coaxing. బుజ్జగము. **ఉపలాలించు** *v.* : To lull (a child, & c) to sleep, to coax. బుజ్జగించు ఉపలాలితము *adj.* : Coaxed, lulled. బుజ్జగింపబడిన.

**ఉపలేపనము** *n.* : Smearing, plastering. అలుకుట.

**ఉపవనము** *n.* : A park or demesne, a garden or grove ఆరామము. తోట.

**ఉపవాసము** *n.* : Fasting, a fast. పస్తు, ఉపవాసముచేయు to go without food, to fast.

**ఉపవాహ్యము** *n.* : A king's elephant. రాజుయొక్క సవారీయేనుగు.

**ఉపవిష్టము** *adj.* : Seated, sitting సుఖోపవిష్టులై seated at their ease.

**ఉపవీతము** *n.* : The brahminical thread. జందెము.

**ఉపశమనము** or **ఉపశమము** *n.* : Tranquility, calmness, patience, alleviation, relief, abatement. ఓర్పు.

**ఉపశ్రుతి** *n.* : A good or bad omen gathered from overhearing a conversation.

**ఉపశ్లోకించు** *v.t.* : To applaud. స్తోత్రము చేయు.

**ఉపసంహరించు** *v.t.* : To clear away, get rid of to kill. To recall. సంహరించు, మరలించు. **ఉప సంహారము** *n.* : Recalling, annulling.

**ఉపసదనము** *n.* : a neighbouring abode : the neighbourhood.

**ఉపసర్గ** *n.* : A grammatical particle, a prefix or preposition. **ఉపసర్గము** *n.* : A portent such as an eclipse, & c. ఉత్పాతము.

**ఉపసర్పణము** *n.* : Courting, fawning. ఆశ్రయించుట. ఉపసర్పించు v.a. To court, sue. ఆశ్రయించు. **ఉపస్థానము** *n.* : Service. సేవ.

**ఉపస్పర్శము** *n.* : Touching, contact. Also ఆచమనము.

**ఉపహతము** *adj.* : Struck (by lightning, & c) hurt, injured, destroyed. కొట్టబడిన. **ఉపహతి** *n.* : A blow, calamity, trouble, ruin. ఉపద్రవము.

**ఉపహారము** *n.* : A complimentary present. కానుక.

**ఉపాంగము** *n.* : In music, the accompaniment, as the drone. సుతి పోసెడి తిత్తి.

**ఉపాంతము** *n.* : Nearness. గ్రామోపాంతమునందు in the vicinity of the village సరోవరో ప్రాంతదేశము నందు in the land near the lake.

**ఉపాంశు** *adv.* : Solitary. ఏకాంతము. **ఉపాంశువు.** *n.* : Muttering a prayer. జపభేదము.

**ఉపాకర్మము** *n.* : A rite celebrated by Brahmins on the full moon in the month Sravanam (July, August:) they imagine that this blots out all the sins of the past year, and they put on new threads సంస్కార పూర్వకముగా వేదమును గ్రహించుట.

**ఉపాఖ్యానము** *n.* : A tale, legend, narrative. ఇతిహాసము. కుచేలోపాఖ్యానము the story of Kuchela. నలోపాఖ్యానము the life of Nala.

**ఉపాత్యయము** *n.* : Neglect, transgress on. అతిక్రమణము.

**ఉపాదానము** *n.* : A cause or motive. కారణము. Alms భిక్షము, ఉపాదానమెత్తు to beg.

**ఉపాధి** *n.* : Meditation ధర్మచింత. One who supports his family. కుటుంబ పోషకుడు Cause or means. వ్యాజము. An attribute or characteristic విశేషణము. జీవనోపాధి means of subsistence.

**ఉపాధ్యాయుడు** *n.* : A tutor, instructor చదువు చెప్పువాడు. A preceptor in religion. One who teaches the Veda. వేదమును చదివించువాడు. ఉపాధ్యాయని *n.* : A female teacher.

**ఉపానహము** *n.* : A shoe.

**ఉపాయనము** *n.* : A complimentary gift. కానుక.

**ఉపాయము** *n.* : A contrivaxce, expedient, means, method, agency. వెరవు. ఉపాయము కల్పించు to contrive. చతురుపాయములు or ఉపాయ చతుష్టయము the four devices. i.e., సామము using gentle or pacific means, దానము giving presents or binding. భేదము sowing dissensions among the enemy or dividing his force or strength, దండము punishment.

**ఉపాలంభము** *n.* : A taunt, irony, innuendo దూషణ, ఉపాలంభించు To taunt దూషించు.

**ఉపాసన** *n.* : Service, worship. సేవ, ఆరాధనము, **ఉపాసించు** *v.t.* : To wait on, worship. సేవించు, ఆరాధించు.

**ఉపాసకము** : same as ఉపవాసము.

**ఉపేంద్రుడు** *n.* : A name of the god Vishnu.

**ఉపేక్ష** *n.* : Indifference, heedlessness, contempt, disregard అశ్రద్ధ, అలక్ష్యము. **ఉపేక్షించు** *v.a.* : To disregard, to contempt.

**ఉపోదకి** *n.* : A kind of spinch. బచ్చలి.

**ఉపోద్ఘాతము** *n.* : Preface, introduction. A commencement పీఠిక.

**ఉపోషణము** or **ఉపోష్యము** *n.* : Fasting, starving పస్తు.

**ఉప్ప** : Same as ఉప్పన.

**ఉప్పత** *n.* : Betraying; divulging a secret; dilating on any man's extraordinary prosperity, qualifications or beauty of any person. రద్ది, రట్టు, రవ్వ, ఒకని మేలునకోర్వలేక ఆడిపోసికొనుట.

**ఉప్పతిలు** or **ఉప్పతిల్లు** *v.n.* : To be born, produced, made ఉద్భవించు.

**ఉప్పత్తులు** *n.* : Shares, portions. బియ్యము ఉప్పత్తులు చేసినారు they shared the grain.

**ఉప్పన** or **ఉప్ప** or **ఉప్పదనము** *n.* : Saltness.

**ఉప్పనబట్టెలు** *n.* : A sort of game. ఉ. హరి.

**ఉప్పని** *adj.* : Saltish, brackish. ఉప్పని మాట చప్పనిమాట చెప్పి by fair means or foul.

**ఉప్పర** or **ఉప్పరి** *n.* : The name of the mining caste who are tank diggers and makers of well, & c.

**ఉప్పరము** *n.* : The sky or atmosphere. ఉప్పరవీధి the path through the sky.

**ఉప్పరించు** : Same as ఉప్పలించు.

**ఉప్పరిగ** *n.* : The upper story of a house మేడ.

**ఉప్పలవాయి** *n.* : The space of flesh between the thumb and the fore-finger. బొటనవ్రేలికిని చుట్టున వ్రేలికిన నడుమనుండు మేర.

**ఉప్పళము** *n.* : A salt marsh. The soil where salt is manufactured, ఉప్పళపువాండ్లు salt manufacturers.

**ఉప్పలి** *n.* : Harm, evil, danger. కీడు, ఆపద.

**ఉప్పలించు** or **ఉప్పళించు** or **ఉప్పరించు** *v.t.* : To beat. కొట్టు, తాడించు.

**ఉప్పి, ఉప్పిచెట్టు** *n.* : A thorny medicinal styptic shrub with a ligneous hollow fruit or gall as large as a nutmeg. మౌక్తిక ఫల వృక్షము. అంత కోటర. తెల్ల ఉప్పిచెట్టు. కుండలి. నల్ల ఉప్పి చెట్టు.

**ఉప్పిడి** (ఉప+ఇడి) *adj.* : Saltless, unsalted. ఉప్పులేని. ఉప్పిడిచప్పిడి మాటలు nonsense. ఉప్పిడిచప్పిడి good or bad.

**ఉప్పిరింత** *n.* : A certain plant. జ్యోతిష్మతి.

**ఉప్పు** *v.t.* : To cook or boil. To steam or scald grain. ఉడకబెట్టు, ఆవిరిపోక ఉడకబెట్టు. ఉప్పినపిండి flour boiled in steam.

**ఉప్పు** *n.* : Salt. పెట్టుప్పు saltpetre. రాతి ఉప్పు rock salt. వెదురు ఉప్పు a sort of gum found in the hollows of the bamboo.

**ఉప్పెన** *n.* : The swell of the sea, an inundation.

**ఉప్పొంగు** (ఉబ్బి + పొంగు) *v.n.* : To swell, burst forth, overflow, to be transported with joy. మిక్కిలి సంతోషించు.

**ఉబలాటము** *n.* : Inciration, fancy, thought. అభిజాలము, వేడుక Kindly feeling. జాలి.

**ఉబీరచెట్టు** *n.* : A certain weed that grows on old walls.

**ఉబుకు** *n.* : Heaving, swelling. పొంగుట. **ఉబుకు** *v.n.* : To swell, jut, bulge, be projected, to heave or rise. పొంగు.

**ఉబుసు** *n.* : Rest, repose, unemployed time. పనిలేని కాలము. News, intelligence. వృత్తాంతము, సమాచారము.

**ఉబ్బ** *n.* : Warmth, oppressive closeness of weather, excessive heat. ఉక్క. ఉబ్బవేయు to be close.

**ఉబ్బకము** *n.* : Increase హెచ్చు.

**ఉబ్బతిల్లు** *v.t.* : To swell. పొంగు, ఉబ్బు.

**ఉబ్బనీరు** : Same as ఉమ్మనీరు.

**ఉబ్బరము** (from ఉబ్బు) *n.* : Swelling, inflation. Swelling of the belly due to wind. **ఉబ్బరించు** *v.n.* and *v.a.* : To swell, to inflate, to be bloated. **ఉబ్బరింపు** *n.* : Swelling (of the belly).

**ఉబ్బలపడు** *v.n.* and *t.* : To be fumigated with mercury. ఉబ్బవేయబడు.

**ఉబ్బలి** *n.* : Mire, deep mud, a quagmire బురద. దొంగ ఉబ్బలి a bog.

**ఉబ్బసము** *n.* : Asthma. ఊర్ధ్వశ్వాస రోగము. బాల ఉబ్బసము chincough.

**ఉబ్బు** *n.* : Swelling ఉబ్బడము సంతోషము. Haughtiness. ఉబ్బు *v.n.* : To swell, be puffed up, to be delighted.

**ఉభయము** *adj.* and *pron.* : Both. ఉభయకావేరి the two branches of the Cauvery. ఉభయపార్శ్వములు both sides. **ఉభయము** *n.* : Giving money for the celebration of a feast in a temple.

**ఉమ** *n.* : the wife of Siva.

**ఉమక** *n.* : haff. ఊక. ఉమక చెరుగుట to Winnow paddy after it is beaten.

**ఉమాదము** : Same as ఉన్మాదము.

**ఉమియు** *v.a.* : To spit, to spit out.

**ఉముక** : Same as ఉమక.

**ఉమేదు** or **ఉమేజు** *n.* : Hope. ఆశ, కోరిక, ఉమేదు చేయు to live in hope, to be a hanger on, as an expectant. **ఉమేదువారి** *n.* : Expectancy, waiting for an employment. Volunteering for employment. ఆశించుకొని యుండడము, ఉద్యోగ మునకై కనిపెట్టుకొని యుండడము.

**ఉమేదువారు** *n.* : A candidate for employment, a volunteer, an apprentice.

**ఉమ్మ** *n.* : Heat, warmth, closeness. కాక, ఉక్క, ఉబ్బ. **ఉమ్మగిల్లు** *v.i.* : To be hot and close as a closed room. ఉక్కగానుండు.

**ఉమ్మడి** *n.* : Partnership, fellowship. ఉమ్మడిగా నుండే common to both : held in common. ఒక్కసారిగా ఆ సరుకును ఉమ్మడిని కొన్నాను. I bought it wholesale.

**ఉమ్మదము** *n.* : Closeness. ఉమ్మ.

**ఉమ్మనీరు** *n.* : The waters that precede child birth. ఉబ్బనీరు, ప్రసవజలము.

**ఉమ్మలము** *n.* : Grief, care. దుఃఖము.

**ఉమ్మలి** *n.* : Mud, mire బురద, రొంపి.

**ఉమ్మలించు** or **ఉమ్మలికించు** (from ఉమ్మలము) *v.n.* : To grieve, to cry దుఃఖించు, శోకించు. ఉమ్మలింత, **ఉమ్మలిక** *n.* : Heat, warmth, closeness, grief, uneasiness, agitation. ఉష్ణము, వ్యసనము.

**ఉమ్మలికాడు** : A ruler. అధికారి.

**ఉమ్మాదము** : Same as ఉన్మాదము.

**ఉమ్మాయముత్తెము** *n.* : A sort of artificial pearl. క్షుద్రముత్యము.

**ఉమ్మి** *n.* : Spittle. ఉమ్మివేయు *v.t.* : To spit out. ఉమియు.

**ఉమ్మెత్త** or **ఉమ్మెత** *n.* : The thorn apple or Indian night shade; దుత్తూరము. Ainslie. తెల్ల ఉమ్మెత్త.

**ఉయ్యల** or **ఉయ్యాల** or **ఉయ్యెల** *n.* : A swing. ఉయ్యాలతొట్టి, ఉయ్యాల మంచము a cradle, a swinging bed. ఉయ్యాలో జంపాలో Lullabies.

**ఉరక** : Same as ఊరక.

**ఉరగము** : A snake. పాము.

**ఉరడించు** or **ఉరణించు** : Same as ఉరవడించు. See under ఉరపడి.

**ఉరణము** *n.* : A ram. పొట్టేలు.

**ఉరభ్రము** : Same as ఉరణము.

**ఉరమరిక** *adv.* : About రమారమి.

**ఉరము** *n.* : The breast, bosom. రొమ్ము. విప్పూటురము a broad breast.

**ఉరరీకృతము** *adj.* : Granted, agreed, అంగీకరింపబడిన. ఆర్ధోరరీకృతము half allowed, not fully ceded. అర్థాంగీకృతము.

**ఉరలు** : of. రోలు Drav. ఉరల్ = a roller. *v.a.* : To roll down. రాలు, దొర్లు. To flow down. కారు.

**ఉరళించు** *v.i.* : To shine. ప్రకాశించు, వెలుగు.

**ఉరవడి** (ఉరవు + వడి) *n.* : Swiftness, అతివేగము. ఉరవడించు *v.i.* : To be quick, to hasten. వేగిరపడు.

**ఉరవు** *n.* : Beauty, abundance. సౌంద ర్యము, విస్తారము *adj.* : Great, large. అధికమైన.

**ఉరస్యుడు** *n.* : A legitimate son. ధర్మపత్ని యందు తనకు పుట్టిన కొడుకు. See ఔరస.

**ఉరి** *n.* : A noose or slipping knot : a snare. ఉచ్చు కాలురి a snare for the feet. ఉరికోల *n.* : A rod attached to a nose. **ఉరితాడు** *n.* : A halter, a tether, a rope to tie a cow's legs when it is being milked. **ఉరితీయు** or **ఉరిపోయు** *v.t.* : To hang : strangle. **ఉరిపోసికొను** *v.i.* : To hang one self. **ఉరియాడు** To move, tremble.

**ఉరికించు** : See ఉరుకు.

**ఉరిడె** *n.* : A beetle కుమ్మరపురుగు.

**ఉరిది** *adj.* : Steady, Rapid. వడిగల, దృఢము. *adv.* : Quickly. వడిగా.

**ఉరియం** *adj.* : Strong, steady. దిట్టతనము గల.

**ఉరియు** *v.a.* : To sweat or leak. ఉప్పూరిసినగోడ a wall out of which salt oozes. ఇల్లు ఉరుస్తున్నది the house leaks. ఉరుపు *n.* : Leaking.

**ఉరు** *adj.* : Great, large, valuable. గొప్ప, శ్రేష్ఠమైన. *v.i.* : To be fit, to suit. ఒప్పు, ఉరున్, ఒప్పును. ఒప్పు, *v.t.* : To mind. లక్ష్యపెట్టు. ఉరుతరము More, larger.

**ఉరుకు** *v.i.* : To run: fly, start. To run out or project. To transgress. ఉరుకుడు కప్ప the flying frog. ఉరుకు బొడ్డు a projecting navel.

**ఉరుకొట్టు** (ఉరు + కొట్టు) *v.i.* : To cry like a monkey when angry. కోపముతో నున్న కోతివలె నుర్రుమను.

**ఉరుజ** *n.* : A sort of fish (Sparus) The gilthead. సాలము.

**ఉరుజు** *n.* : A sluice or water channel.

**ఉరుత** *n.* : A squirrel. ఉడుత.

**ఉరుపు** : See under ఉరియు.

**ఉరుమ** *n.* : A kind of musical instrument made of leather.

**ఉరుమంజి** *n.* : The yellow water in a pearl. ముత్తెపు పసుపునీరు పారాణి.

**ఉరుము** *v.n.* : To thunder. ఉరిమిచూచె he looked daggers. ఉరుము *n.* : Thunder. A sort of drum. To cry avaunt.

**ఉరుముడు** *n.* : A certain forest tree, with delicate blossoms and a fruit as large as a lemon.

**ఉరువడి** *n.* : Violence, impetuosity, speed, haste. ఉరవడి. ఉరువడించు.

**ఉరువడు** *v.i.* : To be fulfilled. నెరవేరు.

**ఉరువిడి** *n.* : a collection of things. వస్తుసమూహము.

**ఉరువు** or **ఉర్వు** *v.t.* : To get rid of. పరిహరించు. *n.* : Form, shape. రూపము. ఉరువు *adj.* : Great, big, large. గొప్ప. *v.t.* : To flay తోలుద్రోచుట. Also, same as ఉరుగొట్టు టెంకాయ ఉరువుగా నుండే as large as a coco-nut. ఆపని ఇంకా ఉరువు ఏర్పడలేదు that work is as yet in embryo.

**ఉరోజము** (from ఉరము + జ) *n.* : Breast. కుచము.

**ఉ(్రాడు** *v.i.* : To hang loose, to dangle.

**ఉ(్రు** or **ఉ(్రట్లు** or **ఉ(్రూతలు** *n.* : The cry of a monkey in anger. కోతియొక్క వికృతిధ్వని. Also, violent move-ment. ఉ(్రట్టులూగు, ఉ(్రూతలూగు.

**ఉ(్రుకట్టు** *v.t.* : To tie up a cow's legs while milking. పాలుపిదుకునపుడు ఆవు కాళ్లను కట్టు.

**ఉ(్రు(త్రాళ్లు** or **ఉరు(త్రాళ్లు** See **ఉరి(త్రాళ్లు** : and under ఉరి.

**ఉర్లగడ్డ** *n.* : A potato. Lit the crum-bling root : so called because it is farinaceous.

**ఉర్లు** : Same as ఉరలు.

**ఉర్వర** *n.* : The earth, feritful soil. నేల, ఉర్వి *n.* : The earth భూమి. ఉర్వీశుడు (ఉర్వి+ఈశుడు) *n.* : A king, a ruler.

**ఉలక, ఉలకన** *n.* : Lightness తేలిక, చులకన.

**ఉలచ** *n.* : An excellent sort of fish.

**ఉలపము** *n.* : A creeper, a trellis తీగె.

**ఉలవ** *n.* : A kind of pulse, horse gram. అడవి ఉలవలు.

**ఉలవరము** or **ఉల్లరము** or **ఉల్లారము** *n.* : A drain. Land enriched by drains. The smart caused by the sting of a nettle. ఉలవరించు *v.n.* : To be enriched or fattened as land by manure.

**ఉలస** : Same as ఉలచ.

**ఉలి** *n.* : A chisel. *adj.* : (another form of నులి) Little అల్పము.

**ఉలిందచెట్టు** *n.* : A sort of tree.

**ఉలికిపడు** *v.n.* : To start, shake. హఠాత్తుగా గలిగిన భయము చేత కంపించు. To be afraid. భయపడు. **ఉలికిపాటు** *n.* : A start, tremor, shudder.

**ఉలిపి** *adj.* : Brittle (as glass) : touchy, easily irritated, low, mean, wicked. దుర్మార్గమైన. **ఉలిపి, ఉలిపికట్టె** or **ఉలిపిగొట్టు** *n.* : A touchy person, an irritable person. తులువ.

**ఉలిమిడి** or **ఉలిమిరి** *n.* : The tree named Cratava Tapia.

**ఉలియు** or **ఉలివాడు** *v.n.* : To move. చలించు. To sound, resound. మ్రోయు, ధ్వనించు. **ఉలివు** *n.* : Sound, voice. ధ్వని, చప్పుడు Movement. చలనము.

**ఉలుకు** *v.n.* : To start, quiver, ముద్దులులుకు కన్నులు eyes quivering with prettiness. ఉలుకు *n.* : Timidity, fright. జడుపు.

**ఉలుచ** : Same as ఉలస.

**ఉలుచు** *v.a.* : To brandish, wave, whisk, shake వాలంబునులిచె brandished the tail. Also, to pull off. ఊడదీయు.

**ఉలువ** or **ఉలుపా** *n.* : A gift, present. కానుక.

**ఉలుపడు** or **ఉలుపి** *n.* : శోభిగలవాడు. See శోభి.

**ఉలుపు** : Same as ఉలుచు to pull off.

**ఉలుము** *n.* : Leprosy. కుష్ఠము.

**ఉలూకము** cognate with Eng. owl) *n.* : An owl. గుడ్లగూబ.

**ఉలూఖలము** *n.* : A mortar. రోలు Vasu.

**ఉల్క** *n.* : A firebrand, embers. మంట లేని కట్టెనిప్పు, భస్మము Also, a meteor or an aerolite.

**ఉల్టా** *adj.* : Reverse, the wrong side, opposite, contrary, turned back లోతట్టు, అడుగుతట్టు. ఆ శాలువను ఉల్టాగా కప్పుకొన్నాడు. he wore the shawl the wrong side up.

**ఉల్బణము** *n.* Excess, increase. అతిశయము, పైత్త్యోల్బణము excess of bile. ఉల్బణము *adj.* : Apparent, evident. Gushing, overflowing. పొంగిన, స్పష్టమైన రసోల్బణముగా with overflowing affection.

**ఉల్ముకము** *n.* : A firebrand కొరివి.

**ఉల్లంకి** *n.* : A bird of the plover family; a plover, sandpiper, stint.

**ఉల్లంగి** *n.* : A sort of tree.

**ఉల్లంఘనము** *n.* : Disregard, disgrace, contempt. అతిక్రమించుట. ఉల్లంఘించు *v.a.* : To disregard, to pass over, transgress, refuse.

**ఉల్లంచేప** *n.* : Name of a large fish that is very delicious but full of bones.

**ఉల్లకి** *n.* : A sling or hammook of cloth or cradle hanging down from a pole carried on two men's shoulders. ఉల్లకిలోవేసి తెచ్చినారు they slung him in a hammock and brought him.

**ఉల్లట** *n.* : A hammock ఉల్లెడశవమును ఉల్లట కట్టి తీసికొనిపోయినారు they slung the corpse in a sheet on a pole and carried it away.

**ఉల్లడ** or **ఉల్లడము** *n.* : An awning or canopy. చాందిని, ఉల్లాభము.

**ఉల్లడి** *n.* : Confusion, trouble, disturbance.

**ఉల్లము** *n.* : The heart. హృదయము. ఉల్లరము *adj.* : What is painful to the heart or feelings. మనస్సునకు సహింపగూడనిది.

**ఉల్లల** *n.* : A bubbling noise, ebullition. ఉడుగుట యందు ధ్వన్యనుకరణము.

**ఉల్లలము** *n.* : Movement. చలనము, కదలిక. **ఉల్లలితము** *adj.* : Moved కదలిన.

**ఉల్లసము** *n.* : Sport, satire, fun, frolic. సంతోషము, ఉపాలంభము. ఎత్తిపొడుపుమాట.

**ఉల్లాకు** *n.* : A ticket or invoice left with goods or grain, specifying the quantity and the owner of the goods. చీటి.

**ఉల్లాకుచేప** *n.* : The bony hilsa or sable fish.

**ఉల్లాభము** *n.* : A canopy borne over marriage offerings or over the bride and bridegroom as they go in procession. చాందిని, మేలుకట్టు, ఉల్లడ.

**ఉల్లాముపిట్ట** *n.* : A snipe.

**ఉల్లాసము** *n.* : Joy, delight, amusement. సంతోషము. ఉల్లాస పురుషుడు A luxurious man or man of pleasure. A prodigal. ఉల్లాసి A cheerful man. ఉల్లఘించువాడు.

**ఉల్లి** *n.* : The onion. నీరుల్లి the onion. ఎఱ్రగడ్డ. వెల్లుల్లి garlic, తెల్లగడ్డ. ఉల్లిపాయ or ఉల్లిగడ్డ *n.* : An onion.

**ఉల్లింకాయ** *n.* : A species of plover.

**ఉల్లిపాషాణము** *n.* : Corrosive sublimate. సౌవీరము.

**ఉల్లె** *n.* : The crust at the bottom of pies or tarts.

**ఉల్లేఖము** *n.* : uttering. mention, rehearsing. ఉచ్చరణము.

**ఉల్లోలము** *n.* : A surge, a large billow, or wave. పెద్ద అల.

**ఉల్వరము** *n.* : Rubbish, sweepings, & c. used for manure.

**ఉళక్కి** or **ఉళ్లక్కి** *n.* : A lie. a. joke, a pretence. వట్టిది.

**ఉవిద** *n.* : Woman. ఆడుది, స్త్రీ.

**ఉవ్వ** *n.* : A certain tree *Dillsnia speceosa.*

**ఉవ్వన** *adv.* : Unexpectedly, all at once. తటాలున, గుబాటుగా, కొల్లగా.

**ఉవ్వపిట్ట** *n.* : A sort of bird, a wagtail. గోలతిక.

**ఉవ్వలపోటి** *n.* : A certain game among children.

**ఉవ్వాయి** *n.* : Cheerfulness, joy, వికాసము.

**ఉవ్విళ్ళూరు** or **ఉవ్విళ్లుకొను** *v.n.* : To water, as the mouth. To be eager. త్వరపడు, మిక్కిలి ఆశపుట్టు To hasten త్వరపడు.

**ఉవ్వు** *n.* : Attempt, exertion, effort. పూనిక, **ఉవ్వెత్తు** *adj.* : All యావత్తు. ఉవ్వెత్తుగా Quite easily. All at once మిక్కిలి చులకనగా, ఏకకాలమందు. Completely నిశ్శేషముగా. From the bottom అడుగుతో.

**ఉశనుడు** *n.* : The name of the planet Sukra or Venus.

**ఉశీరము** *n.* : A sort of fragrant root, usually termed వట్టివేరు.

**ఉషర్బుధుడు** *n.* : He who awakes with the dawn. An epithet of the god of fire. Vulcan. అగ్ని.

**ఉషస్సు** *n.* : Dawn, daybreak. తెల్లవారుటకు ముందు నాలుగు గడియల కాలము.

**ఉష్ట్రము** *n.* : A camel క్రమేలకము, ఒంటె.

**ఉష్ణము** *n.* : Sunshine, warmth; heat; fever, feverishness. ఉష్ణము *adj.* : Hot. ఉష్ణరశ్మి The sun. **ఉష్ణించు** *v.n.* : To be hot. **ఉష్ణీషము** *n.* : A turban, a diadem. కిరీటము, పాగా.

**ఉసి** *n.* : A hiss, hissing. **ఉసికొను** *v.i.* : To give the chase as a dog does కుక్కకవియు. **ఉసికొల్పు** *v.a.* : To hiss a dog or.

**ఉసిరి** or **ఉసిరిక** *n.* : A tree with acid fruit used for pickles.

**ఉసుక** *n.* : Sand ఇసుక. ఉసుక వంటకముగాగనుడికింపవచ్చు.

**ఉసుము** *v.a.* : To scour or wash. పులుము, ఉదుకు, తుడుచు.

**ఉసురు** *n.* : Breath, life; strength, vigour, grief; a sigh, affliction, plague, hardship, evil result; retribution or result. వాని ఉసురు నీకు తగులును his trouble will come upon you.

**ఉసులు** *n.* : Ease, facility; convenience అనుకూలము, సౌఖ్యము.

**ఉసుళ్లు** *n.* : Winged white ants. ఇసుళ్లు.

**ఉసూరను** : Same as ఉస్సురను.

**ఉస్తె** *n.* : The gigantic swallow wort. The fruit is called ఉస్తెకాయ. ఉస్తెవరుగు is the fruit dried and preserved.

**ఉస్సు** *n.* : Ah ! Alas ! "ఉస్సను నూర్చు హాయనున్" ఉస్సని కూర్చున్నాడు he sighed and sat down. **ఉస్సురను** *v.n.* : To sigh.

**ఉహ్వా** *n.* : The sound produced when a fire is kindled by blowing on it. నిప్పూదుటయందు కలుగుధ్వని.

**ఉహూహు** *n.* : Shivering from excessive cold.

## ఊ

**ఊ** : The long vowel or oo, as in flute or shoot.

**ఊక** *n.* : The husk of paddy. ఉముక. Also (noun from ఊగు) Swinging ఊగుట. **ఊకనబొడ్డు** *n.* : A certain plant used in fevers. ఊకబంతి *n.* : The flower called Bachelor's button పోకబంతి.

**ఊకర**ఁ*n.* : To say ఊ ఊ while listening to what another says, ఊ కొట్టుట. **ఊకరగొట్టు** *v.i.* : To crow or make indistinct sounds, as an infant.

**ఊకించు** or **ఊకు** *v.n.* : To shake, agitate or move; to endeavour or make an effort. పూను; to rattle the dice. ఊకు or ఊకువ *n.* : Effort, exertion. పూనిక, ప్రయత్నము.

**ఊకొట్టు** or **ఊకొను** *v.n.* : To hum or make an indistinct sound resembling ఊ, ఊ, denoting that one is listening to what another is saying.

**ఊగు** or **ఊగులాడు** or **ఊగాడు** *v.n.* : To be agitated or shaken, to swing, to wag, roll. ఊగించు (casual of ఊగు) *v.a.* : To shake, to move, to swing or cock. **ఊచు** *v.a.* : To swing, cause to swing, to wag or shake, rock, nod.

**ఊచ** *n.* : The soft core of the plantain or similar tree బొందె. A thornbush ముండ్లదుబ్బు. **ఊచ** *adj.* : Withered.

**ఊచు** *v.n.* : To wither. వెంట్రుకలు ఊచిపోవుచున్నవి his hair is falling off ఊచు causative of ఊగు.

**ఊట** *n.* : Juice, sap. A fountain, a spring as of water.

**ఊటించు** *v.t.* : To deceive వంచించు.

**ఊటు** *v.t.* : To thrust through. పొడుచు.

**ఊటు** *n.* : Moisture. చెమ్మ ఊటుకార్చు to wet.

**ఊడ** *n.* : A root growing down from the branches of the banyan and similar trees. ఊడలు పారినచెట్టు a tree that has such suckers or roots.

**ఊడనిపాడు** *v.t.* : To cry ఊడు while running away. To run away. To be put to flight, to be routed.

**ఊడికూర** *n.* : A kind of herb. ఒక విధమైన కూరాకు.

**ఊడిగము** *n.* : Service, Drudgery, task. కొలువు. ఊడిగపు పనులు menial duties. ఊడిగపుది *n.* : A maid servant. ఊడిగపువాడు or ఊడిగీడు *n.* : A man servant, a menial.

**ఊడిత** *n.* : A staff used as a prop by a weaver for his warp. సాలెవాడు పడుగుచేయునపుడు అది వాలకుండ కింద ఊతగా నిలుపు కొయ్య.

**ఊడు** *v.n.* : To part, drop out, slip out. జారు, రాలు. To give way, fail : to be unfastened, loosened, separated. వదులగు. To flee, run away. పారిపోవు.

**ఊడుకొను** *v.n.* : To become moist, as earth. To pierce. గుచ్చుకొను.

**ఊడుగు** *n.* : The plant named అంకోలము.

**ఊడుచు** *v.a.* : To sweep. To slacken, loosen, divest, open, sever, separate. ఊడజేయు To wrest, take by force. To transplant. నారు నాటుట. ఊడుపు పొలము land in which shoots are transplanted.

**ఊడ్చు** : Same as ఊడుచు.

**ఊడెము** *n.* : A fortified place with a few bastions. గుడి, చిన్నకోట. Also, ఊడిగము.

**ఊఢ** *adj.* : Married. పెండ్లాడినది. *n.* : A wife. పెండ్లాము A married woman వివాహిత.

**ఊత** *n.* : A support, a prop. A fishing hook, a basket snare to catch fish. A coop to keep animals in. A pannier. కేలూతచేసి giving the hand as a support.

**ఊద** *n.* : A swelling, tumour వాపు కడుపూద Malice, spite, envy. ఈర్ష్య. **ఊదకడుపు** *n.* : A pot belly. **ఊద** or **ఊదర** *n.* : A kind of grass. *n.* : Smoke.

**ఊదా** *n.* : Dark colour, purple or brown.

**ఊదిబవము** *n.* : Produce, income. ఫలము, ఆదాయము.

**ఊదు** *v.n.* : To blow with the breath or with bellows. To swell వాచు. To press అదుము, నొక్కు, To play on a flate.

**ఉధము** or **ఉధస్సు** *n.* : An udder. పొదుగు.

**ఊనము** *n.* : Loss, disgrace, injury, defect. లోపము. *adj.* : Less, defective. తక్కువైన, లోపముగల. ఏకోన వంశతి nineteen.

**ఊనిక** *n.* : Resting, support, steadiness. ఆనుట, దిటవు ఊను *v.a.* : To have, take, bear, వహించు, ధరించు To soften as leather.

**ఊప** *n.* : An underwood in a forest. అడవిలోని చెట్లగుంపు.

**ఊపిరి** *n.* : Breath, respiration. ఊపిరి విడుచు to breathe ఊపిరిపట్టు to hold in the breath. వానికి ఊపిరి వచ్చింది. he has revived.

**ఊపు** (from ఊగు and ఊచు) *v.t.* : To cause to swing ఊరజేయు. *n.* : Swinging A push, one oscillation in swinging. ఊచుట.

**ఊబ** *n.* : A eunuch నపుంసకుడు A corpulent man. బొందు.

**ఊబి** *n.* : A slough, or bog, mire. బురద.

**ఊయల** *n.* : A swing. See ఉయ్యల.

**ఊయు** *v.n.* : To whistle ఎద్దుల నూసినారు. They whistled the bullocks on.

**ఊర** : See under ఊరు. n.

**ఊరక** or **ఊరికె** *adv.* : Without. For nothing. Silently, merely, idly.

**ఊరగాయ** : See under ఊరు. v.

**ఊరట** *n.* : Comforting. ఊరడించుట. Rest. విరామము. Ease, freedom, leisure. Aid, help. సహాయము. **ఊరటపడు** *v.n.* : To be consoled ఊరట పరుచు *v.a.* : To console. **ఊరడించు** *v.a.* : To comfort.

**ఊరవ్యుడు** *n.* : A man of the Vaisya caste. కోమటి.

**ఊరార్చు** *v.t.* : To console, cheer, comfort. ఓదార్చు, ఊరడించు.

**ఊరించు** *v.a.* : To excite appetite, tempt, tantalize. To make one's mouth water. ఊరునట్లు చేయు.

**ఊరికె** : See ఊరక.

**ఊరీకరించు** *v.t.* : To consent, to accept. అంగీకరించు. ఊరీకృతము *adj.* : Accepted. అంగీకరింపబడిన.

**ఊరు** *n.* : A village, a town. నేను ఊరికి పోయియుండగా when I was absent from home.

**ఊరు** *v.n.* : To be full, steeped or soaked. To be puffed or fat. నోరూరుట the mouth watering. ఊర బెట్టిన చెక్క timber left to steep or steam so as to be seasoned తేటలూరగా full of light.

**ఊరుకొను** *v.n.* : To be still, or quiet ఊరక ఉండు.

**ఊరుచు** *v.n.* : To sigh, sob ఊపిరి విడుచు.

**ఊరుజుడు** *n.* : A man of the Vaisya caste. కోమటి.

**ఊరుపు** or **ఊర్పు** *n.* : Breath, sighing, శ్వాసము A sort of stew or curry. నిట్టూరుపు. a deep sigh.

**ఊరుపు** *n.* : The thigh తొడ.

**ఊరేగు** (ఊరు + ఏగు) *v.n.* : To go (in parade or procession) through a village or town. ఊరేగించు *v.a.* : to parade, to carry through the town. ఊరేగింపు *n.* : A procession.

**ఊర్చు** : as ఊరుచు.

**ఊర్జము** *n.* : Bodily strength, perseverance. బలము, పూనిక. ఊర్జస్వలుడు n. A strong man. బలాఢ్యుడు. **ఊర్జితము** *adj.* : Stable, firm. గట్టిగానున్న.

**ఊర్ణము** *n.* : Wool, felt, & c. ఉన్ని, నూలు. ఊర్ణనాభము a spider. సాలెపురుగు.

**ఊర్ధ్వము** *adj.* : Above, upper, high. ఊర్ధ్వబాహువై with his arms raised. ఊర్ధ్వరేతసుడు a Rishi or Sage **ఊర్ధ్వ లోకము** *n.* : The world above. Heaven.

**ఊర్పు** : Same as ఊరుపు (q.v.) ఊర్పోవు (ఊర్పు + పోవు) to breathe. ఊపిరి వెడలు. ఊర్పోక (ఊర్పు + పోయ) a pastime ఉబుసు పోక. ఊర్పుచ్చు (ఊర్పు + పుచ్చు) to cause the breath to go out.

**ఊర్మి** *n.* : A wave. అల; the fold of a cloth వస్త్రపుముడుత. Pain నొప్పి. షడూర్ములు the six kinds of pain, viz. hunger, thirst, grief, passion, old age and death. క్షుత్, తృష్ణా, శోక, మోహ, జరా, మరణములు. **ఊర్మిక** *n.* : A wave, a finger ring.

**ఊర్మిళ** *n.* : A woman that has separated from her husband మగనినెడ బాసిన స్త్రీ.

**ఊల** or **ఊళ** *n.* : A whistle. The howling of a fox నక్కకూత. ఊలమెకము the fox. ఊలవేయు to whistle.

**ఊలమాల** *n.* : Pain, anxiety తహతహ. ఊలమాలకుడుచు to suffer pain or anxiety. తహతహపడు.

**ఊలు** *v.n.* : To fall. పడు.

**ఊవు** : Same as ఊగు ఊవాడు Same as ఊగాడు.

**ఊషణము** *n.* : The stimulant called త్రికట్టు, viz., శొంఠి, పిప్పిలి or మిర్యాలు ginger, pepper. or long pepper.

**ఊషము** *n.* : Fuller's earth. చవుడు. **ఊషరము** or **ఊసరము***n.* : Salt soil.

thing staked at a game of chance పందెము. A standard or flag కేడెము.

**ఒడ్డాణము** *n.* : A cestus, or belt of gold or silver worn by women over their dresses.

**ఒడ్డారము** *n.* : Obstinacy, jealousy, dislike ద్వేషము. Opposition ప్రతిఘటించుట, మారొడ్డుట. ఒడ్డారమైన obstinate. ఒడ్డారించు.

**ఒడ్డిమి** *n.* : A wager, a stake in a game of chance. పందెము, ఒడ్డు.

**ఒడ్డీలు** *n.* : Pigeons called Tumblers. ఒడ్డీలు పారావతములు.

**ఒడ్డు** *v.a.* : To place, put, lay, leap up. To fix, set, cast. To rival. To wager పందెమిడు. To spread (a net), & c. చాచు, పరచు. To oppose అడ్డగించు.

**ఒడ్డు** *n.* : A bank or shore. దరి.

**ఒడ్డె** *n.* : Drudgery : mean toil. As a proper name ఒడ్డెదేశము or ఓఢ్ర దేశము Orissa. ఒడ్డెవాండ్లు tank diggers, navvies.

**ఒడ్డెము** : Same as ఒచ్చెము.

**ఒడ్డోరకము** (ఒడ్డు + ఒరకము) *adj.* : High and low, up and down, steep. ఎగుడుదిగుడైన, మిక్కిలి ఎత్తైన.

**ఒడ్డోలగము** : See ఒడ్డు adj.

**ఒత్తక్షరము** *n.* : An aspirated letter, like ఫ. ఖ.

**ఒత్తగిల్లు** : Same as ఒత్తగిలు.

**ఒత్తడము** (from ఒత్తు) *n.* : Pressing. Pressure. **ఒత్తుట.** *adj.* : Thick, dense తరుచైన.

**ఒత్తడి** or **ఒత్తిడి** *n.* : Pressure, trouble, pain సమ్మర్దము, రాపిడి, బాధ.

**ఒత్తరము** *n.* : Raging, excessive, increase ముమ్మరము, ఉద్రేకము. **ఒత్తరించు** *v.t.* : To excel మించు. To occupy ఆక్రమించు.

**ఒత్తిగిలు** or **ఒత్తిగిల్లు** *v.t.* : To lie on ones side, to budge, step aside, stand back, get out of the way. To stick to అంటుకొను. ఉదరంబు వీపుతో నొత్తిగిల్లి a starveling with his belly shrunk to his back.

**ఒత్తిలి** *adv.* : Hard గట్టిగా. Steadly, with perseverance ఒట్టుగా. **ఒత్తిలి** or **ఒత్తిల్లు** *v.i.* : To give way, go aside.

**ఒత్తు** *n.* : Thickness, closeness of texture. తరచుదనము. Aspiration of a letter. Pressure అదుముడు. A mattress మెత్త.

**ఒత్తు** *v.n.* : To give way, yield, retire, recede. To be pierced or poked పొడుచుకొను. To lean on one side ఒరుగు. To become heavy ఘనమగు. **ఒత్తు** *v.a.* : To press or squeeze.

**ఒత్తుకాడు** *n.* : A drone player. సుతి పోయువాడు.

**ఒత్తుడు** *n.* : A thrust, violence. Crowding, squeezing. అదుముడు, పీడనము. A pad used as a rest, on

which to place the paper on which one is writing.

**ఒత్తొరవు** *n.* : Great pressure మిక్కిలి అదుముడు. Teasing, Vexation సంపీడనము.

**ఒదరు** *v.i.* : To excel, increase, to be proud, to rejoice, విజృంభించు, సంభ్రమించు. *v.t.* : To blame నిందించు. ఒదరుచు or ఒదర్చు *v.t.* : To detach, separate ఊడదీయు.

**ఒదలు** : (another form of పొదలు) *v.i.* : To flourish. prosper వర్ధిల్లు.

**ఒదవు** *v.n.* : To arise పుట్టు, కలుగు. To serve, be of use. ఉపయోగించు, ఉప యుక్తమగు. To pervade. వ్యాపించు.

**ఒదికిలు** *v.n.* : To lie on one side, to incline to one side. To move aside. పక్కకొరగు, ఒత్తిగిల్లు.

**ఒదుగు** *v.n.* : To make room, to move so as to accommodate. ఒదిగి ఒదిగి ఉన్నారు. they yielded.

**ఒదుగు** *n.* : Plenty సమృద్ధి. అన్నము ఒదుగుగైనది the rice is become plentiful ఒదుగుపడు Same as ఒదుగు, to move aside.

**ఒదువు** *v.i.* : To cover, to spread క్రమ్ము. To become plentiful ఒదుగు. *n.* : Plenty సమృద్ధి, ఒదుగు.

**ఒద్ద** *n.* : Neareness. దాపు, సమీపము, వద్ద. ఇంటియొద్ద ఉన్నాడు. he is at home. నాయొద్ద లేదు I have not got it by me.

**ఒద్ది** *n.* : A kind of a large tree, *Odina Pinnata.*

**ఒద్దిక** *n.* : Concord, union, friendship. అనుకూల్యము. The weights in a pair of scales, a counterpoise ఒక వస్తువు నకు సరియెత్తుగానుంచి తూచే రాళ్లు మొదలైనవి, ప్రతిమానము.

**ఒద్దె** *n.* : Plenty, abundance. సమృద్ధి.

**ఒనగూడు** *v.* : To be obtained; to succeed or attain. To be happen, chance. To prosper. చేకూరు, సిద్ధించు. ఇతనికి ఆమె ఒనగూడినది she is well suited to him. **ఒనగూర్చు** *v.n.* : To effect, attain to, accomplish. To bestow, grant, acede to. సిద్ధించునట్లు చేయు.

**ఒనరు** *v.i.* : To happen, chance, be. To become, suit, or agree. To be pretty, proper or agreeable. To appertain or belong to, to be attached to. కలుగు, పొసగు, సరిపడు, ఒప్పు. **ఒనరు** *n.* : Convenience, facility, వీలు, వాటము, పొందిక.

**ఒనవెట్టుకొను** *v.i.* : To lie in wait పొంచు వేయు, కాచుకొనియుండు.

**ఒప్పందము** : (from ఒప్పు) *n.* : A contract, undertaking, assignment. A debt payable in kind : a bargain. ఏర్పాటు. **ఒప్పందముచేయు** *u.v.n.* : To stipulate, to contract. **ఒప్పగించు** *v.n.* : To give up charge : to deliver over. అప్పగించు. ఒప్పగించుకొను.

**ఒప్పనము** *n.* : An offering. అర్పణము, అప్పనము. ఒప్పనచేయు To offer అప్పన చేయు, అర్పించు.

**ఒప్పమి** *n.* : Want of agreement, disagreement, ఒప్పుకొనకపోవుట. Inelegance. harm, fault, impropriety, కీడు, తప్పు.

**ఒప్పరము** *n.* : A drain, a gutter. తూము, జలదారి.

**ఒప్పరికించు** *v.t.* : To slight, disregard. ఉపేక్షించు, ఎదిరించు, ఒప్పరికము *n.* : Disregard ఉపేక్ష.

**ఒప్పారు** *v.n.* : To have, to possess. To look, seem, be perceived. To be. To vie with, rival or look like, emulate. ఒప్పు.

**ఒప్పించు** *v.a.* : To cause to consent, to prevail on. To assign or make over, commit, entrust స్వాధీనపరచు, వశముచేయు.

**ఒప్పిదము** *n.* : Grace, agreeableness. Consent, agreement, compliance అందము. Consent సమ్మతి.

**ఒప్పు** *v.n. and t.* : To be fit proper, to be a greeable తగు, ఒప్పిదమగు. అది నీకు ఒప్పునా does such conduct become you ? To consent or agree. To confess, own, acknowledge సమ్మతించు. అనుగ్రహం బొప్పగా graciously. ఒప్పచెప్పిరి they delivered over charge.

**ఒప్పుకొను** *v.a.* : To confess, own, acknowledge. To agree, consent, abide by, comply with, accept. ఒప్పుకోలు Consent; ఒప్పుకొనుట ఒప్పుగా adv. Duly, well. **ఒప్పులాడి** (ఒప్పులు + అడి) *n.* : A graceful or beautiful woman.

**ఒబ్బట్లు** *n.* : A kind of sweet cakes. పోళీలు.

**ఒబ్బిడి** *n.* : Trimness, propriety, thrashing of corn. *adj.* : Trim or clean, as grain; right and tight. చక్కబెట్టడము, మార్చుడము.

**ఒమ్మచ్చు** or **ఒమ్మెచ్చు** *n.* : The beazle of a ring, & c., the part of any jewel that holds the stone.

**ఒమ్మిక** *n.* : Suitability, fitness. ఇమిడిక, పొందిక, ఒమ్మివచ్చు *v.n.* : To prosper, to thrive అచ్చివచ్చు.

**ఒమ్ము** *v.r.* : To agree or suit, సరిపడు. To thrive. వర్ధిల్లు. ఈ భూమి నాకు ఒమ్మలేదు this climate does not agree with me. ఒమ్మిఉండే salubrious. ఒమ్ము *n.* : Bigness, plumpness స్థౌల్యము, బలుపు.

**ఒయ్యు** or **ఒయ్యన** *adv.* : With gentleness, softly, sweetly.

**ఒయ్యారము** or **ఒయారము** *n.* : Bloom, grace, shapeliness, the pride of beauty. సౌందర్యగర్వము. ఒయ్యారపు మాటలు pretty language.

**ఒర** *n.* : Touch, rubbing. Trial of metal of touch. Likeness పోలిక. A case, sheath, scabbard. తలగడ ఒర pillow case. A ring of clay, thus.

**ఒరకటము** or **ఒరకము** or **ఒరకాటము** *n.* : Steepness, inequality. Depth, difficulty. పల్లము, సంకటము. ఒరకటపునేల an uneven spot. ఒరకటపు నీత్రోవ an uneven road.

**ఒరకట్టు** *n.* : Cloth tied in many folds చుట్టగా చుట్టికట్టిన వస్త్రపుకట్టు.

**ఒరకడుగు** *n.* : The water in which rice has been washed a second time.

**ఒరగడ్డము** (ఒరవ + గడ్డ) *n.* : Difficulty, trouble సంకటము. *adj.* : Uneven విషయము.

**ఒరగల్లు** *n.* : A touchstone. బంగారును ఒరపెట్టురాయి.

**ఒరగాలు** (ఒరుగు + కాలు) *n.* : A bent or crooked leg. ఒరగినకాలు.

**ఒరగు** or **ఒరుగు** *v.n.* : To lean, bend, bow down, slant, be inclined recline or lie down, to be weighed down, as scales, వంగు వాలు. ఒరగి crouching, hiding. పడవ ఒరిగెను. the boat leant on one side. ఒరిగి పడినాడు he tumbled down.

**ఒరగొడ్డెము** or **ఒరగొడ్డియు** *n.* : A painful word, a malicious word that picks the heart మనస్సును నొప్పించే వంకరమాట.

**ఒరగొను** *v.t.* : To try (gold) by the touchstone ఒరపెట్టు.

**ఒరచాలుదుక్కి** *n.* : A single ploughing ఒకమారు దున్నినపొలము, చాలు తేలికగా పారిన దుక్కి.

**ఒరచు** : Same as ఒరుచు.

**ఒరటు** *adj.* : Wicked దుశ్శీలుడు.

**ఒరపదును** *n.* : A mere moistening. a slight wetting కొంచెపుతడి.

**ఒరపరి** *n.* : A fine looking man. సుందరపురుషుడు, సౌందర్యవంతుడు.

**ఒరపిడి** *n.* : Pressure, friction రాయిడి, రాపిడి. An unworthy man అయోగ్యుడు.

**ఒరపు, ఒరుపు** *n.* : Touch, contact, rubbing. Tightness. ఒరయిక, కర్షణము. An expedient ఉపాయము. Fineness, nobleness. విలాసాతిశయము, సౌందర్యము, యోగ్యత.

**ఒరపెంకు** *n.* : A ring of baked earth used in building a well, a tier, నూతిఒర.

**ఒరపెట్టు** *v.t.* : To test gold by the touchstone ఒరగొను.

**ఒరబొమ్మ** *n.* : A puppet or doll.

**ఒరము** *v.i.* : To become hot వేడెక్కు.

**ఒరయు** or **ఒరియు** *v.n.* : To rub together, be in contact. To touch or graze, as a bullet. to be brushed. To struggle or compete with. **ఒరయు** *v.a.* : To rub రాచు, to try on the touchstone ఒరపెట్టు.

**ఒరలు** *v.n.* : To lament, wail, cry, whimper విలపించు.

**ఒరవ** *adj.* : Crooked, sloping. వంకరైన. Different వ్యత్యస్తము.

**ఒరవడి** *n.* : The Copy set by a teacher మేలుబంతి.

**ఒరవబడు** *v.i.* : To be tilted to a side, to lie on one side ఒరగబడు. ఒరవు Same as ఒరగు.

**ఒరి** *n.* : Plunder, spoil దోపిడి.

**ఒరిగ** *n.* : A salutaion మ్రొక్కు, నమస్కృతి.

**ఒరిజ** *n.* : A chain tied round the neck of an elephant ఏనుగుమెడ గొలుసు. The girth of an elephant made of iron or leather.

**ఒరిబీజము** or **ఒరుబీజము** *n.* : A swelled testicle, orchitis. ఒక్కవైపు బీజము వాచిన రోగము. Also, Hydrocele.

**ఒరిము** or **ఒరిమిక** *n.* : Friendship, patience ఒద్దిక. unanimity ఐకమత్యము.

**ఒరియు** : Same as ఒరయు.

**ఒరుగు** : Same as ఒరగు.

**ఒరుచు** : (from ఒరియు.) *v.a.* : To rub, to try metal by the touchstone. ఒరుచుబద్ద or ఒరచుబద్ద *n.* : A carpenter's plane, a carpenter's tool to draw parallels with. పలక లోనగునవి నునుపు పరచెడు వడ్లవాని కొరముట్టు.

**ఒరుడు** *n.* : One ఒకడు. Another : a neighbour or other person, a stranger, అన్యుడు. ఒరులు others.

**ఒరుదల** *n.* : A hole ఎలుకబొక్క Solitude ఏకాంతము. Talebearing, backbiting చాడీలు చెప్పుట. కొండెములు చెప్పుట, కొండెకానితనము.

**ఒరుము** *v.i.* : To unite కలియు.

**ఒఱ్ఱ** *adj.* : Hot కారము. Bitter కటువు. ఒఱ్ఱ or ఒఱ్ఱన *n.* : Heat, pungency కారము.

**ఒఱ్ఱు** *adj.* : Large, great పెద్ద గొప్ప.

**ఒఱ్ఱె** or **ఒఱ్ఱియు** *n.* : A crack. బీటిక A rick of corn చిన్నకుప్ప. a low fellow, a black-guard పంద. ఒఱ్ఱె కూతలు filthy language.

**ఒలయు** *v.n.* : To appear, seem, or come to light, enter ప్రవేశించు. పెంపొలయక no increase took place. ఒలయు *v.a.* : To surround, to envelop, to meet చుట్టుకొను, కదియు.

**ఒళవు** *n.* : Secret intelligence మర్మము, రహస్యము The neck of a stringed instrument వీణాదండము.

**ఒలి** *n.* : Robbery దోపిడి, అపహరణము. **ఒలిపడు** to be robbed దోపుడుపోవు. ఒలిపుచ్చుకొను To betray, shew. బయట పడేటట్టుచేయు. To lose, let go పోగొట్టు.

**ఒలికి** *n.* : A funeral pile ఒలికి మిట్ట the cemetery or burying ground. కాడు, ఒల్లకాడు, శ్మశానము.

**ఒలిదామర** (ఒలి + తామర.) *n.* : A certain plant.

**ఒలిపించు** *v.t.* : To cause to peel off ఒలుచునట్లుచేయు.

**ఒలియు** *v.n.* : To bruise, to abrade or rub off the skin తోలుదోగు. ఒలియించు *v.t.* : To kill (See పొలియించు), చంపు.

**ఒలుకు** *v.n.* : To spill, చిందు; overflow, to be shed (as tears) or spilt; to flow కారు; To be dropped, పాలలో నెయ్యి ఒలికినట్లు as ghee gushes forth from milk, i.e., luck upon luck.

**ఒలుచు** *v.a.* : To peel, shell, flay : To pare off, tear off.

**ఒలుపు** *n.* : Peeling, removing the skin, rind, coat or shell. ఒలుచుట. ఒలుపు పప్పు *n.* : Grain freed from the husk.

**ఒలె** : Same as ఒల్లె.

**ఒల్ల** *adj.* : Slow, straight అల్లన, తిన్నన.

**ఒల్లకాడు** *n.* : 'The abominable place', i.e., the cemetery or place where bodies are burnt. A cremation ground. ఒల్లకాటిమాటలు objectionable language, graveyard jokes.

**ఒల్లగిల్లు** *v.i.* : To be neglected ఆదరింపబడనిదగు.

**ఒల్లన** *adv.* : Gently, softly.

**ఒల్లబాటు** : Same as ఒల్లమి.

**ఒల్లబోక** *n.* : Disregard అనాదరము.

**ఒల్లబోవు** *v.n.* : To faint మూర్ఛిల్లు. To turn pale వాడు ఆదరింపబడనిదగు, చిన్నబోవు, తెలతెలబోవు.

**ఒల్లబోమి** *n.* : Hatred, dislike. Refusal, grudge, unwillingness. Dissent, disapproval. కడుపనొల్లమి disinclination to eat.

**ఒల్లియు** : Same as ఒల్లె.

**ఒల్లు** *v.a.* and *n.* : To be willing, choose, fancy, wish. To love, like, long for ఒల్లను I hate, detest, dislike I will not, I do not choose.

**ఒళ్లు** *n.* : The body, person, figure. నీ ఒళ్లు ఎట్లా ఉన్నది how do you do ? how are you ? వానికి ఒళ్లు తిరుగుచున్నది he is giddy. వానికి ఒళ్లు కుదురుగా నుండలేదు he is unwell.

**ఒళ్లె** *n.* An upper cloth అంగవస్త్రము, ఒల్లె. వన్నెయొల్లె colored cloth.

**ఒల్లెంక** *n.* : prickly globular fish with poisonous flesh.

**ఒళ్లెతాడు** *n.* : A noose flung at an animal to catch it.

**ఒళ్లెవాటు** *n.* : A scarf, the upper garment gracefully arranged round the neck. The wearing of an upper cloth. పై బట్టను కుచ్చెళ్లుపెట్టి మెడచుట్టి వచ్చునట్లుగా భుజములమీద వేసికొనుట.

**ఒళ్లో** : A contraction for ఒడిలో. See ఒడి.

**ఒవ్వు** *v.i.* : To agree with, పిట్టు సరిపడు. To assent, consent. ఒవ్వమి, *n.* : Refusal. ఒప్పమి. ఒవ్వనివారు those who hate, or disagree గిట్టనివారు ఒవ్వు *n.* : A sheaf of corn.

**ఒసగు** or **ఒసంగు** *v.a.* : To give. ముద్దొసగు to give a kiss. ముద్దులొసంగు నీమొగము your beautiful face. **ఒసగు** *n.* : A gift ఈవి, త్యాగము.

**ఒసపరి** *adj.* : Agreeable, pretty, lovely, nice, sweet. ఒసపరి *n.* : A fine-looking man సుందరుడు. ఒసపరితనము *n.* : Agreeableness, prettiness, sweetness. సౌందర్యము.

**ఒసవు** : Same as ఒసగు.

**ఓహో** : Same as ఓహో.

# ఓ

**ఓ** : The long vowel.

**ఓం** or **ఓంకారము** : The sacred syllable ఓమ్. OM.

**ఓండ్ర** *n.* : The bray of an ass. గాడిదె కూత. ఓండ్రించు or ఓండ్రపెట్టు to bray as an ass.

**ఓకచెట్టు** *n.* : A small tree called *Carissa Carondas,* hearings an acid fruit. పుల్లకలివె.

**ఓకము** or **ఓకస్సు** *n.* : A house or dwelling place ఇల్లు, స్థానము.

**ఓకర** *n.* : Retching to vomit. Great dislike రోత. **ఓకరించు** *v.n.* : To retch in vomiting, to hate రోతపడు. ఓకరింత *n.* : Retching to vomit : ఓకరించుట.

**ఓకస్సు** : Same as ఓకము.

**ఓకలి, ఓకిలించు, ఓకిలింత** : Same as ఓకర, ఓకరించు, ఓకరింత, respectively.

**ఓకు** *n.* : A telescope దుర్భీను, దుర్భిణి, look with a spy-glass.

**ఓగాత్యము** *n.* : Bad taste, impropriety. A bad omen అమంగళము.

**ఓగితము** *adj.* : Fit, proper, worthy యోగ్యము.

**ఓగిరము** *n.* : Food, boiled rice అన్నము.

**ఓగు** *n.* : Evil, harm, wickedness. కీడు. **ఓగు** *n.* : A fool, a weak creature.

**ఓఘము** *n.* : A crowd, flock or multitude సమూహము. A flood ప్రవాహము.

**ఓచెల** or **ఓచెల్ల** *Interj.* : Alas. అయ్యో.

**ఓజ** *n.* : Order క్రమము. Way, manner విధము. Nature స్వభావము. A command ఆజ్ఞ. Vigor, zeal, joy ఉత్సాహము, ఎచ్చరిక.

**ఓజము** or **ఓజస్సు** *n.* : Strength, might, renown, light, brilliancy. బిగి, పటిమ, శ్రేష్ఠత, తేజస్సు.

**ఓజ్జు** *n.* : A tutor or master. ఉపాధ్యాయుడు A goldsmith అగసాలెవాడు.

**ఓట** *n.* : Fear, వైరపు. Hesitation సంకోచము. **ఓటమి** or **ఓటము** Fear భయము. Failure, loss, defeat, భంగము, అపజయము. గెల్పోటములు gain and loss.

**ఓటరి** *n.* : Ruin, defeat, the loser at a game. ఓటరు or **ఓటారు** *v.n.* : To be ruined or wrecked; **ఓటారిన** cracked, broken or gone to pieces. బద్దలయిన.

**ఓటి** (from ఓడు crack) *adj.* : Cracked ఓటికుండ a cracked pitcher అది ఓటిబొచ్చె it is a mere pack of rubbish. ఓటితిపిరదండె A kind of guitar. వీణావాద్యభేదము. *v.i.* : To hesitate ఓడు, సంకోచించు. ఓటిల్లు చిందర a kind of game.

**ఓటు** *adv.* : surely; perhaps.

**ఓటు** *n.* : Loss, defeat. అపజయము, భంగము. **ఓటుపోవు** or **ఓటుపడు** *v.i.* : To be defeated. ఓటుపాటు *n.* : Defeat ఓడింపబడుట, ఓడి పోవుట.

**ఓడ** *n.* : A ship, a boat. The word ఓడ prefixed to the names of some drugs, & c. answers to foreign or imported as ఓడచింతకాయ imported tamarinds. **ఓడపోక** imported areca. ఓడకీలు Pitch. See కీలు.

**ఓడించు** *v.n.* : To defeat, vanquish. జయించు.

**ఓడిక** *n.* : A stream, a current, a river. ప్రవాహము.

**ఓడిగిల్లు** *v.i.* : To flow ప్రవహించు. To run పరుగెత్తు. To flow out కారు.

**ఓడిగించు** *v.a.* : To empty out, pour out completely.

**ఓడినక్క** *n.* : A short fox. పొట్టినక్క See వరుడు.

**ఓడు** *v.n.* or *v.a.* : To fail, lose, to be defeated or worsted, అపజయపడు. To flow or be lost, as blood, పారు. To shrink, hesitate, fall back భయపడు, సంకోచించు.

**ఓడు** *n.* : Defeat, loss, failure, a forfeit, a crack, chink, hole. ఆ పెనము ఓడుగానున్నది that saucepan is cracked. **ఓడుబిళ్ల** Pan tiles, such as are used for roofs.

**ఓఢ్రము** *n.* : Orissa. The Uriya language. ఓఢ్రుడు A native of Orissa.

**ఓతువు** *n.* : A cat.

**ఓత్వము** : The name of the vowel O.

**ఓదనము** *n.* : food, boiled rice అన్నము.

**ఓదము** *n.* : A pitfall for catching elephants. ఏనుగులనుపట్టే గొయ్యి.

**ఓదారుచు** or **ఓదార్చు** *v.a.* : To comfort, condole with. ఊరార్చు.

**ఓదె** or **ఓదియ** *n.* : A rick of corn formed of several పనలు or cocks. ఒఱె. See వామి. ఓదెకొంగ or ఓదె కొరుకు *n.* : The harvest crane.

**ఓనమాలు** *n.* : The Alphabet, so named, because it commences with the salutation to God *"Om Namah"*.

**ఓనికట్టు** *n.* : A narrow pass between hills కొండలనడిమి గొందిదారి.

**ఓపమి** *n.* : Inability, indolence, laziness. పాలుమాలిక.

**ఓపిక** *n.* : Strength, endurance, patience, toleration. శక్తి, ఓర్పు, సహనము **ఓపికలేని** impatient. **ఓపికపెట్టు** to exercise patience, to be patient.

**ఓపు** *v.t.* : To bear, endure, tolerate. ఓర్చు. చూపోపక unable to stand before his face. ఇంతకష్టమోపలేను I cannot bear this trouble.

**ఓబుడు** *n.* : One of the gods worshipped by the Chentsus, a jungle tribe.

**ఓమటి** *n.* : Food అన్నము.

**ఓమనకాయలు** *n.* : Pieces such as tamarind seeds, & c., used in a game called ఓమనగుంటలాట. **ఓమన గుంటలు** *n.* : A kind of game.

**ఓమము** or **ఓము** *n.* : The seed of bishop's weed. *Carum Copticum,* వాము.

**ఓము** *v.a.* : To preserve, to cherish. కాపాడు, పోషించు.

**ఓయారము** : Same as ఒయ్యారము.

**ఓయారి** : Same as ఒయ్యారి.

**ఓయి** *pron.* : Oh ! hallo ! O thou ! పురుష సంబుద్ధి.

**ఓయిరము** : Same as ఓగిరము.

**ఓర** *n.* : The side, border, edge. అంచు.

**ఓరగిల్లు** *v.n.* : To turn aside, to slant. ఒరగు, ఒదుగు. **ఓరగించు** *v.i.* : To turn aside, కొమ్ము లోరగింపుచు, pointing its horns, or turning them.

**ఓరచ్చులు** *n.* : High-soled shoes ఎత్తుగా అట్టలువేసి కుట్టిన ఓరట్టచెప్పులు. Also, rough shoes మోటచెప్పులు.

**ఓరణము** *n.* : A hawk.

**ఓరపాక** *n.* : A verandah పంచపాళి. A shed built on the side of a house. ఇంటిపంచను కట్టిన పాక.

**ఓరపాటు** *n.* : Leaning against a thing. ఒరగుడు. **ఓరపోవు** *v.i.* : To bend, to be slanting వంగు, ఒరగు.

**ఓరసిల్లు** or **ఓరసీలు** *v.n.* : To move sideways. To move aside తొలగు. To be removed or raised as veil. To withdraw oneself. **ఓరసింపు** *n.* : Moving aside ఓరసిల్లుట.

**ఓరి** or **ఓరీ** *interj.* : O thou ! fellow. లేరోరి up ! ఓరీ బాలక my lad !

**ఓరిమి** *n.* : Patience ఓర్పు, క్షమ.

**ఓరు** *n.* : Sound, noise. Red colour applied to the walls of a house on festive occassions. ఇంటి గోడ యడుగునను మూలలను వేసే ఎఱ్ఱ మంటిపెట్టె. ఓరు adj. Large.

**ఓరుచు** *v.n.* : To bear, endure, suffer, tolerate, pardon సహించు, క్షమించు. (from ఓడు) *v.t.* : To conquer ఓడించు.

**ఓరెము** *n.* : Food. Rice. అన్నము.

**ఓర్చు** : Same as ఓరుచు.

**ఓర్తు** or **ఓర్తుక** *pron.* : One (woman). ఒకతె.

**ఓర్పరి** *n.* : A patient person. ఓర్పుగల వాడు, లేక ఓర్పుగలది.

**ఓర్వమి** *n.* : Impatience, intolerance, envy. సమింపలేమి, ఈర్ష్య.

**ఓర్పు** *n.* : Patience, endurance.

**ఓల** *n.* : A cry, shout, hurah ! Bathing, playing in water. జలక్రీడ. **ఓలగందము** *n.* : Saffron that is smeared over the body while bathing పూతపసుపు.

**ఓలగము** *n.* : An assembly, a court. కొలువు, కొలువుకూటము పేరోల

గము, or ఒడ్డోలగము. a great assembly. **ఓలగించు** *v.t.* : To serve కొలుచు.

**ఓలచెంగనాలు** *n.* : Defeat, discomfiture అపజయము.

**ఓలపాట** *n.* : A song used while bathing or swimming. A boat song.

**ఓలము** *n.* : A covering, screen, shelter, veil. The body as the *covering* of the soul చాటు, దాగేస్థలము, మరుగు, రక్షణ ఓలమంది obtaining shelter.

**ఓలలాడు** *v.n.* : To play in water. To bathe. To revel. జలక్రీడచేయు. ఓలలార్చు *n.* : To cause to play in water.

**ఓలాకు** *n.* : Exhaustion, fatigue. అలయిక, శ్రమము. **ఓలాకుపడు** *v.i.* : To be fatigued. అలయు, శ్రమపడు.

**ఓలాడు** *v.i.* : To bathe, to sport, *n.* : water. *v.n.* : To float తేలు, ఓలార్చు. *v.t.* : To cause to float, to refresh, తేల్చు, సేదదీర్చు.

**ఓలి** *n.* : A dowry, marriage portion, money paid by a bridegroom to the parents of a bride. ఉంకువ. a line, a row. **వరుస**, Plu. ఓలులు.

**ఓలిమి** *n.* : A hiding place మరుగుచోటు, ఓలము.

**ఓవరి** *n.* : An antechamber లోపలిగది, తొట్టికట్టు. A pavilion, a hall మండపము, చంద్రశాల. పువ్వుటో వరులు arbours, summer-houses.

**ఓపు** *v.n.* : To fit, to be agreeable సరిపడు, ఒవ్వు.

**ఓషధి** *n.* : An annual plant or herb, one that dies immediately after it seeds. ఫలించినతోడనే నశించు చెట్టు. A medicinal plant మందుచెట్టు. **ఓషధీశుడు** n. The lord of plants, i.e., the moon.

**ఓష్ఠము** n. The lip పెదవి, అధరము. **ఓష్ఠామృతము** n. The nectar of the lips.

**ఓసరు** or **ఓసరిల్లు** v.t. To step aside, to get out of the way, to evade. తొలగు. To be tired అలయు.

**ఓసి** interj. Woman ! Wife !

**ఓహటము** n. Withdrawal, retreat వెనుకతీయుట. ఓహటించు or ఓహటిల్లు v.t. To retire, retreat, fall back వెనుకతీయు, to give way తొలగు.

**ఓహరిసాహరి** abv. Pellmell, in a rout, backwards and forwards. వెనుకకు ముందరికి. అటమటముగా పెసగి. తండోపతండము.

**ఓహెూ, ఓహెూయి** interj. Holloa ! ho ! What ! ఏమీ. Well done ! భళీ. ఓహెూహెూ Oh, alas ! ఓహెూరె or ఓహెూరే interj. Well done ! భళీ.

# ఔ

**ఔ** : AU, the last vowel, compounded or a and u, and pronunced like ou in out or ow in how, cow, now.

**ఔకాపు** *n.* : Living in a rented house అద్దెకాపురము (properly written అవుకాపు.)

**ఔకు** (properly written అవుకు.) *n.* : A fen, morass, bog. అవుకుమళ్లు.

**ఔక్షకము** *n.* : A herd of oxen ఎద్దుల సమూహము.

**ఔగదే** *interj.* : Surely ! ఔరా. (Properly written అవుగదే)

**ఔగాక** : "So be it." Still అయినను, అట్లే కాని. (Properly written అవుగాక)

**ఔగాములు** *n.* : The hitting or missing, the happening or failing. Prosperity and adversity కలిమిలేములు. Propriety and impropriety.

**ఔగు** *n.* : A kind of cake భక్ష్యవిశేషము.

**ఔచిత్యము** *n.* : Fitness, suitability, propriety. యోగ్యత. ఔచిత్య మెరిగి మాట్లాడినాడు he spoke appropriately.

**ఔజు** *n.* : A servant పనివాడు.

**ఔట** : See అవు to be or become.

**ఔటుగుండు** *n.* : A bomb shell. చట్టి పిరంగి గుండు.

**ఔడు** *n.* : A lip, పెదవి. **ఔడుకొట్టు** or **ఔడుకరచు** *v.a.* : To bite the lips or gnash the teeth through rage.

**ఔత్యుక్యము** *n.* : Cupidity, eagerness. ఉత్కంఠ, తహతహ.

**ఔత్సుక్యము** *n.* : Anxiety, agitation, passion, emotion, Earnestness, ఉత్సుకత్వము.

**ఔదారికుడు** *n.* : A gluttonous or voracious man. గర్భాతురుడు.

**ఔదరులు** *n. plu.* : Rivulets.

**ఔదల** *n.* : The crown of the head నడితల. The head తల.

**ఔదార్యము** *n.* : Bounty, liberality. ఉదారత్వము.

**ఔదు** : Same as ఔజు.

**ఔదుంబరము** *n.* : Copper రాగి.

**ఔద్దాలకము** *n.* : The honey in a honey comb పుట్టలోపెట్టిన తేనె.

**ఔద్ధత్యము** *n.* : Rudeness, toughness. ఏపు, అతిశయము, గర్వము.

**ఔను** or **అవును** or **అగును** *v.* : It may be, it probably is, yes; very well, well done ! So be it ! ఇది నీకు అవునా will this agree with you ?

**ఔపనిషద** *adj.* : Belonging to the Upanishads. Scriptural, theological. **ఔపనిషదుడు** *n.* : One who knows the Upanishads.

**ఔపవిభక్తికము** *n.* : A noun used in an irregular form.

**ఔపాధికము** *adj.* : Temporary, not permanent.

**ఔపాసనము** *n.* : The worship of fire enjoined on a married Brahmin every morning గృహస్థుడగు బ్రాహ్మణుడు ప్రాతఃకాలమందు చేయ వలసిన అగ్ని యుపాసన. In a comic sense, smoking tobacco.

**ఔరా** or **ఔరౌ** *interj.* : yes, verily, ah yes, oh indeed, a battle shout.

**ఔరడి** *n.* : Scorn, despite, slight.

**ఔరసుడు** or **ఔరసపుత్రుడు** *n.* : A son of full blood : ధర్మపత్ని యందు పుట్టినకొడుకు.

**ఔరు** (properly written అవురు.) *n.* : Rushes, bulrush. A fragrant grass, వీరణము, అవురుగడ్డి. Also called విడవలి. అవురు మీటలు a lever for raising weights.

**ఔరౌర** *interj.* : Oh oh ! yes, yes indeed!

**ఔర్వము** *n.* : Devouring flame, fire that will burn under water, unquenchable fire బడబాగ్ని.

**ఔల** : Same as అవుల or అవల.

**ఔలు** : Same as అగులు or అవులు.

**ఔలెమ్మ** or **ఔలే** *interj.* : Yes yes ! never mind.

**ఔషధము** *n.* : Medicine. మందు.

**ఔష్ట్రకము** *n.* : A heard of camels. ఉష్ట్రములగుంపు.

**ఔసు** or **అవుసు** : Same as హౌసు. **ఔసుకాడు** *n.* : An impassioned lover, a beauty. నీటుకాడు, శృంగారి.

## క

**క** : The letter K.

**కంకటము** *n.* : A cuirass, armour, కవచము, బొందలము.

**కంకటి** *n.* : A couch or bedstead. మంచము. కంకటిరజ్జు ticken or bedcord used as a noose. See నులక.

**కంకణము** *n.* : A bracelet or anklet. ముత్యాలు. మొదలైనవాని సరము. **కంకణ గ్రహణము** *n.* : An annular eclipse.

**కంకణము** or **కంకణాయి** *n.* : A kind of water fowl జలపక్షి. An ibis. తెల్లకంకణము the white ibis, నల్లకంకణము the black ibis.

**కంకతము** or **కంకతిక** *n.* : A comb. దువ్వెన.

**కంకము** *n.* : An eagle. రాపులుగు. కంకపత్రము. *n.* : An arrow.

**కంకర** *n.* : Gravel. జల్లి. adj. Hard పరుషము, కంకరగాడిద a mule. కంచరగాడిదె, ఆశ్వతరము. కంకరతల a blockhead.

**కంకాళము** *n.* : A skeleton. అస్థి పంజరము, ఎముకలగూడు. A breast bone డొక్క.

**కంకి** *n.* : An ear or head of corn : a stem of corn. వెన్ను. కంకివెడలని బొందు a blasted ear, one that does not sprout.

**కంకివాయువురోగము** *n.* : The croup.

**కంకు** or **కంకులు పెట్టు** *v.a.* : To scold : to abuse. గద్దించు, తిట్టు.

**కంకుడు** *n.* : One who pretends to be a Brahmin. కపటబ్రాహ్మణుడు.

**కంగటి** : Same as కంకటి. కంగటి కాళ్లు adj. Bowlegged.

**కంగాణము** *n.* : A watch, a guard. కావలి.

**కంగారి** *adj.* : Disorderly or filthy. చీదరగా నుండే. కంగారు or కంగిన n. Battle యుద్ధము.

**కంగాళీ** *adj.* : Wretched, miserable దిక్కుమాలిన, కంగాళీమంచము a wretched bed. కంగాళీబత్తెము paltry batta, a wretched pittance.

**కంగు** *n.* : A gold armlet of a wavy shape. బంగారు పోగుతో వంకగా నేర్పరచిన కన్ను. A shrill sound as of a bell when struck. కంగున. **కంగుమను** *v.n.* : To sound, echo as a bell.

**కంగువు** *n.* : the grain termed *Panicum Italicum*, కొర్రలు.

**కంగేలి** or **కంగేళి** *n.* : A large pyramidal tree, అశోకము.

**కంగోరి** *n.* : An arch or dome. The moulding in brick-work.

**కంగోరు** *n.* : A long waistband. నిడువుకాసె.

**కంచి** *n.* : Conjiveram కాంచీపురము. adv. Large పెద్ద. **కంచిమేక** n. A goat which has a large udder పెద్ద పొదుగుదల ఒక జాతిమేక.

**కంచియ** Same as కంచె.

**కంచుకము** *n.* : A woman's waistcoat or jacket. A man's jacket, a piece of armour, a snake's skin. రవిక, కుబుసము, పాముయొక్క కుబుసము, కవచము. **కంచుకి** n. A serpent.

**కంచులిక** : Same as కంచుకము.

**కంచె** *n.* : A hedge, pasture, land బడుగు నేల. **కంచెకోట** *n.* : The outer hedge or fence round a fort. కంచెనాటుట. To plant a hedge.

**కంచెల** *n.* : A woman's jacket.

**కంచము** *n.* : A metal plate or dish.

**కంచరము** *n.* : A kind of carriage. A mule.

**కంచరవాడు** or **కంచరి** *n.* : A brazier, a coppersmith. కంచుపని చేయువాడు. కంచరది a woman of that caste. **కంచరి పురుగు** *n.* : A kind of beetle called the death. **కంచు** *n.* : Bell metal.

**కంచుకంటు** *n.* : A frying pan. బాణలి. కంచుమించు *n.* : A sort of toe-ring. adj. Invisible, out of sight అగోచరము.

**కంజము** *n.* : Any aquatic product. A lotus. తామర. **కంజముఖి** bright faced, a fair girl. **కంజజ** *n.* : Born from the lotus, a title of Brahma. **కంజాతము** *n.* : A lotus. **కంజుడు** Brahma.

**కంజు** : Same as కాజు.

**కంట** : (from కను) n. Seeing కనుట.

**కంటకము** *n.* : A thorn, a prickle. A pest, plague, evil, inconvenience, besting sin, stumbling block ముల్లు, విరుద్ధమైనది, రోమాంచము. **కంటకఫలము** *n.* : The Jack tree పనస.

**కంటగించు** or **కంటగిల్లు** *v.n.* or *v.a.* : To feel or cause pain మెచ్చు. To oppose, to thwart విరోధించు. To hate, be intolerant, or outrageous. To rave or storm.

**కంటలము** : Same as కంట్లము.

**కంటసము** *n.* : A disagreeable word or words said in opposition. విరోధపుమాట.

**కంటసరి** *n.* : A necklace of gold beeds.

**కంటాణి** *n.* : An awl.

**కంటి** *n.* : One who has an eye. ముక్కంటి one who has three eyes. జగడగంటి or one who has an eye for quarrels, i.e., a quarrelsome woman.

**కంటిచేప** or **కణితచేప** *n.* : A kind of fish, a species of *sparus* with a prickly head and large eyes.

**కంటు** *n.* : The head or top of a pillar. Antipathy, hatred, grudge, unkindness. పగ, విరోధము, కంటుపెట్టు to hate.

**కంటె** or **కంటియ** *n.* : A carcanet, or gold collar worn by women.

**కంటె** or **కన్న** *conj.* : Than. దానికంటె ఇది మంచిది this is better than that. వానికంటె వేరేమణిసి a different man from him. ఆత్మకంటె వేరు different from spirit.

**కంట్లము** *n.* : A pack-saddle చిల్లర సరకులుంచి యెద్లమీద వేసే సంచుల జత. A pannier or bag made to hold a pack. A saddle - bag. కంట్లపుయెద్దు a pack-bullock.

**కంఠము** *n.* : The throat కుత్తుక. Sound కుత్తుకధ్వని. Nearness, proximity, సమీపము. గ్రామ కంఠము the village common.

**కండ** *n.* : A lump or piece of flesh or pulp. కండకొవ్వున కన్నుకానకున్నాడు he cannot see out of his eyes for pride.

**కండీగచేప** *n.* : A kind of fish, a species of *Clupea*.

**కండుబయిచేప** *n.* : The sepia or cuttle fish, from which is obtained the కండుబయిపలక the bone from which pounce is made.

**కండువా** *n.* : An upper garment. అంగవస్త్రము. A cross beam or rafter in a roof. అడ్డదూలము.

**కండువు** or **కండూతి** or **కండూయ** *n.* : Itching, itch దురద, తీట.

**కండె** *n.* : A head or ear of millet or maize. జొన్నకంకి. A ball or roll of thread on a straw, which is put into the shuttle నూలుచుట్ట.

**కండ్లు** *n.* : The plural of కన్ను an eye : and of కల్లు a stone; ఒడికండ్లు

carriage wheels. కండ్లగంతికట్లు to blindfold. కండ్లపడు to appear, come in view.

**కంత** *n.* : A hole, cleft, gap, aperture, fissure, chink, a passage, alley way, పిల్లకంత, a small lane.

**కంతి** *n.* : A wen or swelling, a hump, a tumour.

**కంతుడు** *n.* : A name of Cupid మన్మథుడు.

**కంథ** *n.* : A rag, a patch work quilt. చింపిగుడ్డ, బొంత.

**కంద** *n.* : A bulbous esculent root; మంచికంద a species of vegetable grown for food కనరులేనికంద.

**కందకము** *n.* : A ditch, trench. అగడ్త, పరిఘ.

**కందనగాయ** *n.* : The heart. గుండె, హృదయము.

**కందపట్టెలు** *n.* : Cross pieces of wood at the back of a door.

**కందము** *n.* : A certain metre in prosody. Also, the neck of animals, స్కంధము, పశుజాతి మూపు.

**కందరము** *n.* : A cave, గుహ.

**కందర్పుడు** *n.* : Cupid. మన్మథుడు. కందర్పమందిరము అనగా యోని.

**కందళము** or **కందళికము** *n.* : A quilt or rug used as a saddle. ఎద్దుమీద వేసే గంత. కందళము *n.* : A germ or shoot, a sprout. కొత్తమొలక. **కందళించు** *v.n.* : To sprout, germinate, shoot.

**కందాచారము** *n.* : The native militia కట్టుబడివాండ్లు. adj. Military దండు సంబంధమైన.

**కందాయము** *n.* : Tribute, tax. కందాయము *n.* : An astrological period of four months.

**కంది** *n.* : The grain called red gram తునరి.

**కందిరీగ** or **కంద్రీగ** *n.* : A hornet.

**కందు** *n.* : Blackness, discoloration, as by scorching : a dark shade as in the face of the moon నలుపు. Evil, harm. కీడు.

**కందుకము** *n.* : A ball to play with చెండు. కందుకట్లెగసి springing up, bounding or elastic like a ball.

**కందుడు** *n.* : The god of battle. కుమారస్వామి.

**కందురీగ** : Same as కందిరీగ.

**కందువ** *n.* : 1. A way, path. 2. A place, locality, quarter ప్రదేశము. 3. A season ఋతువు. 4. Fashion, mode, device, trick, peculiarity. 5. Fiction, fraud, మాయ; archness, a prank, a wrench, or a twist. చమత్కారము, నేర్పు. 6. Finesse, innuendo, a quibble, ఛలోక్తి; refinement, prettiness. 7. A token, or mark, trace, track. జాడ, సంకేత స్థలము, ఏకాంతము. వానకందువ the rainy season. ఇరుకందువ on both sides.

**కందువు** *n.* : A gridiron పెనము.

**కందెన** *n.* : Grease for carriage wheels కందెనబిళ్ల the leather or washer put on an axle tree.

**కందెర** (కన్ను + తెర) *n.* : An eyelid. కనురెప్ప.

**కందోయి** కన్ను + దోయి) *n.* : A pair of eyes.

**కంధరము** *n.* : The throat : a cloud. మెడ, మబ్బు.

**కంధి** *n.* : The ocean. కడలి, సముద్రము.

**కంప** *n.* : a bush of thorns. ముళ్లమండ. కంపకోట *n.* : A stockade. వెదురుతో గాని పేముతోగాని చేసిన ఆవరణము. **కంపగోడ** *n.* : A thorn hedge.

**కంపణము** *n.* : A kind of weapon. ఆయుధ విశేషము.

**కంపతుడుపు** *n.* : A hurdle used as a harrow. రెండు ఎడ్లతో తోలే కంప చీపురికట్ట.

**కంపనము** *n.* : Tremor motion. Nodding కదులుట, వణకుట. కంపము *n.* : Trembling, tremor, vibration, agitation. వణకు.

**కంపనల్లంచి** *n.* : the common Pied Bush-Chat అడవి కంపనల్లంచి, లేక అడవి కంపజిట్ట or, The Indian Bush-Chat.

**కంపరము** *n.* : A bier for bearing corpses పాడె.

**కంపించు** or **కంపిల్లు** *v.n.* : To tremble, shake, be agitated. వణుకు. కంపితము *adj.* : Trembling, shaking, వణికెత్తిన.

**కంపిల్లము** *n.* : A plant called గోలికూర or కలుగ్రానుగు.

**కంపు** *n.* : A smell వాసన. A stink దుర్గంధము.

**కంబడి** : Same as కంబళి.

**కంబము** *n.* : A pillar or post. The stem of a tree. దివ్వెకంబము a candle-stick. **కంబమయ్య** or **కంబము రాయుడు** *n.* : The god Narasimha who manifested himself to హిరణ్యకశిప in a pillar.

**కంబరుతాడు** *n.* : Coir, rope. మోకు.

**కంబళము** or **కంబళి** *n.* : A rug, a blanket : (usually black:) కంబళమువంటి as black as a blanket. రత్నకంబళము a particoloured rug. వాడు ఒక కంబళి పురుగు he is a wretch.

**కంబాయి** *n.* : A kind of cotton cloth.

**కంబాలాట** *n.* : A kind of game played by girls. నాలుగుస్తంభాలాట.

**కంబి** *n.* : The grain named *Holcus spicatus :* Bajra. సజ్జలు.

**కంబువు** *n.* : A large shell or conch, pearly white and marked with three ridges across the inner tube. కంబుకంఠి or కంబుగ్రీవ *adj.* : Fair throated : having a neck as beautiful as a shell.

**కంసము** *n.* : Bell metal. కంచు.

**కంసర** or **కంసల** *n.* : Smithery working in gold : *adj.* : Of the goldsmith caste. కంసలది a woman of

that caste. కంసలపని the business of a goldsmith.

**కంసారాతి** *n.* : Slayer of Kamsa, an epithet of Krishna.

**కంసాలి** or **కంసాలవాడు** *n.* : A goldsmith or silversmith.

**కకపాల** *n.* : A recluse's bag. సన్యాసి యొక్క సంచి, కక్షపాల.

**కకపిక** or **కకవిక** or **కకావికలు** *n.* : Tumult, uproar. కకపికలుగా tumultuously. కకపికలుచేయు to brawl, make an uproar. అల్లరి, గత్తర.

**కకుత్తు** or **కకుదము** *n.* : A bull's hump.

**కకుప్, కకుప్పు** *n.* : An *airt* or quarter of heaven. దిక్కు.

**కకుభము** *n.* : A certain tree మద్దిచెట్టు.

**కక్క** *n.* : Papa : daddy. Also (vulgarly) flesh, meat; also (childishly) betel nut, dirt, a nasty thing.

**కక్కపాల** : Same as కకపాల.

**కక్కర, కక్కెర** *n.* : The demoiselle crane, ఓదెకొరుకు, కక్కరకోడి *n.* : The painted Partridge, కక్కర జీనువాయి The spotted Munia.

**కక్కరము** *adj.* : Hard, or sharp కరుకు. *n.* : Hardness.

**కక్కసము** (for కర్కశము) *n.* : Rigidity, hardness, harshness, hardship, trouble, సంకటము, బాధ. కాఠిన్యము, మనఃక్రోధము. కక్కసము లాడు to be rude or cruel. కక్కసపు గుఱ్ఱము a stubborn horse.

**కక్కించు** *v.t.* : To make one vomit. వానివద్ద ఆ రూకలను కక్కించినాను I made him disgorge the money.

**కక్కినచెట్టు** *n.* : A tree called *Posoqueria uliginasa.*

**కక్కు** *n.* : A notch, roughness : కక్కులు dents, notches : teeth : the rough part of a millstone or of a saw the toothed part of a file, sickle, or saw. కళ్లెపుకక్కులు teeth of a horse's bit.

**కక్కు** *v.a.* : To vomit. కక్కు *n.* : Vomiting : the thing vomited. కక్కుడు *n.* : Vomiting.

**కక్కుతెవులు** : Bilious vomiting.

**కక్కురితి, కక్కూర్తి** *n.* : Want, defect, a whim, idle desire. లోభము. Hard necessity కష్టము, ఇబ్బంది, పొట్ట కక్కూర్తికై for want of food.

**కక్కువాయి** *n.* : Whooping cough. కాసరోగ విశేషము.

**కక్కూర్తి** : See కక్కురితి.

**కక్కెర** *n.* : A crane. See కక్కర.

**కక్షపాల** : Same as కకపాల.

**కక్షము** *n.* : An armpit చంక.

**కక్ష్య** *n.* : A belt మొలనూలు, దట్టి. The equator of the earth భూమధ్య రేఖ.

**కగ్గము** *n.* : A sword.

**కగ్గు** *v.n.* : To shrink. To be tarnished. వెండి కగ్గినది the silver is tarnished. **కగ్గించు** *v.a.* : To cause to be tarnished.

**కగ్గులు** *n.* : Sparks. అగ్నికణములు, కగ్గులకాడు a fugitive. Also, (from కాడు a place) the anvil as "the place of sparks. కగ్గులకాటకలుపుట to ruin, to destroy.

**కచము** *n.* : A hair. వెంట్రుక.

**కచిక్కున** *adv.* : Slapdash, at once.

**కచూరము** *n.* : A sort of perfume. The plant *kumpferia otunda.*

**కచేరీ** or **కచ్చేరి** *n.* : An office; cutchery, a place of public business. A public court. A nautch, the ceremony of dancing at a wedding, & c. కొలువుకూటము. కచేరీచేసినారు they had a party.

**కచోరము** : a plant called *Zedoary,* షడ్గ్రంధి.

**కచ్చ** *n.* : A truss. The tuck of cloth, or modesty piece between the legs. గోచి. **కచ్చడము** *n.* : A tuck or truss. గోచి.

**కచ్చరము** *n.* : Dirt, foulness. మయిల.

**కచ్చా** *a.* : Unripe, raw; not good, rough, base. పండని, నీచమైన, కచ్చా సేరు the baser sort of సేరు. కచ్చామనిషి a mean fellow.

**కచ్చి** *n.* : A weaver సాలెవాడు. An interstice where a stick is inserted in a warp. కొయ్యలను పడుగునందు చొప్పించే సందు. **కచ్చికొట్టు** *v.t.* : To geld. *adj.* : Gelded. కచ్చిచేసిన గుర్రము a gelding.

**కచ్చించు** *v.n.* : To be raged, to be angry. *v.a.* : To move a piece at chess. To tuck up a cloth కచ్చకట్టు. **కచ్చింపు** *n.* A move at chess, & c. Also fierceness, emotion. ముష్కరత్వము.

**కచ్చిక** *n.* : A burnt cake of dried dung. కాలిన పిడకతునక.

**కచ్చితము** *adj.* : Strict, correct, exact ఎచ్చుతక్కువలు లేక సరిగానున్న.

**కచ్చు** *v.t.* : To move a piece at chess కచ్చించు. To stick out, project. కచ్చు *n.* : Stench. The washings of rice. Pride దంభము. గర్వము.

**కచ్చూరము** : Same as కచోరము and కచూరము.

**కచ్చె** *n.* : A quarrel or fight. కచ్చెకుకాలు తవ్వు to bestir oneself for fighting. Lit. to paw the ground preparing for the fight.

**కచ్చెర** *n.* : Dirt, that falls from thatch.

**కచ్ఛపము** *n.* : A tortoise. **కచ్ఛపి** *n.* : A female tortoise. *adj.* : That which is made of tortoise shell, as a lute.

**కచ్ఛము** : Same as కచ్ఛ.

**కజాయము, కజ్జ, కజ్జము, కజ్జకాయలు** or **కజ్జాయము** *n.* : A sort of sweet cakes. ఒక విధమైన భక్ష్యము.

**కజ్జలము** *n.* : Lampblack. The black part of a wick. *Collyrium* or black paint for the eyes. కాటుక.

**కజ్జా** *n.* : A quarrel, dispute, altercation. జగడము. **కజ్జాలకోరు** a quar-

rel some person. గిల్లికజ్జాలు తెచ్చుకొను to pick quarrels without a cause.

**కజ్జారము** *n.* : A date tree. ఖర్జూరము.

**కట** or **కటకటా** *interj.* : Alas, అయ్యో ! **కటకటంబడు** *v.t.* : To feel pity. జాలిపడు. To be angry కోపించు. To suffer pain బాధపడు.

**కటకటాలు** or **కటకటాకమ్ములు** *n.* : Rails, railings. ఇనుపకమ్ములు మొదలైనవానితో చేసిన అడ్డు.

**కటకటమను** *v.n.* : To be irritable. **కటకటాత్కారము** *n.* Grinding the teeth.

**కటకము** *n.* : A town or city. A capital రాజధాని. The town of Cuttack in Orissa.

**కటకాముఖము** *n.* : The position of the fingers of the right hand when drawing a bowstring.

**కటపెట** *n.* : Noise సందడి, ధ్వని. (An *onomatopoeic* word.)

**కటము** *n.* : A mat : చాప. The temples of the head. చెక్కిలి. the hip మొల.

**కటా** : Alas !

**కటాక్షము** *n.* : A look; particularly, a glance or side look; a favourable look; (hence) grace, kindness.

**కటాకటిగా** *adv.* : Hardly, with difficulty. అదికటాకటిగా సరిపోయినది. it was just enough.

**కటారి** or **కటారు** *n.* : A cross hilted dagger. కటారికాడు one who carries a dagger. కటారికత్తె a woman who has a dagger with her.

**కటాహము** *n.* : A large vessel : a boiler కడవ, కప్పెర బ్రహ్మాండ కటాహము the globe of the universe, i.e., space.

**కటి** *n.* : The hip or haunch. మొల. కటి చక్రము the lions, the hips. కటి తటము the hip. కటిద్వయము a pair of hips. పిరుదులు. girdle. మొల తాడు. కటిస్థలము. the posteriors.

**కటిక** or **కటికి** *adj.* : Mere, quite, entire, total, downright, cruel, unfeeling, horrid. కటికపని butchery.

**కటీరము** *n.* : The cavity of the loins, the loins. మొల.

**కటుకరోహిణి** *n.* : Black hellebore, a purging medicine.

**కటుక్కను** *v.t.* : To crackle (as a nut when broken).

**కటుమరలు** or **కటుమోరలు** *n.* : The cheek bones. చెక్కిళ్లమీది భాగములు, హనువు. కటుమోరలు ఉబ్బుగాగల having high cheek bones.

**కటువు** *adj.* : Pungent in taste. కారము. Hard, unpleasant ఇంపుకాని. కటూక్తి a hard word.

**కటోలవీణె** *n.* : A stringed musical instrument like the vine. మాల వీణె, కిన్నెర.

**కట్ట** interj. Alas ! కటకటా, కట్టా.

**కట్ట** *n.* : A bank or shore; a dam or embankment.

**కట్టకడ** *adv.* : At the very end. See కడ.

**కట్టడ** *n.* : Order, rule, custom. నియమము. Arrangement, manner, mode తీరు, కావలికట్టడలు or కట్టళ్లు routine or order of guard.

**కట్టడము** *n.* : A building or edifice.

**కట్టనము** *n.* : A gift, a present. కానుక. Tying up బంధనము.

**కట్టా** *interj.* : Alas ! See కటకటా and కట్ట.

**కట్టాని** *adj.* : Fine, first class; కట్టాణి ముత్తెము a matchless pearl. See ఆణి. కట్టాణిగుండ్లు. n. A necklace or small gold beads.

**కట్టావి** *n.* : Steam, moisture collected on the lid of a kettle. Stifling heat.

**కట్టించు** *v.a.* : To cause to tie or build. To get built, to have one bound.

**కట్టిక** or **కట్టికవాడు** *n.* : A macebearer. వెండిబెత్తమువాడు.

**కట్టిడి** *adj.* : Cruel, merciless; hard. కట్టిడితనము *n.* : Cruelty. కట్టిడులు cruel wretches.

**కట్టిడు** *n.* : A butcher.

**కట్టు** *v.n.* : To cease or stop, gather or form as clouds or a boil, or lump; to be with young (used of animals.) భేదికట్టినది the diarrhoea ceased.

**కట్టు** *v.a.* : To tie, bind. బంధించు. To wear, as clothes. ధరించు. To connect, affix, attach. To store up, to lay by. కూడ బెట్టు.

**కట్టు** *n.* : A tie, bond, band. A bandage, a knot బంధము, ముడి. A rule, regulation, law. నిబంధనము, నిర్బంధము. A tax or duty. Fascination. వాకట్టు striking dumb. Soil, place ప్రదేశము.

**కట్టుక** *n.* : A miscarriage గర్భస్రావము.

**కట్టుకంబము** : Same as కట్టుగుంజ.

**కట్టుకమ్మ** *n.* : A written agreement.

**కట్టుకొంగు** *n.* : That part of a female's garment, which she ties round her waist. కోకచెంగు.

**కట్టుకొను** *v.a.* : 1. To build, to bind, to wear or put on. ధోవతి కట్టుకొన్నాడు he put on his cloth. See కట్టు. 2. To incur (blame or sin) ఇంత పాపము కట్టుకోవలసినదా shall we incur so great a sin ? పుణ్యము కట్టుకొను to acquire merit. 3. To marry. దాన్ని కట్టుకొన్నాడు he married her. 4. To conquer. To appropriate, take passession of. వారి దేశమునంతా తాను కట్టుకొన్నాడు he conquered all their territories.

**కట్టుకొమ్మ** *n.* : An embankment, a dyke. ఆనకట్ట.

**కట్టుకొయ్య** *n.* : A tying post, the pole of a plough. నాగటి మేడి.

**కట్టుకోక** *n.* : Ordinary clothes. నన్ను కట్టుకోక తెచ్చినారు they brought me just as I was.

**కట్టుగడ** *n.* : A store, that which is stored up. చేర్చి పెట్టిన ధాన్యము మొదలైనవి. కట్టుగడచేయు to lay up in store.

**కట్టుగుంజ** *n.* : A post to tie cattle to.

**కట్టుగొఱ్రె** *n.* : A sheep bound for slaughter.

**కట్టుదొన** *n.* : A small tank or cistern కోనేరు.

**కట్టుపకాసు** *n.* : A steady man అచలుడు.

**కట్టుపడు** *v.i.* : To be tied, to be bound by. To be subject to బద్ధమగు. న్యాయమునకు కట్టుబడి being tied down to justice. కట్టుపాటు *n.* : System, regulation, a code, a bye-law. నిబంధనము.

**కట్టుపోతు** *n.* : A wizard or necromancer.

**కట్టుబండి** *n.* : A well equipped carriage. సకల పరికరసహితమైన బండి.

**కట్టుబట్ట** *n.* : A garment. కట్టుబట్టతో విడిచినారు they left him with the skirt on his back. కట్టుబట్టతో పారి వచ్చినాడు he escaped with nothing but the clothes on his back.

**కట్టుబడి** *n.* : A settlement : as of permanent revenue. కట్టుబడి బంట్రోతు a serf, a settler; a feudal retainer, who is supported by land settled upon him. a village servant.

**కట్టుమట్టు** or **కట్టుముట్టు** or **కట్టు మొదలు** *n.* : A stall in a stable. పశ్వాదులను కట్టుచోటు. Place of abode. ఉనికిపట్టు. An arrangement ఏర్పాటు.

**కట్టుమాను** *n.* : A float of timber, a raft. తెప్ప.

**కట్టువ** *n.* : A hedge వెలుగు.

**కట్టువర్గము** : A wardrobe or set of clothes.

**కట్టె** *n.* : A tick or staff, a piece of wood, firewood. నీరుకట్టె a harmless water snake. అడ్డకట్టె a fife. నిడుపుకట్టె a flute.

**కట్టెచీమ** *n.* : A large black ant.

**కట్టెడ** *n.* : A kind of snake. కట్లపాము.

**కట్టెపండు** *n.* : Tamarind, with the stone in it.

**కట్టెపాపర** *n.* : The self planting leaf, indented at the edges and having a seed in each notch.

**కట్నము** *n.* : A present giving to a ruler, or given by relations to each other at a marriage, & c. A fee, a gift. కట్నము చదివించుట to proclaim the amount of contributions.

**కట్యము** *n.* : A title or name of honour. కట్యపు వాడు a herald or crier. కట్యము చెప్పు to proclaim a title.

**కట్రాయి** *n.* : A flagged floor, a floor laid or paved with stone. A stall, stable.

**కట్ల** *Affix.* : At (denoting either place or sea son) తెల్లవారకట్ల in the morning. ఎదురుకట్ల in front.

**కట్లగుదియ** *n.* : A club with bands or rings round it. An iron shod, cudgel. ముసుండి.

**కట్లతీగె** *n.* : A plant called *Cissampelos Hexandria.* దాసరితీగె.

**కట్లదండ** *n.* : A necklace or alternate rows of black and gold beads.

**కట్లపురుగు** or **కట్లపాము** *n.* : A viper or venomous snake barred with black stripes. *Cobra Manilla.*

**కట్లబల్ల** *n.* : A camp table or stool.

**కట్లమారి** *adj.* : A thing that is protected by bars of wood or metal కట్లుకలది.

**కట్లసొ్ర** *n.* : A kind of fish.

**కట్లి** *n.* : A dooly or litter. మంచపుడోలి.

**కట్లు** *n.* : The plural of కట్టు. కట్లు or కట్లె *n.* : Weights, particularly those used by goldsmiths బంగారు తూనిక గుండు. Plu. కట్లెలు.

**కట్లెగడ్డిచెట్టు** *n.* : A plant.

**కఠము** *n.* : Voice. కంఠస్వరము.

**కఠారము** or **కఠారి** *n.* : A cross hafted dagger. కత్తి, బాకు.

**కఠినము** *adj.* : Solid, hard, severe, difficult, cruel, inflexible. వాడు బ్రతకడము కఠినము it is hard for him to survive.

**కఠిల్లు** *v.t.* : To produce a crackling sound as in striking with a whip.

**కఠోరము** *adj.* : Hard, solid, severe, rigid. గట్టి.

**కడ** *n.* : A place, quarter, or direction. దిక్కు, పార్శ్వము. The end, extremity అంతము. Distance దూరము. Proximity, సమీపము. ఇరుగడ on both sides. కట్టకడ at the very end. కడకు at last చివరకు. కడసారి adj. & adv. Last, the last time.

**కడ** : An affix. (added to the roots of some verbs it forms nouns or adjectives;) రాకడ arrival, coming. పోకడ going. తేరుగడ settlement. మనుగడ (from మను to live) lifetime.

**కడక** or **కడంక** *n.* : An attempt; courage, determination యత్నము, స్థైర్యము, ఉద్రేకము, పూనిక.

**కడగండ్లు** *n.* : Plagues, calamities, evils, dangers, afflictions, miseries, scrapes, troubles. కష్టములు, తొందరలు, శ్రమలు. నానా కడగండ్లు పడ్డారు they were exhausted or knocked up.

**కడగట్టు** *v.t.* : To fix, to settle, to determine నిర్ణయించు, ఏర్పాటుచేయు. కడగట్టురేఖలు *n.* : Outlines in drawing, boundaries.

**కడగు** or **కడంగు** *v.n.* : To venture, dare. To strive or begin యత్నించు.

**కడగొట్టు** *adj.* : The youngest, the last కడపటి. **కడగొట్టుబిడ్డ** the last child born; the youngest of a house. *v.i.* : To die చచ్చు.

**కడచను** *v.i.* : To die చచ్చు. To perish నశించు. To end, to be finished

ముగియు. *v.t.* : To leap across, to cross దాటు.

**కడచీల** *n.* : linch pin.

**కడచు** or **గడచు** *v.n.* : To elapse, pass గతించు. To exceed a limit. మేర మీరు, హెచ్చు. (Metaphorically) to die చచ్చు. To perish నశించు. *v.t.* : To leap across, to cross దాటు.

**కడతెగు** *v.i.* : To be finished సమాప్తమగు.

**కడతేరు** *v.n.* : To be concluded or finished. తీరు, సమాప్తమగు. To die చచ్చు. నన్ను కడతేరనివ్వడు he prevents me from succeeding. కడతేర్చు *v.a.* : To relieve or save రక్షించు.

**కడప** or **గడప** *n.* : A threshold. A gateway. (Metaph.) a house.

**కడపచెట్టు** *n.* : sometimes called the Indian Oak Tree కదంబము.

**కడపట** *adv.* : At the end, at length. at last. తుదకు.

**కడవల** *n.* : The end. కడవలి *adj.* : Last, final, ulterior.

**కడపు** or **గడపు** *v.t.* : To put off, to send away without giving any thing ఇయ్యకపొమ్మను. To kill చంపు. To drive తోలు. To let go వదలు. కడపు చెయ్యి a rudder. చుక్కాని.

**కడమ** *n.* : The rest, remainder. శేషము A deficit కొరత.

**కడముంత** *n.* : a small pot. చిన్న ముంత.

**కడముట్టు** *v.i.* : To be finished, reach the end. సమాప్తమగు, తుదముట్టు, ముగియు. To accrue to, to come to సిద్ధించు, కలుగు.

**కడయిల్లు** *n.* : the last house. The next world, heaven.

**కడలి** *n.* : The sea. పాలకడలి the sea of milk. కడలికూతురు Lakshmi. కడలిరేడు the god Varuna. కడలివెన్న the moon. కడలు *n.* : A wave. అల.

**కడలుకొను** or **కడల్కొను** *v.n.* : To gleam, to flash, flicker, as light. వ్యాపించు, కడలొత్తు. To spread వ్యాపించు.

**కడవ** *n.* : A large water pot or earthen vase. పెద్దకుండ.

**కడవతీటు** *n.* : A kind of drum వాద్య విశేషము, తుడుము.

**కడవసము** or **కడాసము** *n.* : A dried skin or mat used by ascetics as a bed. కృష్ణాజినము, తోలు.

**కడవెళ్లు** *v.n.* : To be finished, closed, ended. ముగియు. *v.t.* : To cross దాటు. కడవెళ్లా *adv.* : Completely, throughout, everywhere.

**కడవొత్తు** or **కడవత్తు** *n.* : The beam that lies along the top of the wall and sustains the roof.

**కడాని** *adj.* : Pure, fine, as gold, Bright, glittering. *n.* : అపరంజి Pure gold.

**కడామిచెట్టు** *n.* : The tree called *Nauclea Codamaba.* బొట్టకడామి the name of a certain species.

**కడారము** *n.* : Dark tawny colour పింగళవర్ణము.

**కడాసము** : Same as కడవసము.

**కడి** *n.* : A mouthful, a morsel. కబళము. పేడకడి cowdung. చల్లకడి curds. (plu. కళ్లు.) Smell వాసన. **కడగొను** *v.i.* : To eat in mouthful కబళించు.

**కడిఖండలు** *n.* : Bits, fragments. కడిఖండంబులుగా piecemeal.

**కడిగించు** *v.a.* : To cause to wash.

**కడితము** or **కణితము** *n.* : A folding account book formed of cloth covered with black paste and polished like a slate. On these leaves accounts are written with soap stone. బలపము.

**కడితి** *n.* : A sambur. కణుజు.

**కడిది** *adj.* : Extreme, great అధికము. Impossible అశక్యము. Difficult కఠినము. n. Danger ఆపద.

**కడిమి** *n.* : Greatness, excess. అతిశయము, ఆధిక్యము. Bravery, gallantry. పరాక్రమము. *adj.* :Vast, great, brave. *adv.* : Greatly, much. మిక్కిలి.

**కడిమిచెట్టు** : See కదంబము.

**కడిమిడి** *adj.* : Grass పచ్చికగల (నేల)

**కడియము** *n.* : A bracelet or anklet. కడియపుటట్టు a kind of round ring-like cake చక్కిలము.

**కడివెడు** *n.* : A potful.

**కడివోవు** *v.i.* : To be spoiled చెడిపోవు. కడివోని excellent, unspoiled.

**కడిసెచెట్టు** *n.* : A tree called *Cluytia Collina.*

**కడు** *adv.* : Much, greatly. మిక్కిలి, అత్యంతము.

**కడుకొను** *v.i.* : To excel అతిశయించు. To rejoice ఉత్సహించు.

**కడుగు** or **కడ్గు** *v.a.* : To wash, lave, cleanse. *n.* : The water in which rice, & c., has been washed బియ్యము కడిగిన నీరు, కుడితి.

**కడుదురు** or **కణుదురు** *n.* : A wild bee. కందిరీగ.

**కడుపు** or **కడ్పు** *n.* : The belly or stomach. వాని కడుపు కాలుచున్నది he is very hungry; కడుపు కట్టుకొను to stint oneself, restrain one's appetite. **కడుపుమంట** heart burning, malice, envy. ఓర్వలేమి.

**కడ్డాయము** *n.* : Compulsion, force : exaction : forcing people to pay the price set upon articles. బోము, బలాత్కారము.

**కడ్డీ** *n.* : A stick, an ingot, bar of metal. A tube or catheter. పుడక. నల్లకడ్డీ చీరలు cloths with black edges.

**కడ్డీవేయు** : to pass a catheter.

**కణకు** *n.* : A firebrand. కొరవి. Fire ఇంగలము.

**కణగు** : Same as కడగు. కణక Same as కడంక.

**చేయు** *v.a.* To shuffle off, or delay. జాగుచేయు. **జాలకాడు** *n.* : An idler. a loiterer. ఆలస్యము చేయువాడు. A fisherman.

**జాలరి** *n.* : A fisherman. జలగడిగేవాడు. *n.* : A fisherman.

**జాలరు** *n.* : Network, a fringe జాలరు కన్ను the mesh (lit. the eye) of a net.

**జాలవారు** *n.* : Guards, spearmen.

**జాలారిచెట్టు** *n.* : The plant called హింగ్ర.

**జాలి** *n.* : Pity, regret, love. విచారము, దయ. జాలిగానుండే కథ a pathetic story. జాలివిరాళి emotion and eagerness, pining and longing. **జాలిగొను** or **జాలిపడు** to feel pity. **జాలినొందు**, విచారపడు. **జాలిచెట్టు** to grieve దుఃఖపెట్టు.

**జాలిమి** *n.* : A veil. జాల్ములు.

**జాలియము** or **జాలెము** *n.* : A purse. జాలెసంచి.

**జాలు** or **జాలువు** *n.* : A stream. ఏరు. అల్ప ప్రవాహము. **జాలుకొను** or **జాలు పారు** *v.n.* : To form in, or he as a line. To flow ప్రవహించు.

**జాలె, జాలెము, జాలియ** or **జాలియము** *n.* : A purse, a bag. జాలె or జాలి the cord used in spinning a top. బొంగరపు త్రాడు. **జాలెడేగ** *n.* : A kind of hawk.

**జాళించు** : Same as జాడించు.

**జాళియ, జాళె, జాళియము** or **జాళెము** *n.* A certain pace of horses. అశ్వగతి విశేషము.

**జాళువా** or **జాళ్వా** *n.* : Probably (like Ophir or Potosi) the name of a place. Fine gold. అపరంజి. Thus జాళువాపసిడి. fine gold of Jalwa. జాళువా బంగారు మేలువన్నె భేదము.

**జావ** *n.* : Gruel, porridge. పేయమైన గంజి.

**జావడము** or **జావళము** *n.* : A country horse, a hack. గుర్రపు తట్టు. A falcon. The Shanin. Jerdon, గుర్రపు జావడము a mule. గోడిగ. జావడ ములు colts, fillies. ఆడగుర్రపు తట్లు. Unmanliness. అపౌరుషము. Timidity. పిరికితనము.

**జావడి** *n.* : A washerman. చాకలవాడు.

**జావళి** or **జావళి** *n.* : A kind of song. గీత విశేషము.

**జావాహిరి** *n.* : Wealth. సొమ్ము.

**జం** *n.* : A hum. జుమ్మనే ధ్వని, భ్రమరాది ధ్వని.

**జంజము, జంజాము** or **జంజుము** *n.* : A jest, a joke, a lie. A torch made of leaves and sticks tied together in a bundle for use in dances or on the Dipavali day.

**జంజు, జంజురు** *n.* : Dishevelled hair. విరియబోసిన వెంట్రుకలు, చింపిరి వెంట్రుకలు. Shagginess. A lion's mane. జుంజురు or జుంజురుకట్ట a torch made like a brush out of any dry sticks.

**జంటితేనె** Virgin honey. జుంటీగ *n.* : Honey bee.

**జోజురు** *n.* : A cluster. గుబురు. జాజారు కొను to cluster గుబురుకొను.

**జోజివీ** *adj.* : Trivial, petty. common.

**జోట్టనవేలు** or **జోట్టవ్రేలు** *n.* : The fore finger తర్జని. The thumb or the great toe. **జోట్టిలి** or **జోత్తిలి** the distance between the thumb and the forefinger when they are stretched out. చాపబడిన బొటన వ్రేలికి చూపుడు వ్రేలికిని గల నడిమి కొలత.

**జోట్టు** *n.* : A crest, as that of a peacock. The lock worn by Hindu men on the top of the head. అవిద్యజుట్టు అతనికి దొరికినది he has head. ఆవిద్యజుట్టు అతనికి దొరికినది he has got a good hold of that art. జుట్టుపట్టి సొమ్ము అడిగినాడు he caught him by the hair and insisted on payment. జుట్టుపిట్ట *n.* : A peacock. **జోట్టు పిట్టతాలుపు** an epithet of Kumaraswami. **జోట్టుబాతు** *n.* : The crested goose.

**జోట్టుపు** or **జోట్టుపాకు** *n.* : A common milk creeper with heart shaped leaves. అజశృంగి.

**జోడుగు, జోజుణుగు, చేనుగు** or **సునుగు** *v.a.* : To cheat, delude. *v.n.* : To lurk, slink, to lie in wait. దాగుకొను. To retreat వెనుకదీయు. జునుగు మాట a sly or cunning expression.

**జోత్త** *n.* : A short span; measured from the thumb to the end of the ring finger. గోకర్ణము, ప్రస్తుతాంగుష్ఠా నామికా మధ్యము. జుత్తనవ్రేలు Same as జుట్టున వ్రేలు. **జోత్తెడు** a measure of 12 inches. ద్వాదశాంగుళ ప్రమాణము.

**జోనపములు** or **జోలపాలు** *n.* : Locks of hair left just above and in front of the ears.

**జోన్ను** *n.* : Honey, తేనె. Honey comb తేనెతెట్టె. Cheese. జున్నుపలుకులు honeyed accents, sweet words. పులిజున్ను a syllabub of tiger's milk, i.e., an unobtainable luxury. తేనె, నవప్రసూతగోక్షీరము, వండినదిన్ని. జున్నుపాలు *n.* : Biestings : the milk that flows for a week after a cow has calved. ఈనిన తరువాత యేడు దినములలోగా పితికిన పాలు, జున్నుగడ్డ cheese.

**జోబ్బ** *n.* : An epaulett బాహుపురి.

**జోమలా** *n.* : The total, the sum. మొత్తము.

**జోమాయించు** *v.t.* : To hold tight. ఈడ్చిపట్టు.

**జోమాలపేరు** *n.* : A kind of necklace made of gold beads. (Vizag.)

**జోమ్మ** or **జోమ్మట** *n.* : The Weaver Bird, గిజిగాడు.

**జోమ్మడు** or **జోమ్మకాడు** *n.* : A lover, or sweetheart (in a bad sense) విటుడు.

**జోమ్ము** *n.* : A hum. జుమ్మను *v.n.* : To hum. జుమ్మని adv. Aloud : as a humming or buzzing sound.

జుమ్మనుధ్వని humming, buzzing. జుమ్మజుమ్మనన్ aloud (buzzing or humming.)

**జోరుకు** *n.* : Spirting out (as blood), a gush. జురుజురుకు adv. Gushingly.

**జోర్రు** *v.t.* : To suck up, or drink with a noise పీల్చు.

**జోలపాలు** : Same as జునపములు.

**జోలాయించు** *v.i.* : To reel, swing about, to stagger.

**జోలిమి** *n.* : Naughtiness. దుండగము.

**జోలుమానా, జోల్మానా** or **జెరిమానా** *n.* : A fine.

**జోలుము** *n.* : Force, violence; tyranny; oppression.

**జోలువ** or **జోలువతనము** *n.* : Relief, comfort.

**జోల్కి** *n.* : A wrinkle, twisting.

**జోవ్వరించు** *v.t.* : To excel. విజృంభించు.

**జోవ్వి** *n.* : The warry leafed fig tree : *Ficusinfcctoria*. తెల్లజువ్వి A tree called. ఎర్రజువ్వి, పెద్దజువ్వి, పుత్రజువ్వి, కొండజువ్వి, కుదురుజువ్వి, కొండజువ్వి also called శిలావటము or కలుజువ్వి, జువ్విదీవి *n.* : The island called Plaksha.

**జోవ్వు** *n.* : A whizzing noise.

**జూక** *n.* : Haste, flurry. తత్తరపాటు. జూకించు to be flurried. తత్తరపడు.

**జూకురు** *n.* : Grief, sorrow.

**జూజము** *n.* : Gambling, play. జూదము. Deception మోసము. జూజమాడు *v.n.* : To gamble. జూజరి *n.* : A gambler.

**జూజి** *n.* : A female messenger. దూతిక.

**జూటు** or **జూటు** *n.* : Cunning, artfulness. మోసము. జూటుగా cunningly. జూటుతనము *n.* : Cunning, craft, guile. జూటాడు to cheat మోసము చేయు.

**జూదము** *n.* : Dice-play, gambling. జూదకత్తె or జూదకత్తె *n.* : A gambling woman. జూదరి, జూజరి, జూజకాడు or జూదకాడు *n.* : A gambler.

**జూదు** *v.n.* : To burn, or to be hot. *v.a.* : To burn. To light a match. To brand with a hot iron.

**జూలు** *n.* : The mane of a lion or other animal. A cloth or blanket covering the back of any animal, a jhool.

**జూవరము** *n.* : Sorrow. సంతాపము.

**జూంపము** *n.* : A plot of grass, a grassy field : a thicket or cluster, as of bamboos. Thick matted tresses, hairiness వృక్షవిటపము, గుంపు, గుబురు. A tender twig. రెమ్మ. A constant downpour **నిరంతరధార**. *adj.* : Thick, thickset, Constant నిరంతరము.

**జూంపు** *n.* : A spring on a hill or mountain. కొండలోని ఊటనీరు.

**జూగ్గు** or **జోగు** *n.* : Alms. భిక్షము. జొగ్గెత్తు to take alms.

**జోటజోట** *adv.* : Greedily, thristily. Fast వడిగా.

**జోత్తిల్లు** or **జోత్తిలు** *v.n.* : To blush or redden, to turn red. ఎఱ్ఱపారు. To look bright రంజిల్లు. **జోత్తు** *n.* : Redness. జొత్తుపాప a newborn child. జొత్తురు *adj.* : Crimson, red.

**జోన్న** *n.* : The great millet, cholam, jowari. There are many species of this, as తోటజొన్న, ముదురు జొన్న, లోగుపెద్దజొన్న, పయిరు జొన్న, పాలాపుజొన్న, గడ్డిజొన్న, ఎఱ్ఱజొన్న. మొక్కజొన్న Indian corn, or maize. తెల్లజొన్నలు and గడ్డిజొన్నలు, కొండజొన్నలు. **జోన్ననాగు** *n.* : A species of snake.

**జోబ్బిలు** or **జోబ్బిల్లు** *v.n.* : To flow స్రవించు. To thrive, grow thickly. To be redolent, to smell of. To revel : to enjoy oneself. నిండారు. To toss about, to writhe, to wallow. To be produced. ఉప్పతిల్లు. తేనియల్ జొబ్బిలు మోవికెంపు the honey dropping lips.

**జోఱ్రీగ** : Same as జోరీగ.

**జోల్లు** or **చొల్లు** *n.* : Drivel, spittle, slaver. లాల.

**జోల్లెము** or **జోళ్లెము** *n.* : A tire, formed by weaving the tresses in chains and then coiling them up at the back of the head : a wreath of mangrove flowers.

**జోహారు, జోహారువు** or **జోహారు** *n.* : Homage, welcome, salutation, congratulation. నమస్కారము, సర్వోత్కృష్టుడవై యుండుమని మంగళము చేయడము. *interj.* : Huzza ! Hurra!

**జో** or **జోజో** *interj.* : Hush ! a word used in lulling a child to sleep. **జోకొట్టు** *v.t.* : To lull asleep.

**జోక** *n.* : Manner, way. విధము. Grandeur, fineness, bloom,prettiness బాగు, సొగసు, ఒప్పిదము. Similarity, resemblance సామ్యము. Delight ఉల్లాసము, ఉత్సాహము. Companionship, friendship జత. Whole; total మొత్తము. *adj.* : Equivalent సమానము. Proper యుక్తము. Possessed, got, obtained అధీనమైన. adv. Thus, in that manner; duly, properly. **జోకచేయు** *v.t.* : To get, earn సంపాదించు. To get ready సిద్ధపరచు. జోకపడు *v.n.* : To be obtained or got, to be joined జతపడు.

**జోకు** *v.a.* : To weigh. To lay on, to thrash or thump. కొట్టు. To abuse తిట్టు. *n.* : Abuse తిట్టడము.

**జోకొట్టు** : See under జో.

**జోగము** *n.* : Meditation, abstraction. జోగపట్టె or జోగపట్టియ *n.* : A hermit's belt. యోగపట్టము. **జోగి** (from యోగి) *n.* : A beggar. భిక్షకుడు. A vagrant. A hermit.

**జోగిది** a female rover, or a hermit. అడవి జోగులు roamers in the woods, vagrants. **జోగిణి** a certain female goddess; a witch సోదెకత్తె.

**జోగు** *n.* : Alms. భిక్షము. A boat ఏరు దాటే సాధనము. జోగురుతిరుగు to go about the town for alms. **జోగు** *v.n.* : To stagger. సొక్కు, **జోగురాలు** *n.* : A nun యోగిని. A female beggar భిక్షకురాలు.

**జోజో** *Interj.* : Hush, be still. n. A lullaby.

**జోటము** *n.* : A sheet. దుప్పటి.

**జోటి** or **జోటిక** *n.* : A damsel. ఆడుది. జోటికత్తె or జోటికత్తియ a female companion చెలికత్తె.

**జోడగి** or **జోణగి** *n.* : A bloodhound. వేటకుక్క, శోణంగి.

**జోడు** *n.* : A pair, or couple, a pair of shoes or sandals. Junction, conjunction. జోడుకోడె a match, an equal; a companion. సముడు, కూడా ఉండేవాడు. పల్లికిజోళ్లు a pair of palanquins. వాడు నాకు ఈడా జోడా is he my equal ? **జోడు కూర్చు** *v.a.* : To embrace or join. **జోడా** or **జోడీ** *n.* : A pair. **జత జోడగించు** *v.t.* : To make a horse go at a curvetting pace. జోడన నడతో నడిపించు.

**జోత, జోతము** or **జోతాము** *n.* : A salutation నమస్కారము

**జోతి** *n.* : Brilliancy కాంతి. A light or lamp దీపము.

**జోదు** *n.* : A hero. సమర్థుడు, దిట్ట.

**జోబిళ్లు** *n.* : Salutations. నమస్కారములు.

**జోము** *n.* : Torpidity, stupefaction, or silliness with pride. సొమ్మ, తిమ్మిరి. v.n. To rock backwards and forwards, as Musulmans do while reading.

**జోరావరి** n. Force, violence. బలాత్కారము.

**జోరిగాడు** or **అంబలిజోరిగాడు** A sort of lark : the thick billed or red bellied species.

**జోరీగ** (జోరు violent ఈగ. fly.) n. The gadfly or horsedy. పులిపక్క జోరీగ ఉండినమాడ్కి or సింహము పక్క జోరీగ ఉండినమాడ్కి as the gadfly is near the tiger, or the lion, i.e., safety in the lion's lap, weak in himself but mighty in his protector. ధీరాశ్రితనీరసుడు.

**జోరు** *n.* : Force. బలము, ఊతము.

**జోల** *n.* : A lullaby.

**జోలి** *n.* : A thing, concern, affair, matter, business. A topic, theme, subject, intercourse. సంగతి, వృత్తాంతము. ప్రశంస, ప్రమేయము, సంబంధము. వానిజోలికిపోవద్దు don't meddle with him. ఆజోలి యెరుగను I

know nothing of the matter. ఇది నీ జోలికాదు this is not your business. వలవని జోలి తలచుకొన్నావు you are merely building castles in the air.

**జోలె** or **జోలియ** *n.* : A pouch or bag that hangs down from the shoulder. చౌకపు గుడ్డ నాలుగంచులను జతజతగా చేర్చి ముడివేసి కుట్టి చంకను వ్రేలాడవేసికొనెడు సంచి.

**జోవ** : Same as జోల.

**జోస్యము** *n.* : Astrology. జోసి or జోస్యుడు *n.* : An astrologer.

**జోహారు** or **జోహారువు** *interj.* : Well done! Hurra! నమస్కారార్థము, సర్వోత్కర్షచేత నుండుమని మంగళము చేయుట.

**జౌకు** ro **జేవుకు** *v.n.* : To become soft or ripe. To give way or yield, to become loose, as a stake. To rot. మిక్కిలి మెత్తగిల్లు. *adj.* : Swampy. Loose. **జౌకునేల** swampy ground ఊటనేల. జౌకించు *v.n.* : To swing down to hang loosely. వ్రేలాడజేయు.

**జౌజవ్వు** or **జేవుజేవ్వు** *n.* : A rushing noise.

**జౌరు** or **జేవురు** *v.a.* : To thrash or lash. To collect any thing scattered. To stroke.

## ఝ

**ఝ** : The name of a letter of the alphabet equivalent to JH.

**ఝంకారము** or **ఝంకృతి** *n.* : The buzzing or humming noise of a bee. తుమ్మెదరొద.

**ఝంఝ** *n.* : Wind accompanied by rain. A storm వానగాలి.

**ఝంప** *n.* : A certain kind of music. జంపె (తాళము) Impudence దూకుడు.

**ఝడితీ** or **ఝడ్తీ** n. An examination of accounts, & c., **ఝడితీచిట్టా** or **ఝడ్తీజాబితా** a certificate of examination, a memorandum of search; an inventory. A rough note book. A memorandum of daily accounts. **ఝడ్తీచూచు** to examine, to review, సరిచూచు, ఉండజూచు.

**ఝరము** or **ఝరి** *n.* : A mountain stream. A waterfall or cascade. సెలయేరు, నిర్ఝరము. **ఝర్ఝము** or **ఝర్ఝరి** *n.* : A kind of drum. కయిముడి యను వాద్యవిశేషము. A flaw in a precious stone మణిదోషవిశేషము.

**ఝల్లరి** *n.* : A kind of large drum. ఒకవిధమైన పెద్దడోలు. A whirlpool. నీటిమడి.

**ఝషము** *n.* : A fish. చేప. A crocodile. మొసలి. A forest. అడవి.

**ఝషకేతుడు** one who has the sign of a fish on his flag. i.e., Manmadha.

**ఝూటము** *n.* : A crowd, a multitude. సమూహము. A thick forest. కారడవి. A hower. పొదరిల్లు. A broom. చీపురుకట్ట.

**ఝాడాగా** *adv.* : Completely, finally. బొత్తిగా.

**ఝిల్లి, ఝిల్లిక** or **ఝిరుక** *n.* : A cricket. ఈలపురుగు. The noise made by a cricket ఈలపురుగు కూత. A towel తుడిచేగుడ్డ.

**ఝూటా** or **జూటా** *adj.* : False. అబద్ధము.

## ట

**టంకము** *n.* : A piece of money : a coin : బంగారుటంకము a gold coin. A coin, of the value of 16 copper dubs. దీనారము. A composition of copper and pewter. A stonecutter's chisel. కాసెయులి. Borax : వెలిగారము. **టంకణము** or **టంకము** *n.* : Borax : subborate of soda. వెలిగారము. టంకసాల n. A mint. టంకవాటు or టంకసాలవాటు the name of a certain gold coin.

**టంకారము** or **టంకృతము** *n.* : The "twang" of a bowstring. టంకరించు to twang a bow.

**టంకు** *n.* : A civilised person. నాగరికుడు. A pretentious person డాంబికుడు. టంకుతనము *n.* : Refinement. pride. డంబము, నాణెము.

**టంగు** or **టంగువారు** *n.* : A saddle girth. గుర్రముల వీూది జీను జారకుండుటకు కట్టేవారు.

**టకటంకు** or **టకటొంకు** *n.* : A rogue. కుత్సికుడు. కుత్సితమైన.

**టకటక** *adv.* : Agitatedly. Quickly, briskly.

**టక్కు** *n.* : A trick, a pretence, guile, Gamesomeness, a prank (hence the word, Thug or assassin is derived) *v.a.* : To deceive, to pretend. దగాచేయు. **టక్కులాడి** *n.* : A deceitful woman. టక్కులుచేయునది. టక్కులాడు.

**టపా** or **టపాలు** *n.* : The post or mail, the "tappal". A station or stage. టపాలమీద పోయినాడు he travelled by post.

**టమటమ** *n.* : A drum, a tom tom, a proclamation by beat of drum.

**టముకు** or **టమ్కు** *n.* : A drum.

**టరీఫు** *n.* : Tariff. A table of import and export duties.

**టనర** or **తవర** *adj.* : Rash, headstrong, precipitate. Skilful, artful, clever. నేర్పరి. గడుసు, నెరజాణ యైన, బేరజము, ధూర్తస్త్రీ.

**టవాయి** *n.* : A foul wind, an unfavourable breeze.

**టూకానా** or **టికాణా** *n.* : A place of residence; a resort, a resource; prospect.

**టాకీ** *n.* : A stitch. టాకీవేయు to unite by stitching up, to patch.

**టాకీరాయి** *n.* : The key stone of an arch.

**టాకు** *n.* : A flat ring used to keep other rings from slipping down from the fingers. An edge, a side అంచు, ఓర. The end or point of a pen. టాకులో వస్తాడు he will come here in a moment.

**టాటోటు** *n.* : Deceit, pretence, guile. మోసము, కపటము. **టటోటుకాడు** a deceiver మోసకాడు.

**టాపు** *n.* : An island. A place. తాపు.

**టాలాటోలీతనము** *n.* : Knavery, trickery, ill-behaviour.

**టింగు** *n.* : A tinkling sound.

**టికము** *n.* : The pelvis. ముడ్డిపూస.

**టికాణా** *n.* : A trace. జాడ. టావుటికాణా లేదు. there is not the slightest trace (of him).

**టిట్టిభము** or **టిట్టిభకము** *n.* : The bird called a wagtail. ఉయ్యాలపిట్ట, కాటుకపిట్ట.

**టిప్పణము** *n.* : A brief glossary or commentary explanatory of hard passages alone. A commentary explanatory of hard passages alone. A commentary on a commentary. టీకకు టీక.

**టిర్రి** *n.* : A cry to cattle, like jee hup! which turns them to the left : the cry పప్పుప్పు turns them to the right. A term used in games, like Play ! A beast of burthen. మోసే జంతువు.

**టిసి** *n.* : A bar of wood or metal కమ్మి.

**టీక** *n.* : A commentary, notes. A practical exposition of a theme.

**టీకము** *n.* : A whetstone. ఒరగల్లు.

**టీకా** *n.* : Inoculation, small pox by inoculation. An ornament hanging down the forehead. ఒక దినుసు పతకము. టీకాలువేయు *v.n.* : To inocatale.

**టీకు** *n.* : Walking with airs. నడచుట యందలి నిక్కు.

**టీపు** *n.* : A money security given to keep the peace. మంచి నడవడికకు పూటగా కట్టిన ధనము.

**టూకి** or **టూకీ** *n.* : Brevity. సంగ్రహము. **టూకీగా** briefly. **టూకించు** *v.t.* : To abridge. సంగ్రహించు.

**టూకిచెట్టు** *n.* : A certain broadleaved tree that bears a large fruit.

**టెంక** *n.* : The stone of any fruit. మామిడి కాయ లోనగువాని విత్తు.

**టెంకణము** *n.* : A salutation. నమస్కారము.

**టెంకాయ** *n.* : A coconut. కొబ్బరి కాయ. నారికేళము. ఎళనీరుటెంకాయ a tender coconut full of water. **టెంకాయ చెట్టు తుమ్మెద** *n.* : The cocoanut tree-borer. A kind of large beetle.

**టెంకి** *n.* : A place, house, home : a covert, a den or lair. టెంకలు ఇంకిపోయినవి. the wells dried up. The fish called a ray. Various

species are described by Russell on Fishes. వాలుగ టెంకి.

**టెంకిపురుగు** *n.* : A bug with wing covers like shells, which form its టెంకి or home. టెంకె, టెంకి or టెంకియ *n.* : An awl, a borer. అరె, పిడిపాన, చర్మకారుడు రంధ్రములు చేసే సాధనము.

**టెక్కి** *n.* : A sort of cap. కుల్లాయ.

**టెక్కు** *n.* : Grace, charm, elegance. Coquettishness, coquetry, wantonness. Insolence, airs, pride. Blandishment, amorous ways. Fondling, flaunting. గర్వచేష్ట. టెక్కులు fine airs, తళుకుచెక్కుల టెక్కు the charms of her polished cheeks. టెక్కున with a grace, gracefully. **టెక్కులాడి** *n.* : A coquette. **టెక్కులు గలది.** టెక్కులాడు *n.* : A beau. టెక్కులు గలవాడు. టెక్కువ Same as టెక్కు.

**టెక్కెము** or **టెక్కియము** *n.* : A banner or flag. ధ్వజము. టెక్కెపుగాము the descending node. కేతుగ్రహము.

**టేంకణము** *n.* : The name of a certain country.

**టేకిచేప** *n.* : The skate or ray fish. అంబడిటేకి the electric torpedo టెంకి. Shagreen : a skate's skin, used in polishing.

**టేకు** or **తేకు** *n.* : The teak tree. చిరుటేకు the smatter species.

**టేవు** *n.* : A noise such as is made when anything burns. మండుట యందు కలుగు ధ్వని.

**టొంకు** *n.* : Crookedness. A dent or hollow in a stone. నిమ్నోన్నతము. The forehead. *adj.* : Crooked. టొంకు మాటలు broken words, as those of an infant.

**టొంటీలు** *n.* : A kind of earnings.

**టొంపు** or **టొకరము** *n.* : Imputation, a slander.

**టోకు** *n.* : A wholesale bargain, a lot or lump; మొత్తము. Way, manner, ఈ టోకుగా thus, so. Touching each other's shoulders in wrestling.

**టోపి** or **టోపీ** *n.* : A cap or hat. కుల్లాయ, **టోపీపెట్టు** or **టోపీవేయు** to cap or cheat a person.

**టోలీ, టోలీ** or **ఠోలీ** *n.* : Half a pie., Also, a mob or crowd (Vizag.)

## ఠ

**ఠ** *n.* : The name of a letter.

**ఠంగుఠింగు** or **టంగుటింగు** *n.* : A tinkling noise.

**ఠక్కు** Same as టక్కు. **ఠక్కుడు** *n.* : A cheat మోసకాడు.

**ఠక్కురుడు** *n.* : A god. దేవత.

**ఠరాయించు** *v.t.* : To fix, determine, settle, adjust. ఠరావు బేరీజు the fixed assessment of a village.

**ఠలాయించు** or **టలాయించు** *v.n.* : To walk about for pleasure. ఇటు అటు

తిరుగు. v.t. To make a horse walk about. గుఱ్ఱమును ఇటు అటు తిప్పు.

**ఠవఠవ** *n.* : Fatigue, exhaustion. శ్రమము. A hindrance. అడ్డంకి, ఠవఠవలేక swiftly, unweariedly.

**ఠవణించు** or **ఠవణిల్లు** *v.n.* : To be ఉండు. to redouble, as sound or brilliancy ప్రకటించు, అమరు, ఆడరు, ఒప్పు.

**ఠవణె, ఠవిణ** or **డవిణ** *n.* : A great drum. ఢంకా.

**ఠవర** *adj.* : Rash, headstrong, precipitate, Skilful, artful, clever గడుసు, నేర్పరి.

**ఠవళి** *n.* : A trick, guile, prank. హుళక్కి, మోసము, కపటము. a cheat మోసకాడు, కుత్సితుడు. ఠవళికత్తె a deceitful woman మోసకత్తె, కుత్సితురాలు.

**ఠవిణ** : Same as ఠవణె.

**ఠస్యా** *n.* : A stamp, a print, a die.

**ఠస్యా** or **టస్సా** *n.* : A proud demeanour. గర్వముగలనడవడి. ఠీవి.

**ఠాకు** *n.* : A thrust. *v.n.* : To thrust.

**ఠాకురు** *n.* : A lord, a baron, a noble. అధిపతి.

**ఠాణము** *n.* : A place, ప్రౌఢతనంబుల ఠాణము it is the very fountain of excellence, the home of beauty.

**ఠాణా** *n.* : A police station. ఠాణాదారుడు a local policeman, a station house officer.

**ఠాయము** or **ఠాయి** స్థాయి *n.* : A word (like do, re, mi.) used in the gamut. స్వరస్థాయి. ఠాయి అనిపాడు to sing in a high note; to raise up the voice, or make the notes swell out.

**ఠారు** or **టారు** *n.* : Suddeness. A sudden blow. ఆకస్మికమైన దెబ్బ **ఠారుమనడము** *n.* : Sudden death. **ఠారుఠారగు** *v.i.* : To be afraid or alarmed To be quite tired.

**ఠావు** or **తావు** *n.* : A place, house, lodging, or residence, గృహము, స్థానము. ఠావువిడిచిరి they deserted his banners. A sheet of paper. పైఠావులు enclosures in a letter.

**ఠింగణా** or **టింగణా** *n.* : A little boy, a lad. బాలుడు. A short man, a dwarf. పొట్టివాడు.

**ఠీకు** *adj.* : Proper, just, fit, complete.

**ఠీవి** *n.* : Splendour. Fashion, style, manner. వైభవము, రాజఠీవిని in noble style, royally.

**ఠేవ** *n.* : A particular mode in music. హొయలు. grandeur, fineness. ఒప్పిదము. Manner విధము.

**ఠేవణీ** *n.* : A monied security, an advance or a deposit of money.

**ఠేవనము** *n.* : Bravery ధైర్యము.

**ఠేఠె** *n.* : Words like fa, la, la, used in beating time.

**ఠోలా** or **టోలా** *n.* : A crowd, a multitude. సమూహము, తెగ.

# డ

**డంక** or **డంకా** *adj.* : Steady, firm, stubborn. దిట్ట. డంకతనము n. Steadiness, firmness, stubbornness. దిట్టతనమ్ము.

**డంకా** or **డంక** *n.* : A drum. ఢక్క.

**డంగురము** *n.* : A kind of leathern drum. చర్మవాద్య విశేషము.

**డంబము, డంబరము** or **డంబు** *n.* : grandeur, ostentation, gorgeousness. స్థితికి మించిన వేషము. Fame. ప్రతిష్ఠ.

**డక్క** or **ఢక్క** *n.* : Fear, apprehension. డక్కలేదు.

**డక్కి, ఢక్కి** or **డక్కియ** *n.* : A small drum, shaped like an hour glass డమరువు.

**డక్కు** *n.* : Apprehension, fear.

**డగర** or **డగ్గర** *n.* : A demon. పిశాచము. adj. Large, గుండు.

**డగరము** or **దగరము** *n.* : Evil. కీడు.

**డగ్గర** or **దగ్గర** *adv.* : Near. (This form is used only in poetry) **డగ్గరు, డగ్గరించు, డగ్గరించు** or **డగ్గరు** *v.n.* : to appro-ach, come near.

**దగ్గుత్తిక** *n.* : Fluttering accents, a tremulous voice The failure of the voice from dryness of the throat, caused by terror, & c గద్గదస్వరము. దగ్గుత్తికయినంతట her voice failing with anxiety.

**డప్పాటు** *n.* : Suddenness. ఆకస్మికము. దబ్బర పాటు, తొందర.

**డప్పి** : Same as దప్పి.

**డప్పు** *n.* : A large drum. డప్పువాడు. *n.* : A drummer.

**డబడబ** : Same as దబదబ.

**డబర, డబ్బర** or **దబ్బర** *n.* : A brass bowl. బోగోణి, గిన్నె.

**డబ్బర** : Same as దబ్బర.

**డబ్బా** : Same as డబ్బీ.

**డబ్బాటు** *adv.* : Suddenly. ఆకస్మికముగా.

**డబ్బి** or **డబ్బీ** *n.* : A little box : a pill box. బరిణ. A treasure chest; a poor's box, a box to hold collections. నగలడబ్బీ. a casket ఎర్రడబ్బి విత్తులు a sort of grain. పొడిడబ్బి a snuff box.

**డబ్బు** *n.* : A copper coin worth either three or four copper pies చిన్నమెత్తు రాగిముద్ర Cash, money దుడ్డు, wealth ధనము. A colour or streak. Fiction, falsehood, guile. బొంకు. Display, lavishness. **డబ్బుగల** rich. పాతడబ్బు *n.* : coin worth four pies. కొత్తడబ్బు a copper coin worth three pies, a quarter anna. ఈ చీర అంచు డబ్బుగా (or డాబుగా) నున్నది it has a streaked or rich border. *v.a.* : To make up, feign, fabricate. ఒక డబ్బుడబ్బి making up a story.

**డబ్బుర** : See డబుర.

**డమరము** *n.* : A national danger. దేశోపద్రవము.

**డమరుకము** or **డమరువు** *n.* : A rattle or small drum shaped like an hour glass. Skill చమత్కారము.

**డమాను** *n.* : A sail డమాను మాసము the sailing season. డమానుతాడు the principle rope that supports a sail season.

**డమారము, డమాయి** or **డమ్మారము** *n.* : A kettle-drum.

**డమ్మను** *v.n. Lit* : To say (dam) Oh ! To die చచ్చు.

**డయనము** *n.* : Flight in the air. A car. A palanquin. పక్షిరెక్క కదలకుండా పోవడము. A toy cart బాలకాదుల క్రీడా శకటము.

**డయ్యు** *v.n.* : To sink, to be wearied or exhausted. బలహీనముగు, అలయు, డస్సిన exhausted, faint. డయ్యక. untiringly అలయిక.

**డలాయతు** *n.* : A messenger, a retainer, a peon.

**డల్లీ** or **ఢల్లీ** *n.* : A lump.

**డవాలీ** *n.* : a peon's belt or badge.

**డవిణ** : Same as డంక.

**డా** *adj.* : Left ఎడమ, డాకాలు the left leg; డాకన్ను the left eye; డామూపు the left shoulder.

**డాండరవము** *n.* : The sound of drumming.

**డాంబరము** *n.* : War. క్షామడాంబరములలో in times of famine or of war.

**డాంబికము** *n.* : Pretence, pride. **డాంబికుడు** *n.* : A proud of conceited person. A magician. ఇంద్రజాలాదిమాయలు చేయువాడు.

**డాక** *n.* : Greatness, splendour, విజృంభణము. Courage, heroism. శౌర్యము.

**డాకడ** *n.* : The left side. ఎడమ పార్శ్వము. the north ఉత్తరపుదిక్కు.

**డాకన్ను** *n.* : the left eye; a side glance.

**డాకలి** : Same as డాకలి.

**డాకల్లు** : Same as డాకల్లు.

**డాకిని** *n.* : An ogre or female imp. పిశాచస్త్రీ శాకినిడాకినులు fairies and elves, sprites and goblins.

**డాకురు** *v.t.* : To thrust out, project (as the legs.) కాళ్లు తేలగిల వేయు.

**డాకేలు** *n.* : The left hand.

**డాకొను** or **డాకొను** *v.a.* : To touch తాకు. To get ready సిద్ధపడు. డాకొలుపు causal of డాకొను.

**డాగరా** *n.* : A large winnowing basket.

**డాగిలిమ్రుచ్చులు, డాగనమ్రుచ్చులు** or **డాగిలిమూతలు** *n.* : A game called Hide and seek. దాగిలిమూతలు.

**డాగు** *n.* : A mark. గురుతు. a stain. మరక.

**డాగు** or **డాగురించు** *v.n.* : To hide or lie hid. **దాగి ఉండు.** *v.a.* : To hide దాచు. To delude, to tempt. వంచించు. డాచు or దాచు *v.a.* : To hide or conceal, to veil.

**డాచెయ్యి** *n.* : The left hand.

**డాత్ఫ్యూటము** *n.* : A sort of bitter fish. చేదుచేప.

**డాపల** or **దాపల** *n.* : The left side. ఎడమభాగము adj. Left, on the left hand. *adv.* : On the left hand. **దాపలిసున్న** the sunna on the left hand of a letter, that is, preceeding it. **డాపలి.** *adj.* : Sinister, on the left hand. **డాపలికేల** on the left hand.

**డాపలించు** *v.n.* : To go round. ప్రదక్షిణమగు.

**డాపు** or **దాపు** *n.* : Nearness.

**డాబ** *n.* : A small kind of quail. A belt. జందెమువలె వేసుకొనే తోలుపట్టె.

**డాబా** *n.* : The cornice of a pillar, the projecting gallery round the top of a tower; the crest of a bastion. బోడిమిద్దె, ఉన్నతముగా కట్టబడ్డ గృహవిశేషము, A terraced roof, opposed to a pent roof.

**డాబు** *n.* : Pomp. డంబము. A list or catelogue; a physician's recipe దినుసుల పట్టిక.

**డామరము** : Same as డమరము.

**డాయు** *v.n.* : To approach సమీపించు.

**డాలు** *n.* : Brilliancy, lustre of complexion, prettiness, a shield. A banner, a flag. గురుతు, శూరత్వము, కాంతి, అందము, టెక్కెము. డాలువారు same as డాలు a shield డాలుకాడు a standard bearer.

**డింకవేయు** *v.n.* : To die చచ్చు.

**డింకి** or **డింకీ** *n.* : A fall in wrestling. A summersault, a feat in gymnastics wherein two players roll themselves up together into a ball.

**డింకు** *v.n.* : To die. చచ్చు.

**డింగ** *n.* : A vessel పాత్రము. లోహపు డింగలు metal vessels లోహపు పాత్రములు.

**డింగరీడు** or **డింగకుడు** *n.* : A slave దాసుడు A servant సేవకుడు a devotee భక్తుడు.

**డింగిళ్లు** *n.* : Salutations నమస్కార విశేషము.

**డించు** or **దించు** *v.a.* : To let down, to leave, give up or abandon to free, release, let go.

**డిండిమము** *n.* : A small drum. ఢమామా, రాయడిగిడిగిడి.

**డిండీరము** *n.* : Froth foam నురుగు.

**డిందు** *v.n.* : To sink. అడుగు, క్రుంగు. To dry up ఇంకు. To be defeated, ruined, quenched, extinguished. ఓడిపోవు. To expire. *v.a.* : To kill, to ruin. *n.* : Defeat, extinguishment, ruin. అధఃకరణము, హీనత్వము, నాశము. *adj.* : Defeated, worsted, ruined, less, inferior. **డిందుపరచు** *v.a.* : To defeat, ruin, do away with, remove.

**డింపు** or **దింపు** *n.* : Misery. దీనత్వము.

**డింబము** *n.* : A bag of skin. ఎమ్ముల డింబము. a bag of bones. A

starveling Danger ఉపద్రవము. Fear భయము.

**డింభము** *n.* : An infant. పిల్ల డింభుడు *n.* : A little boy.

**డిక్కీ** *n.* : A blow with the head. తలతో కొట్టుట.

**డిగియ** : Same as డిగ్గియ.

**డిగు** or **దిగు** *v.n.* : To alight, to get down. To alight from, to dismount.

**డిగ్గ** *adv.* : (the inf. of డిగ్గు) at once, instantly.

**డిగ్గి** *n.* : Five అగ్ని.

**డిగ్గియ** or **డిగియ** *n.* : A long pond : a well with steps descending into it. దీర్ఘిక, బొడ్డనబావి, నడబావి.

**డిగ్గు** *v.n.* : To alight, get down. దిగు. *n.* : Littleness తక్కువ.

**డిగ్గున** or **దిగ్గున** *adv.* : Suddenly, at once.

**డిగ్గుపడు** *v.n.* : To become less. తక్కువపడు.

**డిప్పకాయ** *n.* : A sort of large gourd used as a bottle.

**డిబ్బెము** *n.* : A fold of cloth, కడితము. A prayer, an offering or gift to the poor.

**డిమ్మరి** : Same as దిమ్మరి.

**డిల్లపడు, డీలాపడు** or **డిల్లపోవు** *v.n.* : To be horrified, astounded, unmanned, unnerved. వితాకుపడు, భయాదులచేత సత్వహీనమగు. **డిల్ల పాటు** *n.* : Horror. డిల్లము *n.* : Enervation. సత్వహీనము.

**డీ** or **ఢీఢీ** *n.* : A cry like Hurra ! hazza! avaunt !

**డీకు** *n.* : Encouragement ప్రేరేపణ.

**డీకొను** (డీ + కొను.) *v.n.* : To meet, as two rams in fighting. To butt. To collide. To defy, to bluster or talk big, to cry out upon. *v.a.* : To encourage, పురికొలుపు. To cause to fall on each other కవ్వించు. **డీకోలు** *n.* : Collision. డీకొనుట.

**డీనము** *n.* : Flight, flying. మీదికెగురుట, రెక్క కదలకుండా పక్షి ఆకాశములో పోవడము.

**డీలు** or **డీలైన** *adj.* : Loose, lean, thin. కృశించిన, చిక్కిన. డీలించు to loosen, సడలించు, డీలజేయు.

**డీలు** or **డీలుపడు** *v.n.* : To be upset. ఢిల్లపడు. **డీలుపాటు** *n.* : The act of being upset or done up. డీలుపడుట.

**డు** : The sign of the first case in some nouns as రాముడు. The sign of the third person in verbs as రాడు. The sign of concession in verbs అనంత ర్యార్థక ప్రత్యయము as కొట్టుడు.

**డుండుకము** *adj.* : Mean. అల్పమైన. Cruel. క్రూరమైన.

**డుండుభము** *n.* : A griphon, a two headed snake. రెండు తలల పాము.

**డుక్కు** *v.n.* : To be hidden. మరుగుపడు.

**డుబాయించు** *v.t.* : To ruin.

**డబుడక్క** *n.* : A small rattling drum. డుబుడక్కలవాడు or బుడబుడక్కల

వాడు *n.* : A mountebank or wizard who uses a drum as a sign of his trade.

**డుయ్యు** or **దుయ్యు** *v.n.* : To retire, to retreat, v.n. To open or unfold a cloth or manuscript. To draw a sword. To pierce.

**డుర్రు** : An interjection similar to Huzza, avaunt. డుర్రుచ్చు to cry Huzza. డుర్రుచ్చి *n.* : A warcry, a challenge. యుద్ధాహ్వానము.

**డుల్లు** *v.n.* : To fall off, as moulting feathers, or withered leaves. though the stars fall. పండ్లునుడుల్లె his teeth fell out. డుల్లపొడుచు to knock down. రాలుచు. **డులుచు** or **డుల్చు** *v.t.* : To loosen, knock out, slay. వదిలించు, పతనముచేయు. **డులుపు** *v.a.* : To cause to fall, to deprive of. విసర్జింపజేయు.

**డూలాము** : Same as దూయు.

**డెందము** *n.* : The heart, mind. హృదయము, మనసు.

**డెక్క** *n.* : A hoof, a fin, a crab's claw.

**డెక్కు** *v.a.* : To strike, smite; to hinder, arrest. అడ్డగించు, నివారించు, అటకాయించు.

**డెక్కొను** *v.n.* : To be fixed firmly. నెలకొను.

**డెప్ప** *n.* : A flat place on a hill. కొండ మీది సమమైన చోటు.

**డెప్పరము** or **దెప్పరము** *n.* : A strait, peril. ఆపద. *adj.* : Impossible, impracticable. అశక్యము. Great, excessive, అధికము, మెండు Intolerable దుస్సహము. దెప్పరపురాళ్ల వర్షము a dreadful shower of stones. **డెప్పరించు** *v.n.* : To become impossible. అశక్యమగు.

**డెప్పు** : Same as దెప్పు.

**డెబ్బది, డెబ్బయి** or **డబ్బై** *n.* : Seventy.

**డేగ** *n.* : A hawk, a falcon. A falconer or huntsman. కోకిల డేగ the cuckoo Hawk. Jerdon. పెద్దవేష్టమడేగ *n.* : Hawking : sport, play. పెండ్లిలో అయిదోనాడు చేసే ఉత్సవము.

**డేరా** *n.* : a tent. గుడారము.

**డొంక** *n.* : A coppice, a copse, a thicket, a waste. Bramble, bushes. A narrow path between two fields left as a passage for cattle. పొద, పశువులదారి. **డొంకనల్లంచి** or పొదనల్లంచి *n.* : The Shama.

**డొంకియ** *n.* : A foot path.

**డొంకు** *v.n.* : To lie hidden : to hide or disappear, to shrink or retreat. అడుగు. To dry up. ఇంకు, ఎండిపోవు

**డొంకెన** *n.* : A pruning hook. దోటి, వంకర అలుగుగల ఈటె.

**డొంగు** *n.* : A hollow in a tree. చెట్టులోని తొర్ర. *v.n.* : To hide. దాగ.

**డొంకెన** *n.* : A pruning hook. దోటి, వంకర అలుగు గల ఈటె.

**డొంగు** *n.* : A hollow in a tree. చెట్టులోని తొర్ర. *v.n.* : To hide దాగు.

**డొకారము** *n.* : The interior లోను. The space between the earth and sky అంతరాళము. డొకారముచొచ్చు to fall within లోపడు, లోనగు.

**డొక్క** *n.* : The flanks. The sides. The belly. The peel, husk, as the hard cocoanut coir.

**డొక్కరము** *n.* : A kind of wrestling మల్ల బంధ విశేషము.

**డొక్కు** *v.n.* : To perish, die. చచ్చు. To grow old ముదియు. *adj.* : Old ముదిసిన, డొక్కుపడు *v.n.* : To be sallow, sunken eyed or pallid.

**డొగరు** *n.* : A fault, transgression. అపరాధము. Blame, censure నింద.

**డొప్ప** : Same as దొప్ప.

**డొలుచు** or **డొల్చు** *v.n.* : To tumble head over heels as dancing girls do. డొల్లజేయు.

**డొల్ల** or **డొల్ల** *n.* : A hamper or long basket placed on a cart. A straw band or withe to bind stacks with. The skeleton of a beast. A lie or falsehood. adj. Hollow, concave.

**డొల్లు, దొల్లు** or **దొరలు** *v.n.* : To fall, to roll over. పడు, పొరలు.

**డోకడా** *n.* : A cent; one hundredth part of a coin. నూరవ పాలు.

**డోకు** *v.n.* To vomit. *n.* : Vomiting. Nausea, qualm. **డోక్కొను** *v.n.* : To be queasy or qualmish. డోక్కొన్న ముఖముగల haggard, grim, gaunt with leanness.

**డోగు** or **దోగు** *v.n.* : To crawl on the hands and knees.

**డోరము** : Same as తోరము.

**డోరములు** *n.* : Streaks on a sword. కత్తిమీది చారలు.

**డోల** or **డోలి** *n.* : A swing cot. డోలీ *n.* : A litter. తొట్ల. డోలనము *n.* : Swinging. ఊచుట.

**డోలు** *n.* : A drum.

**డౌలు** or **డవులు** *n.* : Pomp. దంభము. An estimate మదింపు. Demand or collection of revenue by the Government : డవులుదారు an appraiser. డవులుపట్టీ an account of the estimate of each farmer's produce.

## ఢ

**ఢ** : The letter dh as in hard-hap, pronounced as a palatal.

**ఢక్క** or **ఢక్కా** *n.* : A large drum. డంకా. ఢక్కా నినాదము the sound of a drum.

**ఢక్కా** ro **ఢక్కు** n. A severe blow. పడవ ఢక్కాతిన్నది the boat received a severe blow.

**ఢమంఢమ** *adv.* : Bang ! crashingly, thunderingly. **ఢమఢమార్భటి** n. A bellowing or crashing sound.

**ఢమ్మను** *v.n. Lit.* : To say (dham) Oh ! To die. చచ్చు.

**ఢాక** *n.* : Violence. ఔద్ధత్యము. An inroad, invasion. A difficulty. గాలిఢాక

a gust of wind. ఢాకచేయు to invade, rush in upon. ఢాకావాండ్లు *n.* : Highwaymen.

**ఢామ్మను** : Same as ఢమ్మను.

**ఢుండి** *n.* : A name of Ganesa. గణేశుడు.

**ఢులి** *n.* : A female tortoise. ఆడుతాబేలు.

**ఢోకా** *n.* : An attack, an assault, Fear, apprehension. An injury, a defect, an impediment. See ఢాక.

**ఢోకి** or **ఢోకిపిడత** *n.* : A ladle formed of half a cocoanut shell.

**డోలము** *n.* : A drum. డోలు.

## త

**తంకర** *n.* : Inferior or useless grain. తుచ్ఛధాన్యము.

**తంగేడు** or **తంగెడు** *n.* : The Tanner's *Cassia*. నేల తంగేడు Ground *Cassia* or Senna. అడివి తంగేడు the wild species used in tanning. పయిడి తంగేడు the yellow flowering species, See కసింద (Watts.) సీమ తంగేడు the flower called Peacock's Pride.

**తంటా** or **తంట** *n.* : Trouble. శ్రమము. A quarrel కలహము, పేచీ. Evil కీడు Deceit మోసము. Slander, a false report చాడీ.

**తంటెము** ro **తంటియము** *n.* : A medicinal shrub. దద్రుఘ్నము, ప్రపున్నాటము, నీలి గూనలో వేసే విత్తులచెట్టు.

**తండ** *n.* : The bottom of a ship.

**తండము** *n.* : An assembly, a collection, mass, quantity. కలువతండము a bed of lilies. మృగతండము a herd of cattle, & c. తండములు crowds, swarms, abundance. కొల్లలు, సమృద్ధి. **తండతండముగా, తండోపతండములు** *n.* : Crowds upon crowds.

**తండసము** *n.* : Tweezers for pulling out hairs. మంగలవాడు వెంట్రుకలు తీసే పనిముట్టు. ఎలుగుబంటికి తంటసపుపని a task as endless as pulling out a bear's hairs. A forge కమ్మరకొలిమి.

**తండా** *n.* : A caravan, horde, troop, encampment. A collection of men or things. సమూహము.

**తండు** *n.* : The broad part or beazle of a ring. *v.n.* : To ask for the payment of a debt. To collect or raise money. **తండుకోల** *n.* : An oar. A spear used in killing fish. చేపలను పొడిచే చిల్లకోల.

**తండులము** *n.* : Rice. బియ్యము.

**తండువు** *n.* : An oar. తెడ్డుకొయ్య.

**తండేలు** or **తండెలు** *n.* : The headman among sailors. A tindale or headman ఓడపెత్తనగాడు.

**తండ్రి** *n.* : తెచ్చువాడు. పెత్తండ్రి (పెద్ద + తండ్రి) a father's elder brother. పినతండ్రి a father's younger brother.

**తంతన్యమాన** *adj.* : Grown, mature. పరిపక్వమైన.

**తంతి** *n.* : The wire or string of a musical instrument, a wire. కమ్మి, తీగె. **తంతికురుపు** or నారిపుండు *n.* : Guinea worm. తంతివాద్యము *n.* : A stringed instrument.

**తంతు** *n.* : Craft, cunning, subtlety, a device, shift. తంత్రము, ఉపాయము.

**తంతువు** *n.* : A thread or fibre. నూలి పోగు. తంతుకాష్ఠము a spindle నూలు వడికే కదురు. **తంతుకీటము** a silkworm పట్టుపురుగు. **తంతునాగము** *n.* : A polypus or marine serpent supposed to entangle and drown swimmers.

**తంతెలు** or **తంతియులు** *n.* : The divisions or bridges in the neck of a guitar, steps. మెట్లు.

**తంత్రకము** *n.* : A web, a piece of new cloth. కొత్తబట్ట.

**తంత్రము** *n.* : A device, contrivance. ఉపాయము. A theory, system సిద్ధాంతము. Scheme, plan invention. An art.

**తండన** *adj.* : Lazy, indolent. తందనము or తందనపదములు *n.* : Wretched drawling music. తందనతాన or తందానతాన words used in beating time.

**తందర** *n.* : Hesitation, perplexity, confusion, trembling. Drowsiness, కునికిపాటు. Lassitude, exhaustion, అలసట.

**తంపటి** *n.* : A bonfire : a great blaze.

**తంపర** *n.* : A cluster of lotuses. తామర గుంపు. తామరతంపర blooming or basking like a flower.

**తంపటి** *n.* : A bonfire : a great blaze.

**తంపర** *n.* : A cluster of lotuses. తామర గుంపు. తామరతంపర blooming or basking like a flower.

**తంపి** *n.* : A fire pit, used for boiling water. దాలిగుంట. a quarrel or squabble. కలహము, **తంపిపెట్టు** *v.n.* : To make a slow fire. To create a quarrel. వానికి వీనికి తంపిపెట్టినాడు he made them quarrel.

**తంబ** *n.* : The swordbean.

**తంబళ, తంబళవాడు** or **తంబళి** *n.* : A caste of Saivite priests.

**తంబు** *n.* : A younger brother. తమ్ముడు.

**తంబుగ** *n.* : A small brass water pot in the shape of a truncated cone.

**తంబుర** or **తంబురా** *n.* : A kind of stringed instrument like the guitar. A tamborine.

**తకతక** *n.* : A ringing sound adv. Aloud, tremulously, strongly. **తకతక తాళము, తకతాళము** the action of keeping or beating time in music.

**తకపిక** *adv.* : Wildly, loosely, at random. **తకపికలాడు** *v.n.* : To dance about, to dangle.

**తకరారు** *n.* : A dispute, an altercation. జగడము.

**తకావీ** *n.* : An advance of money, given for the purpose of cultivation. వారకము.

**తక్క** *adv.* : Except, save, but. తప్ప.

**తక్కటి** *n.* : A lamp with three spouts. *adj.* : (from తక్కు) Remaining తక్కిన, మిగిలిన, శేషించిన.

**తక్కరి** *n.* : A rogue, a deceiver, టక్కరి.

**తక్కలపడు** *n.* : To be in trouble. తారుమారుపడు.

**తక్కిడి** *n.* : A lie. Deceit. మోసము. **తక్కిడికాడు** *n.* : A cheat. మోసకాడు.

**తక్కిన** *adj.* : Remaining as a residue. **తక్కినవారు** the rest, the others. తక్కినది the rest.

**తక్కిలి** *n.* : The yellow myrobalan. The tomato plant. తక్కిలి కాయి a tomato.

**తక్కిసము** *n.* : A subscription raised among the ryots to defray the village expenses.

**తక్కు** *v.n.* : To miss, to fail. తప్పు. అట్లుచేయింప తక్కితేని if I fail to effect this. *v.a.* : To leave, let go, loose. విసర్జించు, వదిలిపెట్టు.

**తక్కువ** *n.* : A want, deficiency, defect; inferiority, baseness. లోతక్కువ the balance or remaining sums of money. **తక్కువపడు** *v.n.* : To be wanting, to be deficient, to be insufficient. కొరతపడు, **తక్కువపాటు** *n.* : Want, deficiency.

**తక్కె** *n.* : A weight of two viss. రెండు వీసెల యెత్తు.

**తక్కెడ** *n.* : A pair of scales, a balance, a weighing machine.

**తక్కొను** *v.n.* : To undertake. పూనుకొను.

**తక్కోలము** *n.* : The name of a certain plant.

**తక్రము** *n.* : Buttermilk diluted with water. మజ్జిగ.

**తక్షకుడు** *n.* : The name of a mythological serpent ఒక సర్పరాజు The name of a race of men called Tahshakas. A capenter వడ్లవాడు.

**తగటు** *n.* : Lace. జరీ, సరిగ. తగటుచీర a lace cloth. తగటి or తగటీ adj. Laced సరిగగల.

**తగడు** *n.* : A plate or flat piece of metal. Gold leaf, brocade. రేకు, చీనాతగడు a tin plate.

**తగర** *n.* : A rogue, a deceiver. A tree called నందివర్ధనపు చెట్టు. See కసింద. తగిరిసచెట్టు The oval-leaved *Cassia.*

**తగరము** *n.* : Tin. తగరపు పెట్టె a tin box.

**తగరిసె, తగిరిసె** or **తగర్చె** : Same as తగరచెట్టు. See uder తగర.

**తగరు** *n.* : A ram. పొట్టేసలు. తగరు రవుతు the god of fire. అగ్ని.

**తగవు** (from తగు.) *n.* : Justice, virtue, uprightness. ధర్మము, న్యాయము. Also, presents given to a daughter

by her parents when she is married. A dispute జగడము. A lawsuit వ్యాజ్యెము.

**తగాదా** *n.* : A quarrel. Dunning for payment of money.

**తగిరిస** *n.* : See under తగర.

**తగిలించు** *v.a.* : To apply (paint, a bandage, punishment, a rule, the law & c.) To fasten (a bolt, & c.) To inflict (pain) To attach, fix, insert, lock, bolt, hang on, stick into, అగ్నితగిలించు to set fire. సంకిళ్లు తగిలించుకున్నాడు he put on fetters.

**తగు** *v.n.* : To be fit. or proper, to suit or agree, suffice, యుక్తమగు. తగిన or తగ్గ, fit, proper, moderate.

**తగులము, తగులాటము** or **తగులు** *n.* : Connection. సంబంధము. Desire, lust. ఆసక్తి, వలపు, జంఝాటము. A check, hindrance. అడ్డపాటు.

**తగులు** *v.a. & n.* : To happen, occur, turn up, appear. To belong to. appertain to, to come in contact with, to touch, hit, strike. To be caught; got, found, joined.

**తగులబడు** *v.n.* : To burn or be set on fire. ఇల్లు తగలబడ్డది the house was burnt. **తగలబెట్టు** or **తగులబెట్టు** v.a. To set fire to, to kindle, to burn.

**తగ్గు** *v.n.* : To become less, to decrease, diminish fall (in price,) abate, తక్కువగు. To go back, withdraw, retire, వెనుకకు తీయు. **తగ్గుమొగ్గులు** *n.* : Ups and downs.

**తచ్చు** *n.* : A joke, a lie.

**తచ్చన** *n.* : Sport, play. jesting, a joke, slander, lying, mis. representation, coaxing, feigning. కపటము, పరిహాసము, చాతుర్యపు మాట, చేష్ట. **తచ్చాడు** *v.n.* : To walk about. సంచరించు.

**తటక** or **తటకా** *n.* : Stunning. నిశ్చేష్టత. Surprise. ఆశ్చర్యము. తటకపడు or **తటకాపడు** *v.n.* : To be surprised. **తటకపాటు** *n.* : Surprise.

**తటతట** *adv.* : Violently, loudly.

**తటమట** or **తటవట** *n.* : Deceit, cheating. మోసము, తటవటమాటలు deceitful words. తటమటించు or **తటవటించు** *v.a.* : To swindle, to cheat, to deceive మోసపుచ్చు.

**తటము** *n.* : A place. ప్రదేశము. Shore, bank ఏటిఒడ్డు. A valley కొండ చరియ. నిటలతటమున in his forehead.

**తటస్థము** *adj.* : Present, near, at hand, proximate, approaching, next, impending, imminent.

**తటాకము** *n.* : A tank, reservoir, pond, pool. తటాకముగానుండే నీళ్లు a pond or well that never dries.

**తటాయించు** *v.t.* : To obstruct. అడ్డగించు. To prevent నివారించు.

**తటారించు** *v.a.* : To rub, handle, feel, finger.

**తటాలు** *n.* : Suddenness. ఆకస్మికము. **తటాలున** or **తటాన** *adv.* : All at once, suddenly, abruptly. **తటాన పాటుగా** *adv.* : Suddenly, unexpectedly.

**తటి** *n.* : A bank, side, edge. దరి, ఏటిఒడ్డు. Place, district, region, ప్రదేశము.

**తటిత్** or **తటిత్తు** *n.* : Lightning. మెరుపు. తటిత్వంతము or **తటిత్వతి** *n.* : A cloud. మేఘము.

**తటిని** *n.* : A river. నది. A stream. ఏరు.

**తటుకు** or **తటుక్కు** *n.* : A pat or tap. adj. Swagging, flabby. **తటుక్కున, తటుకున** or **తడుకున** *adv.* : Suddenly, all at once, in a moment. తటాలున.

**తట్ట** *n.* : A flat thing of any sort, a metal plate used as an ornament. తబుకు. A flat hamper for drying grain. పళ్లిక.

**తట్టడి, తట్టు** or **తట్టువ** *n.* : A small horse, a pony. తేజి.

**తట్టము** *n.* : A leather thong, a belt టంగువారు.

**తట్టమ్మ** *n.* : Chicken pox. తట్టు.

**తట్టస** *n.* : Courage. ధైర్యము.

**తట్టాడు** *v.n.* : To toss or fluctuate, to totter అడుగులు ఇట్టట్టుపెట్టు.

**తట్టి** *n.* : A metal platter. కంచము. A hurdle or screen తడిక.

**తట్టు** *v.n.* : To occur or happen, to break out. కలుగు. నాకు సంశయము తట్టినది a doubt occurred to me. అది నామనసుకు తట్టలేదు it did not occur to my mind.

**తట్లాట** *n.* : A squabble.

**తట్టుముట్టు** or **తట్టుముట్టు** *n.* : Things, utensils, furniture, tools, household stuff. తట్టుముట్టాడు to surround (as poverty) చుట్టుకొను.

**తట్టువ** or **తట్టువము** *n.* : A country bred pony. తట్టు.

**తట్రపువాడు** *n.* : A goldsmith.

**తడ** *n.* : A check, a hindrance. అడ్డి. A charm, a spell. తంత్రము. Nearness. కడ. దానికి తడలేదు nothing can prevent it.

**తడక** or **తడిక** *n.* : A framework, a screen, a hurdle, what is called a tatty A gate made of open bars, a mat used as a door.

**తడకట్టు** *v.t.* : To bewitch, charm. To stop by charms. అడ్డగించు. To prove or verify a pair of scales.

**తడగము** : See తణగము.

**తడప** *n.* : A withe or strip of bark, & c., Peel, rind. పట్టగానుండే నార. నడితడప the thick part of a palm branch.

**తడబడు** *v.n.* : To be troubled or confused. To fail. తొట్రుపడు. To quiver చలించు. తడబాటు or **తడమాటు** *n.* : Confusion, irresolution, fluctuation. Fidgetting, Fribbling.

**తడయు** *v.n.* : To loiter or delay. ఆలస్యము చేయు. **తడయక** without delay, at once, rapidly.

**తడవ** *n.* : Time. మారు, ఆవృత్తి. ఒకతడవ once. కొంతతడవ sometime.

**తడవాటు** *n.* : Trouble, confusion.

**తడవు** *n.* : Delay. ఆలస్యము. A while, period or space of time. కొంత కాలము. రేయి తడవుగజరిగె the night passed slowly. ఎంతతడవు how long a time.

**తడవు** *v.a.* : and *n.* : To touch. feel, handle, stroke, grope. To search about. వెదకు.

**తడి** *n.* : Damp, moisture. తేమ. Water నీరు. తడిపొడి slightly wet. **తడిపడు** *v.n.* : To be moist. తడియొత్తు.

**తడిక** or **తడికె** : Same as తడక.

**తడుము** *v.t.* : To grope. తడవులాడు. To pat **నిమురు.** *v.n.* : To think or consider. ఆలోచించు.

**తణగము, తడగము** or **తణగాము** *n.* : A leather bag for water carried on bullocks. **తణగామెద్దు** *n.* : A bullock which bears water in a leather bag.

**తత్** *pron.* : That, the same. తత్పూర్వము before that, beforehand. తక్షణము or తక్షణము instantly, at that moment తత్సమీపము near, close by. తత్సంవత్సరము the same year.

**తతగము** *n.* : Wind. వాయువు.

**తతము** *n.* : Any stringed musical instrument. **వీణెలోనగు వాద్యము.** *adj.* : Spread, diffused, expanded, stretched, extended. **తతరతి** *n.* : Insatiable or excessive pleasure. తతరతిమ్రొక్కి delightedly saluting him.

**తతి** *n.* : Season, proper time. సమయము. *n.* : A multitude or crowd, a great number, a collection, a line, row or range. సమూహము. మిత్రతతి a host of friends, the circle of one's acquaintance.

**తత్తడి** *n.* : A horse గుర్రము.

**తత్తబడ** *n.* : A retinue. పరివారము.

**తత్తర** or **తత్తరము** (తర + తర) *n.* : Perplexity, embarrassment, agitation, violent emotion, shuddering, shrinking. సంభ్రమము.

**తత్తెర** *n.* : A leathern vessel in which spirituous liquors are poured. సారాయిపోసె మానిముంత లేక తిత్తి.

**తత్పరుడు** *n.* : One who is diligent, intent, heedful, assiduous. or bent upon doing anything. ఆశగలవాడు. తత్పరము *adj.* : Diligent. **తత్పరత** or **తత్పరత్వము** *n.* : Inclination, bent, devotedness, diligence.

**తత్రత్యము** *adj.* : Of that place. అక్కడ నున్న, అక్కడ కలిగిన.

**తత్వము** *n.* : The real nature of a thing, the essential nature of any thing. స్వభావము. Any living being, or

essence. Any element or elementary property. Truth, reality. A first principle. An axiom. **తత్వజ్ఞుడు** *n.* : He who knows the truth, a philosopher. తత్వయోగి *n.* : The perfected saint, as being one with God.

**తత్సమము** *adj. Lit* : Equivalent to that. A term in Telugu etymology used to denote words borrowed from Sanskrit, but with the termination altered, as రాజ్యము for రాజ్యం. See on తద్భవము.

**తథాగతుడు** *n.* : An epithet of Buddha. బుద్ధుడు.

**తథాస్తు** *Interj.* : So be it ! Amen !

**తథ్యము** *n.* : Truth, fact. సత్యము. adj. True, real, actual. సత్యమైన. తథ్యమయినది it turned out true. **తథ్యముగా** *adv.* : In fact; really.

**తదనంతరము** *adv.* : Afterwards. Thereafter, then, subsequently. తదనంతరకర్త the next heir, the heir presumptive.

**తదా** *adv.* : Then. అప్పుడు. **తదాత్వము** *n.* : That time. ఆకాలము.

**తదారభ్య** *adv.* : Thenceforward, since that (time.)

**తది, ఘట, తక్కు** or **ధిక్కు** *n.* : Sounds or words used by dancing - masters in keeping time.

**తదియ** (తృతీయ.) *n.* : The third day in the light or dark fortnight.

**తదీయ** *adj.* : His, her, its, తదీయమైన appertaining to it.

**తదేక** (తత్ + ఏక.) *adj.* : Fixed, uniform. వాడు తదేక నిష్ఠగానుండెను he was bent upon doing it, he fixed his undivided attention on it.

**తద్గుణము** *n. Lit.* : That quality. The peculiarity or characteristic of an individual.

**తద్ద** *n.* : "Papa" - a child's word for father.

**తద్ద** or **తద్దయు** *adv.* : Much, exceedingly. మిక్కిలి, విస్తారము, అత్యంతము.

**తద్దినము** *n. Lit.* : "That day", i.e., a commemoration anniversary, or annual mourning for deceased persons. తద్దినముకొని తెచ్చుకొను (proverb) to run one's head against a wall.

**తద్దె** *n.* : A ceremony or feast. పండుగ, as ఉట్లతద్దె, అట్లతద్దె.

**తద్ధర్మము** *n. Lit.* : That right, the law, that custom. The aorist of a verb. భూత భవిష్యత్తు వర్తమానములను చెప్పే క్రియ.

**తద్భవము** *n. Lit.* : Proceeding (or corrupted) from Sanskrit, a term applied to Telugu words which are borrowed from Sanskrit, but greatly changed in spelling as జక్కు for యక్ష.

**తద్రూపము** *Lit.* : That (very) form. *adv.*: Exactly, as it was. ఆ పటమును

తద్రూపముగా వ్రాసినాడు he drew the portrait to the life.

**తద్వారా** *adv.* : Thereby, Through that channel.

**తన** *adj.* : Own, his, her, my. See తాను of which this is the genitive. తనచేతనైనంతదూరి he reviled them to the utmost in his power. **తనదు** *adj.* : Own. His, her. See తన.

**తనకలి** *n.* : A tangle. చిక్కు. **తనకలి కొప్పు**. a tangled knot of hair. A difficulty, puzzle. చిక్కు, సంకటము. One who creates difficulties. చిక్కులబెట్టువాడు.

**తనంత** or **తనంతట** (తన + అంత) *adv.* : Of himself. Voluntarily.

**తనకా** or **తనఖా** *n.* : A mortgage. **తనకాపత్రము** a mortgage deed. Also, an assignment on the revenue.

**తనకుచెట్టు** *n.* : A species of the sandal tree. Floats (catamarans) are made of its wood.

**తనకు** or **తనుకు** *v.n.* : To sink, fail. To tremble. తనకక not enduring it, not tolerating it. తనకెడుచిత్తము a trembling, sinking heart.

**తనము** : An affix, added to many nouns and adjectives to give them an abstract or a collective force like త్వం in Sanskrit words, and ness, tion, ment in English words, thus : దొరతనము government, దండితనము greatness, మంచితనము goodness.

**తనయ** *n.* : A daughter. కూతురు.

**తనయుడు** *n.* : A son. కొడుకు.

**తనరు, తనరుచు** or **తనర్చు** *v.n.* : To appear or shine. To extend; to be great or large. To be, live, exist. ఒప్పు, అతిశయించు, విజృంభించు. **తనరుపు** or **తనర్పు** *n.* : Length, extent, Altitude. పొడుగు. ఉన్నతము. breadth వెడల్పు. Greatness గొప్పతనము, అతిశయము.

**తనాబీ** or **తనాబి** *n.* : A log of wood. A large beam.

**తని** *adj.* : Little, slight. సూక్ష్మము, అల్పము.

**తనికీ** or **తనిఖీ** *n.* : Examination, inspection.

**తనిమ** or **తనిమంము** *n.* : Much. విస్తారము. Corporeality శరీరత. Fineness, thinness సూక్ష్మత. **తనిమను** *adv.* : Finely, thinly. తనుత్వముతోడ.

**తనియు** *v.n.* : To be full, satiated, or content. తృప్తిపడు. To thrive. flourish.

**తనివి, తనివు** or **తన్వి** *n.* : Fulness, satisfaction, content, ease. Relation.

**తను** *n.* : In compounds stands for తనువు and తనువు.

**తనుకు** or **తన్కు** *v.n.* : To happen. కలుగు. To burn or shine జ్వలించు, ప్రకాశించు, తపించు. *n.* : Heat, closeness. తాపము.

**తనుపు** or **తన్పు** *v.a.* : To satisfy : to nurse or nourish **తనియజేయు**, తృప్తి

పొందించు *n.* : Satisfaction. తనివి, తృప్తి Coolness శైత్యము, శైత్యోప చారము. **తనుపెక్క.** the cold having increased, చలువ హెచ్చుగా. తనువడు to cool.

**తనువు** *n.* : The body. దేహము. **తోలు** *adj.* : Small, delicate, fine. చిన్న, బక్క, సన్నము. తనుత్రము. **తను మధ్య** *n.* : A slender waisted woman. A beautiful woman. **తనూజుడు** or **తనూభవుడు** *n.* : A son. తనూరుహము *n.* : Hair, as "growing on the body". వెంట్రుక.

**తన్ను** or **తనను** *pron.* : Himself. The accusative of తాను self.

**తన్ను** *v.a.* : To kick. కోడిని గద్ద తన్నుకొని పోయినది the hawk pounced upon the fowl and carried it off. n. A kick. వానిచేత తన్నులు తినివచ్చినాడు he got a kicking from him. **తన్నుకోల** a pro, పోటీపెట్టినకొయ్య. **తన్నుబల్ల** *n.* : A foot board.

**తన్మయము** *adj.* : Of that form తత్స్వ రూపమైన. తన్మయత్వము *n.* : Corporeality.

**తన్మాత్రము** *n.* : A simple element, a subtle particle, rudiment, or atom. According to the Hindus (శబ్దం) sound is the tanmatra of (ఆకాశం) other; (sparsha) touch is that of (వాయు) air : (రూపం) form is that of (తేజం) fire or light. (గ్రంథం) smell is that of (పృధ్వీ) earth : and (రసం) taste is that of (జలం) water. these are the five rudiments of the five elements.

**తన్వి** *n.* : A graceful. lovely or delicate girl. A woman. ఆడుది.

**తపతప** *n.* : A fluttering sound. రెక్కలు కొట్టుకొనుటయందగు ధ్వని. తపతప మనుచు being in trouble : showing signs of distress.

**తపనము** *n.* : Heat. Sorrow. తాపము. **తపనీయము** *n.* : Gold. తపనుడు *n.* *Lit.* : He who burns, the burner, i.e., the sun. తపించువాడు.

**తపము** or **తపస్సు** (తప = thinking.) *n.* : Meditation. Austerity, penance, self-mortification, self denial. penitence. A life of retirement and study. **తపసి** or **తపస్వి** *n.* : A recluse an ascetic. devotee. **తపస్విని** a female recluse. **తపోధనుడు** *adj.* : Renowned for self-mortification, distinguished in sanctity తపస్సే ధనముగా గలవాడు.

**తపసి** *n.* : The tree. called అవిసిచెట్టు or గారచెట్టు.

**తపారము** or **తపారు** *n.* : A sort of cap. కుళ్లాయి. టోపి.

**తపించు** *v.n.* : To become warm, be heated, burn, be distressed. To be in anguish.

**తపెల** or **తపేలా** *n.* : A brass vessel.

**తప్ప** *adj.* : Empty, flabby, pithless. *n.* : An empty ear of corn. గింజ పట్టని

ధాన్యము. **తప్పకాయ** fruit without any seed formed init విత్తుపట్టని కాయ.

**తప్ప** *adv.* : postp. Save, but, except, unless, without. మీరుతప్ప except you.

**తప్పరించు** *v.t.* : To put down. అణచు. To defeat, deceive, భంగపెట్టు. Chenn.

**తప్పు** *v.n.* : To err, fail, cease. To be lost, broken, changed, made void, or erroneous.

**తప్పుకుత్తి** or **కంపలటెంకి** *n.* : A kind of fish.

**తప్పున** *adv.* : At once, suddenly.

**తప్పెట** *n.* : A large drum. Also, the name of a tree. నేలతప్పెట, గ్రీష్మ సుందరము, వనకుళుత్థము.

**తప్సీలు** *n.* : Particulars or details of an account.

**తబము** : Same as తపము.

**తబిసి** : Same as తపసిచెట్టు.

**తబుకు** *n.* : A dish, a platter. పళ్లెము.

**తబ్దీలు** *n.* : Exchange. Transportation.

**తబ్బిబ్బు** *n.* : Agitation, flurry. తడబాటు. తారుమారు, తడమాటము, భ్రమ, ఒకటిచేయబోయి ఒకటి చేయుట, ఆయనకు ఇప్పుడు తబ్బిబ్బులుగా నున్నది he is in his dotage.

**తమకము** *n.* : Eagerness, ardour. త్వర. Love మోహము, విరహము. **తమకి** *n.* : A lover : one who is enamoured.

**తమగము** or **తమంగము** *n.* : A summer house, having no walls but a roof on pillars. మంటపము, చావిడి. A raised platform మంచె.

**తమటం, తమటము, తమ్మట** or **తమ్మటము** *n.* : A large drum. తప్పెట.

**తమము** *n.* : Darkness. Illusion, mental blindness. Sorrow. శోకము. **తమోమయుడు** *n.* : One who is in darkness. తమోగుణ విశిష్టుడు. **తమోమణి** *n.* : The gem of night, i.e., a firefly. మెరుగుడు పురుగు.

**తమరకము** or **తమరము** *n.* : Tin. తగరము.

**తమరు** *pron. plu.* : (used honorifically.) You, yourself. తమరొకరె your honour alone. The genitive is తమ. own, స్వకీయమైన.

**తమలము** *n.* : The Betel vine. తమలంపు టిరులు Red and bluish tints, తాంబూలపు రక్తిమలో చేరిన నీల కాంతులు. **తమలపాకు** *n.* : The betel leaf.

**తమస్సు** *n.* : Darkness. చీకటి. See తమము.

**తమాటకాయ** *n.* : The Tomato fruit.

**తమాయించు** *v.n.* : To stop, to check oneself; to be patient. శాంతించు, స్తిమితమగు.

**తమాలము** *n.* : The Gloomy tree; చీకటి మ్రాను. కానుగు చెట్టు. As a colour, it means dark brown, or dusky, dun, or dark dull red. Dark hued.

**తమి** *n.* : Eagerness. త్వ. Lust, passion, desire. కుతూహలము, ఆపేక్ష, మోహము. *n.* : Darkness, చీకటి, **తమికొను** *v.n.* : To be eager. త్వరపడు. To desire ఆపేక్షపడు. To fall in love మోహపడు.

**తమిదలు, తమిదెలు** or **తవిదెలు** *n.* : The grain called ragi. చోళ్లు or రాగులు.

**తమిరె** *n.* : The pin in the centre of a yoke. కాడినడిమిసీల.

**తమిస్ర** *n.* : A pinch-dark night. చీకటి రాత్రి. Thick darkness. gloom చిమ్మ చీకటి. తమిస్రము *n.* : Darkness. చీకటి. Anger కోపము.

**తముకు** or **టముకు** *n.* : A drum, a tambourine. తుడుము.

**తమ్మ** *n.* : A quid. The chewings of the betel leaf which are of a red colour. నమలబడిన తాంబూలము. **తమ్మతొట్టి** *n.* : A spitton, **తమ్మపడిగము.** **తమ్మకర** *n.* : The red spittle caused by తమలపాకు.

**తమ్మంటు** *n.* :An earring. కుండలము.

**తమ్మటము** : See తమట.

**తమ్మడి** *n.* : A Tambala or Saiva priest.

**తమ్మళ** : Same as తంబళ.

**తమ్మి** *n.* : The lotus. పద్మము. A disposition or arrangement of an army in the battle-field in the form of a lotus పద్మవ్యూహము. కెందమ్మి the red lotus. **తమ్మికంటి** *n.* : A fair eyed person, a translation of the Sanskrit word పుండరీకాక్షః a name of Vishnu.

**తమ్ముల** : The plu. infl. of తమ్ముడు. of తమ్మి a lily, and of తాము themselves. **తమ్ములవిందు** *n.* : The sun. పద్మబాంధవుడు.

**తమ్మె** or **తమ్మియ** *n.* : The soft part, as the lobe of the ear, or gristle of the nose. A halter's knot. పలుపు యొక్క ముందు భాగము.

**తమ్మెట** *n.* : A sort of drum. A kind of earring. **తమ్మెట్లు** *n.* : Earrings. పోగులు.

**తరంగము** *n.* : A wave, a surge, an undulating swell or surface like waves. అల. **తరంగిణి** *n.* : A river. This and other expressions for river, sea, stream are used in the titles of some books, as **విద్యా తరంగిణి** the circle of the Sciences.

**తరండము** *n.* : A ship. ఓడ. A fishing rod.

**తరందారి** *adj.* : Classified. తరగతులుగా ఏర్పరుపబడిన. *n.* : A classifier of soils, & c.

**తరకటించు** (from తర్కించు.) : *v.n.* : To argue. తరకటింపు n. Arguing తర్కము.

**తరకలు** *n.* : The chaff of grain. తప్పలు.

**తరకసము** or **తరకసా** *n.* : A quiver. అమ్ములపొది.

**తరక్షువు** *n.* : A hyaena or a hunting leopard. సివంగి.

**తరగ** : A wave, surge, An undulating surface.

**తరగంపె** or **తరగంపియ** *n.* : A kind of saw. ఒకవిధమైన రంపము.

**తరగతి** (తరము + గతి) *n.* : A class, grade, rank, order. తరమును తెలిపే భాగము. **తరగతిలెక్కలు** Classified accounts. తరగతిగా according to (its) class. **తరగతి గుండ్లు** *n.* : A kind of necklace worn by women.

**తరగరి** *n.* : A broker, an appraiser.

**తరగు** : See తరుగు.

**తరచు** or **తరుచు** *n.* : Thickness. బాహుళ్యము. *adj.* : Thick, in various senses, as coarse cloth; frequent. usual, perpetual, plentiful. అధికము. తరచుగావచ్చిరి they came in crowds.

**తరటు** *v.n.* : To strike, to kick, to lash. **తాడించు** *adj.* : Stout, coarse, not fine తరటువెర్రి a great fool. Stubborn మూర్ఖము. *n.* : A whip కశ. Stubbornness మౌర్ఖ్యము. తరటుగొను to strike కొట్టు.

**తరణము** *n.* : Crossing. దాటుట. Deliverance, extrication. A ship or boat : also a raft. ఓడ. **తరణి** *n.* : A ship. ఓడ. The sun. సూర్యుడు. The sea సముద్రము. తరణోపాయము *n.* : A means, an expedient.

**తరతమభావముగా** *adv.* : In proportion to (their) rank.

**తరతరము** or **తరతరంబు** *adv.* : Gradually. by degrees. క్రమముగా. One after another, in a series. వరం వరగా. **తరతరముగా** *adv.* : Sort after sort, from generation to generation.

**తరతర** or **తత్తర** *n.* : Fright, panic. **తరతరలాడు** *n.* : to be panic-struck, to quake with fright. తత్తరపడు.

**తరద్దూదు** *n.* : Exertion, application. తదద్దూదుజాబితా an account showing the species and quantity of the seed sown, the extent of land under cultivation and the extent of it remaining fallow.

**తరపడి** or **తరుపడి** *n.* : A lathe. తరిమెన. That which is formed on a lathe.

**తరపణ్యము** *n.* : Boat hire, freight. రేవు, పడవ నడుపువానికిచ్చు కూలి.

**తరపి** *n.* : A calf six months old. ఆరునెలల దూడ. A fat person. Bloom తారుణ్యము. *adj.* : Youthful. యౌవనముగల.

**తరపు** *v.t.* : To remove. పోగొట్టు, హరించు.

**తరబడి** *n.* : Rate, కోట్లతరబడి by millions, millions at a time. వందల తరబడి అప్పుడు hundreds of loans. **తరబడిలెక్క** *n.* : A record resembling the Domesday-book wherein the values of lands are stated.

**తరము** *n.* : Sequence, following : that which follows. A class, sort. A number or collective body. A generation. A step, grade or remove in

genealogy. Practicability, possibility. Difference, Power, ability. **తరమిడు** to compare, try the respective merits n. Crossing దాటుట.

**తరలచేప** *n.* : A kind of fish. మత్స్య భేదము.

**తరలు** or **తర్లు** *v.n.* : To set out or start. ప్రయాణమగు. To stir. move, proceed. చలించు, సంభ్రమించు. **తరలుచు** or **తరల్చు** to set free విడిపించు.

**తరళము** *adj.* : Trembling, tremulous, glancing. as the eye. ప్రకాశమానమైన, చంచలమైన, తరళనేత్ర, తరళాక్షి or తరళేక్షణ lit. bright eyed; ev. a fair maid.

**తరపరి, తరవలి** or **తరవారి** *n.* : A broadsword. పట్టాకత్తి.

**తరవాణి** *n.* : Sour or fermented rice water. పుల్లనీళ్లు, పులిపినగంజి.

**తరవాయి** *n.* : An opportunity. సమయము. A time తడవ ఒక తర్వాయి once. A sequence అనుక్రమము, వరుస. An examination ఉప క్రమము. A lesson in the Vedas. వేదపాఠము.

**తరవారి** or **తరంవారి** *n.* : A settled measurement of fields or villages. తరవారి గ్రామములు the villages under the Ryotwari system.

**తరసము** *n.* : Flesh. మాంసము.

**తరహా** *n.* : A kind, sort, species. విధము. పెద్దమనిషి తరహాగా like a gentleman.

**తరాజు** or **తరాసు** *n.* : A pair of scales. తక్కెడ.

**తరి** *n.* : A ship. ఓడ. తరి adj. Churning. *n.* : Time, occasion. సమయము. ఇత్తరి now. ఒకతరి once. Nearness సమీపము. **తరిగోల** *n.* :A churning staff. **తరిచల్ల** *n.* : Sweet buttermilk. **తరిచుట్టు** or **తరిపట్టు** *v.n.* : To consecrate or offer curds to the gods. **తరితాడు** *n.* : The cord that works a churnstaff. తరిదాలుపు one who wears or carries the churning mountain.

**తరిగించు** *v.t.* : To cut off, lop, amputate. తరుగునట్లు చేయు.

**తరిటి** or **తరిటీ** *n.* : A large sack filled at both ends and laid across a bullock. రెండు పెండెలు బిగించే గోనెపట్టా.

**తరతీపు** *n.* : Fondness, liking, lust : a fool's paradise. ప్రీతి, అడియాస, సంతుష్టి. delay, reluctance. కాలహరణము, ఆలస్యము. Indifference ఉపేక్ష Greatness, pride, ఉద్ధృతి.

**తరిపి** ro **తరిపిదూడ** *n.* : A sucking calf, a calf less than a year old. *Plu.* : తరుపులు.

**తరిమిడి, తరివిణి, తరిమెన** or **తరిమెనదొడ్డి** *n.* : A lathe. In compounds it is contracted into తరి. **తరిమిడి పట్టు** or **తరిమెనపట్టు** *v.n.* : To turn in a lathe.

**తరియ** *v.n.* : To approach. సమీపించు. To enter. To plunge into. చొచ్చు. తారసిల్లు. To cross. దాటు. **తరియ జొచ్చు** *v.a.* : To enter, to engage in. చేరజొచ్చు.

**తరీఖు** *n.* : Manner, way, custom.

**తరుగు** or **తరువు** *v.a.* : To be worn away. తగ్గు, క్షయించు. To pass away; to be done or finished. గతించు. Tare. Cutting or wearing away. **తరగరి** or **తరుగరి** *n.* : A broker. తరుగుబేరకాడు.

**తరుచు** or **తర్చు** *v.a.* : To stir, agitate; to investigate. To churn చిలుకు, మథించు. తరుచు or **తరచు** *n.* : Thickness. సాంద్రత్వము.

**తరుణము** *n.* : Time, an opportunity, an occasion. సమయము, కాలము. *adj.* : Young, tender, blooming. యౌవనముగల. **తరుణి** *n.* : A blooming young girl. **తరుణిమ** *n.* : Youth. యౌవనము.

**తరుపు** *n.* : A yearling calf. An artificial diamond. Same as తరిపి.

**తరుము** *v.a.* : To drive or pursue, to follow. To encroach upon, or make away with, బలాత్కరించు. To turn wood in a lathe. తరిమెనపెట్టు.

**తరులమెకము** or **తరులమోరమెకము** *n. Lit* : The tree beast, i.e., a monkey. కోతి.

**తరువడిమాను** *n.* : A lathe for turnery. తరిమెన.

**తరువాణి, తరవాణి** or **తర్వాణి** *n.* : Sour gruel, fermented rice water పుల్లకలి, పులినీళ్లు, పులిసినగంజి.

**తరువాయి** or **తరువాయ** *n.* : The next time. అనంతరము. A reasonable time, an opportunity తరుణము. A lesson in the Vedas. The rest. The continuation.

**తరువు** *v.a.* : Same as తరుగు. *n.* : An inroad. attack; dunning. నిర్బంధము. A draft. *n.* : A tree. గంధతరువు the sandal - tree.

**తరుసలి** *n.* : A proud man. ఉద్ధతుడు.

**తర్కము** *n.* : The science of reasoning: logic. వాదము. Reasoning, inferring, deducing, guessing. Discussion disputation. Conjecture, fancy, notion. ఊహ.

**తర్జని** *n.* : The index or forefinger. జుట్టునవేలు. తర్జనము. *n.* : Pointing at, blaming. Threatening, bullying. అదలుపు, బెదరించడము. తర్జన భర్జనము the same.

**తర్జించు** *v.t.* : To frighten, బెదరించు.

**తర్జుమా** *n.* : A translation. భాషాంతరము.

**తర్ణకము** *n.* : A new born calf. అప్పుడు పుట్టిన దూడ.

**తర్పణము** *n.* : Gratification, satisfaction, fulness తనివి, తృప్తి A drink offering.

**తర్ర** or **తర్రు** *n.* : A wretch. నీచుడు.

**తర్లు** : Same as తరలు. **తర్లించు** *v.a.* : Same as తరలించు.

**తర్వాడీ** : Same as తరువాణి.

**తర్వాత** : Same as తరువాత.

**తర్షము** *n.* : Thirst. దప్పి. Eagerness ఇచ్ఛ.

**తల** *n.* : The head. శిరస్సు. The hair on the head. తలవెంట్రుకలు. **తలకొరివి** *n.* : The fire placed on the chest of a corpse which is to be cremated, the head-torch which the heir applies to ignite the funeral pile. **తలకోల** *n.* : A noose, on a staff (కోల) to hold the head of a mischievous cow. **తలగడ** or **తల్గడ** *n.* : A pillow for the head. **తలగుడ్డ** *n.* : A turban. **తలచమురు. తలతిక్క** *n.* : A headache. Madness, pride. impudence. **తలదన్ను** v.n. To excel. **తలవంపు** *n.* : Humiliation, hanging down the head అవమానము.

**తల** or **దల** *affix.* : In the direction of, near; the act or state of వాలుదల slanting. ఊరిదల near the town. విడుదల release.

**తలంకు** : Same as తలకు.

**తలంటు** or **తలగడుగు** *v.a.* : To anoint the head. **తలమీద నూనెరాచు**. *n.* : Anointing the head. అభ్యంగము.

**తలంపు** : Same as తలపు.

**తలంబ్రాలు** : Same as తలబ్రాలు.

**తలకాయ** *n.* : The head. The word కాయ is here a mere colloquial. affix.

**తలకు** or **తలంకు** *v.n.* : To shudder, hesitate, be at a loss. To cease, abstain. To fail, to be afraid, turn way, shrink, draw back. భయపడు. *n.* : Fear, alarm. భయము.

**తలకూడు** *v.n.* : To be completed, finished : to be verified సిద్ధించు.

**తలకొను** *n.* : To happen. కలుగు. To exceed, become great. come to head : to head or be a leader. To make an effort. యత్నపడు.

**తలగడుగు** : Same as తలంటు.

**తలగాము** (గాము is corrupted from Skt. గ్రహము.) *n.* : The ascending node. రాహువు.

**తలగు** *v.n.* : To move, draw back, remove, destroyed. To fall off, as a vest. To depart or be lost, as honor or character. To rove or go off. To keep aloof. తొలగు. **తలగుడు** *n.* : Moving aside తొలగుట.

**తలచావిడి** *n.* : The front hall. ముందరి చావిడి.

**తలచు** or **తలంచు** *v.a.* and *v.n.* : To think, think of, reflect imagine. యోచించు, ఊహించు. To intend propose, plan. ఉద్దేశించు. To consider or weigh : To seek or plan. To consider or care for. ఎంచు. To meditate **ధ్యానించు, స్మరించు** *n.* : తలపు.

**తలటుతీగె** *n.* : A creeper.

**తలపడు** *v.n.* : To commence, to begin. ప్రారంభించు. యుద్ధానికి తలపడినారు they commenced the fight. *v.t.* : To oppose or attack ఎదిరించు. To meet తాకు. **తలపాటు** *n.* : Commencement, beginning ప్రారంభము.Opposition. ఎదిరించుట.

**తలపు** or **తలంపు** *n.* : Thinking, considering తలచుట. A thought, idea, అభిప్రాయము. A desire కోరిక. Reflection చింత. Recollection జ్ఞప్తి. Heart హృదయము. Imagination, intention, a proposition, plan, supposition. **తలపుచేయు** *v.n.* : To think, consider.

**తలపెట్టు** *v.a.* : To endeavour, take into one's head, to begin or commence. ప్రారంభించు. To think or talk, of, ప్రస్తావించు.

**తలపొలము** *n.* : The glebe or site of a village. గ్రామకంఠము, పొలిమేర వద్దనున్న పొలము.

**తలపోటకము** *n.* : The Cassia tree. తంగేడు, గోశ్రేణి.

**తలపోయు** *v.a.* : To think, plot, devise, contrive, ruminate, be anxious about, investigate, esteem, hold, reflect on, compare. తలపోసికొను to think over, to reflect in one's mind.

**తలబీకరకాయ** or **తలబీకనకాయ** *n.* : Confusion : a puzzle, riddle, difficulty. కలత, చిక్కు.

**తలబోను** *n.* : A sort of eel.

**తలబ్రాలు** or **తలంబ్రాలు** *n.* : The rice (ప్రాలు) poured over the head (తల) of the bride and bridegroom for luck.

**తలమాటు** *n.* : Evil, ruin. చేటు, నాశము.

**తలమానికము** *n.* : A ruby worn on the head. అలంకారార్థము శిరము నందుంచుకొనే రత్నము.
*adj.* : Excelent, శ్రేష్ఠము.

**తలమించు** *v.n.* : To excel, to exceed, to be in excess. ముందు మించు.

**తలమిగులు** *v.n.* : To remain over. ముందు. మిగులు.

**తలము** *interj.* : Stop ! stand back ! తాళుము. తలము (from స్థలము) *n.* : Site, situation, place. Actuality, subsistence, existence; Essential nature. స్వరూపము.

**తలముల్లు** *n.* : A kind of instrument used by thieves : or hunters. A picklock.

**తలయంపి** *n.* : The head of a bedstead. తలాపి, మంచమునకు తల వైపు. A pillow తలకిందనుంచుకొను దిండు.

**తలయేరు** *n.* : A headache.

**తలరు** *v.n.* : To move. చలించు. To bloom, shine, thrive, rejoice సంభ్రమించు, సంతోషించు. ఒప్పు. To think or consider చింతించు. To be confused కలగు.

**తలవరి** *n.* : A beadle, porter, guardsman. A watchman. తలారివాడు. తోకతలవరి a certain fish, resembling a sole : species of ophidium.

**తలవాకిలి** *n.* : The house door, or street door. Also, the mouth. See తల.

**తలవిడి** *n.* : The severed head or top of a tree తలతుండు.

**తలవీడు** *n.* : The city gate, పురః ప్రవేశము. Nearness. Neighbourhood. సమీప ప్రదేశము.

**తలపు** : Same as తలగు or తొలగు.

**తలసాల** *n.* : The entrance into a house. తలవాకిలి.

**తలా** *adv.* : Each, a piece, per head. చెరి.

**తలాటము** *n.* : A head or crest. తురాయి.

**తలాడ** or **తలగడ** *n.* : A pillow, a bolster.

**తలాపి** or **తలాపి** *n.* : The head of a bed. తలయంపి.

**తలారి** or **తలవరి** *n.* : A watchman, beadle, constable See తలవరి.

**తలారించు** *v.n.* : To turn back. మరలు.

**తలి** *n.* : A mother : thus contracted in composition.

**తలికి** or **తలికె** *affix.* : Before, until. నేను రాకతలికి or నేను వచ్చేతలికి before I arrived, until I come.

**తలిపెర** *n.* : A fountain or pit where a stream arises; the bottom of a canal or drain carried from a river to irrigate the fields.

**తలిమము** *n.* : A cotton mattress. దూది పరుపు.

**తలియ** *n.* : A plate or vessel to take food in. భోజనపాత్రము.

**తలిరు** *n.* : A sprout, a shoot. పల్లవము, చిగురు. తలిరుచు or తలిర్చు v.n. To sprout, shoot, bloom : to rise, as a feeling in the heart.

**తలివము** *n.* : A bed. శయ్య.

**తలుకు** : Same as తళుకు.

**తలుగు** or **తల్గు** *n.* : A halter to tie up cattle. పలుపు.

**తలుపు** *n.* : A door. తలుపుతీయు to open a door. తలుపువేయు to shut a door.

**తలుము** *n.* : A sort of winch for raising a bucket.

**తలేరు** (తల + ఏరు) *n.* : The leading pair of oxen in a plough or cart, as distinguished from మేటిపసరు the thill pair.

**తలోదరి** *n.* : A slender waisted woman. A lady. వనిత, ఆడుది.

**తల్గు** : Same as తలగు.

**తల్చు** : Same as తలచు.

**తల్పము** *n.* : A cotton bed or mattress. దూది పరుపు. A wife. భార్య. తల్పగుడు *n.* : Lit. He who violates a bed, i.e., an adulterer. గురుతల్పగుడు one who commits adultery with his Guru's wife.

**తల్పించు** (for తలపించు.) *v.a.* : To characterise.

**తల్లజము** *n.* : The finest of (anything) the noblest of. శుకతల్లజము a gem of a parrot. కన్యకాతల్లజము the fairest of women. అశ్వతల్లజము a jewel of a horse.

**తల్లడము** *n.* : Shaking, tremor చలనము. Trouble.

**తల్లి** *n.* : A mother. కన్నతల్లి one's own mother, as opposed to సవతితల్లి stepmother. **తల్లివేరు** *n.* : The tap root or principal parent root. ముఖ్యమైన వేరు.

**తళతళ** *n.* : Glitter, brilliance. తళతళలాడే glittering, brilliant.

**తళిగ, తళియ** or **తళిహ** *n.* : A plate or vessel to take one's food in, భోజన పాత్రము. Food that is fit to be consecrated to the god భగవన్ని వేదనార్హమన అన్నము.

**తళుకు** or **తళ్కు** *n.* : A flash, a gleam. మిక్కిలి ప్రకాశము, నున్నని మృదుకాంతి.

**తళ్లు** *n.* : A rush (of water.) An inroad, incursion. A wave. A ripple చిన్న అల.

**తవన** *n.* : A short time. క్లుప్తచిన్న అల.

**తవన** *n.* : A short time. క్లుప్త కాలము.

**తవరము** : Same as తగరము.

**తవళి** or **తవళి** *n.* : Falsehood అసత్యము.

**తవాయి** *n.* : An incursion, a battle, a contest, a war. A cross wind, a foul breeze. Misfortune, hazard, peril. ఉపద్రవము. ఓడ తవాయి పట్టినది the ship missed stays or fell out of its course.

**తవిటిపాము** or **తవుటిపాము** *n.* : A whitish sort of eel. మలుగుచేప.

**తవిద** or **తన్విద** *n.* : The grain called Ragi. రాగిపైరు.

**తవుకోల** : Same as తవ్వుకోల.

**తవుజీ** *n.* : A pension or allowance granted to a Zemindar.

**తవుడు** *n.* : Bran. బియ్యము మీది పొట్టు.

**తవులు** : Same as తగులు. తవులుకొను, తవులబడు or తవులుచు See under తగులు.

**తవెల** : Same as తపెల or తపేలా.

**తవ్వ** *n.* : A gallon or dry measure, equal to two solas (సోలలు), రెండు సోలల కొలది గల మానవిశేషము.

**తవ్వు** or **త్రవ్వు** *v.a.* or *v.n.* : To dig. కాలుత్రవ్వు to paw or spurn the ground, to be eager for. ఊరక తవ్వుకొన్నట్టు అవుతుంది this is merely beating about the bush. **తవ్వుగోల** or **తవుగోల** *n.* :A spade.

**తసరపు** or **తస్రపు** *n.* : Embezzlement. Unlawful enjoyment. అపహరించడము.

**తసి** *n.* : A thick line of sprouts. దట్టమగు నారువరుస.

**తసుకు** *v.n.* : To play pranks, to coquet. ప్రేమ కలిగినట్లు చేష్టించు.

**తస్కరించు** *v.a.* : To steal. దొంగిలించు. **తస్కరుడు***n.* : A rogue, a thief. దొంగ, చోరుడు.

**తస్స** *n.* : Fat. కొవ్వు. proud flesh. దుర్మాంసము.

**తహతహ** *n.* : Flurry, agitation, flutter. తమకము. Grief, vexation, వ్యాకులము. **తహతహపడు** to be in distress, to be at one's wits' end, to be

vexed, తమకపడు. to cause to rejoice కుతూహల పరుచు.

**తహబేలు** or **తహవేలు** *n.* : Comparison.

**తహశ్శీలు** *n.* : Revenue, collection of revenue. **తహశ్శీలుదారుడు** *n.* : A Tahsildar or a Revenue officer in charge of a Taluq.

**తహా** *n.* : Consent, agreement.

**తా** *G.* : తన. *D.* : తనకు. A తన్ను. *Plu.* : తాము, తారు, or తమరు. *G.* : తమ. See తాను.

**తాండవము** *n.* : motion in general, however slight. Violent caperring, a war dance. Gesticulation, Dancing, orgies, antics. ఉద్ధతమైన నృత్యము. **తాండవించు** *v.n.* : To caper or dance violently. ఉద్ధతముగా నృత్యముచేయు.

**తాండ్ర** *n.* : Jelly or jam the inspissated juice of any plant మామిడి తాండ్ర mangojelly. తాటితాండ్ర palmyrajelly. **తాండ్రచెట్టు** *n.* : A kind of tree, విభీతకము. తాండ్రకాయ the nut of this tree.

**తాంతము** *adj.* : Exhausted, languid బడలిన. తాంతి *n.* : Fatigue బడలిక.

**తాంత్రికము** *adj.* : Relating to the Tantras of unorthodox scriptures. See on తంత్రము. తాంత్రికుడు *n.* : One versed in the Tantras. A sophist, a free thinker or materialist.

**తాంబాళము** n. A large brass plate. పెద్ద ఇత్తడిపళ్లెము.

**తాంబూలము** *n.* : The betel-leaf and areca nut formed into a parcel, ready for use. వక్కాకు.

**తాకట్టు** (తాకు + కట్టు) *n.* : A pledge. Something given as security. తాకట్టు వాకట్టు అయినది the pledge is forfeited.

**తాకీదు** or **తాఖీదు** *n.* : An order, a command. ఆజ్ఞ. A written order. ఆజ్ఞాపత్రిక.

**తాకు** *n.* : A touch, contact. తాకుట. An attack. A toe-ring కాలిటాకు. *v.a. & v.n.* : To touch; to strike, to push, to encounter, oppose, front. To be attached, to join, apply.

**తాగడించు** *v.a.* : To oppress. నిర్బంధించు.

**తాగలి** *n.* : A low bed of soil for growing plants. పల్లపుమడి.

**తాగల్లు, తాగాడి** or **తాగాణి** *n.* : The stone beam placed across the mouth of a well : పరుపుజిమ్మ, నూతిమీద నడ్డముగా వేసే కర్ర లేక రాయి.

**తాగు** or **త్రాగు** *v.a.* : To drink. చుట్టతాగు to smoke a cigar. **తాగించు** *v.a.* : To cause to drink. **తాగునట్లు చేయు.** **తాగుబోతు** *n.* : A drunkard.

**తాచు** or **త్రాచు** *n.* : The deadly hooded snake called *Cobra decapello.* Various species of it are నల్లతాచు, కోడెతాచు.

**తాచు** *v.t.* : To kick. తన్ను. To carve or cut. చెక్కు, ఖచించు. to scoop out, తొలుచు. to adopt, అవలంభించు.

**తాజా** *adj.* : Fresh; new. తాజా కలము a postscript in a letter.

**తాజు** *n.* : A jacket. కుళ్లాయ.

**తాట** *n.* : Skin, bark. చట్టుమీది పట్ట. Deceit మోసము. the Instrumental case of తాడు. "With a cord" **తాట తమ్ముడు** a deceitful or hypocritical recluse జీవనము కొరకు సన్యాసి వేషమును ధరించినవాడు, లింగి. **తాటమాలలు** deceitful base pariahs. **తాటగానుండే** thin.

**తాటంకము** *n.* : A sort of earring worn by women. చెవికమ్మ.

**తాటకి** *n.* : The name of a certain hag : a word like fury, hussey, or ogress used in abuse.

**తాటాకు** *n.* : A palm leaf. తాటాకు చేప a certain sea fish. తాటాదూటము a patched up job. adj. Spoilt.

**తాటి** or **తాడి** *adj.* : Belonging to the palmyra tree. **తాటిచెట్టు** *n.* : The palmyra Palm tree. Brab tree, or Fan palm Tree.

**తాటించు** *v.n.* : To flutter, wriggle or flounder : to mouth or move the cheeks in munching. కుక్క చెవులు తాటించినది the dog cocked his ears. పక్షిరెక్కలు తాటించినది the bird fluttered its wings.

**తాటోటు** *n.* : Deceit, knavery. టక్కు, మోసము. adj. Knavish, false.

**తాడనము** *n.* : beating, tapping, patting, కొట్టుట. **తాడించు** *v.a.* : To beat. తాడితము *adj.* : Beaten, flogged, smitten, struck కొట్టబడిన.

**తాడి** *adj.* : Appertaining to the palmyra or the tree called Beleric Myrobalan, విభీతకము. **తాడిమీను** the spouting whale.

**తాడు** or **త్రాడు** *n.* : A cord, thread, string.

**తాత** *n.* : A grandfather. Also, a name for Brahma. *n.* : A grandfather.

**తాత్కాలికము** *adj.* : Present, of that time తాత్కాలిక దాత. a ready giver.

**తాత్పర్యము** *n.* : Intention, import, purport, meaning. drift. Thought, idea, view, design, purpose, inclination. An object. scheme, plan.

**తాత్వికము** *adj.* : Concerned with final causes, metaphysical. True, real. **తాత్వికత్వము** *n.* : Dialectics, logic. The telestic mode of reasoning.

**తాత్సర్యము** or **తాత్సార్యము** *n.* : Disregard, neglect, scorn, Delay, waste of time.

**తాతై** or **తైతై** *n.* : Words used in beating musical time.

**తాదృశము** *adj.* : Such, such like, similar. అటువంటిది.

**తాన** *adv.* : Of himself, personally.

**తానకము** *n.* : An abode, house. గృహము, స్థానము. Posture. Steadfastness, certainty.

**తానము** *n.* : Bathing. (from Skt. స్థానము.) A place. A note, or sound, also, the words used in music like ut, re, mi. తన్నకారముతో పాడేపాట. అది తానములు నేర్చుకొంటున్నది she is learning the gamut.

**తానవము** *n.* : Leanness, thinness. తనుత్వము.

**తాను** *pron.* : (reflexive.) Self, one, oneself. (G. తన. D. తనకు. Acc. తన్ను. Plu. తాము, తమరు. G. తమ.) తనకుతానె voluntarily, of itself, of his own accord. తమకుతామే they of themselves.

**తాప** *n.* : A step, stairs. మెట్టు, గడప. A ladder. నిచ్చెన.

**తాపటిమేకు** (from తాపి.) *n.* : A joining nail or spike nail used to join two planks together, a bolt or rivet.

**తాపము** : Corroding care or trouble. The fire of love or fever of grief. తాపంబుటుడుకు heat, warmth, irritation. **తాపత్రయము** *n.* : Triple cares, all sorts of troubles arising from worldly cares. These are divided into ఆధ్యాత్మికము, అధిభౌతికము and అధిదైవికము, that is, sorrows caused by, (1) ourselves, (2) others, & (3) by the will of God. తాపత్రయపడు to be harassed or vexed, to be in trouble, care and anxiety.

**తాపసి** *n.* : A nun, a female ascetic, or pilgrim. తాపసుడు *n.* : A hermit, monk, ascetic.

**తాపి** or **తాపీ** *n.* : Composition, putting or bringing together. A bricklayer, కాసెవాడు. A bricklayer's work. A trowel. A secret, a mystery in any trade, a trace; జాడ, మర్మము. The setting of a stone. Ballast, weight in a boat. ఓడ అడుగున బరువుకై వేసేది. తాపిచేయు to put or bring together, to pimp.

**తాపించు** *v.t.* : To set up, establish or fix. నిలుపు, నెలకొలుపు. to carve చెక్కు. To belabour మోదు.

**తాపింఛము** *n.* : The tree called *Xanthochymus Pictorius.* తమాలము or చీకటిమాను.

**తాపిత** *n.* : A fine kind of silk cloth. మేలైన పట్టుబట్ట.

**తాపితము** *adj.* : Heated. తపింపజేయబడిన.

**తాపు** *v.a.* : To inlay, as precious stones in a jewel. చెక్కు. To join or unite. *n.* : A prop. అవలంబము. A kick తన్ను, పాదతాడనము.

**తాబందు** *n.* : A petticoat. పావడ, గాగర.

**తాబేదారుడు** *n.* : A dependant or subordinate man.

**తాబేలు** *n.* : A sea or land turtle. The landspecies is often called దాసరతాబేలు or hermit-tortoise.

**తామ** *n.* : A bridge-end or the side of a stream.

**తామర** *n.* The lotus. Ringworm. కృష్ణతామర the plant called Indian Reed or Indian Shot. మెట్టతామర a sort of Cassia, the leaf of which cures ringworm. నీటితామర a tree called the Indian Reed or Arrow-root plant. **తామరచెలి** *n.* : The sun. **తామరతంపము** *n.* : Prosperity అభివృద్ధి. తామరతంపరమగు to prosper వృద్ధిపొందు. తామరతంపర *n.* : A cluster or multitude of lotuses.

**తామసము** *n.* : Tardiness, delay, dullness. ఆలస్యము. *adj.* : Cruel, bloody, malignant. తామసపూజ a bloody sacrifice.

**తామా** *n.* : Thickness, bulk, as opposed to length and width.

**తామిస్రము** *n.* : Darkness. చీకటి A hell of darkness. చీకటిమయమైన నరకము.

**తాము** *n.* : The plural of తాను. Selves (used honorifically); your honour, your lordship.

**తామేలు** : Same as తాబేలు.

**తామ్రము** *n.* : Copper. రాగి. Red color ఎరుపు. *adj.* : Red. ఎర్రని. తామ్రకుట్టకుడు *n.* : A copper smith. రాగి పనివాడు. **తామ్రచూడము** *n.* : The copper-helmed bird, i.e., a cock, కోడి. తామ్రపర్ణి the copper-river.

**తాయము** *n.* : A rare thing, a rarity. అరుదగు వస్తువు. ఇదో ఒక తాయము నీకిస్తాను here, I will give you a rare thing.

**తాయి** *n.* : A mother. See తల్లి.

**తాయితు, తాయెతు** or **తాయెత్తు** *n.* : An amulet, or charm containing things supposed to bring luck. తల్లి బిడ్డలకు కట్టే రక్షరేకు.

**తార** *n.* : A star. నక్షత్రము. The pupil of the eye, కనుగ్రుడ్డు, కనీనిక. నల్లగుడ్డు. The wife of Brihaspati. బృహస్పతి భార్య. Vali's wife. వాలి భార్య. తారకము *n.* : A star. The pupil of the eye.

**తార** *pron.* : They themselves.

**తారకజిత్తు** *n.* : The conqueror of an Asura called తారక, an epithet of the god of war. కుమారస్వామి.

**తారకాణ, తారకాణము, తార్కాణ** or **తార్కాణము** *n.* : An example. దృష్టాంతము. Discussion. Proof, evidence. నిదర్శనము.

**తారకానందము** *n.* : The name of a certain tune.

**తారకుడు** *n.* : A mediator, a saviour, redeemer, emancipator. మాలిమికాడు, దాటించువాడు.

**తారణ** *n.* : The name of a certain year in the Hindu Calendar. adj. That which enables one to cross. తరింపజేయునది.

**తారతమ్యము** or **తారతమ్యత** *n.* :Difference, distinction. Proportionate value : comparative merit.

**తారము** *n.* : A clear pearl; పులుగడిగిన ముత్తెము. A clear note. గట్టిమ్రోత, ఊర్ధ్వస్వరము. crossing, passing over. దాటుట. Silver వెండి.

**తారసించు** or **తారసిల్లు** *v.n.* : To approach, draw near. To spread వ్యాపించు. తారసము *n.* : Nearness, contact, touch. సమీపము. Opposition తలపాటు. **తారసపడు** *v.n.* : To draw near, to front, engage in battle, to face. తారసపెట్టు *v.n.* : to introduce, insinuate, procure, as a bawd. To adduce.

**తారాచువ్వ** *n.* : A sort of sky rocket. A firework in water.

**తారాడు** (తారి + ఆడు.) *v.n.* : To move about. తిరుగులాడు. To lurk about, dangle, hang off and on. To dance attendance without coming to the point. జీరాడు, వ్రేలాడు.

**తారాపీట** *n.* : The seat on the back of an ox. ఎద్దు వెన్నుమీద వేసేపీట.

**తారి** *n.* : One who pulls the wires or strings in a theatrical performance ఆటాడించే సూత్రధారి.

**తారించు** *v.t.* : To make one come close. తారజేయు. See తార్చు and తారు.

**తారీఖు** *n.* : The date of the month. తేదీ.

**తారు** *pro.* : They themselves, You (honorific) తమరు.

**తారు** *v.n.* : To roam, rove, stroll, saunter, run about, loiter. సంచరించు. To go. పోవు. To meet. కదియు. To lurk, lie in wait. మరుగుపడు. to dance attendance.

**తారుచు** : Same as తార్చు.

**తారుణ్యము** or **తరుణత్వము** *n.* : Youthfulness, bloom. యౌవనము.

**తారుమారు** *n.* : Disorder, confusion. గందరగోళము. *adj.* : Disorderly, riotous. Slovenly. క్రమముతప్పిన, వ్యత్యస్తమైన. **తారుమారుగా** *adv.* : Confusedly, in disorder, upside down. తారుమారుపడు to be confused. గందరగోళపడు.

**తార్కాణ** or **తార్కాణించు** : See under తారకాణ.

**తార్కికుడు** *n.* : A logician, a reasoner.

**తార్కొను** : Same as తారుకొను. See under తారు. **తార్కొలుపు** *v.t.* : To cause to meet.

**తార్చు** or **తారుచు** *v.a.* : To unite, set together, join, apply, put. To close.

**తార్తీయము** *adj.* : Third. Ternary.

**తార్పు** or **తారుపు** *n.* : Application, joining, setting. తార్చడము. A small box, బరణి, చిన్నపెట్టె. రాగితార్పు. a copper plate. తామ్రపు హరివాణము, పళ్లెము, తాంబాళము. **తార్పులాడు** *v.n.* : To fight as cocks, rams, & c.

**తాలాంకుడు, తాళాంకుడు** or **తాలధ్వజుడు** *n.* : An epithet of Balrama,

the Baachus of India, whose standard is the palm tree;

**తాలి, తాళి, తాలిబొట్టు** or **తాళిబొట్టు** *n.* : A small piece of gold which the bridegroom ties round the bride's neck as a sign of marriage. పుస్తె, మంగళ సూత్రము.

**తాలించు** *v.a.* : To season food. కూరలను తిరుగుబోయు. To slake lime. తాలింపు *n.* : The seasoning of a dish. తిరుగబోత, seasoned curry తాలించినకూర. Slaking lime.

**తాలిమి** *n.* : Gentleness. Endurance, patience, steadfastness. ఓర్పు. Fortitude. ధైర్యము. తాలిమికత్తె a patient woman క్షమావంతురాలు. తాలిమికాడు a patient man. క్షమావంతుడు.

**తాలు** or **తాలుగింజలు** *n.* : Empty ears of corn, తప్పగింజలు, ఎన్నుతీసి ఎండిపోయిన పైరు.

**తాలుచు** : Same as తాల్చు.

**తాలువు** *n.* : The palate. The inside of the cheek. నోటిలోపలి దవడ.

**తాలువుబిళ్ల** *n.* : A spindle.

**తాలూకా** *n.* : A Taluk or division of a zilla (జిల్లా) or district. Also, applied to the principal town of a Taluq. A subdivision. *adj.* : Belonging to, pertaining to, సంబంధించిన. **తాలూకు** *adj.* : Belonging to.

**తాల్చు** or **తాలుచు** *v.a.* : To take. To hold. To receive, to bear to wear (as a dress, Cornament, or weapon). ధరించు. To take or assume (a shape, & c.) To hold (as a liquid in the mouth). To slake (lime).

**తాల్మి** : Same as తాలిమి.

**తాళకము** *n.* : Yellow orpiment. Yellow sulphuret of arsenic. హరిదళము, తొగరిమన్ను.

**తాళము** *n.* : A lock. బీగము. తాళపుచెవి a key కప్పతాళము a padlock. తాళముతీయు to unlock. తాళము వేయు to lock up. A palm tree. తాటిచెట్టు. తాళ appertaining to the palm tree. తాళ వృక్షము a palm tree. **తాళపత్రము** *n.* : A palm leaf. తాటాకు, చెవ్వాకు.

**తాళాబందు** *n.* : A complete abstract of the actual receipts and expenditure of the revenue for the past year.

**తాళి** or **తాళీ** *n.* : A necklace పతకము, ఒకవిధమైన హారము.

**తాళించు** *v.t.* : To shake the dice before throwing them down జూద మాడునపుడు కిందవేయుటకై పాచిక లను చేతిలో ఇటు అటు తిప్పుట.

**తాళిక** or **తాలిక** (from తాళు.) *n.* : Patience, endurance. ఓర్పు, క్షమ. A pastille or little roll, as of paste or of leaf. పొట్లు.

**తాళు** or **తాళుకొను** *v.a.* : To bear, suffer, endure, tolerate, have or show patience సహించు. to refrain. To wait. stop.

ఆగు, నిదానించు ఈ బట్ట కట్టు తాళును this cloth wears very well.

**తాళ్లు** *n.* : Ropes, Palm trees. See తాడు and తాడి.

**తాళ్వారము** *n.* : A shelving roof : a verandah or shed. A pent roof. వసారా.

**తావక** *adj.* : Thine, thy. **తావకీనము** *adj.* : That which belongs to thee.

**తావకాళ్లు, కావకోళ్లు** or **తావుకోళ్లు** *n.* : Pieces of wood used to rest the feet on while working, a picota or water-lift, ఏతమెత్తువాడు కాళ్లుంచు కొనుటకు అమర్చిన పట్టెలు.

**తావత్** *adj.* : That. **తావత్పర్యంతము** Thus far, so long.

**తావరము** *adj.* : Firm. స్థిరమైన.

**తావలము** *n.* : A place, abode, home. స్థానము, గృహము, నివాసము. A prop ఆధారము, రక్షకము. దయకు తావలమైన who is an object of mercy.

**తావళము** ro **తావడము** *n.* : A necklace of beads, & c; as రుద్రాక్షతావళము.

**తావి** *n.* : Odour, fragrance, పరిమళము. తావిగట్టు the mountain called (మలయపర్వతము.) **తావినూనె** *n.* : Fragrant or scented oil. **తావి మోపరి** the scent carrier, i.e., the wind, గాలి, గంధవహుడు. తావి విలుకాడు an epithet of Manmadha.

**తావు** or **టావు** *n.* : A place, locality; a home, room, space. స్థానము. అది నా తావున ఉన్నది I have it by me, in my hands.

**తావు** *v.t. & n.* : To drink. తాగు.

**తావుకోళ్లు** or **తావకోళ్లు** : Same as తావకాళ్లు.

**తింట** (Contracted from తినుట.) *n.* : Eating. తినుట.

**తిండి** *n.* : Food, ఆహారము. An eater. బువ్వదిండి one who lives on rice. తిండిమెతుకు solid food. **తిండిపోతు** *n.* : A glutton.

**తింత్రిణి** *n.* : The tamarind tree. చింతచెట్టు. **తింత్రిణీకము** *n.* : The Tamarind fruit. చింతపండు.

**తికమక** *n.* : Confusion కలత. Tottering. **తొట్రుపాటు** *adv.* : Up and down, backwards and forwards. ఇట్టట్టుగా.

**తిక్క** *n.* : Madness. పిచ్చి, ఉన్మాదము. తిక్కయజ్వ the Somayaji. Tikkanna. (a celebrated poet.) **తిక్కపట్టిన** or **తిక్కయెత్తిన** *adj.* : Mad. తిక్కగొను to become mad. వెర్రెత్తు.

**తిక్కటమక్కట** *n.* : Confusion, higgledy piggledy. కలత.

**తిక్కడి** *n.* : A spindle. నూలువడికే చిప్పకదురు.

**తిక్తము** *n.* : Bitterness. చేదు. *adj.* : Bitter. చేదైన.

**తిగ** *n.* : Three మూడు. తిగకంటి *n.* : The three eyed one, i.e., Siva, **త్ర్యంబకుడు.** **తిగవంచ** *n.* : Four.

**తిగటు** *n.* : A screen. తెర.

**తిగియు, తివియు, తిగుచు** or **తివుచు** v.t. To pull, draw, take : లాగు,

ఊడ్చు, ఆకర్షించు. To rub as in shampooing the limbs. To stroke. తిగుచుడుపోగులు *n.* : The cords used with a hunter's nets or snares.

**తిగ్మము** *n.* : Heat, warmth, వేడిమి. adj. Hot, warm. వేడిమిగల.

**తిట్ట** *n.* : A heap, a multitude రాశి.

**తిట్టు** *v.a.* : To abuse, rate, scold, rail at, curse. శపించు, నిందించు.

**తడిమి** or **తిడిమ్మి** *n.* : The rustling noise of carriage wheels. రధము పోవునప్పటి మ్రోత.

**తితిక్ష** *n.* : Endurance, steadfastness. క్షమ, ఓర్పు. తితిక్షువు A man of a forgiving nature. ఓర్పరి.

**తిత్తి** *n.* : A purse, bag, case, or cover. సంచి, తోలుసంచి. The skin or hide of animals మృగముల తోలు. A leathern bag or bottle as సారాయి తిత్తి. చనుతిత్తి a loose dangling breast. మూత్రతిత్తి the bladder. కొలిమితిత్తి a pair of bellows.

**తిత్తిరి** *n.* : The francoline partridge.

**తిథి** *n.* : A *Tithi,* a lunar day. The date by computation of lunar days, by which all religious and funeral rites *(Parentalia)* are regulated. రేపు నా తండ్రి గారికి తిథి గనుక రాను as to-morrow is the anniversary of my father's death I cannot come.

**తిను** *v.a.* : To eat. భుజించు. To suffer or undergo (blows, abuse, hardship, or punishment) వానివద్ద దెబ్బలు తిన్నాను I was beaten or flogged by him. **తినుబండారములు** *n.* : Eatables. తినుబండారపు వస్తువులు provisions.

**తినుకు** *v.n.* : To strain. N. Straining.

**తిన్న** or **తిన్నని** *adj.* : Proper యుక్తము. Straight. ఋజువు. Fine, beautiful మనోజ్ఞము. Well స్వస్థము. తిన్నగా or తిన్నంగా *adv.* : Fairly, by gentle or fair means, straightway, directly, properly. Gently, slowly.

**తిన్నియ** or **తిన్నె** *n.* : A pial or seat built at a house door; అరుగు, వేదిక.

**తిపురుకట్టు** *v.* : To spread. వ్యాపించు.

**తిప్ప** *n.* : A hillock. చిన్నకొండ, గుట్ట. A mound, దిబ్బ. A stumbling block, a difficulty. తంటా. **తిప్పలబడు**. to be distressed or in difficulties. **తిప్పల పెట్టె** he threw difficulties in their way.

**తప్పిట** *n.* : Roving, a rambling life.

**తిప్పతీగె** *n.* : the Heartleaved moon-seed, a plant used in curing snake bites. తిప్పపత్తు the extract of that plant. గుళూచీలత.

**తిప్పు** or **త్రిప్పు** *v.n.* : To turn; to be giddy. తలతిప్పుచున్నది my head turns. I am giddy. *v.a.* : (causal of తిరుగు.) To turn, to reverse. To steer or command (as ship). To wind up (a watch).

**తిబిరి** *n.* : A change, alteration. మారుపాటు. *adj.* : Slight, little. అల్పము.

**తిమి** *n.* : A huge fabulous fish, like the leviathan. నూరామడపొడుగు చేప. **తిమింగిలము** *n.* : A huge sea monster, like the kraken, that is supposed to be capable of devouring the తిమి.

**తిమితము** *adj.* : Wet. తడిపి.

**తిమిరము** *n.* : Darkness. The shading of a painting.

**తిమిరి, తిమిరివాయువు, తిమ్మిరి** or **తిమురు** *n.* : Paralysis, numbness. తిమిరితిక్కి *n.* : A kind of fish, తిమిరి మీను *n.* : A fish, a sort of Torpedo. **తిమిరిస్వనము** *n.* : A quaver.

**తిమురు** *v.n.* : To hasten. త్వరపడు. To be proud గర్వించు. *n.* : Numbness. తిమ్మిరి. Pride. గర్వము. తిమురుకొను to pull about in anger కోపముతో పెనగులాడు.

**తిమ్మ** or **తిమ్మన** *adj.* : Whole, healthy. స్వస్థము. *n.* : Health. స్వస్థత. *v.t.* : To bless. దీవించు.నేను వానిని తిట్టను లేదు తిమ్మనులేదు. తిమ్మపడు to become well, to be refreshed, స్వస్థ పడు, సేదతేరు.

**తిమ్మడు** ro **తిమ్మన్న** *n.* : A name of a monkey, like Jacko or Pug : the feminine is తిమ్మ. **తిమ్మనబంతి** *n.* : A monkey's dinner party, a riotous scene. పొట్టితిమ్మడి జొన్న the inferior bastard grain that grows rapidly.

**తిమ్మనము** *n.* : A sort of flummery, made of milk, flour and sugar. పాలు పిండి బెల్లమువేసి వండినది, మజ్జిగ పులుసు.

**తిమ్మప్పడు** *n.* : A name of the god Venkateswara.

**తిమ్మరి** or **త్రిమ్మరి** *n.* : A wanderer. తిరుగువాడు. దేశదిమ్మరి a vagabond, a vagrant. తిమ్మరితనము he being a vagrant. తిమ్మరీడు *n.* : A rover or rambler, a vagrant. **తిమ్మరు** or **త్రిమ్మరు** *v.n.* : To rove, ramble.

**తిమ్మి** : Same as తిమ్మడు.

**తిమ్మిరి** *n.* : The cramp, numbness, Tingling స్పర్శము తెలియని వ్యాధి విశేషము. Itching, lewdness. The teeth being set on edge. Any shock.

**తియ్య** for తీయ. : See తీయు.

**తియ్య** *adj.* : Sweet. తియ్యమామిడి a sweet mango. **తియ్యబిల్లిమాటలు** fair coaxing words. పలుకుతియ్యములు sweet words. తియ్య విలుకాడు an epithet of Manmadha.

**తిరగడ** or **కోడితిరగడ** *n.* : A certain jewel.

**తిరగతివాడ** *n.* : A brig, a two masted vesel.

**తిరగబడు** or **తిరుగబడు** : See under తిరుగు.

**తిరగబోయు** : See under తిరుగు.

**తిరగలి** : See under తిరుగు.

**తిరణామలిచెక్క** *n.* : Trincomali wood. A wood resembling ash. కమ్మిచెక్క.

**తిరము** *adj.* : Firm, steadfast. నిలుకడగా నుండే, నిబ్బరమైన. **తిరపడు** *v.n.* : To become firm. స్థిరపడు.

**తిరస్కరించు** *v.a.* : To despise, scorn, treat with contempt. To outvie, outshine, eclipse. అనాదరముచేయు. **తిరస్కరిణి** *n.* : A curtain, a screen, a guard, a ward. తెరచీర.

**తిరస్తు** *n.* : An alienated village. (Vizag.) A kingdom రాష్ట్రము.

**తిరాల** *affix.* : Regarding, concerning, in the matter of, towards, against. ఎడల, విషయము. నాతిరాలవాడు చేసిన అపకారము the injustice he committed towards me.

**తిరి** *n.* : A twist, turn. మెలి, సుడి, plu. తిరులు. **తిరికబ్బము** base or paltry poetry.

**తిరిక** *n.* : A twist. మెలిక.

**తిరికి** *n.* : A kind of fish.

**తిరికె** *n.* : Scurf than is rubbed off the skin.

**తిరిగి, తిరిగీ** or **తిరుగ** (from తిరుగు.) *adv.* : Again, anew, back. తిరిగి ఇచ్చు to return or give back. **తిరిగి వచ్చు**. to go round to a temple, & c. ప్రదక్షిణము చేయు; to surround పరివేష్టించు.

**తిరితీపులాడు** *v.n.* : To be fond of, to be silly. to dote upon. To struggle పెనగులాడు.

**తిరివము** or **తిరిపెము** *n.* : Alms, what is given in charity. భిక్షము. తిరిపెగాడు or తిరిపరి *n.* : A beggar. భిక్షకుడు. **తిరిపగొట్టు** *n.* : A shameless beggar. విరక్తుడుకాక భిక్షమెత్తు వాడు. **తిరియు** *v.n.* : To live by alms. భిక్షమెత్తు. **భిక్షించు** To beg abjectly. దీనవృత్తిని యాచించు.

**తిరివడు** *v.n.* : To fly, to be routed, worsted, put to flight, or driven back, To be confused. కలతపడు. **తిరివెట్టు** *v.t.* : To confuse కలతపరుచు.

**తిరీటము** *n.* : A crown. కిరీటము.

**తిరు** *adj.* : Blessed or holy. (This is used in a variety of ways by Vaishnavites.) **తిరుకాపు** *n.* : Adorning the god. దేవతనలంక రించుట. **తిరుకొలను** a sacred tank, పుష్కరిణి. తిరుచూర్ణము the sacred powder used to mark the forehead by the Vaishnavites, శ్రీచూర్ణము, తిరునామము, వైష్ణవబొట్టు.

**తిరుగలి** *n.* : See under తిరుగు.

**తిరుగు** *v.n.* : To turn, rove, roam, travel. సంచరించు. To be giddy. పరిభ్రమించు. To go back వెనకకు మరలు. To come again. మరల వచ్చు. **తిరుగలి** or **తిరగలి** *n.* : A hand mill. (or తిరుగు + కలి) Turning భ్రమము. **తిరుగుబోతు** *n.* : A rambler, rover, giddy fool.

**తిరుచు** *v.a. & n.* : To beg alms. తిరియు.

**తిరునాళ్ల** *n.* : A temple festival. దేవోత్సవము.

**తిరునీరు** or **తిర్నీరు** *n.* : Sacred ashes used by the Saivites for their sectarian marks. శైవులు నొసటనుంచు కొనే గోమయపిండ భస్మము, విభూతి. See తిరు.

**తిరుపు** *n.* : Turning. తిరుగుట. తిరుపులు కట్టు *v.n.* : To spread. వ్యాపించు.

**తిరుమల** *n.* : The sacred hill of Tirupati వేంకటాచలము. Any sacred hill. **తిరుమలేశ** *n.* : The Lord of Tirumala, a name employed in the chorus used by a poet who wrote a set of riddles : like this one.

**తిరుముడి** *n.* : A Vaishnavita. వైష్ణవుడు. See తిరు.

**తిరువడికోల** *n.* : A lamp belonging to a mendicant Vaishnavite. దాసరి వాని దీపస్తంభము. See తిరు.

**తిరువరంగములు** *n.* : A kind of fine rice. శాలిధాన్యవిశేషము.

**తిరువారాధనము** (తిరు + ఆరాధనము.) *n.* : Divine worship. దేవతార్చన.

**తిరువు** or **తిర్వు** : Same as తిరుగు.

**తిరోధానము** *n.* : A cover or veil. Concealment, disappearance. మరుగుపాటు.

**తిరోహితము** *adj.* : Covered, veiled, invisible. మరుగుపడిన.

**తిర్యక్కు** *adj.* : Moving crookedly, writing. అడ్డముగా పోవునది. Moving, animate. **తిర్యగ్విధముగా** tortuously. Turned away, as the face. **తిర్యకప్పుంండ్రము** a mark drawn across the forehead.

**తిర్రి** *n.* : A wicker work share for fish. చేపలనుపట్టు బుట్ట. A fisherman చేపలుపట్టేవాడు.

**తిర్రిగొట్టు** : Same as తిరపగొట్టు. See under తిరపము.

**తిర్లాడు** *v.n.* : To attend, be in waiting, to wander about. తిరుగు, కరణముగా తిర్లాడినాడు he was employed as clerk.

**తిర్లిక** *n.* : A lamp. దీపము.

**తిలకము** *n.* : A mark or beauty spot, made on the forehead with black, scarlet or gold paint. బొట్టు A brooch, A masterpiece, the acme or opex. a paragon. శ్రేష్ఠమైనది. చోరగణతిలకము the prince of rogues. శృంగార తిలకము. the masterpiece of poetry. నదీ తిలకము the prettiest of rivers. A certain tree. బొట్టుగుచెట్టు. **తిలకించు** *v.n.* : To shine. ప్రకాశించు. To be favoured ప్రసన్నతనొందు. *v.a.* : To view, behold. చూచు.

**తిలలు** *n.* : Sesamum or gingily seeds. నువ్వులు. **తిరకారకుడు** or **తిలఘాతుకుడు** *n.* : An oilman. తిలఘాతుకురాలు a female of that caste. వాడు మహా తిలఘాతుకుడు he is a cruel wretch.

**తివ** : Same as తిగ.

**తివాసి, తివాసీ** or **తివాస** *n.* : A carpet. రత్నకంబళి.

**తివియు** or **తిగియు** *v.a.* : To pull, draw, drag. ఊడ్చు.

**తివుచు** : Same as తిగుచు.

**తివుట** *n.* : Desire. కోరిక.

**తివురు** *v.t. & n.* : To desire. కోరు. To think ఆలోచించు. To try ప్రయత్న పడు. To hasten, త్వరపడు. To rejoice కుతూహలపడు. To be angry కోపపడు. To excel, to resound. మ్రోగు.

**తిస్సాలా** *adj.* : Triennial, once in three years.

**తీంఢ్ర** or **తీంఢ్రము** *n.* : Splendour. ప్రకాశము. Warmth, heat వేడిమి. Light, radiance తేజస్సు. Activity చురుకు. Enterprise చొరవ. తీంఢ్రము *adj.* : Hot, warm, తీక్ష్ణము, ప్రచండము. **తీంఢ్రించు** or **తీంఢ్రిల్లు** *v.n.* : To shine, or be luminous. ప్రకాశించు, **తీంఢ్రతీగ** *n.* : A certain medicinal plant.

**తీక్ష్ణము** *n.* : Heat. వేడిమి, Sharpness, haste, keenness, wit. **త్వర, చురుకు** adj. Sharp, hot, hasty, keen. **చురుకైన, వాడియైన. తీక్ష్ణగంధము** *n.* : The tree called పెద్దతుమ్మి, నెరవంజి, కందారి చెట్టు. **తీక్ష్ణత్వము** *n.* : Asperity, pungency. తీక్ష్ణ తుండము a mosquito దోమ.

**తీగ, తీగె** or **తీవ** *n.* : A creeping plant or vine ; a tendril or spray. లత. A wire, the string of a lute, తంతి. A necklace of gold wire, a gold or silver belt, మొలనూలు. **తీగెగరిక** *n.* : A creeping species of bent grass, called తీగబచ్చలి a creeper.

**తీట** *n.* : Itching, smarting. దురద. Itch గజ్జి Inclination. lust, liking.

**తీడిరించు** *v.n.* : To shine. ప్రకాశించు.

**తీడు** *v.t.* : To sharpen. వాడిచేయు. To trim or prune, as a bird does its feathers with its beak. To gnash the teeth or bite the lips in rage. మీసాలు తీడి twisting his mustaches.

**తీతకోత** *n.* : gleaning and reaping.

**తీతువ** or **తీతువు** The yellow wattled Lapwing, **ఎఱ్ఱతీతువ** *n.* : The Red-wattled Lapwing.

**తీనియ, తిన్నియ, తీనె** or **తిన్నె** *n.* : A stone bench, a pial అరుగు.

**తీపి** or **తీపు** *n.* : Sweetness. Love, liking ఇచ్ఛ. A pang, throbbing pain యాతన. *adj.* : Sweet. మధురము. తీపిపుట్టించు *v.t.* : To give an appetite, or sharpen the inclination. తీపి ఉలవి or ఉలవటెంకి or నల్లఉలవి *n.* : A kind of fish. తీపుత్రాడు a sweetened string for catching birds with. **తీపురము** *n.* : A joke. ఆగడము.

**తీయన** or **తియ్యన** *n.* : Sweetness.

**తీయని** *v.* : Neg. P|| of తీయు. *adj.* : sweet. తియ్యని, తీపిగల.

**తీయము** *n.* : Wish, desire. ప్రీతి.

తొలగ జేయు. To put away తొలతొలమని Crying Stop ! stop ! తాళుతాళుమని, తొలతొలండు Up ! begone ! rise ! Contracted for తొలగండి.

**తొలసి** or **తొళసి** *n.* : The Tulasi plant. తులసి. తొళిసిపూసలు beads of Tulasi wood.

**తొలి** *adj.* : First, former, ancient, old, previous. తొల్లి, తొలినాడు the day before. ఆ తొలినాడు the day before that ఆ తొలిరాత్రి the night before that. తొలితొలి the very first.

**తొలిపించు** *v.a.* : To hollow out (a thing.) రాతిలోగాని, చెక్కలోగాని పల్లము చేయించు. To get a thing washed. కడిగించు.

**తొలు** *adj.* : First. తొలుకోడి కుయ్యంగ when the earliest cock crows. తొల్నాడు the day before. See తొలుత.

**తొలుకరి** : Same as తొలకరి.

**తొలుకారు** *n.* : The rainy season. వర్షకాలము. (తొలుత + కారు.) the first crop in the season మొదటి కారుపంట.

**తొలుకు** *v.n.* : To rain. వర్షించు, కురియు. తొలు మొగులు (తొలుకు + మొగులు) a raining cloud వర్షించు చున్న మేఘము. To burst forth, overflow, be emitted (as flames, tears, rays, sweat, & c.) తొలుకునవ్వు a smile playing or beaming over the countenance.

**తొలుకుడుపు** *n.* : The "first meal" given to an infant at weaning. అన్నప్రాశనము.

**తొలుగు** : Same as తొలగు.

**తొలుచు** or **తొల్చు** *v.a.* : To bore, perforate, To hollow, dig, scoop. To carve wood. To polish, furbish. To cleanse or rinse. కొయ్యతొలుచు పురుగు the wood-borning insect called a death-watch. ఆ పాత్రను తొలిచినాడు he cleaned or polished the dish.

**తొలుత** or **తొల్త** *n.* : Beginning. మొదలు, ముందు. *adj.* : First. మొదటి. *adv.* : At first, in the first place. **తొలుతటి** *adj.* : First, prior, preceeding. తొలుతటిపదము the preceding word. **తొలుత** or **తొలు దొల్త** *adv.* : At the first, at the very beginning. **తొలునాడు** *n.* : The day before. **తొలుబాము** *n.* : A former birth. పూర్వజన్మము.

**తొలుసంజ** *n.* : The early dawn. ప్రాత స్సంధ్యాకాలము. See తొలు and తొలి.

**తొల్చు** : See తొలుచు.

**తొల్త** : See తొలుత.

**తొల్లి** *n.* : A former time. ముందు, పూర్వము. *adj.* : Former, foregoing ముందటి. *adv.* : First, formerly, of old. of old Infi. తొంటి, తొంటికంటె more than before. **తొల్లింటి, తొల్లిటి** or **తొంటి** *adj.* : Former, old, ancient, of ancient days. తొల్లింటి యట్ల like as before.

**తొల్లించు** : Same as తొర్లించు. See under తొరలు.

**తొల్లిక** or **తొల్లిక** *n.* : A small hoe. తవ్వుకోల.

**తొల్లుగడ** *adj.* : Joint, mutual, as a bond.

**తొళక** *adj.* : Thin. పలుచని.

**తొళసి** : Same as తులసి.

**తొవ** or **తొగ** *n.* : A water lily. కలువ.

**తొవర** : Same as తొగర. తొవరి Same as తొగరి. తొవరు Same as తొగరు.

**తొవ్వ** : Same as తవ్వ.

**తొస్స, తొస్సి** or **తొస్సె** *n.* : Brokenness. The state of being chipped, as glass. A defect in pronunciation. owing to a tooth having fallen away. A slip or mispronunciation. ఉచ్చారణ లోపము adj. Chipped or broken on the edges. మొఱ్ఱివాడు మాట్లాడడములో తొస్సులు పోతున్నవి his pronunciation is lisping or imperfect.

**తో** or **తోడ** *conj.* : With, together with, accompanied by, accompanying or following.

**తోక** *n.* : A tail. తోకత్రొక్కిన పామువలె like a snake whose tail has been trodden on. **తోకచుక్క** *n.* : A comet : a star with a tail. ధూమకేతువు. **తోకపీకుళ్లు** *n.* : Plagues, hobbles, squabbles. తోకపీకుడుగాడు one who is always stirring up strife.

**తోకము** *n.* : A child, offspring. బిడ్డ, అపత్యము.

**తోకటవట్టు** *n.* : A pollard tree. A tree that is half dead.

**తీకొను** *v.n.* : To bring, to bring along with one. వెంటబెట్టుకొని వచ్చు.

**తోకోజి** *n.* : The crimson breasted Barbet or Coppersmith.

**తోగు** *v.n.* : To sink. మునుగు. to become wet. తడియు.

**తోచిగాడు** *n.* : A male hawk. మగడేగ.

**తోచ** *n.* : A chuckler, a worker in leather. మాదిగవాడు.

**తోచు** *v.n.* : To arise. పట్టు To occur to the mind, to seem, appear, To appear, as the sun; to become visible, ప్రత్యక్షమగు.

**తోట** *n.* : A garden. తోటకాపు, తోటమాలి, తోటవాడు or తోటీడు a gardener. తోటకూర *n.* : Greens, garden herbs.

**తోటి** *n.* : A Panchama or pariah. మాలవాడు.

**తోడ** (from తోడు.) : a case ending. With. Together with. See తో, తోడవడ్డి including interest, the interest like wise. **తోడనే** adv. Together : at once, as soon as, వారు వచ్చినతోడనే as soon as they came. తోడబుట్టు *v.n.* : To be born with, or be a brother to. **తోడబుట్టినవాడు** *n.* : A brother. తోడబుట్టినది a sister. **తోబుట్టు, తోడబుట్టు, తోడ బుట్టుగు** or **తోడబుట్టువు** *n.* : A brother or sister : lit : a fellow child.

**తోడంటు** or **తోడు** *n.* : Sour milk kept to curdle other milk with. చేమిరి.

**తోడా** *n.* : A kind of gold jewel worn on the arm. హస్తభూషావిశేషము.

**తోడి** *adj.* : Fellow, joint. తోడికులాంగనలు the ladies who were her fellows. **తోడికోడలు** *n.* : A fellow sister-in-law. మగని తోడబుట్టినవాని భార్య. **తోడియల్లుండ్రు** fellow sons-in-law, the husbands of sisters. షడ్డకులు. **తోడివాడు** a companion తోడనున్నవాడు.

**తోడు** *n.* : Swearing an oath. ఆన An affix, as నీతోడు I swear by you. A sister తోడబుట్టువు. Also, a souring stuff, చెమిరి, తోడుచల్ల same as తోడంటు. Aid, help, convoy సహాయము. A helper or companion. **తోడుత** or **తోడ్త** *adv.* : With, along with. తోడను. **తోడుంతోడ, తోడ్తోడ, తోడుతో** or **తోడ్తో** *adv.* : Immediately, at once, therewith, together. వెంబడిని. **తోడుదొంగ** *n.* : An accomplice. **తోడునీడ** *n.* : Aid and protection. A helper or companion.

**తోడు** *v.a.* : To draw or take up (water:) to bale. To dig up. కెల్లగించు. To wind, as thread. నూలుపోగు తీసిచుట్టు. కుంభముతోడు to place the dinner before the goddess. వడ్డించు. **తోడికొను, తోడుకొను** or **తోడ్కొను** *v.a.* : To bring along with one, to lead; to draw water. వానిని ఇక్కడికి తోడుకొనిరా bring him here. *v.n.* : To curdle as milk. పేరుకొను. పాలుతోడుకొన్నవి the milk curdled. **తోడితెచ్చు, తోడుతెచ్చు, తోడ్తెచ్చు** or **తోతెచ్చు** *v.t.* : To fetch, to go and bring పిలుచుకొనివచ్చు. **తోడించు** *v.a.* : To have drawn, to cause (water) to be raised. తోడ్తేర = కూడా పిలుచుకొని రావడానకు.

**తోడెము** *n.* : A little, a trifle. కొంచెము, లేశము. వచ్చిన దూరము తోడెము the distance we have come is the shortest. *adj.* : Small, little. చిన్న. చిరి. తోడెంపువ్వులు smiles, gentle laughter.

**తోడేలు** or **తోడెలు** *n.* : A wolf. వృక్షము. The Indian Wolf, చొప్పతోడేలు a weevil that destroys hay.

**తోడ్తెచ్చు, తోడుతెచ్చు** or **తోతెచ్చు** : See under తోడు.

**తోడ్తో, తోడ్తోడ, తోడ్తోన** or **తోడ్తోనే** : See under తోడు.

**తోడ్పాటు** or **తోడుపాటు** : See under తోడు.

**తోతెంచు** *v.n.* : To be borne, to arise పుట్టు, ఉదయించు. To make its appearance, to become visible కనబడు, ప్రత్యక్షమగు. To come, వచ్చు.

**తోత్రవము** *n.* : A goad, a spike. ఏనుగును బెదిరించేయీటె, ములుగోల.

**తోదనము** *n.* : A goad. మునికోల. Poking with the fingers; causing pain,

నొప్పించుట. పాపతోదనము atonement, doing away with sin, తొయ్యడము.

**తోదము** *n.* : Pain. దుఃఖము. శిరస్తోదము headache.

**తోదు** *n.* : A series. వరుసకట్టు.

**తోదోపులు** *n.* : Exultation, pushing forward. **తోదోపులుమీరి** in an increasing struggle; ప్రజవిస్తారము వచ్చినది గనుక తోదోపులు నేడు అధికము a great crowd of people came, so to-day there is great excitement.

**తోన** postp. With. Thereupon, immediately. వెంబడి.

**తోనిగాడు** *n.* : A sort of hawk.

**తోప** *n.* : Paste, batter. పిండియుడక బెట్టినది, సంకటి. A wallet or bag of provisions.

**తోప** *adv.* : Apparently, in appearance, seeming, being manifested తోచేటట్టుగా, చిరునవ్వుతోప while a smile beamed over her countenance. దీనతతోప humbly. క్రోధము పాపకారి అని ఈశ్వరుడు నా బుద్ధికి తోపజేసినందున as God put it into my heart that cruelty was a sin.

**తోపడ** *n.* : A carpenter's plane.

**తోపమి** *n.* : Non-appearance.

**తోపరా** *n.* : A horse's nosebag for its food.

**తోపాటు** *adv.* : Like, as వలెన.

**తోపారము** *adv. n.* : A leather mask put on the face of a hawk డేగ ముఖమునకు కట్టే తోలుగంత.

**తోపి** *n.* : A cap or hat. కుళ్లాయి.

**తోపు** *n.* : A grove. తోట. Redness ఎరుపు. A paste put over certain cakes సుకియలులోనగువాని మూత పిండి. *adj.* : Red. తోపుచీర a red petticoat.

**తోపు** *v.t.* : To convey an idea. దీనతదోపనాడుచున్ to give him an idea of her misery. **తోపింపజేయు** or **తోపజేయు** (causal of తోచు.) *v.t.* : To cause, to think, to suggest. ఈశ్వరుడే అతనికి తోపింప చేసినందున. as God put this into his heart. See తోప adv.

**తోపు** or **తోపుడు** *n.* : A shove or push. Rejecting, refusing, thrusting away. **తోపుడు** or **త్రోపుడు** *n.* : Dismissal, putting away.

**తోమగరిక** *n.* : A sort of grass.

**తోమరము** *n.* : An iron club, a lance, a hog spear. నేజా, చిల్లకోల.

**తోమాలె** or **తోమాలియ** *n.* : A wreath, garland, or string of flowers and leaves.

**తోము** *v.a.* : To rub, rub down, handle, scrape, clean, రాచు, రుద్దు. To set or grind a razor, అరగదీయు. To beat or flog. **తోముకము** *n.* : Rubbing, polishing, cleaning. తోముట. తోముకొను to rub or clean. పళ్లు

తోముకొను to wash the teeth. **తోముడు** *n.* : Rubbing రుద్దుట. **తోమించు** *v.t.* : To cause to be rubbed, & c., to have (it) cleaned, & c.

**తోయము** *n.* : A marvel or wonder. చిత్రమైన వస్తువు. A band, or company తెగ, పరివారము. A delicacy, a tit bit, something nice కమ్మని వస్తువు, వింతవస్తువు Manner విధము. A time or opportunity తడవ, సమయము. తోయమువారు companions.

**తోయము** *n.* : Water. తోయజము e. Lit. The water born, i.e., the lotus. **తోయజాక్షి** *adj.* : Bright-eyed. having eyes charming as the lotus. **తోయదము** *n.* : A cloud. మబ్బు. **తోయధి** *n.* : The sea, the ocean.

**తోయలి** : Same as తొయ్యలి.

**తోయు** or **త్రోయు** *v.a.* : To push, thrust, shove, propel. To dismiss, to deduct. కాలముతోస్తున్నారు. they pass their time పడద్రోయు to knock down తోసివేయు to do away with, set aside, dismiss.

**తోరణము** or **తోరణ** *n.* : A wreath, a garland, a festoon of leaves, & c., hung over a doorway or across a road, & c., A gate. జ్వాలా తోరణము a bonfire.

**తోరమల్లి** or **తోరమల్లె** *n.* : Tourmaline. Crystal. A false diamond.

**తోరము** *n.* : Thread consecrated and worn on the arm in token of a vow. కంకణము, చేతికి కట్టేది, వ్రత సూత్రము, **తోరము** or **తోరంపు** *adj.* : Great, large, strong, fine, nice, పెద్ద, చక్కని, బలిష్టము, తోరంపు పన్నీరు fine rosewater. తోరంపు కోపము great anger.

**తోరహత్తము** *n.* : A feat in wresling. మల్లబంధవిశేషము.

**తోరహత్తు** *adv.* : In large quantities, amply. సమృద్ధము.

**తోలు** *n.* : Skin, leather, bark. నల్లతోలు a dark skin. ఎర్రతోలు a fair skin. తోలుక Same as తోలు. *n.* : **తోలు దాలుపు** or **తోలుదాల్పు** *n.* : Lit. One who wears skins, i.e., Siva. **తోలువాద్యము** *n.* : A drum. వాద్యము.

**తోలు** or **త్రోలు** *v.a.* : To drive. వాటిని తన మందలోకి తోలుకొన్నాడు. he drove them into his flock. కపిల తోలు to draw (water,) with a bucket, raised by oxen, to work (a pump).

**తోవ, త్రోవ** or **దోవ** *n.* : A way, path. A road, way or means, an expedient.

**తోసిరాజు** *n. Lit* : A king that has to be driven away. A technical phrase in Chess answering to 'Check'!, 'Sheikh' or 'Shah'.

**తౌ** or **తవు** *v.n.* : To be fit. తగియుండు. or, from తవ్వు *v.a.* : To dig.

**తౌగోల** ro **తవ్వుకోల** *n.* : A spade : a hoe.

**తౌడు** or **తవుడు** *n.* : Bran. చిట్టు. తవుడు చల్లినట్టు ఉన్నాడు they are as thick

as chaff. **తౌటిపాము** or **తవుటిపాము** *n.* : A kind of fish. మలుగుచేప.

**తౌలు** or **తవులు** (from తగులు.) *v.n.* : To follow. వెంబడించు. To be caught చిక్కుభార. Connection. తగులము. తౌలుకొను or తవులుకొను Same as తగులుకొను.

**తౌల్యము** *n.* : Resemblance, similitude. సామ్యము.

**త్యజించు** *v.a.* : To leave, quit, desert, abandon. విడిచిపెట్టు. **త్యజనము** *n.* : Abandonment, desertion. విడుపు. **త్యక్తము** *adj.* : Left, quitted, deserted. విడువబడిన. **త్యాగము** *n.* : A giving up, or renunciation. abdication. విడుపు. A gift, donation.

**త్రంపి** : Same as తంపి.

**త్రచ్చు** or **తరుచు** *v.a.* : To churn butter, & c., చిలుకు. To examine, investigate, stir, search. శోధించు, పరీక్షించు, పరిశీలించు. త్రచ్చన *n.* : Churning. చిలుకుట.

**త్రప** *n.* : Modesty, shame. సిగ్గు.

**త్రమ్ము** *n.* : Dust, *v.t.* : to dirty. To cause to be dusty. దుమ్ముచేయు.

**త్రయము** *n.* : A trio. Three collectively, మూటిసమూహము. కవిత్రయము వారు the three poets, i.e., the Telugu poets నన్నయ, తిక్కన and ఎఱ్ఱాప్రగడ. కాలత్రయము at all hours, morn, noon and night. లోకత్రయము the universe, ie., heaven, earth and hell, పరలోకము, భూలోకము, పాతాళ లోకము. **త్రయి** n. The three.

**త్రవ్వు** : Same as తవ్వు. త్రవ్వుకోల Same as తవ్వుకోల. త్రవ్వటము Same as తవ్వడము or తవ్వుట. త్రవ్వటించు Same as త్రవ్వు. త్రవ్వితండము *adj.* : Innumerable. అసంఖ్యము.

**త్రసరేణువు** *n.* : Dust in the balance. An atom, a mote in the sunbeam. ముప్పది పరమాణువుల కొలది.

**త్రస్తము***adj.* : Timid, fearful. భయపడిన. **త్రస్తుడు** *n.* : One who is timid.

**త్రస్తరి** *n.* : A gibe, a taunt, scorn, ridicule, పరిహాసము. **త్రస్తరించు** *v.a.* : To laugh at, to ridicule, or chaff. పరిహాసముచేయు.

**త్రస్స** *n.* : Drops of saliva that fall out while speaking. నోటినుండి రాలే తుంపర.

**త్రాగు** or **త్రావు** : Same as తాగు to drink. త్రాగుడు or త్రావుడు *n.* : Drinking పానము. ఆము.

**త్రాచు** : Same as తాచు a cobra.

**త్రాడు** : Same as తాడు a rope. A ray of light. కిరణము. త్రాడు దాలుపు an epithet of Varuna వరుణుడు. **త్రాడుపడు** *v.n.* : To become lean as a thread to become emaciated, కృశించు, దారమగు.

**త్రాణ** *n.* : Strength, nerve, might, vigour. బలము, శక్తి. త్రాణము *n.* : Protection. రక్షణము. **త్రాత** *n.* : A protector, saviour. కాచువాడు. త్రాతము *adj.* : Protected, కావబడిన.

**త్రావు** : Same as త్రాగు.

**త్రాసము** *n.* : Fear, dread, horror. భయము. **త్రాసామయము** *n.* : Palsy. వణుకురోగము.

**త్రాసు, తరాసు** or **తరాజు** *n.* : A balance, or pair of scales.

**త్రాహి** *n.* : Mercy ! Help !

**త్రి** *pron.* : Three మూడు. **త్రింశత్** or **త్రింశత్తు** *n.* : Thirty. ద్వాత్రింశత్ Thirty two త్రికము *n.* : The thigh bone. ముడ్డిపూస. A water wheel. కపిల. **త్రికటుకము** *n. Lit* : The three spices, viz., black pepper, dry ginger, and long pepper. సొంటి, పిప్పలి, మిరియాలు. **త్రికరణము** *n.* : The three elements of action, i.e., thought, word and deed త్రికరణ శుద్ధి pure in thought, word and deed. **త్రికాలము** *n.* : The three times, i.e., morn, noon and night. **త్రికూటము** *n.* : A certain hill. **త్రికోణము** *n.* : A triangle. మోచేతి వంపు. **త్రికోణ కుండలి** *n.* : The pineal gland, the part of the brain wherein the soul is imagined to dwell. **త్రితయము** *pron.* : Three. మూడు. **త్రిదోషము** *n.* : Disorder of the three humours, viz., phlegm, bile. and strabilis. వ్రాతపిత్త శ్లేష్మములు. **త్రినేత్రుడు** or **త్రిలోచనుడు** *n.* : The three eyed god, that is Siva. **త్రిపథగ** *n.* : The stream which runs in "three beds", i.e., the Ganges, fabled to flow through heaven, earth and hades. **త్రిపుండ్రము** *n.* : The triple mark worn across the forehead by Saivites. (ఊర్ధ్వ పుండ్రము is the upright line worn by the Vaishnavites.) **త్రిపుట** *n.* : The name of a certain musical metre. ఏడక్షరముల కాలము. **త్రిఫలము** *n.* : The three species of myrobalan; the కరక, తాడి, and ఉసిరిక.

**త్రిభంగి** *adj.* : "Three-ways" twisted. The name of a certain graceful attitude in which some statues stand: such as the వేణుగోపాల or Piping Apollo; or that given to the ద్వార పాలకులు or door keepers carved on each side of a temple gate. **త్రివర్గము** a collection of three (things) as Duty (ధర్మము), Wealth (అర్థము), and Desire (కామము) or the *Gunas* called సత్వరజస్తమములు, or the three states called Increase (వృద్ధి), Decrease (క్షయము), and Stationariness (స్థానము). **త్రివేణి** *n. Lit* : The Triple braided, an epithet of the Ganges which. according to mythology, springs in three streams from the head of Siva.

**త్రిశూలము** *n.* : The three pronged weapon of Vishnu. **త్రిషవణము** *n.* : The thee ablutions, to be performed at morn, noon and night.

**త్రిక్క** : Same as తిక్క.

**త్రిక్కటి** : Same as త్రికము.

**త్రిక్కు** *v.n.* : To turn. తిరుగు. *n.* : A twist to turn. Mand తిరుగుళ్లు. Trouble బాధ. Difficulty చిక్కు.

**త్రిప్పు** or **తిప్పు** *v.t.* : To cause to turn. తిరగజేయు *n.* : Turning. తిరుగుడు. **త్రిప్పట** *n.* : Turning, roaming, wearisomeness తిరుగుట, ఆయాసము. త్రిప్పరి a roamer. **త్రిప్పుకొను** *v.n.* : To turn. తిరిగికొను త్రిప్పియాడు *v.t.* : To turn. త్రిప్పు. **త్రిప్పుతాడు** or **త్రిప్పుడు త్రాడు** a churnin rope తరిత్రాడు.

**త్రిమ్మరు** *v.n.* : To roam about at pleasure. ఇచ్చువచ్చినట్లు సంచరించు *v.t.* : To go round. చుట్టివచ్చు. **త్రిమ్మట** *n.* : Turning. Wandering about, సంచరించుట. **త్రిమ్మరి, త్రిమ్మట కాడు** or **త్రిమ్మరీడు** *n.* : A rover, wanderer, vagabond, stroller.

**త్రిష్టుప్పు** *n.* : A kind of metre in which the Vedas are composed. ఒక ఛందస్సు.

**త్రుంగు** *v.n.* : To break to pieces. తునకలగు. To be ruined, to perish. నశించు. **త్రుంగుడు** *n.* : Ruin నాశము. త్రుంగుడుపడు *v.n.* : To be ruined. నశించు. **త్రుంచు** or **తుంచు** *v.t.* : To break to pieces. తునకలు చేయు, తుంగజేయు. To kill చంపు. **త్రుంపు** or **త్రుంపుడు** *n.* : A piece, a fragment. ఖండము.

**త్రుక్కు** *n.* : Pride, vanity, conceit. త్రుళ్లు, గర్వము.

**త్రుటనము** *n.* : Breaking. తెగుట. **త్రుటి** *n.* : A twinkle, an instant. One fourth the time that it takes to pronounce a short letter. లఘ్వక్షరములో నాలుగో భాగమును ఉచ్చరించునంతకాలము. త్రుటితము *adj.* : Broken. తెగిన.

**త్రుట్టె** or **త్రుట్టియ** *n.* : A crowd or multitude సమూహము. త్రుట్టెలు కట్టు to become a crowd or swarm గుమికూడు.

**త్రుప్పు** or **తుప్పు** *n.* : Rust. ఇనుముమీది మురికి. Tastelessness, అరుచి. **త్రుప్పుడు** *n.* : A hair of a bird or animal.

**త్రుళ్లు** *v.n.* : To rise and fall suddenly. ఎగిరిపడు. To be arrogant or proud. గర్వించు. *n.* : Pride, arrogance ఎగిరిపాటు, గర్వము. **త్రుళ్లింత** *n.* : Rising and falling suddenly. ఎగిరిపాటు. Pride గర్వము.

**త్రుస్సు** or **త్రుస్సు** *n.* : A hissing sound. నీళ్లు చిమ్ముటయందగుధ్వని.

**త్రెంచు, తెంచు** or **తెంపు** *v.i.* : To cause to break తెగునట్లు చేయు.

**త్రెక్కొట్టు** *v.n.* : To cast away, to drive away. ఎగదట్టు.

**త్రెక్కొను** *v.t.* : To spoil. చెరుచు. To kill, చంపు. To confuse, కలచు. To swallow up. మ్రింగు. To drink త్రాగు. త్రెక్కోలు *n.* : Spoiling, & c. త్రెక్కొనుట. **త్రెక్కోలుకొను** *v.t.* & *n.* : To kill చంపు, త్రెక్కొనగా murderously, destructively ruinously.

**త్రెడు** : Same as తెగు.

**త్రెడ్డు** : Same as తెడ్డు.

**త్రెయ్యు** *v.n.* : To break తెగు.

**త్రెళ్లు** *v.n.* : To die. చచ్చు. To fall పడు.

**త్రెవ్వన** *n.* : Beauty. చక్కన, సౌందర్యము.

**త్రెవ్వు** *v.n.* : To break, perish, fall, be served, తెగు, ఖండితమగు. To wear down or be worn away.

**త్రేగుడు** or **త్రేవుడు** *n.* : Sticky saliva. జిగటపారిన ఎంగిలి.

**త్రేచు, త్రేపు, తేచు** or **తేపు** *v.n.* : To belch. త్రేపు, త్రేనుపు or **తేపు** *n.* : Belching. తేపుట.

**త్రేణు** *v.n.* : To come out. బయలుదేరు, వెడలివచ్చు.

**త్రేత** *n.* : The mythological Silver age, the second age of the world. The three sacred fires called గార్హపత్యము, దక్షిణాగ్ని, అహవనీయము.

**త్రేనుచు, త్రేన్పు, తేనుచు** or **తేన్చు** *v.n.* : To belch. త్రేనుపు, త్రేన్పు, తేనుపు or తేన్పు *n.* : Belching.

**త్రేవుడు** : Same as త్రేగుడు.

**త్రైగుణ్యము** *n.* : The three qualities called సత్వము, రజము, తమము.

**త్రైభంగికము** *n. Lit* : "Three ways". This is the name of a certain attitude. See త్రిభంగి.

**త్రైలింగ్యము** *n.* : A pedantic word for Telugu.

**త్రైలోక్యము** *n.* : The three worlds, Elysium, Earth, and Hades. The universe.

**త్రైవర్గికుడు** *n.* : One who seeks after the three objects of desire, viz : ధర్మము, అర్థము and కామము.

**త్రైవిద్యుడు** *n.* : One who knows the Veda. వేదము తెలిసినవాడు.

**త్రొొక్కు** or **తొొక్కు** *v.n.* : To tread, to trample. **త్రోొక్కుడు, తొొక్కుడు, త్రొొక్కట, త్రొొక్కటము** or **తొొక్కట** *n.* : Trampling. తొొక్కుట. Danger ఆపద. త్రొొక్కుడువడు, త్రొొక్కువడు, త్రొొక్కట పడు. **త్రొొక్కుడు బిళ్ల** or **తొొక్కుడు బిళ్ల** *n.* : A certain game played by children.

**త్రోచు** or **తోచు** *v.n.* : To hasten. వడిగొను. To undertake, పూను, To walk, నడుచు. To chase or follow after, కవియు. To go beyond or transgress, మీరు, అతిక్రమించు *v.t.* : To push, **త్రోయు**. To disregard, ఉపేక్షించు. To kill, చంపు.

**త్రోటి** *n.* : The beak of a bird. పక్షి ముక్కు. The mouth of a fish, చేపనోరు.

**త్రోయు** or **త్రోయు** *v.t.* : To push aside or away. తొలగమాకు. **త్రోపు** or **త్రోపు** *n.* : Pushing, తోయుట. An insult,

నిరాకరణము. Refusal, నిషేధము. **తోద్రోపు** (త్రోపు + త్రోపు) *n.* : A hard or violent push, మిక్కిలి తోయుట. **త్రోద్రోపులాడు** *v.t.* : To push hard or violently.

**త్రోపుచేయు** *v.t.* : To disregard, to slight. నిరాకరించు.

**త్రోలు** : Same as తోలు.

**త్రోవ, తోవ** or **దోవ** *n.* : A way, road, మార్గము. Means, an expedient. వెరపు. **త్రోవరి** (త్రోవ + అరి) *n.* : One who knows the way.

**త్ర్యంబకుడు** *n.* : A name of Siva త్ర్యంబకసఖుడు n. Kubera, the friend of Siva.

**త్వక్కు** or **త్వచము** *n.* : Skin తోలు. Rind, bark, husk, coat. చెట్టుపట్ట, నార, త్వక్పుష్పము a cutaneuous eruption, a blotch, a scab.

**త్వదీయ** *pron. adj.* : Thy, thine.

**త్వము** An affix like *tion, ing, ness, ship, & c.* in *action,* doing signifying the act or state of, మంత్రిత్వము the ministry; శత్రుత్వము enmity & c. ఋత్వము the vowel ex.

**త్వర** *n.* : Speed, rapidity, haste. **త్వరగా** *adv.* : Speedily, rapidly. **త్వరపడు** *v.n.* : To hasten, to hurry, or be active. **త్వరితము** *n.* : speed, haste, rapidity. *adj.* : Quick. త్వరగల, **త్వరితముగా** *adv.* : Speedliy, rapidly.

**త్వష్ట** *n.* : A carpenter వడ్లవాడు. The maker of the universe విశ్వకర్మ. One of the 12 Adityas, ద్వాదశాదిత్యులలో నొకడు.

**త్వష్టము** or **త్వాష్టము** *n.* : Bluntness, roughness, want of politeness. Clownishness. *adj.* : Vile, brutish. Wretched. వాడు వట్టి త్వాష్టుడు he is a villain.

**త్వాదృశము** *adj.* : Resembling you. నీవంటిది.

**త్సరువు** *n.* : A hilt or handle. కత్తిపిడి.

## ద

**దంగ** or **దంగా** *n.* : Bullying, outrage, Wrangling, mutiny, sedition, rebellion. దంగాపెట్టు to wrong, to outrage, దంగాపడు to be frightened.

**దంగు** *v.n.* : To be pounded, or cleaned. బియ్యము మీది పొట్టు తీసివేయబడు. **దంగుడు** *adj.* : Beaten, pounded, cleaned, దంచిన, దంగుడుబియ్యము pounded rice.

**దంచన, దంచనము** or **దంచెనము** *n.* : A large gun, a cannon. పెద్దఫిరంగి, బొంబసఫిరంగి, రోకటిఫిరంగి.

**దంచు** *v.a.* : To pound, to bruise, or clean grain in a mortar. దంపు.

**దంట** *n.* : A match, or equal, జంట. A rival, a competitor, A couple or pair. A hero, a genius సమర్థుడు. **దంటపిల్లలు** *n.* : Twins. కవలలు,

దంటమోములదేవర the two-faced god, i.e., Agni.

**దంటు** *n.* : A stalk of such plants as cholam. Pith. బెండ్లదంట్లు hay, sapless stalks. **దంటుకూర** *n.* : A kind of green vegetable the stalks of which are eaten.

**దండ** *n.* : Nearness. సమీపము. A side ప్రక్క. A prop. ప్రాపు. నాల్గు దండల on all sides, around. **దండ కడియము** *n.* : A bracelet worn on the arm. **దండకవిలె** *n.* : Local Archives : a chronicle or book giving the history of a village. పాతలెక్క పుస్తకపు కట్ట. **దండకోల** *n.* : A prop. ఊత.

**దండగ** : See దండుగ.

**దండనము** : See under దండించు.

**దండపడు** *v.n.* : To approach. సమీపించు. To become tough. ఎద్దు ముడ్డిమీద ముల్లుకోలతో పొడువగా బొరుసుగా నేర్పడు. **దండపాటు** *n.* : Approaching సమీపించుట, దండపడుట.

**దండము** *n.* : A bow, a salutation made by joining the palms of the hands in front of the breast. నమస్కారము.

**దండసిల్లు** or **దండసిలు** *v.n.* : To be jammed in. ఇరుకుకొను : to be pressed or squeezed అదుముడు పడు, అణగు.

**దండి** *n.* : Strength, power, valor, courage, heroism ప్రతాపము, శౌర్యము One who carries a staff. A staff-bearer. దండము గలవాడు. Name of a Sanskrit poet. A gate keeper, ద్వారపాలకుడు. **దండిగా** *adv.* : Much, thoroughly, constantly. దండితనము n. Might, vigour.

**దండించు** *v.a.* : To punish, chastise. దండించిన దండన the punishment inflicted. **దండితుడు***n.* : One who is punished దండింపబడినవాడు. **దండ్యుడు** *n.* : One who deserves punishment. **దండనము** or **దండన** *n.* : Punishment. దండించుట.

**దండిక** *n.* : A guitar. కిన్నెర. A part of necklace హారమందలి పేట.

**దండిగ** *n.* : An ornamental palankeen or royal litter.

**దండు** *n.* : An army, a multitude, a swarm, సైన్యము. సమూహము. మిడతల దండు a swarm of locusts. **దండెత్తు** To raise an army. యుద్ధ ప్రయత్నము చేయు. To wage war. To invade.

**దండుగ, దండగ, దండుగు, దండువ** or **దండువు** *n.* : Loss. నష్టము. A fine: జుల్మానా. కలిమి దండుగ *n. Lit*: A tax on wealth, as income tax.

**దండుదారి** or **దండుబాట** *n.* : A high way.

**దండుదివ్వె** or **దండుదివియ** *n.* : A lampstand దీపపు సమ్మె.

**దండె** or **దండియ** *n.* : A guitar, కిన్నెర, తంబుర. A pole. కఱ్ఱ, గడ. The pole of a palankeen. పల్లకి బొంగు. The beam of a pair of scales త్రాసుకోల.

**దండెము** or **దండియము** *n.* : A cord line, or pole on which clothes are hung to dry. A kind of gymnastic exercise. దండెములు తీయు to perform a kind of gymnastic exercise, which consists in resting the hands on the ground and moving the body to and fro. కాళ్లు చేతులు నేలను మోపి ముందుకు వెనుకకు ఊగుట.

**దండోరా** *n.* : Proclamation by beat of tom-tom. దండోరావేయు to proclaim by beat of tom-tom or drum.

**దంతము** *n.* : A tooth. పల్లు. Ivory. జీవదంతము solid ivory. **దంతధావనము** *n.* : Cleaning the teeth. పళ్లు తోముట. **దంతావళము** *n.* : An elephant with tusks, a tusker; an elephant. **దంతి** *n.* : A kind of tree. జాంబవతీ వృక్షము. An elephant, ఏనుగు. One who has projecting teeth కోరపంటివాడు. See దంతురుడు.

**దంతురత** *n.* : Ups and downs. Unevenness. నిమ్నోన్నతము, మెరక పల్లము. **దంతురము** *adj.* : Uneven.

**దంతె** or **దంతియ** *n.* : A grade of any kind : a fold, a layer of earth. A large rake. పైరుమీద దున్నే యంత్రము, కొయ్యపండ్ల అచ్చు. వెన్ను దంతె a harrow. A rafter అడ్డముగా వేసే పట్టె. **దంతెనము** *n.* : A large rake.

**దంత్యము** *adj.* : Dental; of or belonging to the teeth. *n.* : A dental letter.

**దండడి** *adj.* : Much, great. Thick. తరుచైన. adv. Thickly, crowdedly, much. తరుచుగా, దొమ్మిగా, మిక్కిలి. **దండడించు** *v.n.* : To thicken. తరుచగు, దట్టమగు. **దండడిపెట్టు** *v.a.* : To be confused, కలవరపెట్టు. To oppress, to trouble. రాయిడిచేయు.

**దండన** *n.* : A trick, a delusion, guile. మాయ జాలము. **దండనకాడు** *n.* : A trickster, a deceiver. జాలము చేయువాడు. **దండనకత్తె** *n.* : A woman who deceives, a gipsy. జాలము చేయునది.

**దండశూకము** *n.* : A serpent సర్పము.

**దండహ్యమానము** *adj.* : Burning.

**దంపకర్రు** *n.* : The plough share used in wet land., **దంపనాగలి** *n.* : A sort of plough used in wet land. అడుసు దున్ను నాగలి.

**దంపతులు** *n. plu.* : Man and wife. ఆలుమగలు. దంపతిపూజ worship or homage paid to a man and his wife.

**దంపు** Same as దంచు. *n.* : Beating, pounding, bruising. దంపుటిల్లు a room in which rie, & c., are pounded. **దంపుడు** *n.* : The act of pounding. దంచుట. దంపుడు బియ్యము cleaned rice. **దంపించు** *v.n.* : To cause to pound.

**దంభము** *n.* : Fraud, cheating, hypocrisy. కపటము. See డంబము and డాంబికము. A pretence. వ్యాజము. Insolence, impudence. A fault

తప్పు. *adj.* Pretended, delusive. దంబ భూసురుడు a pretended Brahmin.

**దంభోళి** *n.* : A thunderbolt. పిడుగు, వజ్రాయుధము.

**దంశము** *n.* : A fly, a gad fly. అడవి ఈగ. దంశము or దంశనము a bite, కాటు, a piece of armour, కవచము. **దంశి** *n.* : A forest mosquito. అడవిదోమ. దంశిక *pincers, tongs,* పటుకారు. **దంశితుడు** *n.* : One who is bitten. కాటుపడ్డవాడు. One who wears an armour, కవచము తొడిగినవాడు.

**దంష్ట్ర** or **దంష్ట్రము** *n.* :A tusk or large tooth. కోరపల్లు. **దంష్ట్రాయుధము** *n.* : That which is armed with tusks, i.e., a wild boar. వరాహము. **దంష్ట్రి** *adj.* : Tusked, toothed, carnivorous. *n.* : A wild boar.

**దక్కినము** : The South.

**దక్కు** *v.n.* : To be available for enjoyment. అనుభవయోగ్యమగు. To fall to one's share or lot; to be saved, to escape. *adj.* : Enjoyable. అనుభవయోగ్యము.

**దక్షత** *n.* : Skill, cleverness. ability. నేర్పు. Management; protection. మగదక్షత లేనిదై being without any male protector. **దక్షత్వము** *n.* : Ability, cleverness, dexterity. సమర్థత. **దక్షుడు** *n.* : A clever or capable man. నేర్పరి. Name of Brahma, దక్ష ప్రజాపతి. కార్ముక దక్షుడు one skilled in archery. మాయాదక్షుడు a clever rogue.

**దక్షాయ్యము** *n.* : A kite. గద్ద.

**దక్షిణ** *n.* : A present given to a priest at a sacrifice. యజ్ఞాదులందు ఋత్విగాదాదులకిచ్చే ద్రవ్యము. A present. An offering made in money. In alms, గురుదక్షిణ the money fee or payment offered to an instructor. వారు ఒక రూపాయి దక్షిణ ఇచ్చిరి they gave a present of one rupee.

**దక్షిణము** *n.* : the right hand side (i.e., while facing the East). The south. **దక్షిణకైలాసము** the southern Kailasa-an epithet given to the town of Kalahasti. **దక్షిణాపథము** the Deccan and South India together.

**దఖలు** or **దాఖలు** *n.* : Insertion, entering. An application. దాఖలు చేయు to present, to file, admit, & c.

**దగ** *n.* : Heat. తాపము. Thirst అతిదాహము.

**దగదగ** or **ధగధగ** *n.* :Brilliancy, glittering. *adj.* : Bright దగదగమను or **దగదగలాడు** *v.n.* : To glitter, to flash.

**దగర** : Same as డగర.

**దగరము** : Same as డగరము.

**దగరు** *n.* : Sand. ఇసుక.

**దగా** *n.* : Fraud, deceit, cheating. మోసము. దగాచేయు to deceive.

**దగుల్బాజి** *n.* : A rogue, a cheat. మోసకాడు.

**దగ్గలి** *n.* : A kind of plant used for food.

**దగ్గిర, దగ్గర** or **దగ్గర** *n.* : Nearness. సమీపము. *adv.* : and postposition. By, at, near, close by, at hand, towards, to, with, in possession of.

**దగ్గు** *v.n.* : To cough. కాసము చేయు. *n.* : A cough. కాసము.

**దగ్ధము** *adj.* : Burnt. కాల్పబడిన.

**దచ్చి** or **దచ్చువుక** *n.* : A word used at games, for eight. ef. దుగవచ్చి, దచ్చికాళ్లమెకము a fabulous beast with eight legs. శరభము.

**దటాయించు** *v.t.* : to chide, browbeat, enub.

**దట్ట** : Same as దట్టా.

**దట్టడుగులు** *n.* : Toddling, totterings steps like those of an infant.

**దట్టన** *n.* : thickness, closeness, coarseness. Threatening. bullying. అదలుపు, తర్జనము. **దట్టించు** *v.t.* : To bully, to frighten. అదలుచు.

**దట్టము** or **దట్ట** *n.* : A body or multitude. Crowd, assembly. తురంగ దట్టము a troop of horses, అశ్వ సమూహము. గుఱ్రపు దట్టలు crowds of horses.

**దట్టా** *n.* : A stopper or cork బిరడా.

**దట్టీ** or **దట్టి** *n.* : A sash, belt, girdle, cestus round the waist. నడికట్టు, కాసెకోక. **దట్టించు** *v.n.* : To tie up the girdle. దట్టికట్టు.

**దట్టుడు** *n.* : A brave or daring man, a hero; a clever man, a man of ability. చతురుడు, సమర్థుడు, దిట్టతనము గలవాడు, శూరుడు.

**దడ** *n.* : Tremor, agitation. వణుకు. Faintness. apprehension.

**దడదడ** *adv.* : All at once, swiftly. వడిగా. **దడదడమను** *v.n.* : To palpitate. దడదడకొట్టుకొను.

**దడము** *n.* : Firmness or thickness. దట్టము. An army, సేన. A multitude. సమూహము.

**దడాలన** *adv.* : Slapdash, at one thrust.

**దడి** *n.* : A screen of leaves, bamboos, & c., a fence. plu. దళ్లు దడిబియ్యము *n.* : A certain rite observed regarding maidens.

**దడిగ** *n.* : A large shield carried as an ensign.

**దడిబము** *n.* : A bed. పరుపు, మెత్త, తల్పము, శయ్య.

**దడిమము** *n.* : A robe. A bed, పరుపు. *adj.* : Thin, సన్నని.

**దడియ** *n.* : Land at the foot of a hill. కొండచేరువ నేల.

**దడియము, దడెము, దడ్డియము** or **దడ్డెము** *n.* : A weight equal to five, or ten seers. ముద్దదడియము thirty seers.

**దడియు** *v.n.* : To shiver, tremble. వణకు.

**దడ్డీ** *n.* : A lump or ingot of steel.

**దడ్డు** *adj.* : Naked. **దడ్డు సన్యాసి** *n.* : An ascetic who goes naked.

**దణా** *n.* : An army. సేన. **దణాయుడు** *n.* : A leader of an army. సేనాధిపతి. **దణి** *n.* : A master, a ruler, a king. ప్రభువు; రేడు.

**దణ్ణము** : Same as దండము a salutation.

**దణ్నెము** : Same as దండెము.

**దత్తము** *adj.* : Given, presented. ఇయ్యబడిన. Adopted, reared. **దత్తు** or **దత్తువు** *n.* : Adoption. స్వీకారము. **దత్తకుడు** *n.* : An adopted son. దత్త పుత్రుడు. **దత్తి** *n.* : A gift. ఈవి, దానము.

**దత్తూరము** : Error for దుత్తూరము.

**దద్దనాళ** *n.* : Tumuli, prehistoric tombs, commonly called పాండవయిండ్లు.

**దద్దరించు, దద్దరిల్లు, దద్దిర్లు** or **దద్దరు** *v.n.* : To be alarmed, perplexed, confounded. To be scared or inflamed. తత్తరపడు.

**దద్దళము** or **దద్దడము** *n.* : A flat ceiling. A small temple with a flat mud roof. చిన్నగుడి. A flat roofed house. ఇంటిమిద్దె.

**దద్దు** or **దద్దురు** *n.* : A hump. A slight swelling of the skin. పొక్కు.

**దధి** *n.* : Curds. పెరుగు. దధ్యుదము or దధ్యుదాకరము a sea of curds. **దధ్యోదనము** *n.* : A pudding of curds, rice and spice with salt.

**దనియాలు** or **ధనియాలు** *n. plu.* : Coriander seeds. కొత్తిమిరివిత్తులు.

**దనియు** *v.t.* : To meet, to unite. కూడు, కలియు, **దనివు** *n.* : A meeting, union. కూడిక, సంగమము.

**దమక, దాక** or **దాకా** *adv.* : Until. వరకు, పర్యంతము.

**దనుకు** or **దన్కు** *v.n.* : To kindle or catch fire. నిప్పు అంటుకొను. To strike, to touch. తాకు దోషము దనుకక the sin not having come home to him. దోషము అంటక To have, పొందు.

**దనుజుడు** *n.* : A giant, fiend, demon. అసురుడు, తొలివేల్పు. దనుజాధిపుడు *n.* : The king of the giants.

**దప్పము** *n.* : thickness, swelling, a tumour. దప్పమైన adj. Thick. దట్టమైన.

**దప్పళము** *n.* : A sour drink made of tamarinds and vegetables. కాయకూరలు వేసి పలచగా కాచిన పులుసు.

**దప్పి** or **దప్పి** *n.* : Thirst. నీరుపట్టు. నాకు దప్పి అయినది I am thirsty. Fatigue, శ్రమము.

**దఫా** *n.* : Time, occasion, turn. ఒకదఫా once.

**దబదబ** *adv.* : audibly, noisily, aloud, trippingly. Quickly.

**దబలకము** *n.* : A disease of the knee joint. The disease of a swelled and carious knee joint.

**దబాయించు** *v.a.* : To frighten, bully, browbeat.

**దబేనా** *n.* : Hoard, buried treasure.

**దబ్బ** *n.* : The citron tree. దబ్బకాయ *n.* : A citron. కోలదబ్బ & నారదబ్బ are two species of it. A slip, strip, piece of split wood, a slice. A thin rafter. బద్ద. వెదురుబద్ద. **దబ్బవాడు** a mat weaver మేదరవాడు.

**దబ్బడము** *n.* : An earthern cover over a pot. మూకుడు. **దబ్బడించు** *v.n.* : To close or cover the mouth of a cup with a lid. మూకుటితోమూయ. To slap (with the palm of the hand) అరచేతితో చరచు.

**దబ్బనము** or **దబ్బలము** *n.* : A bodkin, a large packing needle.

**దబ్బర** *n.* : A falsehood. బొంకు. Cheating, deception. A delusion మోసము A calamity, harm, విపత్తు. దబ్బతలాడు to deal in falsehoods. వానికాలికి దబ్బర అయినది his leg has been injured.

**దబ్బాటు** or **డబ్బాటు** *adv.* : Suddenly, unexpectedly. అధాట్టుగా, అదిరి పాటుగా.

**దబ్బిచిప్ప** *n.* : A kind of axe. తాటిచెట్టు బద్దలు చేసే సాధనము.

**దబ్బిరి** *adj.* : Cross, unsteady, irregular, curst.

**దబ్బిలి** or **దబ్బలి** *n.* : Trouble A popular ferment or fray. An insurrection. A liar, a makebate, a rascal.

**దబ్బు** *v.t.* : To tell. చెప్పు *n.* : A word. మాట. The cover of a jar. మూకుడు, దబ్బడము. The noise made by a blow on anything. A clapping sound, బల్లలు మొదలైన వాటిని గుద్దిన చప్పుడు. దబ్బపెట్టు to cover మూయు.

**దబ్బు** *adv.* : Aloud. దబదబ.

**దబ్బుడు** : Same as దబ్బడము.

**దబ్బున** *adv.* : Instantly, at once, quickly.

**దబ్బర** or **డబ్బర** *n.* : A cup గిన్నె.

**దభ్రము** *adj.* : Little, small. సూక్ష్మము. Thin. సన్నము.

**దమము** or **దమనము** *n.* : Austerities, mortification of the flesh, a self-controlled state. ఇంద్రియ నిగ్రహము. Fortitude, క్లేశమునోర్చు తనము. Suppression. అణచుట. **దమనుడు** or **దమి** *n.* : The queller or subduer. అణచువాడు; as కందర్ప దమనుడు Siva who destroyed Manmadha. **దమితుడు** *n.* : One who is subdued. అణపబడినవాడు. **దమించు** *v.t.* : to suppress, subdue (as one's passions) అణగద్రొక్కి.

**దమదమా** *n.* : A battery, a fortress బురుజు.

**దమ్మిడి** *n.* : A pie, one twelfth part of an anna. అరదుడ్డు.

**దమ్ము** *n.* : Mud, mire, slush. అడుసు, బురద, పంకము. Moisture, wetness. Breath. Wet ploughing. **దమ్ము నాగలి** a plough used to work wet land. మడినీరు కట్టి దున్నేది. **దమ్ము పలక**. దమ్ముపట్టు to hold the breath.

**దయ** *n.* : Favour, kindness, grace, regard. Love, affection, attachment. mercy, pity, tenderness, elemency, compassion. Pleasure, goodness, amiability, a kind heart. కృప, కనికరము. తమదయ ఎట్లో అట్లు just as your honour pleases. **దయాళు త్వము** *n.* : benignity. సర్వదయాళు త్వము. universal beneficience, goodness to all creatures. **దయాళువు** or **దయాశాలి** *n.* : A kind, gracious, merciful person. కనికరముగలవాడు.

**దయిత** *n.* : A darling, pet, favourite. ప్రియురాలు. A woman, ఆడుది. **దయితుడు** *n.* : A lover, husband. ప్రియుడు, ఇష్టుడు my love.

**దయ్యము** *n.* : A deity, a god. దేవుడు, వేలుపు. Destiny, fate, విధి. A goblin, fiend, demon or evil spirit, పిశాచము. దయ్యము కాదు భూతమే it was not a fiend but a ghost. కొరివిదయ్యము a jack o'lantern, a will of the wisp.

**దర** *n.* : Price. వెల, క్రయము.

**దరఖాస్తు** *n.* : A darkhast an application, a proposal a sender.

**దరణము** *n.* : A coin of one value or eight dubs.

**దరము** *n.* : Fear. భయము. A shell, A pit. గొయ్యి. *adj.* : Slight, little, ఇంచుక. **దరదము** *adj.* : Fearful, terrible. **దరహసితము** or **దరహాసము** *n.* : A gentle smile, a smile, a slight laugh. దరహసితాస్యుడై with a smiling face.

**దరి** *n.* : A bound, line, limit. A shore, or side. గట్టు, మేర. A refuge, a place of safety. Nearness, సమీపము. దరిమేరలేని బాధ boundless grief. ఇంటిదరిని close to the house.

**దరిద్రము** *adj.* : Poor, needy. n. Poverty. పేదరికము. **దరిద్రుడు** *n.* : A very poor man. మిక్కిలి బీదవాడు. దరిద్రురాలు a poor woman. దరిద్రులు the poor. గర్భిదరిద్రుడు a wretched starveling.

**దరిబేసి** *n.* : A helpless man. దైన్యము గలవాడు, దీనుడు.

**దరిమిలాను** *adv.* : Afterwards, subsequently.

**దరియాప్తు** *n.* : An inquiry, investigation. విచారణ.

**దరిసించు** *v.t.* : To see, to pay a visit. చూచు. To offer as a gift, కానుకగా నిచ్చు.

**దరుజు** or **దురుజు** *n.* : A cornice, a frieze, a joining, a seam in carpentry or masonry గోడకొననుగాని స్తంభపు కొననుగాని చేసియుండే చిత్రపుపని, దురుజు సున్నము plaster made of lime.

**దరువు** *n.* : A song in a peculiar metre. గీతి విశేషము. Beating time to music. తాళము, to beat time to music. తాళము వేయు.

**దరుసు** *n.* : A limit, a landmark. ఎల్ల.

**దరోబస్తు** *adj.* : All, whole; entirely.

**దర్జా** *n.* : Rank, grade.

**దర్జీ** *n.* : A tailor కుట్రపువాడు.

**దర్పణము** *n.* : Amirror. అద్దము, దర్పణ సేవ the rite of viewing an idol in a mirror and thus adoring it.

**దర్పము** *n.* : Pride, passion, anger. Irritability, touchiness. గర్వము, కొవ్వు దర్పమే యశస్సుగా భావించినారు they prided themselves on their fierceness. దర్పముచేయు to boil over, to be furious or proud. **దర్పించు** *v.n.* : To become proud, to be insolent, గర్వించు.

**దర్బారు** *n.* : An audience chamber : audience.

**దర్భ** *n.* : the sacred grass, used in sacrifices. దర్భపోటు See శ్రాద్ధము. దర్భముద్రిక or దర్భ ఉంగరము a ring made of this grass.

**దర్వి** *n.* : A spoon, a ladle. మిళ్లి. గరిటె The hood of a serpent, పాము పడగ. **దర్వీకరము** *n.* : A serpent. పాము, సర్పము.

**దర్శనము** *n.* : Sight, view. చూపు. An eye కన్ను. A mirror, అద్దము. The mind, understanding. బుద్ధి, తెలివి. A dream, కల. Science, శాస్త్రము, ధర్మము.

**దల** *an affix.* : Used to convert verbs, & c., into nouns. వాలుదల slantingly. ఊరిదల near the town. విడుదల release. దిగుదలపొలము the lower field. కమ్ముదల concealment. మోపుదల weight. వ్యాధి తిరుగుదలగా నున్నది the disease is on the turn.

**దలపము** *n.* : A visor. ముఖత్రాణము.

**దలాలీ** *n.* : A broker; a salesman తరగరి. A swindler. Brokerage. Douceur.

**దలిమము** or **దడిమము** *adj.* : Thin. సన్నము.

**దల్లు** : Same as జల్లు.

**దళనము** : See దళము.

**దళవము** *n.* : Thickness, solidity. తరుచుదనము. Troops, a host, an army. దండు. A multitude, quantity, number, heap. *adj.* : Thick, solid. తరుచైన. Much, great. అధికము.

**దళము** *n.* : A leaf. ఆకు. A petal. A part. భాగము A hemistich, or half verse. **దళవాయి** *n.* : A general, a chieftain or minister of state.

**దవ** *n.* : Dust. దుమ్ము. The up of a sugar cane, చెరుకు కొన.

**దవంత్రి** *n.* : A moat, a ditch. కందకము, అగడ్త.

**దవడ** or **దవుడ** *n.* : The jaw; the cheek. నన్ను దవడమీద కొట్టినాడు he slapped me on the cheek. దవడ పండ్లు the jaw teeth or grinders.

**దవనము** *n.* : Southernwood, a fragrant leaf like balm.

**దవము** *n.* : A conflagration, wildfire. కార్చిర్చు Ardent feelings, the consuming heat of hunger or fever. A forest అడవి. దవానలము *n.* : Wildfire, a scorching blaze, a conflagration.

**దవసము** *n.* : Grain. ధ్యానము.

**దవిష్ఠము** *adj.* : Very remote, far distant. మిక్కిలి దూరమందున్న. దవీయముగా adv. A far. దూరముగా.

**దవుడు** or **దౌడు** *n.* : Running, galloping. An inroad, incursion, or invasion.

**దవ్వ** *n.* : A tender shoot. Pith, the soft part of wood. మ్రానినడిమి మెత్తని భాగము. చెరుకుదవ్వ the young shoot of a sugar cane. ఈ తాటిచెట్టులో అంతా దవ్వగాని చేవలేదు this tree is all pith and has no wood.

**దవ్వు** *n.* : Distance. దూరము. A distant place, దూరదేశము. దవ్వనక not thinking it far. *adj.* : Distant, far. దవ్వుగా *adv.* : A far, from afar. **దవ్వున** *adv.* : Afar off, at a distance ఎంతయు దవ్వున్నను however far.

**దశ** *n.* : State, condition. అవస్థ. Power, authority, influence. Lucke, fortune. బాల్యదశ childhood. వృద్ధదశ old age. క్షామదశ వచ్చెను.

**దశనము** *n.* : A tooth. పల్లు.

**దశము** *n.* : Ten. పది. దశకము *n.* : A word for Ten: as we say a dozen for twelve. **దశకంఠుడు** *n.* :The 'ten throated". demon, i.e., Ravana. **దశమము** *adj.* : The tenth part దశమి *n.* : The tenth lunar day reckoned from new or full moon. పదోతిథి. **దశరథుడు** *n.* : The name of the father of Rama. **దశాస్యుడు** n. The 'ten faced' demon, i.e., Ravana. **దశాహము** *n.* : The ceremony performed on the tenth day after a death. పదోనాటిశ్రాద్ధము.

**దష్టము** *adj.* : Bitten. **కరపబడిన,** **దష్టించు** *v.n.* : To bite or sting. To chide or rebuke.

**దసరా** *n.* : The name of a feast called విజయదశమి in the month అశ్వయుజ (October.) It is the close of the నవరాత్రి anniversary.

**దసిలీ** *n.* : A kind of silk. ఒక దినుసు పట్టు, మొగ్గపట్టు. Looseness, వదలు.

**దసువంది** *n.* : One who gets up wrestling matches. గ్రుద్దులాటకు జెట్టీలను కూర్చువాడు.

**దసెన** *n.* : A kind of weapon. ఆయుధ విశేషము.

**దస్కతు** *n.* : A signature. చేవ్రాలు.

**దస్తరము** or **దస్త్రము** *n.* : A bundle of papers tied together in a cloth, a portfolio, a budget. కాగితాలకట్ట.

**దస్తావేజు** *n.* : A voucher. A document, a bond.

**దస్తు** *n.* : The actual collection of money. Money.

**దస్తూరి** *n.* : Handwriting. వ్రాత.

**దస్యుడు** : an enemy, శత్రువు.

**దస్రులు** *n.* : The asvins. అశ్వినీదేవతలు.

**దస్సాలా** *adj.* : Decennial; lasting ten years.

**దహనము** *n.* : Burning. కాల్చుట. దహనమయి పోయిన burnt. **దహనుడు** *n.* : The god of fire, అగ్ని. దహించు *v.a.* : To burn. కాల్చు.

**దహరము** *n.* : The heart, హృదయము. Intention, అభిప్రాయము.

**దా** : An interjection signifying Come !

**దా** : In some compounds signifies left, or inner as దాకాలు the left leg. దాచెయ్యి the left hand.

**దాంతము** *n.* : Patience, endurance, fortitude, self-control, moderation. **దాంతుడు** *n.* : One who is temperate, patient, self-controlled, moderate, or master of himself. అడపబడినవాడు, తపఃక్లేశము నోర్చువాడు. **దాంతి** *n.* : Self command, repression of the passions. ఇంద్రియనిగ్రహము, బ్రహ్మచర్యాది తపఃక్లేశము నోర్చుతనము.

**దాంపత్యము** *n.* : Wedlock. దంపతిభావము. అనుకూలదాంపత్యము. harmony in a family, mutual affection.

**దాంభికుడు** *n.* : One who is ostentatious or pompous దంభముగలవాడు.

**దాక** *n.* : A pot with a wide mouth. బోగోణి, మూతి వెడల్పుగల అటిక.

**దాకలి** : Same as దాగలి.

**దాకల్లు** *n.* : A spoke in a carriage. wheel బండికంటికడ కమ్మి, నేమి.

**దాకొను** or **డాకొను** *v.n.* : To come on, to happen. దాకొన్న కష్టము the evil he suffered. To meet or encounter, సన్నద్ధపడు. సమీపించు. To be hidden, మరుగుపడు, దాగుకొను.

**దాక్షాయణి** *n.* : A name of Parvati. పార్వతి.

**దాక్షిణాత్యము** *adj.* : Southern. **దాక్షిణాత్యులు** *n.* : Southerners, people of the South.

**దాక్షిణ్యము** *n.* : Shyness, kindness, feeling, delicacy. మొగమోటము, దాక్షిణ్యం ధననాశనం a kindly feeling may cause loss.

**దాఖలా** *n.* : Proof. A receipt. దాఖలా చూచు to verify.

**దాఖలు** or **దఖలు** *n.* : Submitting, as an application or a complaint in writing. దాఖలు చేయు to file or enter. వ్యాజ్యము దాఖలయినది the suit is filed.

**దాగర** *n.* : A wallet or pouch for food. A large winnowing basket. ప్రసేవకము, ఎండుపుతట్ట.

**దాగలి** or **దాకలి** (దాయి + కలు) *n.* : An anvil. ఇరుకుదాగలి a carpenter's vice.

**దాగిలిముచ్చులు, దాగిలిమూతలు** or **దాగిలిబూచులు** *n.* : The game of Hide and Seek. **దాగిలిబూచులాడు** v. To play at Hide and Seek.

**దాగు** *v.n.* : To be hidden or concealed. To hide. To escape. మరుగుపడు. **దాగురించు** *v.t.* : To hide. దాచు. To delude, వంచించు. దాగురు మూతలు Same as దాగిలిమూతలు.

**దాటు** *v.n. & a.* : To cross over, to pass over, To jump or leap, లంఘించు. To elude. To escape. To go beyond or transgres, ఉల్లంఘించు. To cross or copulate, applied to cattle.

**దాడి** *n.* : An invasion, an inroad, a compaign. దండయాత్ర. A host, సేన. Flight, escape. దాడిమెకము lit : the invading tiger, i.e., a royal tiger. దాడి The beard. **దాడిచేయు** *v.n.* : To invade. దండెత్తు To rush on, to charge in battle.

**దాడినిమ్మ, దాడిమ్మ** or **దాడిమము** : Same as దానిమ్మ.

**దాడుగచెట్టు** *n.* : The tree called *nauclea cordifolia.*

**దాఢ** *n.* : A projecting tooth, a tusk. కోరపల్లు. A multitude, సమూహము.

**దాణ** or **దాణా** *n.* : Horse gram, or other gram given to horses for food. ఉలవలులోనగు గుర్రమునాహారము.

**దాణము** *n.* : A tax, a toll. సుంకము, శుల్కము.

**దాత** *n.* : A giver, donor, bestower, or liberal man. ఇచ్చువాడు. **దాతృత్వము** *n.* : Generosity, liberality, bounty.

**దాతికర్ర** or **దాతివసాను** *n.* : A carpenter's block or work bench. A block used by cloth beaters.

**దాత్యూహము** *n.* : The bird called a gallinule. కూకురుగుండంగిపక్షి. the black cuckoo or the swallow, చాతకము, వానకోయిల.

**దాత్రము** *n.* : A sickle. కొడవలి, లవిత్రము.

**దాదాపు** *adv.* : Close at hand. Very nearly, almost. దాదాపు ముప్పది దినములయినది about thirty days have elapsed.

**దాది** or **దాదిలి** *n.* : A nurse, a fostermother. పాలిచ్చి పెంచుతల్లి.

**దాదుంగ** *n.* : Same as దాతికర్ర.

**దాన** (ablative of అది) *adv.* : Thereby, hereby. దాన A feminine form in verbs. I am she who does. ఒంటిదానను I (feminine) am alone. ఒకదాననే ఉన్నాను I am left by myself.

**దానము** *n.* : A gift, alms. Giving, donation. దానఫర్మానా an order to bestow a gift, a deed of gift, the fluid that flows from the temples of an elephant in rut.

**దానవుడు** *n.* : A demon, fiend, giant, తోలువేల్పు, దనుజుడు. **దానవారి** *n.* : The queller of the giants. a god, దేవత, వేల్పు. దానవి an ogress or a giantess.

**దాని** : The genitive form of అది దానిని its accusative.

**దానిమ్మ** or **దాడిమము** *n.* : The pomegranate tree. దాడిమవర్ణము the scarlet hue of the pomegranate.

**దాపన** *n.* : Hiding దాచుట.

**దాపనము** *n.* : the imposition of a fine. దండుగగొనుట.

**దాపరము** *n.* : Happening, meeting. ప్రాప్తి. Stealing, దొంగిలించుట. Concealment, duplicity. మరుగు, మాయ, మోసము, వానివద్ద మరేమి దాపరములేదు there is no concealment about him. *adj.* : Secret, unseen.

**దావల** or **డావల** *n.* : the left side. ఎడమభాగము. **దావలి** *adj.* : On the left side, left. In the inside, within, along with, in the possession of near నాదావలిసొమ్ము the property of my hands.

**దాపు** *n.* : Nearness. సమీపము. Fear, భయము. ఆ ఇల్లు నాకు దాపు నీకు దూరము that house is near to me and far from you.

**దాబు***n.* : Fear, reverence, subjection.

**దామము** *n.* : A cord, a sting. త్రాడు A wreath, a string of pearls, హారము. **దామోదరుడు** *n.* : A title of Krishna; as bound with a cord in infancy. "Funiger", cord-girt, the cordelier.

**దామర** *n.* : A halter. ఉరిత్రాడు. a species of leprosy.

**దామాషా** *n.* : Allotment, division into shares, dividends. దామాషా ఖర్చులు proportionate costs.

**దామీనపాము** *n.* : A kind of snake.

**దామెనతాడు** *n.* : A cord, a tether : a long cord, fastened to a stake or tree at each end, to which cattle are secured by short halters.

**దాయ** *n.* : A cousin. జ్ఞాతి. An enemy, a foe, శత్రువు. **దాయాది** or **దాయాదుడు** *n.* : A kinsman. **దాయాదులు.** దాయాదత్వము rivalry, kinship. hereditary right.

**దాయము** *n.* : Heritage. పంచుకొనదగిన తండ్రిసొమ్ము. Kinship, heirsh జ్ఞాతిత్వము. A gift, ఈవి. దాయము, **దాయలు** or **దాయాలు** *n.* : A certain game among girls గవ్వలాట; గవ్వలు పాచికలు మొదలగువాని సంఖ్య.

**దాయు** *n.* : An anvil, a workbench, or smith's form. used as a rest or prop. దాగలి.

**దాయి** or **దాయీ** *n.* : A nurse. బాలురకు పాలిచ్చి పెంచుస్త్రీ . A plaintiff (Vizag.) *n.* : One who gives, ఇచ్చువాడు.

**దాయు** or **డాయు** *v.n.* : To approach. సమీపించు.

**దార** *n.* : A wife. పెండ్లాము. పరదార a. neighbour's wife. (from ధార) A stream, నీటిచాలు. A gift, దానము. Order, క్రమము. **దారకొొమ్ము** *n.* : A torchbearer's oil vessel. చమురు పోసే పసరపు కొమ్ము. **దారాపుత్రాదులు** *n.* : A family, a household. *Lit* : Wives, children, and all.

**దారకము** *n.* : That which breaks or causes breaking. బద్దలు చేయునది. చీల్చునది. **దారకుడు** *n.* : One who splits asunder, చీల్చువాడు.

**దారణ** *n.* : Price, value. వెల, క్రమము.

**దారణము** *n.* : Splitting. చీల్చుట.

**దారబంధము** *n.* : the lintel or post of a door.

**దారము** *n.* : A thread, cord, sting, rope. నూలిత్రాడు. A match for fire.

**దారి** *n.* : A way, road, path. A manner, mode, method. మార్గము దారికి వచ్చినది it is cleared up, it has turned out well, she has come to her sense. One who bears, ధరించువాడు; used in compounds as జడదారి. జడను ధరించినవాడు. **దారిబడి** *n.* : A convoy or guard, an escort.

**దారితము** *adj.* : Split, cut, divided. చీల్చబడిన. **దారించు** *v.t.* : To split, to cut. చీల్చు.

**దారిద్ర్యము** *n.* : Poverty. బీదతనము.

**దారుణము** *n.* : Horror, terror. భయము. A crime or horrible act. *adj.* : Horrid, cruel. భయంకరమైన.

**దారున** *adv.* : Unexpectedly, suddenly. తటాలున, తెప్పున, శీఘ్రముగా.

**దారువు** *n.* : Wood. మ్రాను adj. Wooden, made of wood. **దేవదారువు** *n.* : Deodar, dealwood. **దార్వాఘాటము** *n.* : The wood-pecker. వడ్రంగిపిట్ట.

**దారోగా** n. An agent or superintendent. An overseer of any department.

**దార్ఢ్యము** *n.* : Hardness, fixedness, stability, Strength, vigour. దిట్టము, దిట్టి. Power, reality.

**దాలి** *n.* : A heap of cowdung cakes used for firing. A hole or little pit used as a temporary fireplace, as పాలదాలి. **దాలిగుంట** *n.* : A smouldering fire, a fire pit, a little pit serving for a hearth.

**దాల్చిని** *n.* : Cinnamon.

**దాళ** or **దాళా** : Overweight in scales, preponderance. పడి యొక్క హెచ్చు తక్కువ.

**దాళి** *n.* : Split pulse. సెనగలులోనగువాని పప్పు.

**దాళింబ** or **దాళిమ్మ** : Same as దానిమ్మ.

**దాళీకుడు** *n.* : An agent. కార్యకర్త.

**దాళు** *n.* : slight colour, a tinge. వర్ణలేశము. ఎర్రదాళు reddishness.

**దాళువ** *n.* : A cheek. దవడ.

**దాళువా** or **దాళ్వా** *n.* : A wet crop. పల్లపు పంట. *adj.* : dark coated : having a black husk. **దాళువాపంట** the black crop, a technical phrase used in Ganjam.

**దావంతము** *n.* : Grief suffering. దుఃఖము.

**దావము** *n.* : A forest. అడవి. A burning forest, a conflagration, wildfire, కారుచిచ్చు. **దావాగ్ని** or **దావానలము** *n.* : Wildfire, a devouring flame, a conflagration, burning heat.

**దావరి** or **దావరీడు** *n.* : A hero. వీరుడు.

**దావా** or **దావ** *n.* : A claim, a law-suit, or complaint. వ్యాజ్యము, తగవు. **దావాదారుడు** a prosecutor, a complainant. దావాతెచ్చు to make or file a complaint. దావాచేయు to dispute, to quarrel, to claim.

**దాశరధి** *n.* : The son of దశరథుడు, i.e., Rama.

**దాశార్హుడు** *n.* : An epithet of Krishna.

**దాష్టికము** or **దాస్తీకము** *n.* : Resolution, bravery. Overbearing conduct, insolence, pride.

**దాసనము** or **దాసానపువ్వు** *n.* : the China rose, or shoe flower plant, జపాపుష్పము, దాసానిపొడి a blackening dye applied to the teeth.

**దాసరి** *n.* : A Sudra or Pariah mendicant who is a worshipper of Vishnu. **దాసరయ్య,దాసరిగాడు** or **దాసరి తాబేలు** *n.* : The hermit-tortoise, found on land in secluded spots.

**దాసుడు** *n.* : A slave, bonds man, serf. వెలకుగొన్న పనివాడు. A fisher man, దాశుడు. **దాసానుదాసుడు** *n.* : A servant of servants, an utter slave. **దాసి** *n.* : A handmaid, a slave girl.

**దాహము** *n.* : Burning, ignition. కాలుట. Thirst, దప్పి. Eager desire. ఆశ, దాహము అయినది I m thirsty.

**దాహరి** : Same as దాసరి.

**ది** : A verbal suffix as నాది, వానిది.

**దించు** or **దింపు** causal of దిగు. *v.t.* : To bring lower, let down, take off, put down, set down. To place, unload, disembark or land. To distil, or extract spirit. దిగజేయు.

**దింటెన** or **గెంటెన** *n.* : The flower called Bluebell (clitorea) whether blue or red. గిరికర్ణి.

**దిండు** *n.* : A bundle, pillow, cushion or bolster. తలగడ. A belt, a girdle, దట్టి. A sheaf of corn. A bag of money. The nave or centre of a wheel; A cylinder. గుండ్రని తలగడ వలెనుండు ద్రూను., Any thing, cylindrical.

**దిందిం** : Same as దిమిదిమి.

**దింపు** *n.* : Diminnution, setting down, hanging down loose. వ్రేలుట, లంబనము. **దింపులుపోవు** *v.n.* : To hang down loose. వ్రేలాడు.

**దిక్కు** *n.* : A quarter, part, side, direction. దిశ. An airt or point of the compass. The ten directions named in Hindu books are the four points. N.E.S.W. and the intermediate four : N.E. (ఈశాన్యమూల), S.E. (ఆగ్నేయమూల) S.W. (నైరృతిమూల), N.W. (వాయవ్యమూల) to which are added the Zenith and Nadir దిక్కులు మ్రోయగా while the heavens resounded. Quarter, shelter, asylum, refuge, protection, patronage.

**దిగ** *adv.* : Down; downwards. దిగబడు to go down, to sink. దిగజారు to slide down. దిగగాచు to distil. **దిగ దిగ** *adv.* : Rapidly, brightly. వేగముగా, ప్రకాశముగా.

**దిగసన** *adv.* : Down, below, దిగువగా.

**దిగు** *v.n.* : To come down from a higher place. To alight, drop, come or go down, descend from; to dismount. To be landed, unladen, or disembarked, as goods. దిగుమతియగు.

**దిగులు** *n.* : Fear, alarm. భయము. Palpitation of the heart, గుండెఅదురు. **దిగులుపడు** or **దిగులొందు** *v.n.* : To fear, be alarmed, be frightened.

**దిగ్గవాడు** : Same as దిగనాడు See under దిగ.

**దిగ్గియ** or **డిగ్గియ** *n.* : A lake, a large pond. దీర్ఘిక, బొడ్డనబావి.

**దిగ్గు** Same as దిగు. **దిగ్గు** *n.* : Fear. భయము. **దిగ్గురను** or **దిగ్గను** *v.n.* : To shudder, to be alarmed. భయ పడు. **దిగ్గున** or **దిగ్గన** adv. Suddenly, at once తటాలున. దిగ్గున లేచు to start up, to jump up.

**దిగ్గోలు** *n.* : The last crop reaped before the one which is ripening. కోయుపయిరునకు ముందుపయిరు.

**దిగ్ధము** *adj.* : Smeared, anointed. *n.* : A poisoned arrow.

**దిగ్భ్రమము** *n.* : Confusion.

**దిడ్చుమొగము** *adj.* : Disappeared, vanished. అదృశ్యము. *n.* : Disappearance, vanishing అదృశ్యము. దిచ్చు మొగమగు to disappear, vanish.

**దిట** *n.* : Strength, power. దార్ఢ్యము, శక్తి. **దిటము** *n.* : courage.

**దిడ్డి** adj. Small. చిన్న *n.* : A backdoor, a postern or sally-port. A little door, as of a palankeen. గవనిలోనగు వాని ప్రక్కనుండు చిన్నవాకిలి, చిన్న వాకిలి. **దిడ్డీవాకిలి** *n.* : A backdoor, a small side gate, a wicket.

**దితి** *n.* : The mother of the Asuras. అసురులతల్లి.

**దిద్దు** *v.a.* : To correct, rectify, set straight శిక్షించు. సవరించు. To prepare, make ready train, సింగారించు. To deck, adorn, tim.

**దిదృక్ష** *n.* : A desire to see. చూడనిచ్ఛ. **దిదృక్షువు** *n.* : One who desires to see. చూడనిచ్ఛగలవాడు.

**దిధక్ష** *n.* : A desire to burn or to set fire to (a house, town, & c.) కాలువనిచ్ఛ దిధక్షువు *n.* : One who desires to set fire to. కాలువ నిచ్ఛగలవాడు.

**దిధిషువు** *n.* : A re-married woman. మారుమనువుది. A man who marries a widow, మారుమనువు దాని మగడు.

**దినము** *n.* : A day. The day time. **దినేదినే** *adv.* : Daily. **దినకరుడు** *n.* : The maker of the day, i.e., The

sun. **దినచర్య** n. A diary, day book, or journal. **దినదినము** *n.* : Every day. *adv.* : Daily, day by day. **దినబత్తెము** daily batta or allowance.

**దినారి** *n.* : A gold coin. Same as దీనారము.

**దినుసు** or **దినుస్సు***n.* : An article, thing, drug, ingredient. వస్తువు Manner, kind, sort, ప్రకారము, విధము.

**దిన్న** or **జిన్న** *n.* : A kind of tree. అచ్చ : యు : కాం.

**దిన్నె, దిన్నియ** or **తిన్నె** *n.* : A bulk, divan or settle, being a seat built at a house door; commonly called a pial. A high raised embankment. ఇసుకదిన్నె a bank of sand. దిన్నెలు dunes or sand hills.

**దిబ్బ, దిప్ప** or **తిప్ప** *n.* : A high land or mount. ఉన్నతభూమి. A heap or mound. కుప్ప, గోలీలదిబ్బ a burying ground. ఎరువుదిబ్బ a manure heap.

**దిబ్బడము, దిబ్బణ** or **దబ్బడము** *n.* : A lid or earthen cover to a jar. A bung.

**దిబ్బడ** or **దిబ్బెడ** *n.* : Slight deafness, casual deafness, a ringing in the ears, caused by cold, amazement, & c. నాచెవులు దిబ్బెడవేసి (or దిబ్బెళ్లు వేసి) ఉన్నవి I was astounded.

**దిబ్బెము** *n.* : A light, a lamp. దీపము.

**దిమము** or **దీము** *n.* : A decoy, any lure intended to ensuare.

**దిమాకు** or **ధిమాకు** *n.* : Pride, hauteur, arrogance అధికారము, గర్వము, హామిక.

**దిమిదిమి, దిందిం** or **ధిమింధిమిన్** *n.* : Ting tang, ding dong. మద్దెల మ్రోత.

**దిమిస, దిమ్మిస** or **దిమ్మెస** *n.* : A paviour's beetle, a runner నేలను చదునుచేసే పనిముట్టు.

**దిమ్మ** or **దిమ్మె** *n.* : A stand or frame (to support a box or a palankeen.) The frame on which the parchment of a drum is fixed.

**దిమ్మరించు** *v.t.* : To upset or pour out (grain. & c.)

**దిమ్మిస** : See దిమిస.

**దిమ్ము** *n.* : Giddiness, Madness, folly. భ్రమము, మత్తు. A multitude, సమూహము.

**దిమ్మె** *n.* : A cone. An ingot, or cylindrical lump of gold. A wooden cork or stopple, కొయ్యబిరడ. A candle stick. A sort of rocket. A heap (as of sand.) A hillock.

**దిమ్మెస** : See దిమిస.

**దిరదిర** or **దిద్దిర** *adv.* : Round and round : whirlingly.

**దిరిసెన, దిరిసెనము** or **దిరిసెము** *n.* : A forest tree with delicate woolly flowers, commonly called the Rain Tree, Mimosa sirisha. The species called తీగదిరిసెన is a creeper much used in medicine.

**దివటీ** or **దివ్వటీ** : Same as దివిటీ.

**దివవు** *n.* : The sky. ఆకాశము. Heaven. స్వర్గము. Day. పగలు. **దివసము** *n.* : A day. దినము, పగలు. దివసములు days set apart for funeral rites.

**దివాకీర్తి** *n.* : A pariah or man of low caste. మాలవాడు. A barber. మంగలవాడు.

**దివాణము** *n.* : An audience chamber; a tribunal దివాణపువారు persons connected with the Government. Government. న్యాయసభ, సర్కారు. రాజుకొలువు కూటము, కొలువు కూటము.

**దివాలా** *n.* : Bankruptcy. దివాలాతీయు or దివాలాయెత్తు to become a bankrupt. **దివాలాకోరు** *n.* : A bankrupt.

**దివి** *n.* : Heaven. స్వర్గము. The sky. ఆకాశము. adj. Dated so and so (of the month.) దివిజుడు or **దివుషదుడు** *n.* : A god. దేవత, వేల్పు. **దివిజాధిపుడు** *n.* : Indra. as chief of the gods.

**దివిటీ** or **దివిటి** *n.* : A torch.

**దివియు, దీవియు** or **దివె** : Same as దివ్వె. దివ్వెకోల Same as దివిటీ.

**దివు** : Same as దిగు.

**దివె** : Same as దివ్వె. **దివెదారికొమ్ము** *n.* : A lamp stand.

**దివౌకసము** or **దివోకసము** *n.* : A bird. పక్షి దివౌశమడు or దివోకనుడు being. god. వేల్పు.

**దివ్య** Another form of దివియం. దివ్యారుపుపురుగు (దివ్య + అరుపు + పురుగు) *n.* : An insect that puts out light.

**దివ్యము** *adj.* : Divine, heavenly, supernatural, celestial. Fairy, appertaining to fairies or demigods. Grand, superb, glorious, noble, fine, admirable, bright. **దివ్యార్చన** or **దేవతార్చన** *n.* : Divine worship. **దివ్యుడు** *n.* : A god, a demigod.

**దివ్య** or **దివ్వియ** : Same as దివ్వె.

**దివ్వటి** or **దివ్వటీ** : Same as దివిటీ.

**దివ్వు** *v.a.* : To draw, pull, withdraw. ఈడ్చు, తీసివేయు.

**దివ్వె** *n.* : A lamp, a light. దీపము. A torch దివిటీ. దివ్వెకంబము a candle stick. **దివ్వె** adj. Bright, luminous. **దివ్వెసుడి** *n.* : A candlestick, దీప స్తంభము. A niche in a wall to keep a lamp in. గూడు.

**దిశ** *n.* : A point of the compass, quarter, direction, region. దిక్కు, దెస.

**దిష్టము** n. Fate, destiny, time. భాగ్యము, సమయము. adj. Taught. ఉపదేశింపబడిన.

**దిష్టి** *n.* : The evil eyes.

**దిస** *adj.* : Plain, unadorned. See దెస.

**దిసంతు** *n.* Reproach, blame, shame, imputation. దూరుట. దిసంతుకొట్టు or దిసంతడుచు to revile. నిందించు, దూరు.

**దిసమొల** or **దిస్సమొల** adj. Naked : stark naked. *n.* : Nakedness of the body.

**దిస్సు** *n.* : A hissing sound. పాముకొట్టు బుసవంటి ధ్వని.

**దీ, డీ, దీకు** or **డీకు** *n.* : Striking the heads together as rams do. Butting. **దీకొను** or **డీకొను** *v.a.* : To oppose. మార్కొను, ఎదిరించు. *v.n.* : To arouse, to rouse or bestir oneself, to prepare. **దీకొలుపు** or **డీకొలుపు** v.a. To arouse, warn, excite. దీకోలు Same as డీకొనుట.

**దీక్ష** n. A vow, Sacrificing, offering oblations. Worshipping, యజ్ఞాది క్రియారంభమునందు అనుష్ఠింప బూనుకొనే ఆచార నియమము.

**దీటు** *v.t.* : To arrange, to level సవరించు. *n.* : Equality, similiarity, resemblance. A share or plot of land. A sort Rate. *adj.* : Equal, similar, like. సమానము.

**దీడు** *v.n.* : To trim or prune, as a bird does its feathers with the beak. To gnash the teeth or bite the lips in rage. It is the same word as దిడ్డు. మీసాలుదీడి curling his whiskers, twisting them with his fingers (denoting rage)

**దీధితి** *n.* : A ray of light. కిరణము, కాంతి, వెలుగు.

**దీన** *pron.* : Hereby. (the able. of ఇది this)

**దీనము** *adj.* : Poor, humble, wretched, low. *n.* A helpless or miserable woman దీనురాలు. దీనత or **దీనత్వము** *n.* : Poverty, humility, wretchedness. దీనదశ poverty, humiliation. దీనవదనుడు humble in looks.

**దీనారము** or **దినారి** *n.* : A certain gold coin. పైడిటంకము.

**దీపము** *n.* : A lamp. a light. **దీపము పెట్టు** *v.n.* : To light a lamp. Metaphorically, to sustain a man's household. **దీపారాధన** *n.* : The rite of offering a light to a god. The lighting up lamps at a shrine. **దీపావళి** (దీప + ఆవలి.) *n. Lit.* : A row of lights, i.e., A feast held on the 14th day of the dark fortnight (bahula) in Aswayuja (answering to Oct. Nov.) wherein is commemorated the నరకాసురవధ.

**దీమము, దీము** or **దీం** *n.* : A trained bird, a decoy bird. సాకితీర్చిన పిట్ట. A snare, decoy or tranl (for birds, elephants. & c.) A house. ఇల్లు.

**దీమసము** *n.* : Courage. ధైర్యము. Cleverness, a contrivance, a stratagem, యుక్తి, ఉపాయము, ప్రజ్ఞ, ఆలోచన, నైపుణ్యము.

**దీర్ఘము** *adj.* : Long, either as regard size or rice. *n.* : a song vowel. thus, సకారదీర్ఘము means పాంచ దీర్ఘకాలము a long time. **దీర్ఘాయువు** or **దీర్ఘాయుస్సు** *n.* : A long life. One

who has a long life to live, పెక్కేండ్లు బ్రతుకువాడు. A crow, కాకి. **దీర్ఘిక** *n.* : A long or oval pond.

**దీర్ణము** *adj.* : Shivered, smashed, torn, rent. చీల్చబడిన. Frightened, భయపడిన.

**దీలు, డీలు** or **డిల్లము** *adj.* : Lean, thin, poor, deficient; loose, slack. దీలైన. Emaciated, కృశించిన.దీలు or దీలు పడు to swoon, be weared or exhausted. సొమ్మసిల్లిపడు, డీలుపడు.

**దీవన** : See under దీవించు.

**దీవసము** or **దీమసము** *n.* : Bravery, courage. ధైర్యము.

**దీవి** *n.* : An island. (Poetically) a heaven, abode, home. మురిపెమ్ముల దీవి the very home or birthplace or attraction, a perfect mine of charms.

**దీవించు** *v.a.* : To bless. ఆశీర్వదించు. **దీనవ** or **దీవెన** *n.* : A blessing, a benediction. ఆశీర్వాదము.

**దీవియు** : Same as దివ్వె.

**దుంక, దుంకము** or **దుంకి** *n.* : A hole. రంధ్రము.

**దుంగ** *n.* : A block, clog, or piece of wood. కఱ్ఱమొద్దు. తరిమెనదొడ్డి దుంగలు the bits or side pieces in a lathe. వానికేమి బాగా దుంగవలె ఉన్నాడు he is as stout and strong as a log of wood.

**దుండగము** or **దుండరికము** *n.* : Villainy, dishonesty, crime, wickedness; a crime, a prank. ధూర్తత్వము, దౌష్ట్యము, కీడు. **దుండగీడు, దుండగుడు** or **దుండగాయ** *n.* : A wretch, scamp, blackguard, villain. తుంటరి.

**దుండి** *adj.* : Corpulent, big bellied.

**దుండివ** *n.* : A fish-being a sort of *Sparus*. plates. అంతికదుండిన a sort of Perch.

**దుండు** *adj.* : Stout, strong. **దుండు** or **దుండుపాము** *n.* : A sort of ell. A rock snake. **దుండుబలి** *n.* : An idler. సోమరి.

**దుంత** *n.* : A male buffalo. దున్నపోతు, ఎనుబోతు. దుంతరవుతు or దుంతి వయాళి (for వాహ్యాళి) కాదు Yama, the god who rides on the buffalo. మహిష వాహనుడు.

**దుందిలము, దుండిగము, దుండుకము** or **దుండుకము** *n.* : A sort of vegetable, న్యగ్రోధము.

**దుందుభి** *n.* : A drum. భేరి. The name of a year, ఒక సంవత్సరము.

**దుందుము** *n.* : A wheel like torch చక్రాకారపు దివిటీ.

**దుందురు** : Same as జుంజురు.

**దుంప** *n.* : A root. The wedgelike part of a plough, నాగలిగొడగ. **దుంప నాశనము** *n.* : Total ruin, eradication. వానిని దుంపనాశనము చేసినాడు he ruined him root and branch.

**బొంబొడి** : See under దుమ్ము.

**దుః** : A negative prefix, Bad, evil, wicked. చెడు, చెడ్డ. **దురంతము**

*adj.* : Endless, eternal, without limit, boundless, unfathomable, అంతములేని. **దురదృష్టము** *n.* : Ill luck, misfortune. *adj.* : Unfortunate. **దురభిమానము** *n.* : Arrogance, presumption. **దురభ్యాసము** *n.* : An evil practice, a bad habit. **దురవగాహము** *adj.* : Hard to understand, inexplicable, puzzling. **దురవస్థ** *n.* : Mishap, evil plight. **దురహంకారము** *n.* : Presumption, arrogance. **దురాకృతము** *n.* : An evil act, a misdemeanour. **దుర్మార్గము దురాక్షేపణ** *n.* : A quibble or groundless objection; a finesse. **దురాగతము** *n.* : *An outrage* **దురా గ్రహము** *n.* : Groundless anger. **దురాలోచన** *n.* : bad intent, a plot. **దురాశ** *n.* : Covetounsness, vain hopes, avarice, greed. **దుస్సహము** *adj.* : Insufferable, intolerable. **సహింపగూడని** **దుస్స్వప్నము** *n.* : An evil dream.

**దుఃఖము** *n.* : Grief, trouble, unhappiness, pain, misery. వ్యసనము, మనోబాధ.

**దుకాణము***n.* : A bazaar, a shop అంగడి.

**దుకూలము** *n.* : A robe, vest, fine or white raiment, సన్నని వస్త్రము, తెల్లనివస్త్రము.

**దుక్కి** *n.* : Ploughing. దున్నుట. tillage, కృషి Ploughed land.

**దుంగ** *n.* : A deuce at games, or in dice. రెండు, ద్వయము, దుగదచ్చి deuceeight.

**దుగలము** or **దుగులము** *n.* : One sixteenth of the coin termed a Pagoda (వరహా).

**దుగ్గ** or **దుగ్గి** *n.* : An epithet of Kali or Parvati. కాళి, పార్వతి.

**దుగ్గు** *n.* : Musty straw. Straw trodden to pieces; రూపము చెడినది (తృణము)

**దుగ్ధ** *n.* : Ill will, displeasure, annoyace.

**దుగ్ధము** *n.* : Milk పాలు, **దుగ్ధాబ్ధి** *n.* : The sea of milk.

**దుండిదుండి** *adv.* : With eagerness, sharply. దబ్బున.

**దుడుకు** *n.* : Rashness, folly, wickedness, silliness, hastiness, దౌష్ట్యము, ఉద్ధతి. adj. Rash, intemperate, foolish, wicked.

**దుడుదుడ** *adv.* : Bang, slapdash, off, in a trice దొడదొడ.

**దుడ్డు** *n.* : A coin of the value, in some places, of four, and in others, of two annas. డబ్బు. Money in general. పైకము Wealth దుడ్డుగలవారు rich people. **దుడ్డుకఱ్ఱ** or **దుడ్డుకోల** *n.* : A club, stick or cudgel.

**దుత్త** *n.* : A jug, a jar, a small pot. చిన్నబుంగ దుత్తాయి *n.* : A short half jacket. కురుచ అరచట్ట. **దుత్తారి వలువ** *n.* : A sort of cloth.

**దుత్తూరము** *n.* : The Thorn apple, a poisonous plant. ఉమ్మెత్తచెట్టు Cunning, కపటము.

**దుద్దు** *n.* : The *pericarp* or centrebulb of a lotus : తామరపువ్వులోని దిమ్మె, కర్ణిక.

**దును** (another form of దున్ను) *v.n.* : To plough.

**దునుకు** or **దుముకు** *v.n.* : To leap. To make beate, *n.* : A lean a jump. గంతు Pain బాధ.

**దునెవారి** or **దునేదారి** *n.* : One who carries a sword in hand కత్తికట్టిన శూరుడు. A hero, శూరుడు.

**దున్నంగి** *n.* : A certain plant, a kind of wild croton.

**దున్ను** *v.a.* : To plough. దుక్కిచేయు. **దున్న** *n.* : A male buffalo. మహిషము. A male beast, పురుషపశువు. ఏనుగు దున్న a youngmale elephant. **దున్నపోతు** *n.* : A male buffalo, (Applied abusively), a rude, ignorant wretch.

**దుప్పటి** or **దుప్పటీ** *n.* : A sheet cloth, vest. పక్కదుప్పటి a bed sheet. **దుప్పటము** *n.* : A vest, a robe. వస్త్రము.

**దుప్పి** *n.* : The Spotted Deer.

**దుబారా** *adj.* : Extravagant. దుబారా ఖర్చు vain or extravagant expenditure.

**దుబాసి** *n.* : An intepreter. A Dubash.

**దుబ్బ** *n.* : The female organ of generation ఆడుగురి.

**దుబ్బు** *n.* : A bunch or tuft of grass. Stubble, తృణస్తంభము, దుబ్బు కొట్టివేయు to weed or clean land.

**దుమగతికేతు** *n.* : A star portending ill-luck. A comet, ధూమకేతువు.

**దుమదుమ** *adj.* : All wet. మిక్కిలి తడిగల. *n.* : Anger, irritability of temper. కోపము, **దుమదుమలాడు** to be angry.

**దుమారము** or **దుమ్మారము** *n.* : Dust, pollen of flowers. దుమ్ము, పుప్పొడి.

**దుమాలు** *adj.* : To the root, entire. సమూలము.

**దుముకు** or **దుమకు** *v.n.* : To leap, to jump, to plunge into గంతువేయు. n. A leap, గంతు. **దుముకులాడు** to leap about, గంతులువేయు, గోడ దుమికి leaping over the wall.

**దుముక్కు** *n.* : A thud. The sound made in leaping.

**దుముదారు** *n.* : An army, a host దండు. దుముదారుగా in a mob గుంపుగా.

**దుమ్ము** *n.* : Dust దుమారము, ధూళి, దుంబొడి (దుమ్ము + పొడి) Currystuff, మెంతి జీలకర్ర చేర్చిచేసిన నున్నని కూరపిండి.

**దుయ్యు** : Same as దూయు.

**దుర్** : See under దుః

**దురటిల్లు** or **దురపిల్లు** *v.n.* : To grieve, suffer.

**దురద** *n.* : Itching. జిల, కనరు. **దురదగొండి ఆకు** *n.* : The nettle. దూలగొండి.

**దురదుర** *adv.* : Hastily. అతిశీఘ్రముగా.

**దురము** *n.* : Battle, war యుద్ధము. Swiftness. వేగము. *v.t.* : To wage war, to fight.

**దురాయి, దురా** or **దురాయీ** *n.* : A command, conjuration, adjuration, protestation a caveat or veto. ఆజ్ఞ, నీకు రాజుదురాయి you are not the king's friend.

**దురాడము** *n.* : A pillow, ఒరుగుదిండు.

**దురితము** *n.* : A crime, sin. పాపము.

**దురుసు** *n.* : Stubbornness, forwardness, impetuosity, hurry, vehemence, boisterousness, bluntness, rudeness. పెళుసు, పెటుకు, కట్టెవిరుపుతనము, పెడసరిగొట్టుతనము.

**దురోదరము** *n.* : Gambling. జూదము, దురోదరుడు a gambler జూదరి.

**దుర్గ** *n.* : One name of the goddess kali or Parvati.

**దుర్గము** *n.* : A strong-bold or-hill fort. కోట, స్వర్ణదుర్గము. a golden citadel.

**దుర్భిని** or **దుర్భిణి** *n.* : A telescope. ఓకు.

**దుర్యోధనుడు** *n.* : The name of a certain hero.

**దులదుల** *n.* : Hurry, agitation. సంభ్రమము.

**దులుచు** *v.a.* : To knock down as fruit off a tree, **దులుపు** *v.a.* : To shake off, as dust. విదిలించు.

**దువ** : Same as దుగ.

**దువారము** *n.* : A gate, gateway. వాకిలి.

**దువాళము** or **దువాళీ** *n.* : A trot ఒక విధమైన అశ్వ, ధార, దువాళించు to trot (as a horse does)

**దువ్వ** *n.* : Dust దుమ్ము, ధూళి.

**దువ్వటము** : Same as దుప్పటము.

**దువ్వటిల్లు** : See దూపటిల్లు.

**దువ్వలువ** *n.* : A cloth, a vest; a garment దుప్పటము, కట్టుకోక.

**దువ్వు** *v.a.* : To stroke, hanger or handle. To comb To run the fingers through the hair. కాలుదువ్వుట to draw the foot slowly over the ground, to paw the ground with the foot. **దువ్వెన** *n.* : A comb.

**దుశ్శిరము** *n.* : సుదర్శనలత, దూసరితీగె.

**దుష్టము** *adj.* : Vile, evil. bad, cruel, weak, base. **చెడ్డది, దుష్టమృగము** *n.* : A beast of prey. **దుష్టుడు** *n.* : A bad man.

**దుసికిలు** or **దునికిల్లు** *v.n.* : To slide off. To slip out of the fingers జారిపడు, బెణుకు To escape, తప్పించుకొను.

**దుఫ్, దుస్తరము** & c. : See under దుః.

**దుస్తు** *n.* : A cloth వస్త్రము A suit of clothes ఒక జత బట్టలు Beauty, అందము.

**దుస్సర** : Same as దూపర.

**దుహిత** *n.* : A daughter, కూతురు.

**దూకలి** *n.* : Pain బాధ.

**దూకు** *v.n.* : To leap over, get over, cross. **దుముకు, దూకుడు** *adj.* : Uneven ఎగుడు దిగుడు Forward.

**దూకొను** (from దూయు) *v.a.* : To penetrate, pierce. To learn, acquire. To suck up. To have, పొందు, కలుగు, ఆస్వాదించు. To oppose. *v.n.* : to spread, as a scent, వ్యాపించు, దూకొన్న suitable, proper. ఒప్పిదమైన.

**దూగర** *n.* : Soot కరదూపము. Dust, dirt; the dust of grain.

**దూచి** *n.* : A sort of game among boys.

**దూట** *n.* : Entering. The interior tender substance of the plantain tree : అరటి ఊచ.

**దూటు** *v.n.* & *a.* : To enter, rush into. To push the udder with the head, to butt. పొడుచు. దూటిపోవు. To rush, run swiftly, పరుగెత్తు. **దూటుకొను** *v.n.* : To fly. ఎగురు.

**దూడ** *n.* : A calf దూడలు అరిచనవి the calves were bleating. దూడల గొట్టిగాడు.

**దూడుగ** *n.* : చిలకదూడుగ.

**దూత** *n.* : (mase.) A messenger, an envoy. రాయబారి, దేవదూత (In Christian usage) an angel.

**దూతి** or **దూతిక** *n.* : A lady in waiting; a handmaid.

**దూది** *n.* : Cotton : which is thus called after being cleaned : విత్తులు తీసిన ప్రత్తి. దూదినిమ్మకాయ The citron, a kind of a large lime. **దూదేకు** *v.a.* : To clean cotton దూదేకులవాడు a man of the caste who are cotton cleaners. దూదేకులు cotton fluff. **దూదేకులపిట్ట** *n.* : The Grey Shrike, *Lanius lahtora.*

**దూప** *n.* : Thrist దప్పి. **దూవటిల్లు** or **దూవటిలు** *v.n.* : To feel thirsty, దప్పిగొను To be exhausted or wearied. అలయు. **దూపించు, దూపిల్లు** or **దూపిలు** *v.n.* : To thirst, to feel thirsty. దప్పిగొను.

**దూపము** *n.* : Smoke. పొగ. Burning of incense, incense.

**దూబ** *n.* : A mean fellow అధముడు.

**దూబరదిండి** *n.* : A prodigal, a spendthrift. సొమ్మును వృధాగా ఖర్చుచేసి తినువాడు.

**దూబిడి** *n.* : A stick used for keeping the loose pieces of thread in spinning నూలు తోడునపుడు చీడు తగిలించుటకు నిలిపే పీఠమమర్చిన కొయ్య.

**దూబూచి** *n.* : A game played by boys.

**దూము** or **ధూము** *n.* : Laying waste, sacking; a disturbance, plague, pestilence, epidemic. పాడు చేయడము, కొల్ల, దోపిడి. అమ్మవారి దూము an attack of cholera. హయిదరు దూము the invasion of Hyder.

**దూముడి** *n.* : A Knot with a loop, a running knot. దుస్సిపోయేముడి.

**దూయు** or **దుయ్యు** *v.n.* : To penetrate, go through గుచ్చుకొను. To

pull off the scabbard, as a sword. To take plam leaves out of a volume. ఊడదీయు to strip off leaves or boughs. To pluck, take, as a handful of grass.

**దూరము** *n.* : Distance, Distance in point of time. దూరదేశము a distant land. **దూరాభారము** *n.* : A great distance. **దూరుడు** *n.* : He who is far from దుష్టప్రవర్తన దూరుడై being far above such wickedness.

**దూరు** *v.a.* : To reproach, curse, rebuke, abuse, నిందించు. To enter, penetrate, rush in, చొచ్చు. To be introduced, or inserted. ప్రవేశించు.

**దూర్వ** *n.* : Bent grass : Saint foin, cinquefoil.

**దూర్వాసుడు** *n.* : The name of a Rishi or demigod proverbial for a fierce disposition. **దూర్వాసప్రకృతి** a violent temper.

**దూల** *n.* : Itching దురద, జిల. నవ. **దూలగొండి** *n.* : The plant called Cowach.

**దూలము** *n.* : A beam of timber. ముక్కుదూలము the bony division of the nose.

**దూషించు** *v.a.* : To revile abuse, satirize, laught at. నిందించు, దూరు. **దూషకుడు** *n.* : A reviler, a scoffer. నిందించేవాడు. **దూషణ** or **దూషణము** *n.* : Dispanagement, reproach. Abuse, reviling.

**దూసరితీగ** *n.* : A plant ఒక మొక్క. **దూసరి ధాన్యము** or **దూసరి వడ్లు** *n.* : The seeds of the same plant.

**దృ** *n.* : A serpent. పాము.

**దృక్కు** *n.* : The eye. కన్ను Sight, seeing, చూపు. **దృగాయుధుడు** *n. Lit.* : One who is armed with the eye, a title of Siva, who has a blasting glance.

**దృఢము** *adj.* : Hard, solid, strong, firm, bulky, massive. Able, mighty, brave, resolute, confirmed, certain, sure. real. **దృఢత** *n.* : Firmness, steadfastness, greatness, certainty.

**దృతము** *adj.* : Comforted, consoled. ఆదరింపబడిన.

**దృశ్యము** *adj.* : Visible. చూడదగిన. **దృశ్యుడు** *n.* : One who is visible, one worth looking at, a vencrable person, a respectable person.

**దృష్టము** *adj.* : Seen, visible, apparent. చూడబడిన. **దృష్టాంతము** *n.* : An instance, illustration, example, proof; evidence, testimony; a sample ఉదాహరణము. An institute or body of learning.

**దెప్పము** : A butt, a target. బాణాదుల కెదుట నిలిపిన కృత్రిమ లక్ష్యము, కూటలక్ష్యము.

**దెప్పరము** *n.* : Difficulty, distress. ఆపద, కీడు, కష్టము. Speed, quickness, త్వర. *adj.* : Perilous, terrible. అశక్యము, దుస్సహము. *v.n.* : To be

hurt. ఆపదనొందు,**దెప్పరికము** *n.* : Unbearableness, intolerableness దుస్సహత్వము.

**దెప్పు** *v.a.* : To taunt, quiz, gibe at, slander, tell tales of satirize.

**దెప్పుడు** *n.* : Taunting, gibing. దెప్పుట, దెప్పుడు మాటలు sarcasm.

**దెబ్బ** *n.* : A blow, a stroke. దెబ్బలుతిను to suffer blows, to be beaten. మంచిదెబ్బ a good blow.

**దెస** *n.* : A quarter or side. దిక్కు, పార్శ్వము. Lot bap, condition. అవస్థ, దురవస్థ Protection, refuge, దిక్కు, కాపు, ప్రాపు.

**దేకు** *v.n.* : To slide along on the posteriors. ముడ్డితో ప్రాకు.

**దేదీప్యమానము** *adj.* : Glorious, splendid.

**దేని** (from ఏది) *adj.* : Of which.

**దేబరించు** *v.n.* : To grovel, దేబరిస్తూ ఉండేవాడు. a mean wretch.

**దేబె** *adj.* : Wretched pauper, miserable. Dull, insensible, silly. A silly lout. దేబెముఖము గల careworn, wretched looking.

**దేయము** *adj.* : Fit to be given ఇయ్యదగిన.

**దేరీజ** *n.* : A tent. గుడారము.

**దేవ** : See under దేవుడు.

**దేవకము** *n.* : A die. (plu. dice) పాచిక, అక్షము.

**దేవకి** *n.* : The mother of the god Krishna. దేవకీనందనుడు Krishna.

**దేవనము** *n.* : Gambling, sport జూదము, క్రీడ.

**దేవరాతము** *n.* : A sluice from a tank అలుగు.

**దేవరాయికొంగ** *n.* : A kind of ibis, probably the Black ibis.

**దేవరుడు** *n.* : A title applied chiefly by a wife to a husband's brother. మగని తోడబుట్టినవాడు.

**దేవాంగి** or **దేవాంగులు** *n.* : The name of a certain caste of weavers. జేంద్రలు, **దేవాంగి** or **దేవాంగిపిల్లి** a sort of monkey, a Loris.

**దేవిడీ** *n.* : A fort-gate, a palace gate. కోటవాకిలి, నగరువాకిలి.

**దేవు** *v.a.* : To rinse. To take rice, & c., out of water with the hand to grope for, as with a drag under water, to trample on so as to destroy, as salt. **దేవురింపు** or **దేవురు** *n.* : Begging with importunity. Lamentation, bewailing, complaining, ఏడ్పు, మొర, **దేవులాడు** *v.n.* : To dive in water, to search in water. To roam about, to be in trouble, to pine or struggle.

**దేవుడు** *n.* : God, A deity, దేవత, వేలుపు. **దేవదత్తము** *n. Lit.* : the gift of god. The name of the conch or Arjuna అర్జునుని శంఖము. **దేవదారువు** *n.* : The Cedar : the Himalayan Cedar. Commonly called deodar. **దేవళము** *n.* : A temple, గుడి, దేవాలయము.

**దేవాలయము** *n.* : A temple. దేవళము. **దేవి** *n.* : A goddess, particularly Parvati. A queen.

**దేశము** *n.* : A country, land, territory; a district or sub-division of a country. రాజ్యము. A part, site, place, situation, seat, region, ప్రదేశము. **దేశకాకి** *n.* : A homeless wanderer, a vagrant. దేశపాండియ, దేశపాండ్య or **దేశముఖి** *n.* : A recorder. The higher revenue officer, a superintendent. **దేశభాష** *n.* : A vernacular language, as distinguished from Sanskrit; a dialect.

**దేహము** *n.* : the body. శరీరము. దేహబాధ a call of nature. **దేహసంబంధి** or **దేహసంబంధుడు** *n.* : A relation by blood. రక్తసంబంధుడు. **దేహయాత్ర** *n.* : Death. చావు. **దేహి** *n.* : The corporeal or embodied spirit. One who has a body, a man, దేహము గలవాడు.

**దేహళి** *n.* : A threshold : or the landing place before a door. (ఇంటి) గడప.

**దైతేయుడు** or **దైత్యుడు** *n.* : A demon, giant, or titan. తొలివేల్పు. **దైత్యారి** *n.* : The foe of the demons, i.e., Vishnu. A god వేలుపు.

**దైన్యము** *n.* : Lowness, meanness, poverty, humility, దీనత్వము. దరిద్రత్వము, దైన్యపడు to be humiliated. **దైన్యపాటు** *n.* : Humiliation.

**దైర్ఘ్యము** *n.* : Length. నిడుపు, పొడుగు.

**దైవము** *n.* : A deity, God దైవకృతము caused by chance or fortune దైవగతి Providence, the will or act of God chance. accident. దైవగతి చేత వర్షము రాలేదు it pleased God to give me rain. **దైవజ్ఞ** *n.* : A witch. **దైవజ్ఞుడు** *n.* : A fortuneteller wizard. **దైవతము** *n.* : A deity, వేలుపు *adj.* : pertaining to a god, దేవతది. **దైవికముగా** accidentally, providentially.

**దైవారు** *v.n.* : To excel, be exuberant. ఒప్పు, ప్రకాశించు, వెలుగు. To overflow. పొరలిపారు.

**దైహిక** *adj.* : Corporeal, bodily.

**దొంగ** (తీ to take lit. One who takes) *n.* : A thief or robber. A rogue, cheat, or hypocrite. A wretch, or miscreant : a culprit or felon. **దొంగిలించు** or **దొంగిలు** *v.a.* : To steal. అపహరించు.

**దొంగు** or **డొంగు** *v.n.* : To hide. దాగు.

**దొండ** *n.* : The plant called *Bryonia* or *Bimba*. దొండపండు the ripe fruit which is glossy and of a bright scarlet colour.

**దొండి** *n.* : A hole. రంధ్రము, తూటు, బొక్క. **దొండిపొడుచు** to bore, to make a hole, రంధ్రము చేయు.

**దొంతర** or **దొంతి** *n.* : A series. వరుస. A heap, or set of things, as a pile of pots or cups and saucers. *Adj.* : Lying in a series, వరుసగానున్న. adv. In a pile or heap.

**దొందడి** *n.* : A crowd, throng : a squeeze or crush : closeness, crowdedness. దిమ్మి, సందడి, సమ్మర్దము.

**దొందు** *n.* : A pair. జత. దొంబులిగొట్టు lit : one who kills two tigers. Ironically used to mean coward, పిరికివాడు.

**దొంపు** *n.* : A series of beds of flower or other plants. మళ్లవరుస.

**దొగ్గలి** *n.* : The Broad leafed thorny dock, రక్తబాష్పమనే మొక్క. The small leaved kind is called చిర్రికూర.

**దొట్టి** *affix.* : With, from తో, కూడా. రాముడుదొట్టి, రామునితో కూడా.

**దొడదొడ** or **దొణదొణ** *n.* : A gush (of water, & c.) a gushing flow.

**దొడవ** *n.* : A deformed person. కురూపి.

**దొడ్డ** *adj.* : Large, great, respectable Rich, powerful, Pleasing, charming, fine. దొడ్డనీళ్లు delicious water.

**దొడ్డి** *n.* : A yard. A backyard, stable or byre. పెరడు. *adj.* : Crooked, వంకరయైన. **దొడ్డికాళ్లు** bandy legs, పంగటి కాళ్లు. **దొడ్డివల** a kind of net, ఒకదినుసువల.

**దొడ్డు** Same as దొడ్డ. **దొడ్డువారు** (దొడ్డు + పారు) *v.n.* : To become great, to increase. అధికమగు.

**దొద్ద** *n.* : Plunder. కొల్ల, దొద్దకాడు *n.* : A plunderer. కొల్లపెట్టు వాడు. **దొద్దకత్తె** *n.* : A woman who plunders. కొల్లపెట్టునది. **దొద్దగొను** *v.t.* : To plunder, to rob. కొల్లగొను.

**దొద్దు** *n.* : A pot bellied man, a corpulent man. బొజ్జపట్టినవాడు.

**దొన** *n.* : A pool on a hill. కొండమీది నీటిపల్లము. A quiver, అమ్ములపొది. The sheath of a toddydrawer's knife, ఈంఢ్రవానికత్తిపిడి. **దొన యుప్పు** *n.* : Fuller's earth. చవుటి ఉప్పు.

**దొన్నె** or **దొప్ప** *n.* : A dish formed of a leaf pinned up at the corners.

**దొపారము** *n.* : The cap used to blind a goshawk or falcon.

**దొప్ప** See **దొన్నె. దొప్పలబోవు** *v.n.* : To bag out with wet, as leather does with damp. To shirivel up : to contract as the hands in pain. **దొప్పదోగు** *v.n.* : To plunge, to be drenched.

**దొప్పుదొప్పు** *n.* : A dull thumping noise.

**దొబ్బ** *n.* : A piece of flesh. A clot cloth of blood. ముద్ద. The outer side of the thigh. A pool or puddle. నెత్తురుకండ.

**దొబ్బు** *v.a.* : to shove, poke, push. తోయు. To cohabit, or lie with. To ravish or rape. పడదొబ్బు to knock down. దొబ్బుకొనిపోవు to run away with. **ఎత్తుకొని పారిపోవు** *n.* : A push, a thrust.

**దొమదొమ** *n.* : A loud buzzing.

**దొమ్మ** *n.* : The staggers : a fainting disease. మూర్ఛవంటిరోగము. Also,

the chest. దొమ్మవ్యాధి pneumonia. A kind of fish.

**దొమ్మడోలు** or **దొమ్మదారి** *n.* : A certain tree. అశ్వగంధి, పెన్నేరు, హయగంథ.

**దొమ్మర** *n.* : The name of a certain wandering caste, the members of which are tumblers, ropedancers and buffoons. **దొమ్మరి** *n.* : A man of this caste. దొమ్మరివాడు.

**దొమ్మి** *n.* : A swarm, rabble, mob, crowd. A melee fight. A fray, a skirmish. A noise, సందడి. దొమ్మి గూడి వచ్చిరి they came in a mob. దొమ్ములాడు to riot, to flight, To be distressed, to suffer.

**దొర** or **ధొర** : (from a Turanian root Tur-swift, powerful. The root is found also in Turk, Turannian, త్వర, త్వరితము, & c) n. A chief, a baron, a lord, master, owner, ruler, king, governor. ఏలువాడు, రాజు, గొప్పవాడు.

**దొరకు** : Same as దొరుకు. **దొరకుపడు** *v.n.* : To be caught or entangled. చిక్కుకొను. **దొరకొను** *v.n.* : and a. To be found. లభించు, చిక్కు. To begin, ఆరంభించు. To try, యత్నించు.

**దొరయు** *v.n. & t.* : To touch అంటు. To approach, come near, సమీపించు. To be equivalent to, సమానమగు. To resemble, be one with, suit, befit, become.

**దొరలు** or **దొర్లు** *v.n.* : To roll, to be rolled, to be poured forth, to be overturned or upset. Metaphorically, to die.

**దొరవి** Same as దొరువు.

**దొరుకు** or **దొరకు** *v.n.* : To be got, gained, found, procured, obtained. To accrue, occur, turn up చిక్కు, లభించు. దొరికించుకొను *v.a.* : To apprehend, seize, secure.

**దొరవు** or **దొర్వు** *n.* : A well-spring supplied by a sluice, a largewell : a pit of water. A ship's dock. నడబావి. A tank, కొలను. **దొరువుపట్టెద** *n.* : A crupper. ఎద్దుముడ్డికి తగిలించే పట్టెడ.

**దొలుపు** *v.t.* : To cause to roll. దొర్ల జేయు. **దొర్లించు** *v.t.* : To upset. దొరలించు. పాచికలను దొల్లించినాడు he threw the dice.

**దొసగు** or **దొసవు** *n.* : Fear, evil, harm. భయము, కీడు, ఆపద. విఘ్నము. *v.n.* : To happen, సంభవించు.

**దోః** or **దో** *n.* : The arm. బాహువు. Plu. దొలు.

**దోర్బలుడు** *n.* : One who is strong in the arm : a mighty man. **దోర్మూలము** *n.* : The armpit. **దొర్లు** a plural of దో.

**దోకు** *v.a.* : To pare or shave the ground, cutting up the turf. To dig slightly so as to loosen the soil for weeding. నేలను చెక్కు. **దోకుడు** or **దోకిస** *adj.* : Paring or scraping the ground. దోకుట. **దోకుడుపార** *n.* : A weeding spade. **దోకుడుబార** *n.* : A game played by children.

**దోగు** or **తోగు** *v.n.* : To be wet. తడియు. To be bruised. కొట్టుకొనిపోవు. **దోగాడు** or **దోగియాడు** *v.n.* : To crawl on the hands and knees like a babe. **దోగురు** *n.* : Theft దొంగతనము, చౌర్యము.

**దోగ్ధ** *n.* : A cowherd గొల్లవాడు. దోగ్ధ్రి *n.* : A milch cow. ఈనిన ఆవు, పాలిచ్చే ఆవు.

**దోచు** or **దోచుకొను** *v.a.* : To plunder, rob, sack. దొంగిలించు, అపహరించు.

**దోటి** *n.* : A pruning hook. A hook at the end of a pole. దోటమ్ము or దోటియమ్ము *n.* : An arrow with a crescent shaped head. దోటిముక్కర a hook-like nose-ring.

**దోటు** *v.t.* : To give. ఇచ్చు.

**దోణము** or **దోణాము** *n.* : A dumb-bell or Indian club. భుజమునకు బలము నిచ్చుటకై త్రిప్పెడు జెట్టెవాని యుపకరణ విశేషము. A mallet, ప్రూను సంకరముగా చీలుటకై అక్కడక్కడ చెక్కిన మేకులను దిగగొట్టెడు ఉపకరణ విశేషము.

**దోత్రము** *n.* : A garment : clothes. దోవతి.

**దోదసి** *n.* : The 12th day in the dark or lunar fortnight.

**దోదు** *adj.* : Bulky, slow, heavy, tardy.

**దోదుమి, దోదుమ్మి** or **దోదుముదారి** *n.* : A kind of weapon. ఆయుధ విశేషము.

**దోనము** *n.* : A large mallet. తాటిబద్దలు వేసేటప్పుడు దబ్బిచిప్పమీద కొట్టేది.

**దోనె** or **దోని** *n.* : A small boat ; a single masted ship. A small bucket, జలగడుగు సాధనము. A trough, usually made of a palm tree hollowed as a canoe. The beam, roller or pillow in a loom. A sluice, కాలువతూము. *adj.* : Slight, అల్పము.

**దోపిడి, దోపు** or **దోపుడు** *n.* : Plunder, devastation, pillage. దోపిచ్చువారు those who submit to be robbed.

**దోపు** *v.a.* : To stick in, insert, fasten (a hook or button)

**దోమ** *n.* : A mosquito or gnat. మశకము. **దోమతెర** *n.* : mosquito curtain.

**దోమటి** *n.* : Food అన్నము.

**దోమడి** *n.* : A marriage feast attended by certain peculiar ceremonies, in which only married people whose partners are alive can join.

**దోవము** *n.* : Diarrhoee in cattle. ఆహారము దేహమునపట్టక పశువులు పారుకొనుట.

**దోయము** *n.* : A dose, a certain prescribed quantity.

**దోయి** *n.* : A couple, a pair. జత. చనుదోయి a pair of breasts.

**దోర** *n.* : A heap, pile, stack. కుప్ప, పోగు, రాశి. *adj.* : Dun coloured.

**దోరణ** or **దోరణము** : Same as తోరణము. దోరపాక or ఓరపాక a shed with a pent roof.

**దోరము** : Same as ద్వారము.

**దోరు** *v.n.* : To die, expire, perish. చచ్చు. To be done away with or removed. తొలగిపోవు. To bend down, ఒరగు, వ్రాలు. **దోరుచు** or **దోర్చు** *v.t.* : To kill. చంపు. To cause to bend down, ఒరగించు, వ్రాల్చు.

**దోరువ** or **దోరువా** *n.* : A kind of plover. ఒకవిధమైన పక్షి.

**దోరెము** *n.* : The string by which hawks are kept tied up. డేగలకు కట్టె త్రాడు.

**దోవ, తోవ** or **త్రోవ** *n.* : A way, road, path. A way or means, an expedient. దోవపెట్టు to make a way, దారిచేయు.

**దోవతి** *n.* : A man's garment worn round the lions. కట్టువస్త్రము, పరిధానము.

**దోష** *n.* : Night. రాత్రి. The arm, భుజము. **దోషము** *n.* : Harm, evil. A fault, crime. An error, mistake, తప్పు sin, పాపము. A bad sign : a fatal symptom in illness. ప్రమాణము యొక్క దోషము the penalty of an oath.

**దోస** *n.* : A cucumber A melon (Ceded Districts) చేతిదోస or చేదుదోస the bitter cucumber. నక్కదోసకాయ a gherkin, ముల్‌దోసకాయ the prickly cucumber. నూగుదోస rough bryony. దోసకాయ చెంబు a mug, ribbed like a sort of cucumber.

**దోసము** : Same as దోషము. **దోసకారి** *n.* : A wicked person, a sinner. **దుష్టుడు, దుష్టురాలు** *n.* : he or she who is a sinner.

**దోసర** *n.* : The name of a certain creeping plant.

**దోసిలి** or **దోయిలి** *n.* : The hands held together so as to form a cup. A double handful : as much as can be contained in the two hands held as a cup.

**దోసె** *n.* : A kind of cake. ఆపము.

**దోహదము** *n.* : Wish, desire, longing. ఇచ్ఛ. The desires of a pregnant woman, గర్భిణికి గల వేవిళ్లు. Manure, ఎరువు. The art of gardening : the operation of forcing a plant or bringing out the flowers prematurely. దోహద లక్షణము pregnancy, గర్భము.

**దోహలము** *n.* : Desire, eagerness, or longing. Aspiring. ఇచ్ఛ, ఉత్సాహము. **దోహలి** *adj.* : Expert. నిపుణుడు, సమర్థుడు.

**దౌ, దవు** or **దవ్వు** *adj.* : Far, afar, distant. దూరము.

**దౌడ, దవుడ** or **దవడ** *n.* : The cheek. చెంప. బుగ్గలోపలి భాగము, తాలువు.

**దౌడు** or **దవుడు** *n.* : A fast run, a gallop, మిక్కిలి వేగపు పరుగు. See దవుడు.

**దౌత్యము** *n.* : Agency, ambassadorship. దూతభావము. An act of an agent, దూతకర్మము. The nature of an agent, దూతస్వభావము.

**దౌరు** or **దవురు** *n.* : Brightness, brilliancy. కాంతి.

**దౌరుగోడ** *n.* : A parapet wall round a well.

**దౌర్జన్యము** *n.* : Force, violence, wrong, fraud. బలాత్కారము.

**దౌర్భాగ్యము** *n.* : Mischance, evil, ill luck. దురదృష్టము. **దౌర్భాగ్యుడు** *n.* : A wretch, a miscreant.

**దౌల** or **దవ్వల** *adv.* : A far off. దూరమందు.

**దౌలత్తు** *n.* : Fortune; wealth; regal state.

**దౌవారికుడు** *n.* : A warder, a porter. ద్వారపాలకుడు.

**దౌవు** : Same as దువ్వు.

**దౌష్ట్యము** *n.* : Badness, wickedness. దుష్టస్వభావము.

**దౌహిత్రుడు** *n.* : A daughter's son. దుహితకొడుకు, మనుమడు.

**దౌహృదము** *n.* : Wish, desire, longing (in pregnant woman.) The prospect or symptoms of pregnancy. Compare దోహదము and దోహదవతి.

**ద్యుతి** *n.* : Brilliancy, radiance. కాంతి, వెలుగు.

**ద్యుమణి** *n.* : The gem of the sky, i.e., the Sun.

**ద్యుమ్నము** *n.* : Wealth; power. విత్తము, పరాక్రమము, బలము.

**ద్యూతము** *n.* : Gambling, play. జూదము.

**ద్యోతకము** *adj.* : Illuminating. ప్రకాశింపజేయునది. Conveying, shewing. స్నేహద్యోతకము what shews friendship. **ద్యోతము** *n.* : Light, heat. ప్రకాశము, ఎండ.

**ద్రప్సము** *n.* : A drop of water. నీటిబొట్టు. అతడు నాకు ఒక ద్రప్సమున్ను ఇయ్యలేదు he did not give me even a drop of water.

**ద్రబ్బెడ** *n.* : A kind of cake. ఒకవిధమైన భక్ష్యము.

**ద్రవము** *n.* Juice : moisture. తడి. **ద్రవద్రవ్యము** *n.* : A liquid. **ద్రవించు** *v.n.* : To distil, emit (moisture or liquor) To trickle, as water. కారు.

**ద్రవిడము** *n.* : The Tamil country. ద్రవిడాంగన a Tamil lady. ద్రావిడ.

**ద్రాక్ష** *n.* : A grape, a grape vine. పచ్చి ద్రాక్ష an unripe or sour grape. ద్రాక్ష పండ్లు raisins. ద్రాక్షరసము wine.

**ద్రాక్షారామము** *n.* : The name of a village near Rajahmundry.

**ద్రాఘిష్ఠము** *adj.* : longest : very long, మిక్కిలి దీర్ఘము.

**ద్రాబ** *n.* : A blockhead, a fool అసారుడు, అధముడు. *adj.* : Silly, worthless, base, trashy, అధమము, ద్రాబసొమ్ము trash, stuff, rubbish.

**ద్రావకము** *n.* : Spirit. An extract, essence. గంధకద్రావకము Sulphuric acid, vitriol. పెట్లుప్పు ద్రావకము Nitric acid. లవణద్రావకము Muriatic acid. కర్పూర ద్రావకము or కర్పూర తైలము turpentine.

**ద్రావిడ** *adj.* : Dravida; a name usually applied to Tamil. ద్రావిడ దేశము the Tamil country. ద్రావిడులు or ద్రావిళ్లు the Tamil people.

**ద్రిండు** : Another form of దిండు.

**ద్రుడ్డు** : Same as దుడ్డు adj.

**ద్రుతము** *n.* : Speed, quickness, త్వర. A name given by Telugu grammarians to the letter (న) N, in particular places. ద్రుతప్రకృతి A grammatical phrase denoting a word which ends in an N sound.

**ద్రుమము** *n.* : A tree. వృక్షము.

**ద్రొబ్బు** : Same as దొబ్బు to cause to fall, పడద్రోయు.

**ద్రోణము** or **దోణము** *n.* : A certain measure of capacity : rather more than 64 lbs. avoirdupois. తూము. The name of a certain hill. A steel. bow used in gymnastics. A scorpion. **ద్రోణాచార్యులు** *n.* : The name of a certain hero renowned for his strength.

**ద్రోవది** *n.* : The daughter of Drupada. ద్రౌపది.

**ద్రోహము** *n.* : Treachery. కీడుతలపు. Harm, offence, wickedness, a sin. రాజద్రోహము treason. స్వామి ద్రోహము a sin against God. **ద్రోహి** *n.* : A traitor.

**ద్వంద్వము** *n.* : Apair or couple. రెండు. The name of a certain kind of compound word (సమానము.) in which two nouns if uncompounded would be in the same case and united by a conjunction. Thus, రామ లక్ష్మణులు. Rama and Lakshmana. ద్వంద్వయుద్ధము A duel.

**ద్వయము, ద్వయి** or **దోయి** *n.* : A pair, couple. జత, రెండు.

**ద్వాదశ** *adj.* : Twelfth. పండ్రెండవ. **ద్వాదశాత్ముడు** n. The god who has twelve phases, an epithet of the sun. **ద్వాదశి** *n.* : The twelfth lunar day of either the light or dark fortnight.

**ద్వాపరము** *n.* : The third or Brazen age of the world, which has preceded the present కలియుగము or Iron age. ద్వాపరయుగ కథలు old wives' tales, legends.

**ద్వారము** *n.* : A door. వాకిలి. An opening, orifice, hole. A medium or way, ఉపాయము. **ద్వారపాలకుడు** *n.* : A porter. వాకిటికావలివాడు, ప్రతిహారి. The figures of "cherubs" put up on each of the gates of a temple. **ద్వారబంధము** *n.* : The frame of a gate, a door frame. వాకిటి ద్రానిచట్టము.

**ద్వి** *n.* : Two, ఎండు. **ద్విగుణము** adv. and adj. Double, two fold. ధనద్విగుణము cent. per cent. **ద్విగుణాకృతము** *adv.* : Twice ploughed. **ద్విజ** *adj.* : Twice born. పక్షి, పల్లు, పాము. A tooth : as all

teeth are reproduced. **ద్విజుడు** A Brahmin.

**ద్విషుడు** *n.* : An enemy. శత్రువు.

**ద్వీపము** *n.* : An island. దీవి. A continent. The Hindu mythology reckons seven such. In compounds this means Foreign. Thus. ద్వీపద్రాక్ష పండ్లు Raisins, i.e., foreign grapes. ద్వీపాంతరములు foreign parts. **ద్వీపవతి** *n.* : A river, stream. నది, ఏరు. **ద్వీపి** *adj.* : Pertaining to islands, native of an island, insular. *n.* : A tiger, ounce or leopard, పులి, చిరుతపులి. The sea, సముద్రము.

**ద్వేషము** *n.* : Enmity, hatred పగ, శత్రుత్వము, అన్నద్వేషము loathing food, want of appetite. **ద్వేషి** *n.* : An enemy of ద్విషుడు. **ద్వేషించు** *v.a.* : To hate, dislike. విరోధించు, పగగొను. **ద్వేష్ట** *n.* : An enemy.

**ద్వైతము** *n.* : Dualism : the theory that there are two eternal and self-existing substances or principles. Opposed to అద్వైతము which teaches that there is but one substance of which all things are manifestation. Also the name of a forest. ఒకానొక వనము.

**ద్వైపాయనుడు** (from ద్వీపము.) *n. Lit* : The Island born. an epithet of వ్యాస the celebrated poet.

**ద్వైమాతురుడు** *n.* : An epithet of the god Ganesa; who according to mythology had "two mother", one being Parvati and the other an elephant.

**ద్వైవిధము** *n.* : Two-foldness : the being in two modes.

**ద్వ్యర్థి** *adj.* : Having a double sense, as an allegory or a puzzle.

## ధ

**ధ** : The letter Dh, as in Adhere.

**ధగధగ** *n.* : Brilliancy, glittering. *adj.* : Bright. "ధగధగద్ధగితరత్నము" or ధగధగలాడు *v.n.* : To glitter, to flash.

**ధట** or **ధటము** *n.* : A wooden balance, or pair of scales. కొయ్యత్రాసు.

**ధటి** *n.* : A belt. దట్టి. A modesty piece, గోచి. **ధటిని** *n.* : A cotton cord used as a belt నూలిమొలత్రాడు.

**ధట్ట** *n.* : An army, సేన. **ధట్టము** *n.* : A host, a multitude. సమూహము.

**ధట్టుడు** or **ధట్టుడు** *n.* : A hero, a brave man. శూరుడు.

**ధనము** *n.* : A herd of cattle. ఆవుల మంద. Treasure, property, resources, wealth. In mathematics, it is the equivalent of the word "plus".

**ధనియాలు** or **దనియాలు** *n. plu.* : Coriander seeds. కొతిమిరగింజలు.

**ధనిష్ఠ** *n.* : The name of a constellation. నక్షత్రవిశేషము.

**ధనువు** or **ధనుస్సు** *n.* : A bow. విల్లు. The arc of a circle. The sign Sagittarius in the zodiac. **ధనురా కారము** *n.* : The shape of a bow ధనుర్ధరుడు, ధనుష్మంతుడు or **ధానుష్కుడు** *n.* : An archer. విలుకాడు. **ధనుర్మార్గము** *n.* : A curved line : an arc.

**ధన్యము** *adj.* : Fortunate, blest, virtuous. *n.* : Wealth. An exclamation like Hurra! Huzza! most excellent! ధన్యుడు a happy or fortunate man, పుణ్యవంతుడు, పుణ్యాత్ముడు, కృతార్థుడు. **ధన్య** *n.* : A noble woman, a lady ధన్యురాలు, పుణ్యవతి.

**ధన్వంతరి** *n.* : A name common to Surya the sun, and to Siva, but usually given to the physician of the gods. దేవవైద్యుడు.

**ధన్వము** (from ధనువు.) *n.* : A bow. **ధ్వని** n. A woman. విలుకాడు. An epithet of Arjuna, అర్జునుడు. A skilful man, నేర్పరి.

**ధమనము** *n.* : Southerwood, a very fragrant herb. దవనము, కిక్కస కసవు.

**ధమని** *n.* : A vein. నరము, బోలునరము. A tube or pipe, గొట్టము. a flute. **ధమనుడు** n. One who blows a pair of bellows, కొలిమితిత్తి నూదువాడు. A cruel man, క్రూరుడు. Fire అగ్ని.

**ధమ్మిల్లము** *n.* : Tresses, curls, locks. కొప్పు.

**ధర** or **ధర** *n.* : Price, rate, valuation. ధరప్రతులు rates, prices. **ధరావతు** *n.* : Valuation. A deposit, an advance of a loan.

**ధర** *n.* : The earth. భూమి, నేల. See ధరణి. **ధరిత్రి** *n.* : The earth. భూమి, నేల. **ధరాధరము** *n.* : A mountain : as being a pillar or prop of the earth. **ధరణము** *n.* : Holding, possessing, having. ధరించుట. **ధరణి** *n.* : The earth. భూమి. ధరణి దేవుడు or ధరామరుడు *n.* : A terrestrial deity, i.e., a. Brahmin. **ధరనీధరము** *n.* : A mountain. కొండ, నేల తాల్పు. **ధరణీ ధరుడు** or **ధరణీశ్వరుడు** *n.* : A king, రాజు.

**ధరణము** *n.* : An imaginary coin, of the value of 8 dubs.

**ధరించు** *v.a.* : To wear or put on. To bear, తాల్చు.

**ధర్మము** or **ధర్మువు** *n.* : Duty. విధి. Virtue, పుణ్యము. Right, న్యాయము. Alms. A rule, precept or principle. విధి. Nature, character, property, స్వభావము. A function or trade. Custom, usage, propriety. ఆచారము. ధర్మశాస్త్రము or ధర్మ సంహిత Law, the science of right. సాత్వికధర్మము the conduct that shows meekness, కులధర్మము the rules of caste. **ధర్మపత్ని** a lawful

wife. **ధర్మకర్త** *n.* : A judge or arbitrator. A church warden, or manager of a temple. The executor to an estate. **ధర్మజుడు** *n.* : One who knows what is right. ధర్మము నెరిగినవాడు. **ధర్మసత్రము** *n.* : A charity house, a poor's house. **ధర్మాత్ముడు** *n.* : A Virtuous or liberal man పుణ్యాత్ముడు, ధర్మాసనము *n.* : A Judge's seat.

**ధర్షణము** *n.* : Contumely, scorn. బెదిరించడము, తిరస్కారము. **ధరణి** *n.* : An adulteress. జారస్త్రీ. **ధర్షించు** *v.t.* : To treat with contempt. తిరస్కరించు.

**ధవళము** *adj.* : White, bright. తెల్లని. Fine, చక్కని *n.* : Whiteness, తెలుపు. **ధవళములు** *n.* : A kind of song. ఒక విధమైన పాట ధవళిమ or ధవళిమము *n.* : Whiteness, తెలుపు.

**ధవిత్రము** *n.* : A leather fan used in sacrifices.

**ధవుడు** *n.* : A master, lord, owner, king. రాజు. A husband, పెనిమిటి. See విధవ and వైధవ్యుడు.

**ధాటి** *n.* : A rush. An attack, as assault. An inroad, incursion, invasion. దండయాత్ర, దాడి, ధాటికలadj. Resolute, firm, decided, decisive, fluent, well versed. **ధాటిగా** *adv.* : Decisively, decidedly, resolutely, firmly, trimly, spiritedly, briskly.

**ధాణుకపాలు** or **ధాణుధోడ** *n.* : A shuffle; a quivering motion in dancing.

**ధాత** *n.* : One who saves. రక్షించువాడు. Brahma, the Creator, బ్రహ్మ.

**ధాతకి** *n.* : A tree called *Grislea tomenlosa,* ఆరెచెట్టు.

**ధాతువు** *n.* : The essence of anything. సారము. One of the constituent elements of the earth, or of the body. A fossil or mineral red chalk, పర్వత ధాతువు, జేగురు.

**ధాత్రి** *n.* : The earth. భూమి. A foster mother, తల్లి. A nurse, దాది. A plant, ఉసిరికచెట్టు. **ధాత్రేయి** *n.* : The earth. భూమి.

**ధానుష్కుడు** : See under ధనుస్సు. ధానుష్కస్వాములు expert archers.

**ధాన్యము** *n.* : Rice in the husk : rough rice. Grain, corn in general : all kinds of grain are spoken of in the plural number, except cleaned rice (బియ్యము) నవధాన్యములు the nine kinds of grains, viz., గోధుమలు, యవలు, పెసలు, సెనగలు, కందులు, బొబ్బరలు, నువ్వులు, మినుములు and ఉలవలు.

**ధామము** *n.* : A house, abode or dwelling. ఇల్లు. A place, చోటు. Light, వెలుగు. Brightness, splendour. కాంతి.

**ధార** *n.* : A stream, a current; oozing or issuing of anything; the course of a stream, a course or sequence.

ప్రవాహము. The edge, అంచు. Sharpness, కరుకు.

**ధారకము** *n.* : Sustenance, food. A stimulant, made of spices, & c., given to a convalescent before he is put upon diet.

**ధారణ** *n.* : Exchange, barter.

**ధారణము** *n.* : Keeping, holding, having, maintaining, wearing. ధరించుట.

**ధారాటము** *n.* : A horse. అశ్వము. A cuckoo, చాతకపక్షి, వానకోయిల.

**ధారాళము** *n.* : Freedom from restraint. అడ్డపాటులేమి. *adj.* : Liberal, free. **ధారాళవృష్టి** plenteous rain.

**ధారి** *n.* : One who bears or carries. ధరించువాడు, ధరించునది, విషధారి poisonous, venemous; one who carries a poison, విషమును ధరించినవాడు. ధారుడు *n.* : A bearer, carrier, supporter.

**ధార్తరాష్ట్రము** *n.* : A sort of goose or swan with a black beak and legs. నల్లని ముక్కును కాళ్లును గల హంస. **ధార్తరాష్ట్రుడు** *n.* : A son of Dhritarashtra.

**ధార్మికుడు** *n.* : A good man. పుణ్యాత్ముడు.

**ధావనము** *n.* : Running. పరుగు Cleanness. శుద్ధి. దంతధావనము cleaning the teeth.

**ధావళ్యము** *n.* : Whiteness, brightness, a white colour. తెలుపు.

**ధిక్కరించు** *v.a.* : To flout, scorn, disregard, treat contemptuously, cry out against. తిరస్కరించు. **ధిక్కారము** or **ధిక్క్రియ** *n.* : Scoru, contempt. తిరస్కారము. **ధిక్కారి** *n.* : A scorner. ధిక్కృతుడు one who is scorned, తిరస్కరింపబడినవాడు.

**ధిమింధిమి** *n.* : Ting tang, ding dong. **ధిమ్మనిమ్రోయు** *v.n.* : To resound aloud.

**ధిషణ** *n.* : Sense, wisdom. understanding : The intellect. బుద్ధి.

**ధిష్ణ్యము** *n.* : A place. స్థానము. A house, గృహము. A star, నక్షత్రము. Strength బలము.

**ధీ** *n.* : Understanding, intellect. బుద్ధి, మతి. ధీజనము the wise, the sagacious. **ధీంద్రియము** *n.* : The understanding sense, the knowing faculty, జ్ఞానేంద్రియము. **ధీమంతము** *adj.* : Sensible, intelligent. బుద్ధిగల. **ధీమతి** *n.* : A clever woman. ధీమంతుడు a wise man. బుద్ధిమంతుడు.

**ధీర** *n.* : A heroine, a brave woman. **ధీరము** *adj.* : Brave, firm, steady, wise, sensible. **ధీరత్వము** *n.* : Courage Self-command, resolution to hear or endure. **ధీరుడు** *n.* : A hero. ధైర్యము కలవాడు. A learned man, విద్వాంసుడు.

**ధీవరుడు** *n.* : A fisherman. జాలరి.

**ధుత్తూరము** *n.* : The Thorn Apple; ఉమ్మెత్తచెట్టు.

**ధుని** *n.* : A river. నది. a stream ఏరు.

**ధుర** *n.* : A burden. బరువు. **ధురంధర** *adj.* : Bearing a burden, able,

clever, talented. బరువు మోయునట్టి. **ధురంధరత్వము** *n.* : Supporting, upholding, patronage, responsibility.

**ధూ** *interj.* : Fie! Poh! avaunt!

**ధూకళి** *n.* : A sort of tune or dance.

**ధూతము** *adj.* : Tossed, flowing, dishevelled. ఎగరగొట్టబడిన.

**ధూపము** or **ధూపము** *n.* : Incense, fumigation. **ధూపకలశము** *n.* : A censer. **ధూపార్తి** *n.* : A censer. **ధూపితము** *adj.* : Fumigated, ధూపము వేయబడిన.

**ధూమము** *n.* : Smoke. పొగ. **ధూమకేతువు** *n.* : A comet, being "smoke-tailed", i.e., having a trail of smoke. Also a name of fire (Agni). **ధూమధ్వజుడు** *n.* : The god of fire, whose banner is smoke. **ధూమరేఖ** *n.* : A smouldering smoke.

**ధూర్జటి** *n.* : Siva శివుడు.

**ధూర్తము** *adj.* : Outrageous, rude, violent. **ధూర్తుడు** or **ధూర్తు** *n.* : A violent man, a villain. A cheat. మోసకాడు.

**ధూర్వహము** *adj.* : Able to bear or sustain a burden బరువు మోయగల. **ధూర్వహుడు** *n.* : One who sustains a burden **ధూర్వహత** *n.* : Sustaining, bearing. బరువు మోయుట.

**ధూళి** *n.* : Dust, దుమ్ము, పరాగము. **ధూళిధ్వజుడు** *n.* : Wind. వాయువు.

**ధూసరము** *adj.* : Ash colored, dark, obscure, embrowned as with dust, discoloured, soiled, begrimed, Iron-grey: blackish. బూడిద వర్ణము గల. n. Ashcolor. బూడిదవర్ణము. An ass, గాడిద.

**ధృతము** *adj.* : possessed, held, contained. ధరింపబడిన. ధృతకోపము angry. **ధృతరాష్ట్రుడు** *n.* : The father of Duryodhana and uncle of the Pandu princes. **ధృతి** *n.* : Steadiness, firmness, bravery, valour. ధైర్యము. Pleasure, happiness. సంతోషము, సౌఖ్యము. A spirit, extract, essence. లవంగధృతి essence of cloves. చందనధృతి sandal oil.

**ధృష్టుడు** *n.* : A man of firmness దిట్టతనము గలవాడు.

**ధేనువు** or **ధేనుక** *n.* : A milch cow. లేగటి ఆవు.

**ధైర్యము** *n.* : Steadiness, firmness, reliance, boldness, bravery, self-command. Resolution, courage, gallantry. నాకు ధైర్యము లేకపోయినది my heart failed me. ధైర్యము చేయు to make bold, to pluck up heart. ధైర్యము కొలవు to encourage, to comfort.

**ధోరణి** *n.* : A series, line, range; వరుస, పంక్తి. A way, style, tradition. పద్ధతి. ధూమధోరణి, a volume of smoke.

**ధౌతము** *adj.* : Washed, cleaned. కడుగ బడిన, ఉతికిన *n.* : A washed cloth. ఉతికిన బట్ట.

**ధౌరంధర్యము** (from దురంధరము) : Same as ధురంధరత్వము.

**ధౌరితకము** *n.* : A horse's trot. అశ్వగతి భేదము, కావతిరగడము.

**ధౌరేయము** *n.* : A beast of burden. **బరువుమోయు జంతువు** adj. Able to bear a burden. బరువు మోయునది. **ధౌరేయుడు** *n.* : One who is able to sustain a burden or responsibility.

**ధౌర్త్యము** : Same as ధూర్తత్వము.

**ధ్యానము** *n.* : Fixing the attention on God. Meditation. contemplation. A poetical personification. An encomium, panegyric. తదేక ధ్యానముగా నున్నాడు he has fixed his undivided attention on it. **ధ్యానించు** or **ధ్యానము చేయు** *v.a.* : To meditate on. ధ్యేయము fit to meditate on, ధ్యానింపబడిన.

**ధ్రువము** *n.* : Permanency, stability : certainity. నిశ్చయము. The truth, sure knowledge. *adj.* : Permanent, fixed, enduring, eternal, certain, ascertained. నిలుకడగల, కదలని. ధ్రువకాలు a permanent lease; ధ్రువపైరు a permanent crop, garden produce. **ధ్రువకము** *n.* : The Longitude. (Colebr. Essay on Zodiac) **ధ్రువపరుచు** *v.a.* : To establish, settle, ascertain or verify. **ధ్రువుడు** or **ధ్రువనక్షత్రము** *n.* : The name of the North Pole : the Pole Star.

**ధ్వంసము** *n.* : Destruction, ruin. నాశము. ధ్వంసము చేయు or ధ్వంసపరచు to ruin, destroy. నాశము చేయు. **ధ్వంసితము** *adj.* : Ruined, destroyed, wrecked.

**ధ్వజము** *n.* : A flag or banner. టెక్కెము. A flagstaff, టెక్కెపు కంబము. A mark, a sign or symbol. గురుతు. The male organ of generation. లింగము, మగగురి.

**ధ్వని** *n.* : A sound : a voice. ప్రతిధ్వని an echo. **ధ్వన్యర్థము** *n.* : An allegory. An ellipitcal meaning. **ధ్వనించు** *v.n.* : To sound శబ్దించు, మ్రోయు, మ్రోగు.

**ధ్వాంతము** *n.* : Darkness. అంధకారము. చీకటి.

**ధ్వానము** *n.* : Sound. ధ్వనిమ్రోత.

## న

**నంకు** *v.n.* : To rub on the ground. నేలను కోరాడు.

**నంగ** or **నంగనాచి** *n.* : A weevil, or canker worm, a book worm, a round white worm, (also called వడ్లచిలక and ముడికొొక్కు) which looks harmless but is desructive. **నంగనాచితనము** *n.* : Feigned simplicity. **నంగిమాట** *n.* : A nasal sound : a word pronounced through the nose. ముక్కుతో మాట్లాడినమాట. A snuffle, or twang.

**నంజ** or **నంజి** *n.* : Land artificially cultivated; land in which wet crops are raised; an irrigated field, a field adapted for the growth of wet crops. మాగాణి. The opposite is పుంజ or పుంజి dry land. **నంజనేల** *n.* : Wet land.

**నంజు, నంజుకొను** or **నంచుకొను** *v.n.* : To eat by small morsels, to nibble, to pick at, to eat a little of any thing like pickle. & c., as a relish to the principal food. **నంజుకురుపు** an idolent ulcer. నంజు చిగురు a gumboil.

**నంటి** or **నంటు** *n.* : Friendship. స్నేహము. మాలిమి. నంటు, నంటికాడు or **నంటుకాడు** *n.* : A friend, companion, or lover. నేస్తకాడు, స్నేహితుడు. నంటుకత్తె a female friend. స్నేహితురాలు.

**నంద** *n.* : A small pot. ముంత. Wealth, fortune, కలిమి.

**నంది** or **నందికేశ్వరుడు** *n.* : The name of the bull of Siva. A bull, వృషభము. పందిని నంది నందిని పంది చేసేవాడు one who can make a pig a bull and a bull a pig.

**నందించు** *v.n.* : To rejoice. **నందకము** *n.* : That which rejoices, సంతోషించునది. The sword of Vishnu. **నందన** *n.* : A daughter, కూతురు. The name of a year, ఒక సంవత్సరము. **నందనము** *adj.* : That which rejoices. సంతోషించునది. **నందన వనము** *n.* : Indra's pleasure garden. Elysium. A park. ఉద్యానవనము.

**నందివర్ధనము** or **నంద్యావర్తము** *n.* : The broad leaved Rose Bay. తగరచెట్టు.

**నందివృక్షము** *n.* : A tree, the Toon or Indian Mahogony Tree.

**నందుడు** *n.* : The shepherd king Nanda, the foster father of Krishna.

**నంబరు** or **నెంబరు** *n.* : A number. Also (colloquially), a law-case. Abbreviated into నెం.

**నంబి** *n.* : A Vaishnava priest. విష్ణుపూజకుడు.

**నకనక** *n.* : Hunger. కార్శ్యము. **నకనక బడు** or **నకనకలాడు** *v.n.* : To be famished. కృశించు. వాని కడుపు నకనకలాడుచున్నది he is famished.

**నకరనక్రలు** *n.* : A weed called *Poa ciliata*.

**నకలు** *n.* : A copy of a document or letter; a duplicate. నకలువ్రాయు or చేయు to make a copy of a document or letter.

**నకషా** *n.* : A map or plan.

**నకారపొల్లు** *n.* : The sign of N final. This is exemplified in the words నాకున్, వానికున్, ఇంటిలోన్, బైటన్.

**నకించనత్వము** *n.* : Nothingness, Nonexistence.

**నకీబు** *n.* : A herald, a chamberlain or usher. భట్టురాజు, వెండిబెత్తమువాడు, వేత్రధరుడు.

**నకులము** *n.* : The mongoose, ముంగి, ముంగిస. **నకులుడు** *n.* : Nakula, the name of a certain hero. యుధిష్ఠిరుని తమ్ముడు.

**నక్క** *n.* : A jackal. కొంకునక్క a fox : గుంటనక్క, కొండనక్క or **పోతునరి** *n.* : The Indian Fox, *adj.* : Mean, base, క్షుద్రము. నక్కను తొక్కి వచ్చినావు you have come on a jackal in your way, i.e., you are in luck to-day. **నక్కగుంట** a pitfall.

**నక్కీ** *n.* : Gold or silver lace, brocade. సరిగ.

**నక్కు** *v.n.* : To prowl, crouch down. To peep. To conceal or hide oneself, ఒడుగు, దాగు *n.* : A joint, అతుకు.

**నక్తము** *n.* : Night. నక్తంకరుడు n. An epithet of the moon. **నక్తంచరుడు క్తే** A demon, a fiend that prowls at night. రాక్షసుడు, రేద్రిమ్మరి.

**నక్రము** *n.* : A crocodile. మొసలి.

**నక్షత్రము** *n.* : A star. చుక్క. A constellation. The name of any one of the twenty lunar mansions. అశ్వని మొదలగు నక్షత్రములు సూర్యుడున్న నక్షత్రము the sign in which the sun is. **నక్షత్రమాల** a necklace consisting of twenty seven pearls. **నక్షత్రవీధి** *n.* : The Milky Way.

**నఖముక్త** : A nail, talon, claw. గోరు. A scale, as of an armadillo.

**నఖారా** *adj.* : Worthless, useless.

**నగ** *n.* : A jewel or ornament. భూషణము. Cattle in general.

**నగదు** *n.* : Ready money, cash. నగదీ లెక్క or నగదులెక్క a cash account.

**నగము** *n. Lit* : That which is immovable. A hill, కొండ.

**నగరము** or **నగరి** *n.* : A town పట్టణము, పురము.

**నగరిచెక్క** Same as నక్కెరు.

**నగరు** or **నగరి** *n.* : A house, a palace. రాజగృహము. ఆ మాన్యము నగర గలిసి పోయినది that land is fallen in to Government. A temple. దేవగృహము. నగరు సాంబ్రాణి benzoin imported from Nugger.

**నగవు** or **నవ్వు** *n.* : A laugh, a smile. నగవరి one who is laughing, నవ్వుగలవాడు. See నవ్వు.

**నగారా** *n.* : A large kettle drum. పెద్ద ఢంకా.

**నగిషీ** or **నకాసి** *adj.* : Ornamental, variegated, as sculpture.

**నగు** or **నవ్వు** *v.n.* : To laugh. To smile. నవ్వు. **నగించు** or **నవ్వించు** *v.a.* : To make (one) laugh. నగుబాటు or **నవ్వుబాగు** *n.* : A joke, a jest : redicule, mockery. అపహాసము.

**నగ్గు** or **నుగ్గు** *n.* : Powder. పొడి, చూర్ణము.

**నగ్నము** *adj.* : Naked. నగ్నంకరణంబులై stripped naked. నగ్నత్వము nudity, nakedness. **నగ్నవేషము** *n.* : Nudity, a naked figure or appearance.

నగ్నవేషధరుడై assuming the appearance of a naked man. నగ్నుడు a naked man, దిసమొలవాడు.

**నచ్చికొట్ట** *n.* : a drug called *Coccolus indicus.*

**నచ్చు** *v.a.* and *v.n.* : To confide, trust. నమ్ము. To coax, persuade; to harass, pester. *n.* : Delay. ఆలస్యము. Wearisomeness, annoyance; something that gives trouble. బాధ.

**నజరానా** or **నజరు** *n.* : A present, A present offered in homage. A forced contribution, an unjust fine. నజరుగల shapely, handsome, fine.

**నజుగుజులుచేయు** *v.n.* : To hustle, push about.

**నజ్జ** *adj.* : Thick, buttery, greasy, as buffalo's milk.

**నజ్జు** *n.* : An atom. అణువు. A bit, fragment. నలుసు. నజ్జునజ్జుగా కోయు to mince, cut up into small bits.

**నటత్** *adj.* : Dancing. terrible with moving eyebrows. నటన or **నటనము** *n.* : A dance, dancing. నాట్యము Motion, agitation; cunning behaviour, కపటప్రవర్తనము. మాయా నటనము a course of fraud. **నటి** n. An actress. వేశ్య, నట్టువుని పెండ్లాము. **నటించు** *v.n.* : To dance. To act, as on the stage.

**నట్ట** *n.* : A die at play. పాచిక. **నట్ట** Short for నడుమ. The middle part of anything. **నట్టడవి** the heart of the forest, అరణ్యమధ్యము.

**నట్టనము** *adj.* : Slight, weak, frail.

**నట్టాడు** *v.n.* : To dance, నర్తించు. To move or shake, చలించు. నట్టాడునడుము a trembling waist.

**నట్టు** *n.* : A spot of ground. A place, abode. స్థానము, వాసస్థానము. Delay, ఆలస్యము. An obstacle, or hindrance; hesitation. ఆటంకము.

**నట్టువ** *n.* : Dancing నర్తనము, ఆట. నట్టువుడు, నట్టువకాడు or **నట్టుగుడు** *n.* : A dancing master. నాట్యము నేర్పువాడు. A dancer. నాట్యకాడు.

**నట్లొట్లు** *n.* : Drops of water that fall from the leaves of trees. చెట్లాకుల మీద నిలిచిపడే నీళ్లబొట్లు.

**నడచు** : Same as నడుచు, నడ or **నడక** *n.* : A walk; walking, stepping, motion, movement. గమనము. **నడకొండలు** moving mountains. నడపీనుగు a walking corpse : a fool, a good for nothing man. **నడజోడు** *n.* : A foot soldier. కాలిబంటు, పదాతి. **నడత** *n.* : Conduct, behaviour నడవడి, ప్రవర్తనము.

**నడము** *n.* : A sort of reed or bulrush. Burgrass, కిక్కసగడ్డి.

**నడయాడు** *v.n.* : To wander about, to roam, సంచరించు. To move, shake or tremble, చలించు. **నడవ** *n.* : The entry into a house. నడవలో

పండుకొన్నాడు he lay down in the entry or porch. **నడవడి** or **నడవడిక** *n.* : Conduct, behaviour. నడత, చరిత్రము. *plu.* : నడవడులు or నడవళ్లు. **నడతెంచు** (నడుచు + తెంచు.) *v.n.* : To come. వచ్చు. నడతెమ్ము (the imperative.) come. To go, పోవు. **నడబావి** *n.* : A well with steps down into it.

**నడి, నడిమి** or **నడు** *adj.* : Middle, mid. నడికాలము the idle time of the year, between the ploughings. **నడితడప** the thick or middle part of a palm branch, తడప. **నడికట్టు** (నడిమి + కట్టు.) *n.* : A girdle, waistband. నడిరేయి, నడురేయి or **నడురే** *n.* : Midnight.

**నడితి** or **నడ్తి** : Same as నడత.

**నడుకు** *v.n.* : To tremble వణకు, కంపించు. నడుకొను (నడుకు + కొను) Same as వణకు. **నడునడు** *adj.* : Trembling much. మిక్కిలి వణుకుచు.

**నడుచు** or **నడచు** *v.n.* : To walk, go, move, proceed. To happen, occur, pass, take place.

**నడుము** *n.* : The middle, the waist, or loins. కాను. The middle portion మధ్యభాగము. నడుమంతరము or **నడుమంత్రము** *adj.* : Extraordinary, unprecedented, unthought of, as a windfall. *n.* : The waist, కాను. An interval, మధ్యకాలము.

**నడ్డి** *n.* : The bending of the body back-wards శరీరము వెనుకకు వంగియుండుట. (The bending of the body forwards or being hump-backed is called గూను.)

**నద్వలము** or **నద్వంతము** *adj.* Reedy, abounding in reeds. నడప్రాయదేశే, కిక్కస కసువుగల (దేశము.)

**నతము** *adj.* : Bent, bowed. వంగిన. Crooked, వంకరైన. Deep, లోతైన. నతనాభి a deeply curved navel.

**నత్త** *n.* : A snail, a shell fish. గుల్లయందుండు పురుగు. A pad (like that used by palankeen bearers, so called because somewhat hollow.) **నత్తగుల్ల** *n.* : The shell of a snail, & c. **నత్తగొట్టు, నత్తచిప్ప** *n.* : An oyster shell. నత్తచేపలు. A sort of bird పక్షిభేదము.

**నత్తి** *n.* : Stuttering, stammering. **నత్తివాడు** a stammerer, నత్తిగలవాడు.

**నత్రెము** *n.* : A sort of glove worn by falconers.

**నది** *n.* : A river or stream A river or stream, which flows from west to east. **నదము** *n.* : A river which flows to the west.

**నద్ధము** *adj.* : Bound. కట్టబడినమొగ్గ. A sprout, చిగురు. A flower, పుష్పము. క్రొన్ననలు పూచెను it bore fresh blossoms. **ననకారు** *n. Lit* : Blossom time.

**ననంద** or **ననాంద** *n.* : A husband's sister. ఆడుబిడ్డ మగని తోడబుట్టినది.

**ననయు, ననచు** or **ననుచు** v.n. To expand, bloom, blossom, sprout, పూచు, పుష్పించు, పల్లవించు, చిగిరించు. To be pleasant or fine, ఇంపగు. To excel, అతిశయించు.

**ననుబ్రాయి** or **నన్బ్రాయి** *n.* : Ill-boiled food. చక్కగా ఉడకని బియ్యము. **ననుబ్రాయిపడు** of **ననుబ్రాయియగు** *v.n.* : To boil badly, as rice.

**నన్న** *adj.* : Short. కురుచ.

**నన్నూరు** (నలు + నూరు.) *adj.* : Four hundred.

**నపుంసకము** *adj.* : Neuter, neither masculine nor feminine.

**నప్త** *n.* : A grandson, either in the male or female line. మనుమడు.

**నఫరు** *n.* : An individual. నఫరుగతిగా individually. నఫరుజామీను personal bail. నఫరుగతిలెక్క each customer's account at a shop.

**నఫా** or **నకా** *n.* : Profit, gain, advantage. లాభము.

**నభము** or **నభస్సు** *n.* : The sky, or atmosphere. ఆకాశము, **నభస్యము** *n.*: A name of the month Bhadrapada. భాద్రపదమాసము. **నభస్వత్తు** or **నభస్వంతుడు** *n.* : Air, wind. వాయువు, గాలి.

**నమః** *n.* : Hall ! దండము. **నమసితుడు** or **నమస్వితుడు** *n.* : One who is worshipped, అర్చితుడు. **నమశ్శివాయ** I salute Siva. **నమస్కరించు, నమించు** or **నమస్కారము చేయు** *v.n.* : To prostrate one's self, salute with folded hands, bow.

**నమకచమకము** *n.* : Certain prayers in the Vedas addressed to Rudra.

**నమనములాడు** *v.n.* : To thrive, to bloom, as plants.

**నమనము** *n.* : Bending. వంగుట: Humility. నమ్రమగుట. **నమితము** *adj.* : bent. humble. వంగిన, నమ్రమైన.

**నమలు** or **నములు** *v.a.* : To chew, masticate or munch.

**నమస్కరించు** and **నమస్కారము** : See under నమః.

**నమిలి** : Same as నెమలి.

**నముచి** *n.* : A demon, so *named*. **నముచిసూదనుడు** *n.* : The slayer of Namuchi, an epithet of Indra. ఇంద్రుడు.

**నమూదు** or **నమోదు** *adj.* : Shewn, exhibited, entered, mentioned, specified, particularised. ఆగుపరచబడిన, చెప్పబడిన, వివరించబడిన.

**నమూనా** or **నమోనా** *n.* : A specimen, sample, model, pattern మాదిరి.

**నమేరువు** *n.* : The tree termed *Calophyllum inophyllum.* సురపొన్న.

**నమ్మకు** *n.* : Salt. నమ్మకుదారోగా a salt superintendent.

**నమ్మదుంప** *n.* : A sort of grass, *Scirpus kysoor.* కశేరుకము, గొట్టి గడ్డ.

**నమ్మి** : Same as నెమలి.

**నమ్ము** *v.a.* & *n.* : To believe or give credit to. To trust or confide in. To rely on, to have faith in. విశ్వసించు. To suppose. imagine. నమ్మనగు it is believable, విశ్వసింప వచ్చును.

**నమ్రము** *adj.* : Bowed, bent. crooked, curved. వంగిన.

**నయ** or **నయము** *n.* : Beauty. అందము.

**నయనము** *n.* : An eye. కన్ను.

**నయము** *n.* : Cheapness. Profit. లాభము. Smoothness మనువు, మృదుత్వము Beauty, అందము. Welfare, case facility. Good health, soundness. safety.

**నర, నరపు** or **నరువు** *n.* : Greyness of the hair. ఫలితత్వము. A grey hair. **నంవెంద్రుకలు** *n.* : Grey hairs. నరపగడ్డము a grey beard.

**నరకము** *n.* : Hell. దుర్గతి. **నరకుడు** *n.* : A scoundrel, villain. దుష్టుడు. **నరకాసురుడు** *n.* : The name of a giant slain by Vishnu. **నరకాంతకుడు** *n.* : The destroyer of Naraka, an epithet of Vishnu.

**నరకు** : Same as నరుకు

**నరగ** or **నరగజము** *n.* : A drum. భేరి, అనద్ధభేదము.

**నరము** *n.* : A vein or artery, a nerve. నాడి. A tendon, or muscle of the body. వానిచేతికి నరాలు లేవు he has no nerves in his hand. i.e., he is a very open handed man.

**నరయు** : Same as నరియు.

**నరవ** *n.* : A hill path. కొండత్రోవ.

**నరవంగి** *n.* : A kind of tree.

**నరాగి** or **నరాగీ** *n.* : A knife or sword. కత్తి, ఖడ్గము.

**నరిగి** *n.* : A certain colour of sheep. గొర్రెలలో నొకవిధమైన రంగు.

**నరిడి** *n.* : A certain disease of the heart among the cattle. గుండెయుబ్బరపు పశురోగము.

**నరియకొక్కు** *n.* : A sort of snake.

**నరియడు** *n.* :A jackal or fox. నక్క.

**నరియు, నరయు** or **నరియు** *v.n.* : To grow grey, as appliend to the hair. గడ్డము నెరిసినవాడు a man with a grey beard.

**నరుకు** or **నరకు** *a.* : To cut, to hew, to fell to sever, to chop or of lacerate. ఖండించు.

**నరుజు** *n.* : An atom. అణువు. *adj.* : Very small. సూక్ష్మము.

**నరుడు** *n.* : a man. A name of Arjuna. నరులు human beings. నర nara. *adj.* : Human. నరదేవుడు, నరపాలుడు or **నరేంద్రుడు** *n.* : A king, a ruler. రాజు. **నరపశువు** *n.* : A brutish man. **నరబలి** *n.* : A human sacrifice. **నరాంతకుడు** *n.* : A man slayer, a murderer. **నరభక్షకుడు** or **నరమాంస భక్షకుడు** *n.* : A cannibal.

**నరుము** *v.t.* : To reduce to powder, to triturate. పొడిచేయు. n. Powder. పొడి. భార. నరుమూడు (నరుము + ఆడు) Same as నరుము.

**నర్తనము** *n.* : Dancing, gesticulation, acting. నటనము, ఆట. నర్తనాగారము a dancing school. నాట్యశాల. **నర్తకుడు** *n.* : An actor, mime, or juggler. A puppet show man. ఆడెడువాడు, నట్టువుడు.

**నర్మము** *n.* : Sport, pastime, dalliance. పరిహాసము, మేలము. Gladness, సంతోషము.

**నర్మిలి** or **అర్మిలి** *n.* : Desire. అపేక్ష.

**నర్ర** *n.* : A troublesome milch cow. ప్రయాసచేత పిదుకదగిన ఆవు. An ox. నర్రలు horned cattle, కొమ్ములు గల పశువులు.

**నర్రమామిడి** *n.* : A plant used in medicine.

**నల** : Same as నల్ల adj.

**నల** or **నళ** *n.* : The name of a king. See నళ.

**నలక** *n.* : A particle or mote. నలుసు.

**నలకం** *n.* : A kind of vessel, భాండవిశేషము.

**నలకువ, నలగుడు** or **నలచు** : See under నలుగు.

**నలకూబరుడు** *n.* : The name of a son of Kubera.

**నలగు** : Same as నలుగు.

**నలత** : See under నలుగు.

**నలదము** *n.* : The root of the *Amtropogou muricutus,* called cuscuss grass. తెల్లవట్టివేరు.

**నలభై** or **నలుబది** *n. & adj.* Forty. నలభైమంది forty people.

**నలి** *n.* : Dust, powder. పొడి, చూర్ణము. Indisposition, illness, రోగము. Rubbish, weeds, stuff. చిదుగులు. Affection, love. ప్రేమ.

**నలినము** or **నలిని** *n.* : A lily. తామర. నలినాయాతాక్షి or **నలివాక్షి** *n.* : A woman who has fair eyes or lily-like eyes. **నలివారి** *n.* : The 'Foe to lilies : i.e., the moon.

**నలు** or **నాలుగు** *adj.* : Four. నలుదెసలు the four quarters or sides. నలుగురు, నల్గురు, నలువురు or **నల్వురు** *n.* : Four persons, Some persons, several people, as in English we say half a dozen without meaning exactly the number six. **నలుచదము** *adj.* : Four square.

**నలుగు, నలగు** or **నలియు** *v.n.* : To break.

**నలుడు** or **నళుడు** *n.* : The name of Nala, a certain hero.

**నలుపు** *n.* : Blackness. నీలవర్ణము. adj. Black. See నల్ల.

**నలువ** : See under నలు.

**నలువు** *n.* : Beauty. ఒప్పిదము. ability, సామర్థ్యము *adj.* : Beautiful. ఒప్పిదమైన. నలునొప్ప beautifully, finely.

**నలుసు** (from నలుగు) *n.* : A mote or particle: an atom: a mote that gets into the eye. రేణువు, నలుసంత very little, as much as an atom.

**నల్ల** *adj.* : Black. *n.* : Blackness. నలుపు. Black stuff : charcoal, బొగ్గు. Blood, నెత్తురు. **నల్లచీమ** *n.* : A black ant. **నల్లజీలకర్ర** *n.* : Black cummin. **నల్లటి** or **నల్లని** *adj.* : Black. **నల్లనయ్య** lit : the black god, i.e., Krishna. **నల్లపూస** *n.* : A black bead. **నల్లపడు** *n.* : To turn black, to blacke. *n.* : **నల్లమందు** *n.* : Lit the black drug, i.e., Opium అభిని.

**నల్లవు** or **నల్లవో** *Interj.* : Alas ! అయ్యో, ఔరా !

**నల్లా** or **నల్లీ** *n.* : The barrel of a gun.

**నల్లి** *n.* : A bug. మత్కుణము నల్లిచెట్టు A shrub.

**నల్లిక** or **నల్లికళ్లపాము**: See నలికిలిపాము.

**నల్లె** *n.* : A span. జేన. నల్లెడు of the size of a span, or of four finger's breadth. జేనెడు, లేక, బెత్తెడు.

**నల్లెరు** or **నల్లేరు** *n.* : The plant termed *Cissus*. a weed used in dyeing, వజ్రవల్లి. కొండనల్లేరు samphire.

**నల్వము***n.* : A furlong or a distance of four hundred cubits or 200 yards.

**నళ** *n.* : Name of a year. ఒక సంవత్సరము.

**నవ** *n.* : An itching. జిల, దురద. **నవగోను** *v.n.* : To itch. **నవనవ లాడు** *v.n.* : To flourish, prosper, thrive.

**నవటాకు***n.* : One eighth part of a seer.

**నవత్** *adj.* : Budding, వికసించెడి.

**నవత** *n.* : Languishing illness, decline. దీర్ఘజాడ్యము, నవయుట. Pain. Sorrow, దుఃఖము.

**నవనీతము** *n.* : Fresh butter. అప్పుడు చిలికి యెత్తిన వెన్న.

**నవము** *adj.* : New, కొత్త. *n.* : Praise, స్తోత్రము, పొగడ్త. Nine, తొమ్మిది. నవసంఖ్య the figure nine : viz. which the poets say is (the form of a beautiful ear. నవమన్మథుడు a second Cupid. నవసుందరి a second Venus, a rival to Venus. **నవకము** *adj.* : New, Fresh, blooming, నూతనమైనది. నవరత్న కిరీటము a gemmed crown. **నవరాత్రి** n. The "Navaratri" or nine nights : an annual festival in honour of Durga : also called Dussarah, దసరా.

**నవయు** or **నవియు** *v.n.* : To languish, sink, perish, to fall away in flesh. రోగాదులచేత కృశించు, శుష్కించు. నవిసిన worn away, worn out ఇట్లు నవిసి నవిసి చచ్చుచున్నాడు he is dropping into his grave.

**నవరంగము** *n.* : A chamber, or summer house standing alone in the square of a house. మధ్య రంగము.

**నవరు** Same as నగరు. **నవళ్లు** or **నగళ్లు** *n.* : Places. వివిధోత్పాతంబులకును నవళ్లలో దోచుకీడునకు దోడ్తోశాంతి విధానము.

**నవల** or **నవలా** *n.* : A woman. ఆడుది, ఇంతి. In the acc. case, నవలాను.

**నవాచారము** or **నవాసారము** *n.* : Salt ammoniac Ammonium chloride.

**నవాతు** *n.* : A sort of white loaf sugar.

**నవారు** *n.* : A broad tape. మంచుములకు నేసే పెద్దటేపు.

**నవి** *n.* : A foundation pit on which a wall is raised.

**నవీనము** or **నవ్యము** *adj.* : New, recent, fresh.

**నవితి** *n.* : A measure of twelve seers (Ganjam).

**నవుకు** *n.* : A leak in a channel or sluice.

**నవుకరీ** or **నౌకరీ** *n.* : Service. కొలువు. **నవుకరు** or **నౌకరు** *n.* : A servant. పరిచారకుడు, కొలువుడుకాడు.

**నవురు** or **నౌరు** *adj.* : Soft (as cloth or the temples).

**నవులు** or **నౌలు** or **నమలు** *v.a.* : To chew. To shoot or throb. పిక్కలు నవులుచున్నవి the calves of my legs ache.

**నవ్వు** *v.n.* : To laugh. హసించు. *v.t.* : To laugh at to joke పరిహసించు, అపహసించు. **నవ్వులాట, నవ్వుటాల** or **నవ్వుటాలు** *n.* : Laughter, amusement, fu. *n.* : **నవ్వుబాటు** or **నగుబాటు** *n.* : Ridicule, a joke.

**నశించు** *v.n.* : To be ruined or destroyed, to lapse, merge, pass away. **నశింపు** *n.* : Loss, destruction, ruin. **నశ్వరము** *adj.* : Perishing, perishable. నశించునది.

**నస** *n.* : Irritation, ticklishness, soreness of throat, itching. దురద. A pest; harm, danger, ఉపద్రవము. నసనసగానుండే irritable, ticklish. **నసగూటి** *n.* : An amorous woman, an adulterous woman, కామోద్రేకము కలది, జారిణి. **నసగూడు** *n.* : Amorous desire. కామోద్రేకము.

**నసుకు** *n.* : Slinking, An innuendo, a hint, A lie, అసత్యపు మాట. *adj.* : Petty, slight, inaudible. False, అసత్యము. *v.a.* : To hint, express by innuendo.

**నస్యము** *n.* : Snuff; any powder, or liquid which physicians prescribe to be snuffed up into the nose. నస్యము పిడిచు to express the juice of any herb into the nose. నస్యము వేయు to use such a medicine.

**నహి** : (interjection) No ! "వానినహి" kinship is all nonsense, the cousinship is a mere nullity.

**నాంచారు** *n.* : A lady, a goddess.

**నాంది** *n.* : A preliminary. The exordium, prelude, prologue dedication, or praise of a deity, recited in benedictory verses at the commencement of a religious ceremony or poem.

**నాకము** *n.* : Heaven, Elysium, Paradise, స్వర్గము. The sky, the atmosphere, ఆకాశము. నాకబలి See నాగవల్లి. **నాకేశుడు** *n.* : A name of Indra.

**నాకు** *v.n.* : To lick. నాకించు to make one lick. పులి నాకి విడిచినట్లు (proverb) you have had a narrow escape వానిని పాము నాకినది the snake stung him.

**నాకువు** *n.* : An ant-hill. పుట్ట.

**నాగ** or **నాన్** *adv.* : As though, so called.

**నాగపసాని** or **నాగప్పసారి**: See under నాగవల్లి.

**నాగము** *n. Lit* : That which pertains to a mountain. A serpent, పాము. Particularly, a cobra. **నాగపాశము** *n.* :The *sperpentine,* weapon of Varuna. **నాగబంధము** *n.* : The serpents embrace i.e., both wound together in an upright position as shown in various sculptures. **నాగేంద్రుడు** *n.* : The king of the Naga fairies.

**నాగరము** *n.* : Dried ginger, సొంఠి. నాగరము or **నాగరి** the name of the Devanagiri alphabet as, being elegant or polished. *adj.* : Pertaining to a town, నగర సంబంధమైన. **నాగరికత** or **నాగరికము** *n. Lit* : Townliness; urbanity, elegance, civility, courteousness, refinement, civilisation. **నాగరికుడు** *n.* : A gentleman, a man of elegance, a civilised person.

**నాగలి, నాగెలు** or **నాగేలు** *n.* : A plough. నాగటికర్రు a plough-share. నాగటి చిప్ప or నాగటిదుంప the wooden part of the plough on which the share is fixed. నాగటిజోదు an epithet of Balarama.

**నాగవల్లి** *n.* : The vine that produces the betel leaf or *tamalapaku.* నాగవల్లి or more correctly written నాకబల్లి, i.e., దేవలకు చేయు పూజ. **నాగపసాని** or **నాగప్పసాని, నాపసాని** *n.* : A matrom.

**నాగసింధూరము** *n.* : A red calx of lead.

**నాగా** *n.* : Nought, nothing; and cipher; intermission. Remainder. నాగా లేకుండా without fail. without intermission or remainder.

**నాచికొను** *v.a.* : To snatch, usurp, seize. హరించు. **నాచికోలు** *n.* : Seizure, usurpation, అపహరణము. **నాచు** *v.a.* : To snatch, *n.* : A thief.

**నాజేరు** *n.* : A sheriff in a court of law. An inspector. Nazir.

**నాజూకు** *adj.* : Delicate, fine, tender. సున్నితమైన, నాణెమైన.

**నాటకము** *n.* : Acting, dancing. నర్తనము. A play, or drama. Conduct. ప్రవర్తనము. వీధి నాటకము a street play. **నాటకులు** *n.* : Stage players, dramatis personae.

**నాట్యము** *n.* : Dancing, a dance, నృత్యము. నాట్యమాడు to dance.

**నాటు** *adj.* : Home-made, country-made. నాటుపురము the country, the mofussil. నాటుపురానికి పోయినారు they are gone up the country. **నాటువైద్యుడు** a quack doctor. నాటుమందు country-made gunpowder.

**నాటు** *v.n. & a.* : To plant or fix. గుచ్చు. To impress, as with the nails. To prick or pierce, గుచ్చుకొను. **నాటించు** *v.a.* : To plant, fix firmly.

**నాడా** *n.* : A ribbon, tape. నేసిన పట్టా.

**నాడి** *n.* : A pipe, tube, blow pipe. గొట్టము Any tubular organ of the body, as an artery, vein, the pulse. బోలునరము. A Hindu hour of 24 English minutes. గడియకాలము. నాడి చూచు to feel the pulse. **నాడింధమము** *n.* : Bellows, కొలిమితిత్తి.

**నాడు** *v.a.* : To plant, నాటు. *n.* : A land, a country, a district. తూర్పు నాడు, నాడెల్ల the eastern districts. all the land. పల్లపునాడు low-lying land. వేగినాడు the Vegi country. వేగినాటివారు people of the Vegi sect or party.

**నాడు** *n.* : A day. Time. That day. ఆనాడు. That time, ఆకాలము. ఆనాడు at that time. **నానాడు** *adv.* : Day by day, now and there. **నానాటికి** *adv.* : Day by day. by degrees.

**నాడె** *n.* : A weaver's shuttle. నూలుకండె యుంచి నేసే సాధనము.

**నాణెము, నాడెము** or **నాణ్యము** *n.* : Quality, Fineness, goodness of cloth, metals, & c. యోగ్యాయోగ్య పరిశీలనము. Character, honesty, యోగ్యత. Polished behaviour. నాగరికత. **నాడెకత్తె** or **నాణెకత్తె** *n.* : A polished woman. నాణెము కలది.

**నాతము** *n.* : A daily allowance of money, batta. బత్తెము. వానికి జీతనాతములు లేవు. he receives neither pay nor batta.

**నాతి** or **నాతుక** *n.* : A woman. స్త్రీ.

**నాదము** or **నాదు** *n.* : Sound; a note, a ringing in the ears. A slight head-ache. నాకు తల నాదుగానున్నది I have a slight headache. ధ్వని, మ్రోత. **నాదించు** *v.n.* : To make a noise, to sound మ్రోగు.

**నాది** *pron.* : Mine. **నాదు** *adj.* : My, my own. నాదుకరంబులు my hands.

**నాదూరు** or **నాదారు** *adj.* : Poor, helpless.

**నాథుడు** *n.* : A lord, king. రాజు, a hus-band, పెనిమిటి, a saint.

**నాన** *n.* : Shame, modesty. సిగ్గు. నానగేడియై losing all shame, సిగ్గుచెడి. **నానగండ** *n.* : A shameless man. సిగ్గుమాలినవాడు.

**నానపాల** *n.* : The plant called the *Thymeleaved spurge*. రెడ్డివారి నానబాల బియ్యము.

**నానా** *adj.* : Many, diverse, all sorts of, sundry. వివిధమైన. **నానాత్వము** *n.* : Plurality, diversity.

**నాను, నానుకోవి** or **నానుక్రోవి** *n.* : A gold necklace of small beads linked together. కంఠాభరణ విశేషము.

**నాను** *v.n.* : To soak, to be steeped, to become wet. నానుడు or **నాన్చు** *v.t.* : To cause to soak. నానజేయు. **నానుడి** (నాను + నుడి) *n.* : A rumour. కింవదంతి. A proverb, సామెత. **నానుడు** *adj.* : Moist, damp, wet, soaked, sopped, steeped. తడిసిన.

**నాపకుడు** *n.* : A destroyer. నాశకుడు, నశింపచేయువాడు. కులనాపకుడు the curse of his father's line.

**నాపరాయి** *n.* : A whitish freestone used in lithography. Grey chlorite slate, or potstone. నాపు ఉప్పు salt that is not crystallized.

**నావసా** *n.* : A knapsack. సిపాయీలవీపు మూట.

**నావసాని** : See under నాగవల్లి.

**నాపితుడు** *n.* : A barber. మంగలి.

**నాభి** *n.* : The navel. బొడ్డు. Musk, కస్తూరి. Poison, విషము, నాభి or వసనాభి aconite. The central hole in a wheel, రథచక్రమధ్య రంధ్రము. నాభిక *n.* : The navel. **నాభిజన్ముడు** *n.* : Brahma, as produced from Vishnu's navel.

**నామము** or **నామధేయము** *n.* : A name appellation, title. The upright mark drawn in the forehead by the Vaishnavites.

**నామా** *n.* : A deed, letters patent. కరారునామా an agreement. రాజీనామా a deed of an amicable settlement. వకాలతునామా a deed of attorney, a power of attorney given in writing.

**నామాలపిల్లి** *n.* : A sort of wild cat with four upright lines on the forehead. **నామములుతీయు** *v.n.* : To reed wood in carpentry, to carve it with parallel upright lines, resembling the Vaishnavite marks.

**నాము** *n.* : The new sprout springing from the stumps of millet. **నాపచేను** *n.* : A field of జొన్నలు of which the stalks after being cut, have thrown out sprouts నాపపంట the crop so produced.

**నామోషి** *n.* : Disgrace, shame. అవమానము.

**నాయకము** or **నాయకరత్నము** *n.* : the central gem or stomacher of a necklace పతకము నడిమిరత్నము.

**నాయకుడు** *n.* : A leader. శ్రేష్ఠుడు A chief, అధిపతి. కథానాయకుడు the hero of a poem or story. **నాయిక** n. The heroine. నాయకరము n. The rank or office of a Naik or headman, chiefdom, lordship. ఆధిపత్యము.

**నాయడు** or **నాయుడు** *n.* : A chief. A title borne by men of a certain Sudra caste.

**నాయన** *n.* : Father, sir. Used also as an endearing term for any one that is addressed. మీనాయన your father. మానాయనమ్మ my grand-mother. నాయన, నాయనా Alas ! alas, oh ! oh !

**నాయము** *n.* : Justice.

**నార** *n.* : The fibre of plants, fibrous bark of trees. నారకచ్చడము or నారకుడి a garment made of bark used by nuns. నారవస్త్రము. అరటినార strings of the fibres of the plantain tree. **నారచీర** *n.* : A garment of bark worn by sages, a linen cloth. **నారజెల్ల** *n.* : A sort of fish. **నారదబ్బకాయ** or నారదపు కాయ *n.* : The citron.

**నారంగము** *n.* : the orange tree. నారింజ.

**నారము** *n.* : Water. జలము. A crowd of men. నరులసమూహము.

**నారకము** *n.* : Hell. నారకస్థలము the infernal regions.

**నారట్టము** *n.* : Land which has chasms or cracks in it. నెరియలు వాసిన భూమి, బీటికనేల.

**నారదంతకము** *n.* : The side timber of a door frame. ద్వారపు నిడుపుకమ్మి.

**నారదము** *n.* : A sort of orange.

**నారదుడు** *n.* : Narada, the Mercury or Momus of the Hindu Olympus, represented as the inventor of the lute, and messenger and news monger of the gods. A roaming tell-tale, a makebate. నారద సంగీతము divine music. **నారదత్వము** *n.* : A jeering makebate temper like that of Narada or Mercury.

**నారసము** *n.* : An iron style or arrow; a pin or spike run through a volume to keep it together A tool used by housebreakers for boring walls. Proverbially used for a piercing glance.

**నారాచము** *n.* : An iron arrow. అచ్చుయినుప బాణము, గంటము. **నారాచి** *n.* : An instrument to cut gold, బంగారమునునరికే కొరముట్టు, సానము. The balance used by a goldsmith, అగసాలెవాని త్రాసు.

**నారాజి** or **నారాజీ** : Same as నరాజి.

**నారాయణుడు** *n. Lit.* : One who rests on the waters. A name of Vishnu or Brahma. విష్ణువు, బ్రహ్మ.

**నారి** *n.* : A woman. పరనారి another man's wife. **నారీత్వము** *n.* : The being a female: womanhood.

**నారి** *n.* : A bowstring. వింటి అల్లెత్రాడు. A gut or muscle, నరము. నారి or నారికురుపు *n.* : The guinea worm that breeds in the flesh of the leg, సెలపుండు, నాడివ్రణము.

**నారింజ** *n.* : An orange. కిచ్చిలిపండు.

**నారికేళము, నారికడము, నారికెడము** or **నారికేడము** *n.* : The cocoanut

tree నారికేళపాకము a very difficult style used in books.

**నారు** *n.* : a tender young sprout, or plant. Young plants kept to be transplanted. నారుమడి a field thickly set with grain to be afterwards transplanted. నారుపప్పు a shoot, & c. (anuk) **నారుపాటలు** *n.* : Common ballads or ditties regarding a fairy or goddess named నారు which presides over tender plants. **నారుపోయు** *v.n.* : To sow corn thickly, for the purpose of afterwards transplanting it. మిరపనారు పోసినారు they planted chilie seeds in beds.

**నారుడు** or **నార్చు** *v.t.* : To cause to wither. వాడజేయు.

**నారువ** *n.* : A kind of tree.

**నాలవ** : See under నాలుగు.

**నాలి** *n.* : A mean work. కుత్సితపు పని. కూలినాలి cooly and other low and uncertain kind or work. adj. Sly. కుత్సితము. Deceitful, వంచకము. Slight, imperceptible, latent, insidious, మందము. **నాలి కరువు** a latent or indolent ulcer. నాడీ వ్రణము, నారికురువు. **నాలిగాలి** or **నాలి తెమ్మర** a zephyr, a slight or imperceptible breeze. మందమైనగాలి.

**నాలి** *n.* : A forest tree called *Ulmus, integrifolia*.

**నాలుక, నాలిక, నాలికె** or **నాల్క** *n.* : The tongue. A tongue of fire. జ్వాల. కొండలనాలుక the uvula.

**నాలుగు, నాల్గు** or **నాలువు** *adj.* : Four. Often used indefinitely as when we say half a dozen.

**నాళము** *n.* : A tube, a hollow or tubular stalk, as the stalk of the water lily. కాడ, గొట్టము. A sort of air gun, చిమ్మనగ్రోవి.

**నాళ్లు** *n.* : The plural of three words; that is, of నాడు a day నాడి n. Vein and నాడు a country.

**నావ** *n.* : A ship, boat, or vessel. ఓడ, తరణి. **నావకన్ను** *n.* : A fish called Kuritch, also a species of Sparus. **నావికుడు** *n.* : A steersman. A sailor, ఓడ నడపువాడు.

**నావర** *n.* : A kind of locust that is most destructive to crops.

**నావుడు** or **అనవుడు** *conj.* : On his or her saying so, అనిచెప్పగా. Therefore, wherefore.

**నావురాకులు** *n.* : A sort of plant with broad leaves.

**నాశము** or **నాశనము** *n.* : Disappearance, కనబడమి. Ruin, loss, destruction, death. **నాసిరిల్లు** *v.n.* : To be ruined. నాశమునొందు, నశించు. To be hurt, నవయు.

**నాస** *n.* : The nose. ముక్కు. The lintel, or upper timber of a door. ద్వారము

మీది లక్ష్మికమ్మి, అడ్డకమ్మి. **నాసా పుటము** or **నాసికారంధ్రము** *n.* : A nostril. ముక్కురంధ్రము. నాసామణి *n.* : A nose jewel. ముక్కర. **నాసిక** *n.* : The nose. The sense of smell, ఘ్రాణము.

**నాసీరము** *n.* : The van of an army. అగ్రేసరసైన్యము, ముందరవెళ్లు దండు, సేనాముఖము. Pride, దర్పము. **నాసీరుడు** *n.* : A leader, a captain. సేనాముఖమందు నిలిచిన వాడు.

**నాస్థి** *n. Lit* : "It is not" A cipher, non-entity, nullity. **నాస్తికుడు** *n.* : One who denies the existence of an after-life, పరలోకము లేదనువాడు. An atheist. నాస్తిక్యము or **నాస్తీకత** *n.* : Atheism.

**నింకెర** *adv.* : Quickly, శీఘ్రము.

**నింగి** *n.* : The sky. ఆకాశము. నింగిచూలి the atmosphere, వాయువు. **నింగిపడు** *v.n.* : To set, as the sun, అస్తమించు. నింగిసిగ an eptithet of Siva. శివుడు.

**నించు** or **నింపు** *v.a.* : To fill. పసిడి కుండలు నించి filling the golden vases.

**నింజిలి** *n.* : Uneasiness, distress, trouble of mind. మనోదుఃఖము.

**నిండు** *v.n.* : To be filled, to be full. పూర్ణమగు. **నింట** or **నిండుట** *n.* : Fullness, as of water (జల) పూరము. **నిండ, నిండా** or **నిండుగా** *adv.* : Fully. Much, entirely, utterly. Perfectly. **నిండారు** or **నిండబడు** *v.n.* : To be full.

**నింద** *n.* : Blame, censure, reproach, dishonour. అపవాదము, దూరు. అపదూరు. **నిందాస్తుతి** *n.* : A sneer : ironical praise : irony. నిందాస్పదము.

**నింపాది** *adj.* : Plenty. సమృద్ధము. Gentle, proper, right, fair. *n.* : Gentleness, quiet. నెమ్మది. నింపాదిగా by gentle means, gently, fair and softly.

**నింపిరి** *n.* : Dirt. మురికి.

**నింపు** : See నించు.

**నింబము** *n.* : the margosa tree. *Ayadirachta indica.* వేపచెట్టు.

**నికటము** *n.* : Nearness. సమీపము. adj. Near, close to. సమీపమైన.

**నికము** : Same as నిక్కము.

**నికరము** *adj.* : What remains after all deductions are made, the net balance. త్రోపుడుపోగా మిగిలినది. Selected, excellent. నికరము బంగారు the net weight of the gold. నికరం రాబడి net income. *n.* : A flock or multitude. A treasure. నిధి. adj. Excellent, శ్రేష్ఠము.

**నికర్షణము** *n.* : The backside of a house, & c. ఇల్లులోనగువాని వెనుకటి భాగము. An open space around a town or city. పట్టణము చుట్టు వారికబయలు.

**నికష** *n.* : The name of the mother of the demons. రాక్షసుల తల్లి నికషాత్మజుడు *n.* : A son of Nikasha. నిర్రుతి.

**నికషణము** *n.* : Rubbing.

**నికారము** *adv.* : Voluntarily, willingly, (implying certainty.) Much : as much as one pleases, యథేచ్ఛము, మిక్కిలికోరినట్టుగా.

**నికాయము** *n.* : A multitude, a congregation ప్రోగు. నికాయము నికాయ్యము or నీకాయ్యము *n.* : A house. ఇల్లు.

**నికాశము** *adj.* : like, resembling. తుల్యము, సమానమైన, వలె. *n.* : Certainty, నిశ్చయము.

**నికుంజము** *n.* : A bover, thicket, arbour. పొదరిల్లు.

**నికురుంబము** *n.* : A multitude, assembly. గుంపు, గుమి.

**నికృంతనము** *n.* : Cutting ఖండనము, నరుకుట.

**నికృష్టము** *adj.* : Outcast, vile, abject. అధమము.

**నికేతనము** *n.* : A house ఇల్లు.

**నిక్కచ్చి** *n.* : Violence. forcing, annoyance. నిర్బంధము. Strictness. adj. Strict. ఖండితమైన. వాడు చాలా నిక్కచ్చిమనిషి he is a very strict man.

**నిక్కము** *n.* : Truth, reality, certainty, verity, నిశ్చయము, యథార్థము, సత్యము *adj.* : True, certain genuine, real intrinsic, sterling. Unalloyed pure. సత్యమైన, నిర్మలమైన.

**నిక్కవుడు** *n.* : Simplicity, absence of cunning, నిష్కపటము.

**నిక్కాక** *n.* : Burning heat. మిక్కిలికాక. Fever.

**నిక్కు** *v.n.* : To strut, sit upright, erect oneself, stand on tiptoe. To just out or protrude. To be proud or conceited. ఉన్నతమగు. గర్వించు, అతిశయించు, వర్థిల్లు. *n.* : Jutting out, or projecting, as the nose, protrusion, ఉన్నతి.

**నిక్కువము** *n.* : Truth, certainty. యథార్థము. నిక్కువముగా truly, నిజముగా; much, మిక్కిలి.

**నిక్వణము** or **నిక్వాణము** *n.* : A musical note. వీణెలోనగువాని మ్రోత.

**నిక్షేపము** *n.* : A buried treasure; a treasure, a deposit, a pledge. నిధి. **నిక్షేపించు** *v.a.* : To hide, bury under ground, lay up, store up. పాతు,పూడ్చు, దాచు.

**నిఖిలము** *adj.* : All, entire. complete సర్వము, ఎల్ల.

**నిగదించు** *v.a.* : To tell plainly. స్పష్టముగా చెప్పు. **నిగదము** or **నిగాదము** *n.* : Plain speaking. స్పష్టముగా చెప్పుట.

**నిగనిగ** *n.* : Brilliancy, gleam. adj. bright. *adv.* : Brightly నిగనిగమను or నిగనిగలాడు *v.n.* : To glitter, to be bright, to glow.

**నిగమము** *n.* : The Veda, వేదము. A market. అంగడివాడ. A way, మార్గము. **నిగముడు** *n.* : A merchant. బేహారి, వణిజుడు.

**నిగరణము, నిగరము** or **నిగారము** *n.* : Swallowing, మింగుట. **నిగరము** or **నిగారము** *adj.* : Excellent. శ్రేష్ఠము.

**నిగర్వముగా** *adv.* : Humbly. గర్వము లేకుండ.

**నిగళము** or **నిగడము** *n.* : A fetter, chain. సంకెల.

**నిగా** or **నిఘా** *n.* : View. Attention, superintendence. control, care. చూపు, దృష్టి, గమనము.

**నిగాళము** *n.* : A horse's neck. గుఱ్ఱపు మెడ.

**నిగుడు** *v.n.* : To stretch, or be extended, వ్యాపించు, నిక్కు, సాగు. To rise or increase, విజృంభించు. To fly or be discharged, as a dart. To fall upon or attack. కవియు. To hasten, వేగిరపడు. To become straight, చక్కబడు. To be fulfilled, నెరవేరు. To be vented, as a sigh. To burst forth, as rage. ఆర్పులు నిగిడె shovts arose.

**నిగురు** or **నివురు** *n.* : Embers. The ashes covering live coal. కట్టెనిప్పు మీది భస్మము. నివురుగప్పిన నిప్పు a fire hidden under ashes. సున్నపు నిగురు time for making plaster.

**నిగూఢము** *adj.* : Quite hidden. మిక్కిలి మరుగుపరచబడిన.

**నిగ్గడి** *adj.* : Hard. కఠినము.

**నిగ్గు** *v.n.* : To thrive, flourish : to be effected. to prosper, get through, go on properly. నెగ్గు. నిర్వహిల్లు, సమకూరు.

**నిగ్రహము** *n.* : Rejection. త్రోపుడు. A version, disfavour : blaming; a threat. బెదురుమాట. Imprisonment, చెర. A limit, మేర.

**నిఘంటువు** *n.* : A dictionary.

**నిఘోషణము** *n.* : A sound, voice.

**నిఘ్నము** *adj.* : Obedient. docile, facile. అధీనమైన, లోకువైన.

**నిచయము** *n.* : An assembly, heap, mass. సమూహము, గుమి.

**నిచితము** *adj.* : Spread, పరపబడిన.

**నిచులము** *n.* : The red Oleander tree. ఎఱ్ఱగన్నేరు.

**నిచోళము** *n.* : A veil, cloak, covering. కప్పుడుదుప్పటి, గవిసెన. పక్కదుప్పటి.

**నిచ్చెన** *n.* : A ladder. నిశ్రేణి. **నిచ్చెన పంజు** or **నిచ్చెనదివ్వపంజు**. *n.* : A ladder on which number of torches are arranged దివిటీల కమ్ములమర్చిన నిచ్చెనవంటి సాధనము.

**నిచ్చ** *adv.* : Always. సదా Every day, ప్రత్యహము. See నిచ్చలు.

**నిచ్చయము** *n.* : Certainty. నిశ్చయము.

**నిచ్చలము** *adj.* : Firm, immovable. నిశ్చలము. Pure, faultless. నిర్దోషము. Eternal, lasting, నిరంతరము. *n.* : Certainity, నిశ్చయము.

**నిచ్చలు** *adv.* : always, సంతతము. సదా. *n.* : Certainty, నిశ్చయము.

**నిచ్ఛేదము** *n.* : Cutting off.

**నిజము** *n.* : Nature. స్వభావము *adj.* : Own, peculiar, native, తన. **నిజస్థితి** *n.* : The real fact. **నిజము** Truth, reality, సత్యము.

**నిటనిట** *adv.* : Very tremulously.

**నిటలము, నిటాలము** or **నిటలతటము** *n.* : The forehead. నుదురు, ఫాలము. **నిటాలాక్షుడు** *n.* : Siva, who has an eye in his forehead.

**నిట్ట** *n.* : A place. స్థానము, ఇరవు. "మూడు మూర్తుల నిట్ట మ్రొక్కుల గుట్ట."

**నిట్టలము** or **ఇట్టలము** *adj.* : Certain, నిశ్చయము.

**నిట్టు** or **నిట్రు** *n.* : Thirst, నీరు, పట్టు, దప్పి. A fast, ఉపవాసము. A famine, క్షామము. *adj.* : Dry, శుష్కము.

**నిట్టూరుపు, నిట్టూర్పు** or **నిడూర్పు** *n.* : Deep sighing, a sigh. **నిట్టూర్చు** *v.n.* : To sigh.

**నిట్టెమ్ము** *n.* : the back bone.

**నిట్ర, నిట్రము** or **నెట్రము** *n.* : Height. నిలువు, కలమును అంత నిట్రముగా పట్టుకొనకుము do not hold the pen so high or erect.

**నిడు** *adj.* : Long. నిడుమోము a long face. నిడువాలు a long sword. **నిడివి** *n.* : length, నిడివిమీద by degrees. *adj.* : దీర్ఘము. **నిడుద** *n.* : length, నిడువు, దీర్ఘము, దైర్ఘ్యము. నిడుదయగు long. నిడుదపండ్లు long teeth. నిడుదలైన కురులు long tresses. **నిడుచను** *v.n.* : To stretch. సాగు. **నిడుదవెన్ను** *n.* : A snake. సర్పము. **నిడుపు** *n.* : Length. **నిడివి.** adj. నిడివియైన. నిడుప కమ్ములు. door posts, ద్వారశాఖలు. **నిడుపడు** n. A snake. పాము. **నిడువెండ్రుక** (నిడుద + వెంట్రుక) *n.* : The hair standing on end, a starting sensation. రోమాంచము. **నిడువెంట్రుక పెట్టు** *v.n.* : To be startled. to stand on end, as hair. నిక్కపొడుచుకొను.

**నితంబము** *n.* : The bottom or posteriors. పిరుదు, మొల. నితంబములు the buttocks. పర్వత నితంబప్రదేశము the ridge of a hill, కొండనడుము. నితంబిని or **నితంబవతి** *n.* : A woman with well developed hips, i.e., a beautiful woman.

**నితాంతము** *adv.* : Extermely, greatly పెల్లు, అధికము.

**నిత్యము** *adv.* : Always, continually, constantly. ఎల్లప్పుడు. *adj.* : Constant, perpetual, permanent Everlasting, eternal, universal, omnipresent. regular, fixed, natural, invariable, usual, daily, ordinary, unchanging. Percunial, flowering all through the year. ఎడతెగని. నిత్యమల్లి చెట్టు or నిత్తెమల్లె a species of jasmine. నిత్యహోమము a daily sacrifice, as distinguished from నైమిత్తికము an

occasional one. నిత్యకర్మము daily rites. **నిత్యుడు** *n.* : The everlasting one, i.e., God.

**నిదర్శనము** *n.* : An illustration, example, instance; evidence, proof. దృష్టాంతము.

**నిదాఘము** *n.* : Summer, hot weather. వేసంగి కాలము. heat, వేడిమి Sweat, చెమట.

**నిదానము** *n.* : The original cause, origin, source. అదికారణము. నిదానము *n.* : Steadiness, patience, gentleness, ఆత్రపడక విచారించుట. నిదానముగా మాట్లాడు speak gently.

**నిదుర, నిద్దుర** or **నిద్ర** *n.* : Sleep. నిదురపోతు or **నిద్దురపోతు** *n.* : A drowsy person, నిద్రపోవు స్వభావము గలవాడు. **నిదురించు** or **నిదురపోవు** *v.n.* : To sleep. నిద్రించు.

**నిదేశము** or **నిర్దేశము** *n.* : An order, command, direction, instruction. పసుపు, చెప్పుట. నిదేష్ట one who gives an order.

**నిద్దము** or **నిద్దా** *adj.* : Bright, smooth, polished. నునుపుగల. Loving, dear, స్నేహము గల. **నిద్దావంకి** *n.* : A dagger, బాకు.

**నిద్ర** *n.* : Sleep. **నిద్రపుచ్చు** *v.t.* : To put to sleep, as an infant. జ్ఞాననిద్ర a mesmeric trance.

**నిద్రమబ్బు** or **నిద్రమత్తు** *n.* : Drowsiness. **నిద్రలేపు** *v.a.* : To awake from sleep.

**నిధనము** *n.* : Death చావు. Evil, misfortune, చేటు.

**నిధానము** *n.* : A treasure a hoard or fund, a treasury. నిక్షేపము దాచుకొన్నది, పాతరి, పాతిపట్టుకొన్నది.

**నిధి** *n.* : A treasure A repository. పాతర. The poets frequently mention the nine nidhis of Kubera, the god of riches : these are named పద్మ, మహాపద్మ, శంఖ, మకర, కచ్ఛప, ముకుంద, కుంద, నీల, వర. నిధినిక్షేపము a hidden treasure. గుణనిధి one who is a perfect assemblage of virtues. పరాక్రమనిధి he who is a perfect hero, a mine of valour.

**నినదము** ro **నినాదము** *n.* : A sound, note. ధ్వని, మ్రోత.

**నినుచు** or **నించు** *v.a.* : To fill, satisfy, satiate. నిండునట్లు చేయు. తృప్తి పొందించు. **నినుపు** or **నింపు** *n.* : Filling, fulness, నింపు. **నినుపారు** or **నింపారు** *v.n.* : To become full, to be filled, పూర్ణమగు.

**నిన్న** *n. Lit* : The last day, yesterday.

**నిపఠము** or **నిపాఠము** *n.* : Reading, perusal, study. పాఠము. చదువు.

**నిపాతనము** *n.* : An overthrow పడద్రోయుట. నిపాతించు or **నిపించు** v.a. To overthrow, పడద్రోయు. **నిపాతము** n. A fall, పడుట.

**నిపాదితము** *adj.* : Hidden, sunken, collected, as mud.

**పప్ప** *n.* : A cake. భక్ష్యము.

**పప్ప** *n.* : A papa, father, తండ్రి.

**పప్పళి** *n.* : A cloth of a vaeriegated color, చిత్రవర్ణ వస్త్ర విశేషము.

**పప్పాయపండు** *n.* : The papaya fruit. బొప్పాయిపండు. **పప్పాయగువ్వ** n. The black-headed Myna.

**పప్పు** *n.* : Split pulse of any kind. A kernel of any kind freed from the shel as చారపప్పు and జీడిపప్పు, & c. రొయ్యపప్పు prawns or shrimps freed from the coat or shell. **పప్పుకూర** the white Goose-foot, పప్పు చేయు to reduce to powder.

**పబువు** *n.* : Lord. ప్రభువు.

**పబ్బము** *n.* : A feast. పండుగ, A feast at particular periods of the year such as the equinoxes, & c., when offerings are made by the Hindus to the manes of their ancestors. సంక్రాంత్యాదులు. A festival, ఉత్సవము. Hospitality to guests, ఆతిథ్యము.

**పమిడి** *n.* : Gold. పయిడి **పమిడికంటి** or **పమిడికంట్రిక** *n.* : The Indian owlet. See పైడి.

**పమిదె** : Same as ప్రమిద.

**పముజు** : Same as పంజు. **పముజుల కమ్మలు** or **పంజుల కమ్మలు** *n.* : Large earrings worn by women.

**పమ్ము** or **పంబు** *v.n. & a.* : To excel, to display, to cover, to spread. అతిశయించు, విజృంభించు, కవియు, ఆపకంచుకొను, క్రమ్ముకొను.

**పయట, పయ్యట, పయిట** or **పైట** : Same as పయ్యెద.

**పయనము** *n.* : A journey. **పయనించు** *v.n.* : To get ready for a journey. ప్రయాణమగు.

**పయర, పయ్యర** or **పైర** *n.* : A sephyr, a cool wind, చల్లగాలి. A South wind, దక్షిణపుగాలి, పయరపంట.

**పయస్సు** *n.* : Milk. క్షీరము. Water, ఉదకము. **పయస్విని** *n.* : A milch cow. పాలిచ్చే ఆవు. **పయోజము** *n. Lit* : water-born, i.e., a lotus, తామర. **పయోధరము** *n.* : A woman's breast. A cloud. పయోధరత nebulosity, the quality of being a cloud, ఉదకమును ధరించుట, మేఘత్వము. **పయోధి** or **పయోరాశి** *n. Lit* : A place for a heap of waters, i.e., the ocean, సముద్రము.

**పయ్య** *adj.* : Dun, sorrel. పయ్యెద్దు a dun bullock.

**పయ్యద** or **పయ్యెద** *n.* : a woman's veil or mantle (or wimple) formed or her skirt thrown over her shoulder and her breast, పైట.

**పయి** : Same as పై.

**పర** *n.* : A measure with which chunam, & c., is measured. A salt marsh, ఉప్పు పండుబయలు, పఱ్ర. A plain, బయలు, ఇసుకపర a sandy plain.

**పర** *n.* : Another form of పొర.

**పర** *prep.* : Alien, other, appertaining to one's neighbour. పరకాయం ప్రవేశము transmigration from one body (కాయము) to another (పర) the magic power of shifting oneself into another body. **పరకీయ** *adj.* : Alien, belonging to another. ఇతరునిది. *n.* : A neighbour's wife, a strange woman, పరస్త్రీ, నాయికలలో నొకతె. **పరజాతుడు** *n.* : A slave, బానిసవాడు. **పరతంత్రము** adj. Subservient, obedient, dependent. **పరతంత్రుడు, పరపంతుడు** or **పరాధీనుడు** *n.* : A servant. **పరదళము** *n.* : A foe, an enemy's army. పరదేశము *n.* : A strange country. **పరదేశి** *n.* : A foreighner, an immigrant. A guest, అతిథి. **పరధ్యానము** *n.* : Absence or mind, reverie. **పరనారి** *n.* : A neighbour's wife, another's spouse. **పరపుష్టము** or **పరభృతము** *n.* : A cuckoo, so called as being reared (పుష్టము) in another (పర) bird's nest. కోకిల. **పరభృత్తు** *n.* : A crow. **పరమండలము** n. A foreign realm. **పర లోకము** n. The other or next world. Heaven. పరలోకగతుడు one who is dead or departed to the next world. పరలోకక్రియలు obsequies, rites for the rest of a departed soul. ఉత్తరక్రియలు. **పరవశము** *adj.* : Out of one's control from joy, ectacy or sorrow, overpowered. **పరవశత్వము** *n.* : Bewilderment, wildness, ecstasy. **పరవశుడు** *n.* : One who is in ecstasy or wild with joy or sorrow. **పరవాది** *n.* : A diesenter. A foe, an opponent, శత్రువు. An impetuous or precipitate man, ఆత్రగొట్టు. **పరశృతము** *adj.* : More than a hundred. పరస్సహస్రము more than a thousand. **పరసతి** *n.* : Another man's wife, a neighbour's wife. another woman. **పరసదనము** *n.* : A neighbour's house. **పరస్థలము** or **పరస్థానము** *n.* : Another place. **పరాధీనము** *n.* : Possession by another. **పరార్థవాది** *n.* : A vakil, వకీలు.

**పరంగి** *n.* : A Frenchman. **పరంగి సాంబ్రాణి** *n.* : The foreign or refined myrrh.

**పరంజము** *n.* : A mill. గానుగ. The edge of a sword. చురకత్తి యలుగు. Foam, నురుగు.

**పరంజు** *n.* : A hilt. కత్తిపిడి.

**పరంపర** *n.* : A series, succession, order, race, a lineage. వరుస, సంతానము. Also, killing, హింస, బాణ పరంపర a shower of darts. **పరంపరాకము** *n.* : Cow. killing for sacrificial purposes, యజ్ఞమందలి పశువధ. **పరంపరుడు** *n.* : A great-great-grandson, ముమ్మనుమడు.

**పరక** *n.* : The fraction of one eighth of a rupee, or two annas. The

cream on curds. A trifle, a bit, a slip. గడ్డిపరక a blade or grass. గడ్డిపోచ.

**పరకాయించు** or **పరికించు** *v.a.* : To examine.

**పరకాశాగుడ్డ** *n.* : Long cloth.

**పరగడ** or **పరగడము** *n.* : Another place. ఇతర స్థలము. A side, పార్శ్వము. A field outside of a village ఊరిబైటిపొలము, బీడు, నెత్తము.

**పరగడుపు** (పరము + కడుపు) *n.* : An empty belly. Fasting పరగడుపున ఔషధము పుచ్చుకోవలెను. it is proper to take medicine fasting or on an empty stomach.

**పరగణా** *n.* : A division of a country, a Parganah.

**పరగు** *v.n.* : To be, exist, remain, వెలగు, ఉండు. To be used, to be applied, ప్రయుక్తమగు. To apply, to be applicable, ప్రవర్తిల్లు. To spread, ప్రసరించు. To become known, to be found, ప్రసిద్ధమగు.

**పరచి** *n.* : A loan, ఎరుపు.

**పరచు** or **పరుచు** *v.a.* and *v.n.* : To cause to fall, పడజేయు. To make or cause. To spread over, as a mat. To expand or spread. To go, to run. To run away. To urge or cause to run. To flow as water. **పరత, పరతి** or **పరద** *n.* : A stream, current, ప్రవాహము, వరద. **పరతెంచు** (పరచు + తెంచు) *v.n.* : To come running. పారివచ్చు.

**పరజ** *n.* : A kind of bird.

**పరట** *n.* : A cowdung cake, ఏరుపిడక.

**పరటి** : Same as పనటి, **పరటిపుట్టువు** *n. Lit* : one who is born in a pot, i.e., Agastya.

**పరటె** : Same as పంటె.

**పరత** *n.* : Addictedness, devotedness to, love for. **తత్పరత** *n.* : Eagerness, devotedness. ఆసక్తి.

**పరతము** *n.* : A certain large number, ten billions. ముప్పైరెండు సంజ్ఞలలోనొకటి.

**పరదా** *n.* : A paradah, a screen. తెర.

**పరపతి** or **పరపత్తెము** *n.* : Credit, trust, loan, పరపతిచేసికొను to borrow money. నాకు పరపతిభంగము చేయదలచినారు they tried to destroy my credit.

**పరపర** *n.* : The noise produced when a cloth or paper is torn, బట్టలు మొదలయినవి చించితే పుట్టే ధ్వని. Feigning, affectation.

**పరపు** or **పరుపు** *v.a.* : To cause to run or fall, & c. పరవజేయు, పడజేయు. To let fly, as an arrow. (బాణమును) ప్రయోగించు. To cause to flow, ప్రవహింపజేయు, To cast, to make, వేయు, చేయు. To remove, పోగొట్టు. To drive away. తోలు. To spread or smear, పూయు.

**పరమము** *adj.* : Best, supreme, most excellent, principal, chief ఉత్కృష్టము, ప్రధానము పరమగురువు

the supreme teacher. పరమ పతివ్రత the most virtuous woman. **పరమపదము** or **పరంపదము** *n.* : Heaven. మోక్షము. **పరమపదించు** or **పరంపదించు** *v.n.* : To depart to bliss, to die, to expire. పరమ లుబ్ధుడు a great miser. పరమ పావనుడు the great purifier, he who wholly sancrifies. పరమహంస an ascetic recluse, ఉత్తమ పదము నొందిన సన్యాసి. పరమయోగి an absolute ascetic. **పరమాణువు** *n.* : An atom, the invisible base of all aggregate bodies. సూక్ష్మములకంటె సూక్ష్మమైన అణువు. **పరమాత్మ, పరమాత్ముడు** or **పరమము** *n.* : The Supreme Being, considered as the soul of the universe. పరబ్రహ్మము. **పరమార్థము** *n.* : The great object or summum bonum of life. Bliss, heaven. **పరమాన్నము** *n.* : Rice pudding, milk boiled with rice and sugar. పాయసము. **పరమేశ్వరుడు** *n.* : The Supreme. Lord. One of the names of Siva. శివుడు. **పరమేష్ఠి** *n.* : Bramha, the Creator. బ్రహ్మ.

**పరమానా** or **పరవానా** *n.* : A grant or letter from open in authority; a firman, an order, a mandate. సన్నదు. రాజాజ్ఞ.

**పరమాసు** *n.* : The fore yard of a vessel.

**పరము** *n.* : The frame or upper part of a carriage. కట్టెబండిమీది పరుపుగ్రూను. A level surface, చదును. *n.* : Heaven, మోక్షము. adj. Other, అన్యము. Excellent. శ్రేష్ఠము. **పరముపడు** *v.n.* : To fast, as a vow or religious observance. అనశనవ్రత మాచరించు.

**పరవ**: Same as పరత. See under పరచు.

**పరవంజు** *v.a.* : To spread, surround, envelop, expand, ప్రసరించు, అనరించు, కమ్ముకొను.

**పరవతిగాడు** *n.* : The kestrel.

**పరవా** *n.* : Regard, respect, care for, లక్ష్యము, పరవాలేదు never mind, no matter, చింతలేదు.

**పరవు** or **పరగు** *v.n.* : To spread, వ్యాపించు. *n.* : Spreading, వ్యాపనము.

**పరశువు** or **పరశ్వధము** *n.* : A battle axe. గండ్రగొడ్డలి. **పరశురాముడు** *n.* : The name of a certain hero. ఆ ఇల్లు పరశురామప్రీతి అయినది the house was burnt : lit : enjoyed the favour of Parasu-Rama. పరశురామ క్షేత్రము the ancient name of the country now called Malabar.

**పరస్పరము** *adj.* : Mutual, reciprocal, interchanging, అన్యోన్యము. By proxy, circuitous, not in person.

**పరాకు** *n.* : Oversight, error. Careless-ness, forgetfulness. ప్రమాదము, పరధ్యానము. పరాకున unawares, By error. పరాకులేక headfully, without inattention.

**పరాక్రమము** *n.* : Valour. Power, strength, exertion.

**పరాగము** *n.* : The pollen of a flower. పుప్పొడి. Dust, దుమ్ము.

**పరాఙ్ముఖుడు** or **పరాజీనుడు** *n.* : One who turns away his face from a thing. పెడ మొగము పెట్టినవాడు.

**పరాజితుడు** *n.* : A slave. బానిసవాడు.

**పరాజయము** *n.* : Defeat. అపజయము, ఓడిపోవుట. **పరాజితము** *adj.* : Conquered, overcome. ఓడిన.

**పరాత్పరుడు** *n.* : The supreme Being, the Almighty. శ్రేష్ఠులకు శ్రేష్ఠుడు.

**పరాన్నుడు** *n.* : One who feeds himself at another's table.

**పరాపేక్ష** *n.* : Dependence on the aid of others. ఈ పనిని పరాపేక్షలేకుండా చేసినాడు he did this work himself without any help.

**పరాభవము** or **పరాభూతి** *n.* : Defeat, loss, ruin, contempt, disrespect, defiance. తిరస్కారము, అవమానము, నాశము. **పరాభవించు** *v.a.* : To defeat, disgrace. తిరస్కరించు, అవమానించు. **పరాభూతుడు** *n.* : One who is defeated or disgraced పరాభవింపబడినవాడు.

**పరామరిక** *n.* : Heed, care, attention. నీ పరామరికలేకుంటే కార్యముకాదు unless you attend to it the work will not succeed. పరామరికలేక inattentive, negligent.

**పరామర్శ, పరామర్శము** or **పరామరిక** *n.* : Attention, care, examination. చక్కగా విచారించుట. An inquiry. Condolence, consolation. (In logic), inference, conclusion.

**పరాయణము** *n.* : A prop, support, ప్రాపు. Devotion, addiction to. తత్పరత, ఆశ్రయము.*adj.* : Eager, devoted to, అభీష్టము. **పరాయణుడు** *n.* : An aspirant to, one devoted to, a candidate. ఆసక్తికలవాడు.

**పరాయి** *adj.* : Another, ఇతరము. పరాయివాడు a stranger.

**పరారి** *adj.* : Fled, absconded n. A runaway, a defaulter. పారిపోయినవాడు.

**పరార్థ్యము** *adj.* : Excellent, noble. ముఖ్యమైన, శ్రేష్ఠమైన.

**పరాసుడు** *n.* : A Frenchman. **పరాసులు** *n. plu.* : The French.

**పరాసువు** *adj.* : Dead, expired. చచ్చిన. *n.* : A dead man. చచ్చినవాడు. **పరాసనము** or **పరాసత్వము** *n.* : Death, extinction. పరాసత్వమును పొందు to perish.

**పరాస్కంది** *n.* : A thief or robber. దొంగ.

**పరి** *n.* : An army సేన. A multitude, సమూహము. A series, పఙ్క్తి. The set of surrounding (anything), వేష్టనము.

**పరి** *prefix.* : Around; full, fully, geatly, completely. మిక్కిలి **పరికించు** *v.a.* : To examine. పరీక్షించు. **పరికర్మము** *n.* : Cleaning the body. శరీర శుద్ధీకరణము, దేహమాలిన్యమును

పోగొట్టుకోవడము. Adornment, decoration, అలంకారము. **పరిక్రమము** *n.* : Walking at ease. విహారము, **పరిక్రియ** *n.* : Walking round a thing, ప్రదక్షిణము, చుట్టుకొని వచ్చుట, **పరిక్షిప్తము** *adj.* : Surrounded on all sides, అన్ని ప్రక్కలను చుట్టుకొనబడిన. **పరిక్షేపము** *n.* : The act of surrounding. చుట్టుకొని యుండుట. **పరిక్లేశము** *n.* : Calamity, affiction, misery. కడగండ్లు. **పరిగణనము** *n.* : Estimation ఎంచడము, ఎన్నిక. **పరిగణించు** *v.a.* : To think, reckon, consider, ఎంచు, ఎన్ను. **పరిగ్రహించు** *v.a.* : To take, accept, admit or receive. ప్రియముతో పుచ్చుకొను. **పరిగ్రహము** or **పరిగ్రహణము** *n.* : Acceptance, taking, assent, consent, ప్రియముతో పుచ్చుకొనుట. Dependants, a family, a train, పరివారము. **పరిఘట్టనము** *n.* : Thumping, striking, collision. **పరిఘూణించు** or **పరిఘూళించు** *v.n.* : To vaunt, to boast, to oppose in words. ఎదురాడు.

**పరిఘోషము** *n.* : Sounding, noise, మ్రోత. Thunder, ఉరుము. **పరిచరుడు** *n.* : A guard or boydguard, an attendant, a servant, చౌకిపారాలు జాగ్రత్తగా చేసే భటుడు. A sentinel, సేననుకాచు భటుడు. **పరిచర్య** or **పరిచారము** *n.* : Service, attendance, dependence. సేవ. **పరిచరించు** *v.n.* : To serve. పరిచర్య చేయు. **పరిచారకుడు** *n.* : A man servant. **పరిచారిక** *n.* : A maid servant. **పరిచార్యుడు** *n.* : One fit to be attended on or served. **పరిజనము** *n.* : A train of followers, attendants. పరివారము. **పరితపించు** *v.n.* : To grieve, to be sorrowful. **పరితాపము** or **పరీతాపము** *n.* : Pain, anguish, sorrow, affiction, సంతాపము. Heat, fever, జ్వరభేదము. Trembling, భయము, కంపము, **పరితోషము** or **పరితుష్టి** *n.* : Pleasure, satisfaction, delight, gratification, great joy, మిక్కిలి సంతోషము, **పరిత్యజించు** *v.n.* : To abandon, or quit బొత్తిగావిడుచు. **పరిత్యాగపత్రిక** *n.* : A writ of divorce. **పరిత్రాణము** *n.* : Preservation, protection, fostering, రక్షణము. **పరిత్రాసుడు** *adj.* : Afraid, భయము గలిగిన. **పరిదానము** *n.* : Barter, exchange. వినిమయము, వస్తువులను మార్చుకొనుట. A bribe. పరిదానము పట్టు to receive a bride. **పరిదేవనము** paridevanamu. *n.* : A lamentation, పలావము, కలవరింత. **పరిధానము** *n.* : A cloth, or lower garment. కట్టుబట్ట, దోవతి, నిర్ముక్త పరిధాన she who is stripped. **పరిపక్వము** *adj.* : Ripe, mature. Cooked, dressed. **పరిపాకము** *n.* : Maturity, perfection; the fruit or consequence of actions. **పరిపాలకుడు** *n.* : A good protector,

cherisher, or patron. చక్కగా కాపాడు వాడు. **పరిపాలన** or **పరిపాలనము** *n.* : Protection, patronage, fostering care, government. **పరిపూర్తి** *n.* : Well protected or ruled. **పరిపోషించు** *v.a.* : To nourish well, చక్కగా పోషించు. The noun forms are పరిపోషకుడు. పరిపోషణము, పరిపోషితుడు, **పరిభ్రమణము** *n.* : Wandering, roaming, travelling. **పరిమండలము** *adj.* : Perfectly round. అంతట గుండ్రమైన. **పరిమర్దనము** *n.* : Rubbing, grinding, trampling or destroying. **పరిమార్జనము** *n.* : A thorough cleaning or cleansing, అంతట తుడుచుట, పరిశుద్ధము చేయడము. **పరిమితము** *adj.* : Meted, measured, limited. **పరిరంభము, పరిరంభణము** or **పరీరంభము** *n.* : An embrace. ఆలింగనము. **పరిపట్టము** *n.* : A cloth or head band, used on particular ceremonial occasions at a temple. **పరివర్జనము** *n.* : Entire abandonment. బొత్తిగా విడుచుట. killing, చంపుట. **పరివర్తితము** *adj.* : Wholly abandoned, బొత్తిగా విడువబడిన. **పరివర్తము, పరివర్తనము** or **పరీవర్తము** *n.* : The act of going round any thing, చుట్టివచ్చుట. A return, వెనుకకు తిరుగుట. An exchange, వస్తువుల మార్పు. **పరివాదము** or **పరీవాదము** *n.* : Reproach, censure. నింద. **పరివాదిని** *n.* : A lute with seven strings. ఏడుతంతులుగలవీణ. **పరివారము** or **పరీవారము** *n.* : Dependants, a train, or retinue. Those who are about a prince, his escort. పరిజనము. **పరివారదేవతలు** *n.* : Attendant gods, పరివారాంగన a hand maid, a waiting woman. **పరివాసితము** adj. Scented, perfumed. **పరివృతము** or **పరీవృతము** *adj.* : Encompassed, surrounded. చుట్టబడిన. **పరివేషము** or **పరివేశము** *n.* : A halo encircling the sun or moon, గాలిగుడి. **పరివేష్టించు** *v.a.* : To surround, or encompass. చుట్టివచ్చు. **పరివేష్టనము** *n.* : Surrounding. చుట్టివచ్చుట. Also, పరివట్టము **పరిశీలన** or **పరిశీలనము** *n.* : An enquiry, investigation. శోధనము. **పరిశుద్ధము** *adj.* : Sacred, holy, pure, clean. మిక్కిలి శుద్ధి పొందిన. **పరిశోధన** or **పరిశోధనము** *n.* : An enquiry, మిక్కిలి శోధించుట. **పరిశోధించు** *v.a.* : To examine well, investigate; to try or search thoroughly, మిక్కిలి శోధించు. **పరిశ్రమ** or **పరిశ్రమము** *n.* : Industry, assidnity, thorough acquaintance.

**పరింకి** (కంప) *n.* : A certain thorny shrub. **పరిక** n. A kind of bird. పక్షి విశేషము. See పరిగెపిట్ట. A kind of stone. ఒకవిధమైన రాయి. Also, a pattern or diagram drawn on the floor with lines of flour or coloured

powder. ముగ్గులు, పరికలువేయు, అనగా ముగ్గులు పెట్టు.

**పరికరము** *n.* : An instrument, ఉపకరణము, Furniture, సామాగ్రి A cot, మంచము. A retinue, పరివారము A multitude. సమూహము. A waist-band, నడికట్టు. A belt, యోగిపట్టె.

**పరికాడు** *n.* : The leader among a head of elephants. తెగలో ముఖ్యమైన యేనుగు.

**పరికి** *adj.* : Dishevelled. చింపిరి *n.* : A savage, కిరాతకుడు. See పరింకి. పాలపరికి a certain forest tree.

**పరికించు** *v.a.* : To seek for, search, enquire into, examine, investigate, scrutinise, to prove by trial, వెదుకు, విచారించు, పరిశీలించు.

**పరికిణి** or **పరికిణీ** *n.* : A frock worn by little girls. గాగరా, పావడ, లంగా.

**పరికూటము** *n.* : A mound of earth raised in front of a gate, to sit on or to plant flower trees on, అరుగు.

**పరికె** *n.* : sort of cray fish.

**పరిఖ** *n.* : n. A moat, or ditch. అగడ్త.

**పరిగ** or **పరిగె** *n.* : Ears of corn that drop down when a crop is harvested, gleanings of corn. చేనిలో రాలినవెన్ను. పరిగెలు fragments, shivers, తునియులు.

**పరిగచేను** *n.* : A reaped filed. సస్యము, కోసినచేను. **పరిగరి** or **పరిగవాడు** *n.* : A gleaner. పరిగయేరువాడు.

**పరిగ బ్రతుకు** *n.* : An uncertain means of livelihood, పరిగలేరుకొని బ్రతికేబ్రతుకు.

**పరిగమ్మి** *n.* : A crock or stick used by herdsmen.

**పరిగె** n **పరిగియ** *n.* : A kind of tree. A sprat. చేరుపరిగె the bitter sprat which resembles the silver fish. సాలుంపరిగె the white sprat. బెత్తుపరిగె a sort of Choetodon. adv. Quickly, శీఘ్రము.

**పరిగొను** *v.n.* : To form a line or series. బారుతీరు. *v.a.* : To surround, చుట్టుకొను. Testeal, అపహరించు.

**పరిఘ** or **పరిఘము** *n.* : The pin, bolt, or bar of a door. అర్గళము, గడియ. A club, a bludgeon, a stick mounted with iron. A weapon. లాటీకర్ర, గుదియ, ముద్గరము, a blow, దెబ్బ. The gate of a fort, కోటగవను.

**పరిచయము** or **పరిచితి** *n.* : Acquaintance, intimacy, knowledge. ఎరుక, స్నేహము. **పరిచయించు** *v.n.* : To contract friendship. స్నేహించు. **పరిచితము** adj. Known, acquainted with. పరిచయము గల.

**పరిచాళిక** *n.* : A mode of wrestling.

**పరిచ్ఛదము** *n.* : Court, train, attendants, retinue, family, dependants. పరివారము. A covering cloth, కప్పుడు వస్త్రము.

**పరిచ్ఛేదము** *n.* : A division of a book, a section, or chapter. గ్రంథ భాగము. A limit, extent, మేర.

**పరిజించు** or **పర్జించు** *v.a.* : to seize the hilt. కత్తికటారి మొదలయినవాటిని పట్టు, పరుజుతోపట్టు.

**పరిటె** *n.* : A weaver's whirl. A trundle. **పరిటెపురుగు** or **బరిడెపురుగు** *n.* : A large spotted beetle.

**పరిఢవిల్లు** *v.n.* : To shine, to give light. వెలుగు, ప్రకాశించు. To excel, అతిశయిల్లు. To go on, to get on, ప్రవర్తిల్లు, నడచు. **పరిఢవించు** *v.a.* : To carry on. నడపు, పరిఢవిల్లజేయు. To excel, అతిక్రమించు. To bear, to carry, ధరించు.

**పరిణతము** *adj.* : Ripe, mature, పక్వమైన. Bent, bowed. *n.* : A butting elephant, an elephant stooping to strike with his tusks. **పరిణతి** *n.* : Bending, bowing. సమ్రత, వంగడము. **పరిణద్ధము** *adj.* : Bound, tied, possessed of. కట్టబడిన, కూడుకొన్న. **పరిణమించు** *v.n.* : To be glad. సంతసించు, ఆనందించు. To become matamorphosed, transformed, changed. వికారమును పొందు, ప్రకృత్యన్యధా భావము అగుట. *v.a.* : To cause to rejoice, సంతోషింప జేయు. **పరిణయము** *n.* : Marriage. పెండ్లి. **పరిణామము** *n.* : Metamorphosis, transformation, change of form of state. వికారము, మారురూపు. Maturity, fulness, ripeness, పరిణామ దర్శి one who looks forward to the end. Joy, gladness, ఆనందము, సంతోషము. Health, prosperity, welfare, క్షేమము, సుఖము. **పరిణామశూల** *n.* : Pain caused by indigestion, gastritis.

**పరిణాహము** *n.* : Extent, breadth, width. విశాలత, వెడల్పు. **పరిణాహుడు** *n.* : A great man. విశాలత గలవాడు.

**పరిణేత** *n.* : A husband, భర్త.

**పరితము** *n.* : A cuckoo. కోయిల.

**పరిధి** or **పరిది** *n.* : The halo of the sun or moon. పరివేషము. the circumference of a circle, the disc of the sun or moon. The branch of a tree, to which the victim at a sacrifice is tied.

**పరిపంథి** : An enemy, foe, antagonist. శత్రువు.

**పరిపణము** *n.* : Capital, principal stock, మూలధనము, సంచిమొదలు.

**పరిపరి** *adj.* : Divers, sundry, various, Harassed, పీడితము. పరిపరి విధము లయిన miscellaneous.

**పరిపాటి** *n.* : Order, method, arrangement, క్రమము.

**పరిపోవు** or **పరిపోవు** *v.n.* : To be plundered, కొల్లపోవు. To perish, to be ruined, నశించు.

**పరిబర్హము** *n.* : A retinue or train. పరివారము. Insignia of royalty, రాజయోగ్య వస్తువు.

**పరిభవము, పరిభావము** or **పరీభావము** *n.* : Disgrace disrespect, irreverence, insult. contempt, disregard, reproach, abuse తిరస్కారము, అవమానము. **పరిభవించు** *v.a.* : To conmn, slight, scorn, insult తిరస్కారము చేయు, అవమానించు. **పరిభూతము** *adj.* : Conmned. disregarded, despised. తిరస్కరింపబడిన, అవమానింపబడిన.

**పరిభాష** *n.* : A technicality, a conventional term in any science, సంకేతము, నియమము.

**పరిమళము** *n.* : Fragrance, perfume. **పరిమళించు** *v.n.* : To smell, be fragrant, give forth scent.

**పరిమాణము** *n.* : A measure, measuring, quantity, capacity. కొలత.

**పరిమార్చు** or **పరిమారుచు** (పరియ + మారుచు.) *v.a.* : To kill, assassinate.

**పరియ** *n.* : A piece, bit, fragment. తునక, శకలము. **పయవాయు** *v.n.* : To split, చీలు, **పరియవాపు** *v.a.* : To cause to split, to split a thing.

**పరియంకము** : Same as పర్యంకము.

**పరియాచకము** : Same as పరిహాసము.

**పరియ** *v.n.* : To miss, తప్పు. To be spoiled, to spoil. చెడు.

**పరివిత్తి** or **పరివిత్తుడు** *n.* : An elder brother who remains unmarried while his younger one is married. **పరివేత్త** *n.* : A younger brother who is married before his elder. అన్నకు పెండ్లికాకమునుపు పెండ్లాడినవాడు.

**పరివృధుడు, పరీవృధుడు** or **పరిబృధుడు** *n.* :n. A master, owner or superior. ప్రభువు. యజమానుడు.

**పరివేల్లము** *n.* : A bulrush. తుంగగడ్డి, భద్రతుంగగడ్డి.

**పరివ్రాజకుడు** or **పరివ్రాట్టు** *n.* : A mendicant, or devotee. సన్యాసి.

**పరిషత్తు** *n.* : An assemly, meeting, audience, congregation. గోష్టి, సభ, సమూహము.

**పరిషేచనము** *n.* : The rite of sanctifying a meal by sprinkling water round the dish. Lustration చుట్టూరు తడపడము.

**పరిష్కరించు** *v.a.* : To trim, deck, settle, arrange, adjust. To get through, finish : to make clear or evident; to decree, decide. చక్కబట్టు.

**పరిష్వంగము** *n.* : Embracing, an embrace. ఆలింగనము, గిలిగింత.

**పరిస** *n.* : A built well in the bed of a river.

**పరిసరము** *n.* : Neighbourhood, ground on the skirts of a river or mountain, or contiguous to a town. ప్రాంతభూమి. Death. చావు.

**పరిసెనము** *n.* : Tumbling head over heels. A leap, గంతు.

**పరిస్పందము** *n.* : Beating, throbbing. Decoration of the hair with flowers. మాల్యాది నిర్మాణము.

**పరిస్పర్ధ** *n.* : Contention. **పరిస్పర్ధాళువు** *adj.* : Contentious. పోరాడే స్వభావము గల.

**పరిస్ఫోటించు** *v.a.* : To split చీల్చు, To cause to shine ప్రకాశింప జేయు, పరిస్ఫోటనము, Splitting చీల్చుట.

**పరిహరించు** : to desert, cast off, throw away, quit, discard, reject. To quash, set aside, nonsuit. To remove, abolish, clear away. **పరిహారము** *n.* : Abandonment, shunning, removal. Doing away, abolition, remedy. దానికి పరిహారము లేదు there is no remedy for it. **పరిహారి** *n.* : One who removes, or shuns. పరిహరించు వాడు. **పరిహృతము** *adj.* : Got rid off, shaken off. పోగొట్టబడిన, **పరిహార్యము** *adj.* : Fit to be got rid off. విడువదగిన.

**పరిహాసము, పరీహాసము** or **పరియాచకము** *n.* : Joking, satire, jesting, raillery. అపహాస్యము. మోటుపరిహాసము rough joking, bear's play. **పరిహసించు** *v.a.* : To scorn, deride, laugh at. నవ్వు, పరిహాసము చేయు.

**పరీక్ష** *n.* : Observation. చక్కగా చూచుట. A trial, examination, test, experiment. పరిశీలనము. పరీక్షయిచ్చు to appear for an examination or pass an examination. పరీక్షకుడు or పరీక్షదారుడు an examiner.

**పరీధావి** *n.* : The name of one of the Telugu years.

**పరీభావము** : Same as పరిభవము.

**పరీరంభము** : Same as పరిరంభము.

**పరీవాహము** *n.* : A drain, or channel : a small sluice. అలుగు.

**పరుండు** *v.n.* : To lie down, recline, repose, sleep, శయనించు, నిద్రించు.

**పరుగు** or **పరువు** *n.* : Running, a run. పరుగెత్తు, పరుగిడు or పరువిడు *v.n.* : To run. పరుగులెత్తు to run about.

**పరుచు** *v.a.* : To cause to fall. పడజేయు. to spread, to scatter. To make do ఆటంకపరుచు to make objection. సఫలపరుచు to bring to use, to effet. **పరిపించు** or **పరపించు** *v.a.* : To cause to spread. **పరుపు** *n.* : Bedding, a matteress. పరుండుటకు పరచిన శయ్య, పడక.

**పరుజు** *n.* : A haft, hilt or handle. కత్తిపిడి.

**పరుడు** *n.* : Another man, one's neighbour, a stranger. అన్యుడు. An enemy. శత్రువు. God, పరమాత్ముడు. adj. Addicted to, attached to, a lover of. పరులపాలయిన alienated, given to others.

**పరుపత్తి** *n.* : The cross sticks to which a weaver fixes his web.

**పరువడి** *adj.* : Properly, gently, well, fully, duly. క్రమముగా, కుదురుగా, తిన్నగా, అత్యంతము. *n.* : A time, పర్యాయము. Order. క్రమము. Various steps used in fencing. సాములో అడుగులు వేయడము.

**పరువము** *n.* : Youth, bloom, prime. యౌవనము Maturity, పక్వము, పరిపాకము. **పరువంపు** *adj.* : Blown, blooming.

**పరువు** *n.* : The act of running. పరుగు, శీఘ్ర గమనము. Ripeness, పక్వము, పరిపాకము.

**పరుషము** or **పరుసము** *adj.* : Harsh, rough, severe, stern, *n.* : A harsh word, పరుషవాక్యము. A harsh letter. In grammar పరుషములు are the five hard consonants. viz., క, చ, ట, త. & ప. **పరుషత్వము** *n.* : Roughness, harshness. కఠినత్వము. **పరుస** *n.* : A severe man, a tyrant. కఠినుడు. **పరుసన** or **పరుసదనము** *n.* : Harshness, roughness. కాఠిన్యము, పారుష్యము. **పరుసు** *adj.* : Rough, coarse, brutal. పరుసు కూక a dreadful roar. *n.* : Roughness, కాఠిన్యము.

**పరుసవేది***n.* : The philosopher's stone.

**పరుసు** *n.* : Manner. విధము.

**పరేతుడు** or **ప్రేతుడు** *n.* : A dead man, a ghost or spirit. మృతుడు. పరేతనికేతనము a haunted spot, i.e., a cemetery.

**పరోక్షము** *adj.* : Imperceptible by the senses. Imperceptible, invisible; absent, past అప్రత్యక్షమైన, ఇంద్రియములకు అగుపడని *n.* : Invisibility, absence, secrecy. నా పరోక్ష మందు చెప్పిన మాటలు నాకు తాకవు what was said in my absence does not affect me.

**పరోఢ** *n.* : A neighbour's wife.

**పరోష్ణి** *n.* : A cockroach. తైలపాయిక. A bat. గబ్బిలము.

**పర్జని** *n.* : Turmeric. చాయపసుపు, మ్రానిపసుపు.

**పర్జన్యము** *n.* : Muttering clouds, thunder. గర్జదంబుదము, మేఘనిర్ఘోషము. పర్జన్యలతిశ lighting. **పర్జన్యుడు** *n.* : the god of rain, i.e., Indra.

**పర్ణము** *n.* : A leaf. ఆకు. పర్ణశాల a hermitage or bower of leaves or grass : a hut, ఆకుటిల్లు, ఉటజము.

**పర్పాటకము** or **పర్పటము** *n.* : A kind of grass. ఒకవిధమైన గడ్డి.

**పర్మానా** *n.* : A firman, a royal mandate, a command, a warrant, letters patent, శాసనము, **పర్మాయించు** v.a. to direct or command, to order. **పర్మాయిషి** n. An order to make an article.

**పర్యంకము** *n.* : A cot. మంచము.

**పర్యంతము** *adv.* : Until, as far as, up to, పరదాక, దనుక. పదిపర్యంతము as much as ten or to the number of ten. వారు వచ్చుపర్యంతము until they come.

**పర్యటనము** *n.* : A wandering about for alms. **పర్యటించు** *v.n.* : To wander about for alms.

**పర్యవసానము** *n.* : the end, conclusion, termination, finishing, completion, accomplishment, fulfilment, upshot, ముగియుట ఇది జగడములో పర్యవసానమయినది this ended in a quarrel.

**పర్యస్తము** *adj.* : Fallen పడిన. Beaten, కొట్టబడిన.

**పర్యాప్తము** *n.* : That which is obtained or gained. Satisfaction, satiety, తృప్తి. All, completeness, entirety, enough, sufficiency, యథేప్సితము, పరిపూర్ణము, ప్రకామము. Power, ability, శక్తి. Prevention, నివారణము. **పర్యాప్తముగా** *adv.* : Readily, ably, satisfactorily.

**పర్యాయము** *n.* : An order, arrangement. ప్రకారము, క్రమము, వరుస, అనుక్రమము. An opportunity, occasion, a time, అవసరము, సమయము తడవ Generic or specific character. నాలుగు పర్యాయములు పోయి ఉంటిని I went four times. పరాయతః or **పర్యావేణ** *adv.* : Gradually, by degrees. Moderately.

**పర్యాలోచనము** *n.* : Deep consideration, pondering, చక్కగా ఆలోచించుట. **పర్యాలోచించు** *v.a.* : To consider deeply, to ponder.

**పర్యుదస్తము** *adj.* : Thrown down, rejected, త్రోయబడిన.

**పర్యుషితము** *adj.* : Stale (as yesterday's food), బహుకాలము ఉంచబడిన, పర్యుసితాన్నము cold food, చద్దిఅన్నము.

**పఱ్ఱ** *n.* : A marsh, hog, fen, swamp, ఉబ్బిలి. A plain, బయలు, ఉప్పుపఱ్ఱ a salt marsh. పఱ్ఱమన్ను the soil of a salt swamp, చవుడు. A certain measure of capacity, ధాన్యాదులు కొలిచేతూము.

**పఱ్ఱు** *n.* : The sound caused in tearing a paper, cloth, & c. **పఱ్ఱున** *adv.* : Aloud. పఱ్ఱున చించిపారవేసెను he tore it up and threw it away.

**పఱ్ఱె** or **పఱ్రియ** Same as పఱియ.

**పర్వతము** *n.* : A mountain. కొండ.

**పర్వము** *n.* : A knot, a joint in a cane or body. గణుపు. A feast or annual festival at a certain division of the year. A name given to certain days in the lunar month, as the full and change of the moon, and the 8th and 14th of each half month, పండుగ. పంచపర్వములు the five holidays in a month, i.e., అష్టమి, చతుర్దశి, కుసుహ్తావు, పూర్ణిమ, రవి సంక్రాంతి. పంచపర్వోత్సవము is a feast celebrated in one of these holidays.

**పర్వు** or **పరవు** *v.n.* : To spread or extend, as darkness. వ్యాపించు, *n.* : Running. పరువు, పరుగు.

**పలంకష** *n.* : A thorny weed, ఏనుగ పల్లేరు. A horse radish, ముల్లంగి.

**పలక** *n.* : Any flat surface or face. స్తంభము మొదలైన వానియొక్క ఒక వైపు. ఎనిమిది పలకల స్తంభము an

eight sided pillar. A plank, board, table, బల్ల. **పలకము** *n.* : A small cot చిన్న మంచము, **పలకసరి** *n.* : A kind of neck ornament worn by men.

**పలకు** *v.n.* : to ripen, పండు. to produce a crop, ఫలించు.

**పలగండుడు** *n.* : A brick layer, a plasterer. సున్నపు పైపూత పూయువాడు. A tank-digger or excavator. ఉప్పరివాడు.

**పలగడి, పలుగాడి** or **పలుగడ** *n.* : Gratings, bars, a door set with spikes; a gate.

**పలగొౖరు** or **పలుగొౖరు** *n.* : A kind of rake. See under పలు.

**పలచము** *n.* : A tax. కప్పము.

**పలచ** : See పలుచ.

**పలనాడు** or **పల్నాడు** *n.* : The name of a country in the Krishna District, Palnad. పల్నాడు. (1904 నుంచి గుంటూరు జిల్లా)

**పలపల, పల్పల, పలపలన** or **పల్పలన** *adv.* : Scatteredly, here and there, one by one, dispersedly. Plainly, విరాళముగా, *adj.* : Thin. పలుచని, అనగా పలుచపలుచని. **పలపలన** *n.* : Plainness, dispersion. వైరళ్యము Thinness, కార్శ్యము.

**పలము** *n.* : A weight, equal to that of ten pagodas. నాలుగు కర్షముల యెత్తు One-fortieth part of a viss. **పలలము** *n.*: Flesh, meat. మాంసము. a string of dried mutton chops.

**పలవ** *n.* : A branch, a fork. పలవకఱ్ఱ a forked branch or piece of wood. పలవలుగల దుప్పి a deer with forked or branched horns.

**పలవర** *n.* :n. The name of a certain tree much cultivated in the neighbourhood of Hyderabad for its fruit. పలవర ఆకులు, its leaves, which are used to manure land. See description in the Kasiyatra, date 7th September 1830.

**పలవరించు, పలపించు** or **పలపు** *v.n.* : To use broken words or exclamation. ప్రలాపించు, విలపించు. పలవరింత or **పలవరము** *n.* : Prattling, talking confusedly, ప్రలాపించుట. ప్రతాపము.

**పలాండువు** or **పలండువు** *n.* : An onion. నీరుల్లి.

**పలాత్** *n.* : A demon. రాక్షసుడు.

**పలాన** or **పలాని** *adj.* : such and such such, a one. ఒకానొక, అట్టే పలానివాడు such a man. ఫలానిపని such a work, such and such an affair.

**పలాయనము** *n.* : Flight, rapid progress. పారిపోవడము. పలాయనము చేయు to disperese, to rout. **పలాయితుడు** *n.* : One who is routed or put to flight. పారిపోయినవాడు.

**పలాలము** *n.* : Straw. చొప్ప, గింజలేని గడ్డి, నిష్ఫలకాండము, ధాన్యపుగడ్డి.

**పలాశము** *n.* : A tree called *Butea frondosa.* కింశుకము, మోదుగచెట్టు.

A leaf, ఆకు adj. Green. ఆకుపచ్చని. **పలాశి** *n.* : A tree. వృక్షము. A demon. రాక్షసుడు.

**పలాశుడు** *n.* : A demon. రాక్షసుడు.

**పలాస్త్రి** *n.* : A plaster for a wound. పొక్కుపలాస్త్రి a blister.

**పలిక్ని** *n.* : A gray headed woman. ముసలిది. A cow which is for the first time in calf. తొలిచూలిపెయ్య.

**పలితము** *n.* : Greyness నెరయుట A grey hair, నెరసినవెండ్రుక. పలిసపిట్ట Same as పరిగెపిట్ట, పాలపలిసపిట్ట the *Greyheaded Mynas*, పొదపలిస పిట్ట, the Blackcapped Black-bird.

**పలు** or **పల్లు** *n.* : A tooth. పలువరుస a row of teeth. పల్జాడ or పలుజాడ *n.* : The dent or mark of a tooth. పలు కప్పు *n.* : A lip, పెదవి. పలుకప, పలుదెర or పలుగర (పలు + కర) *n.* : Tooth powder, పండ్లపొడి. పలుగొర్రు *n.* : A harrow.

**పలు** *adj.* : Many, several, various. అనేకము. పలు తెరుపులు various ways. **పలుకొమ్మలమెకము** *n.* : An elephant. పలుగురు, పలుగుండ్రు, **పలువురు** or **పలువుండ్రు** *n. plu.* : Several men, many men. **పలుపట్టడ** *n.* : A mongrel race, సంకరజాతి జనము. **పలుమారు** *adv.* : Many times, frequently.

**పలుక** *n.* : A shield, డాలు. The small bars of a loom, సాలెవాడు నేయు మగ్గములోని అడ్డకమ్ములు.

**పలుక** or **పలుకన, పల్కన** *n.* : Whiteness. తెల్లన. paleness, వైవర్ణ్యము, పలుకబారు to become white or pale.

**పలుకు** or **పల్కు** *v.n. & a.* : To sound, ring, & c to speak, మాటాడు, అను. To answer, ఉత్తరముచెప్పు. **పలుకు తత్తడి** *n.* : A parrot. చిలుక. **పలుకు రాయి** *n.* : A ringing stone or an echoing rock. **పలుకుబడి** *n.* : Pronunciation. ఉచ్చారణము. Influence, power of word. ఆయనకు ఆ ఊరిలో కొంచెము పలుకుబడి కద్దు he has some influence in that town.

**పలుగాకి** or **పల్గాకి** *n.* : A wretch, a villain. దుష్టుడు.

**పలుగాడి** *n.* : Gratings or cross bars. Railings, కటకటాలు. *plu.* : పలు గాండ్లు. A cart, బండి. *adj.* : Having many gratings or cross bars. పెక్కుగాడులుగల.

**పలుగు** *n.* : A wretch. a villain, దుర్జనుడు. A crow-bar, గడ్డపలుగు. A rock crystal, స్ఫటికము. పలుగు గుంటక a harrow with iron teeth in it. గుంటక పలుగులు the teeth of a harrow. **పలుగురాయి** *n.* : A white marble stone. Also, a goldsmith's smoothing stone. **పలుగురాతి ప్రతిమ** *n.* : A white marble statue.

**పలుగుడుపాము** or **పల్గుడుపాము** *n.* : A snake, the bite of which is not fatal but causes great pain. సర్పభేదము.

**పలుగుపిట్ట** *n.* : An owl. గుడ్లగూబ.

**పలుచ** *adj.* : Thin. సన్నని. Light, తేలికయైన, చులకని. పలుచని, **పలుచదనము** *n.* : Thinness, leanness. Slight contempt. అడవి పలుచన thinness of the forest.

**పలుపు** *n.* : A halter for cattle or horses : the rope collar for oxen in a cart.

**పలుమన** *n.* : Rubbing or polishing a statue with an ivory point.

**పలుమరు, పలుమారు, పలుమారులు, పల్మరు** or **పల్మారు** *adv.* : Many times, often, perpetually, frequently, constantly, repeatedly. మాటిమాటికి.

**పలుము** *v.n.* : to mutter, talk indistinctly, to prattle. ప్రలాపించు. *n.* : Prattle. ప్రలాపము.

**పలుమేరు** *n.* : A kind of tree.

**పలువ** or **పల్వ** *n.* : A wicked wretch. కుత్సితపురుషుడు. **కుత్సితస్త్రీ** *adj.* : Vile, abominable, wicked, bad.

**పలువరేణి** *n.* : A sort of tree.

**పలువలువ** or **సల్వల్వ** *n.* : A lip, పెదవి.

**పలువిత్తు** *n.* : A bastard, a child of many fathers. పలువురకు పుట్టిన వాడు, దుర్బీజుడు.

**పలువురు, పల్వురు** or **పలువుంద్రు** : See under పలు adj.

**పలుసము** : Same as పరుసము.

**పలుసు** *n.* : the sable fish. A species of *Clupea.*

**పల్యంకము** *n.* : A cot. మంచము. **పల్యంకిక** *n.* : A palanquin. పల్లకి.

**పల్యయనము, పల్యాణము** or **పల్లము** *n.* : A saddle. A howdah or seat on an elephant. అంబారి.

**పల్ల** *adj.* : Red, reddish, as hair. తామ్రవర్ణమైన. పల్లలైనజడలు red matted hair. పల్లచీమ a red ant. పల్లమీసములు red whiskers. పల్లచెట్టు, ఏటిపల్లచెట్టు braulleia nitida. *adj.* : Reddish tinted. పల్లవన్నె చూపునది.

**పల్లకి** or **పల్లకీ** *n.* : A palanquin, మనుష్యులు మోసుకొనిపోయే వాహనము.

**పల్లగించు** : See పల్లించు.

**పల్లట** or **పల్లటము** *n.* : Movement. చలనము. Difference, వ్యత్యాసము. Confusion, perturbation, perplexity, agitation. తారుమారు, తల్లడము, దొర్లడము. **పల్లటిల్లు** or **పల్లటిలు** *v.n.* : To move, చలించు. To turn pale, తెల్లపోవు. to redden with anger. ఎర్రబారు. To be in convulsion or disorder, to be perplexed, to be agitated. తారుమారగు, తత్తరపడు, చెదరు, తల్లడిల్లు, కొందలమందు, వణకు, అదరు.

**పల్లటి** or **పల్టీ** *n.* : A somersault. జక్కణి సాధని విశేషము. Tumbling (as of a pigeon in the air), bounding or skipping. పైకెగసి పిల్లిమంతరములు వేయుట. A pigeon called a Tumbler. **పల్లటీల్గొను, పల్లటీల్దాటు** or

**పల్లటీల్ వైచు** *v.n.* : To tumble, as a pigeon, to throw a somersault.

**పల్లన, పల్లనము** or **పల్లము** *n.* : A saddle, an elephant's howdah, అంబారి.

**పల్లము** *n.* : A saddle, A ditch. A hole in the ground (however small). A dale, low ground. పల్లంబుమిట్రు, మెరక పల్లము hill and dale, rising and falling ground ups and downs. పల్లపునాడు low ground capable of being ploughed. పల్లపుపంట a wet crop, being the crop that is sown on low land.

**పల్లరపులు** *n.* : Several cries, many useless words, much useless talking. వ్యర్థమైన పెక్కు మాటలు, ఆడరాని పెక్కుమాటలు పల్లరపు *adj.* : Simple, innocent. బేలైన.

**పల్లవము** *n.* : A sprout, a shoot. కరపల్లవములు rosy hands. పల్లవగ్రాహిపాండిత్యము superficial knowledge, పైపైచదువులు. **పల్లవాస్త్రుడు** *n.* : Manmadha, because his arrows are young leaves. **పల్లవించు** *v.n.* : to sprout or shoot. చిగిరించు, చిగుర్చు. **పల్లవితము** *adj.* : Sprouted, చిగిరించిన.

**పల్లవి** *n.* : The chorus or burden in songs. వెనుకటి చరణములందలి అర్థము ననుసరించి సంగీతము మొదట చెప్పెడు వాక్యము.

**పల్లవుడు** *n.* : A lover, an adulterer, a gallant. విటుడు.

**పల్లా** *n.* : A certain measure equal to ten markals.

**పల్లాయనము** *n.* : Relationship, friendship. ఆప్తత, పల్లాయనమువాడు a friend ఆప్తుడు.

**పల్లి, పల్లియ** or **పల్లె** *n.* : A small village. చిన్నగ్రామము. A lizard, బల్లి. **పల్లికట్టుమాన్యము** *n.* : Land held free by the heirs of the founder of a village. **పల్లీ** *n.* : A fisherman, a boatman. Local, పల్లీలు.

**పల్లించు** or **పల్లగించు** *v.a.* : To saddle a horse. పల్లముకట్టు, జీనుకట్టు.

**పల్లిక** or **పల్లిక** *n.* : A small basket. చిన్నతట్ట. **పల్లికలు** *n.* : The scab or herpes (distinct from తామర, శోభి and చెలిది). Varieties of this disease are called సుబ్బరాయుని పల్లికలు, ఎంగిలి చిరుగుడు పల్లికలు.

**పల్లినాడు, పలనాడు** or **పల్నాడు** *n.* : The Palnad Taluq in the Krishna District (1904 నుంచి గుంటూరు జిల్లా) పల్లినాయడు the Rajah thereof.

**పల్లు** *n.* : A tooth. A tooth of a saw. a sort of gold lace, or bits of gold in a necklace. పంటినొప్పి toothache. పంటిసార a gumboil. **పండ్లమాను** *n.* : A harrow. పది కొయ్యపండ్లు గల దూలము వంటి ఒక సాధనము. ఇది మాగాని కలుపుతీసే సాధనము.

**పల్లు, పల్లము** or **పల్లుడు** *adj.* : Low (as land) ఇక్కడికంటె ఆ నేల పల్లుగా నున్నది that place is lower than

this. *n.* : Low lands. ఆ ఊరు కొండపల్లుననున్నది the town is on the side of the hills.

**పల్లుగొౖరు** *n.* : A sort of harrow. See పలుగొౖరు under పలు.

**పల్లె** *n.* : A small village, a hamlet. పల్లె or పల్లె కూటము a village, school, బడి. పల్లెటూరు. a hamlet. *adj.* : Rustic, rude.

**పల్లెంక** or **మీలపల్లెంకపులుగు** *n.* : The bird called a kingfisher.

**పల్లేరు** *n.* : The thorny creeping plant ఏనుగుపల్లేరు a large species.

**పల్వలము** *n.* : A pit, a pond. పడియ గుంట.

**పల్వురు** : See పలువురు.

**పళపళ** *n.* : Brightness, ప్రకాశము. adv. Brightly, ప్రకాశముగా. పళపళమని (anuk) *adv.* : Dazzlingly, brightly.

**పళ్లెము, పళ్లెరము** or **పళ్యము** *n.* : A saucer, like a soup plate, a small metal basin, dish, tray or platter. తాంబాళము, భోజనపాత్రము. అభిషేకపు పళ్లెము a chalice or vessel to bathe and idol with.

**పవడము** : Same as పగడము.

**పవతుడు** : Same as పగతుడు.

**పవనము** *n.* : Air, wind. **పవన తనయుడు.** *n.* : The son of the air, i.e., Hanuman (హనుమంతుడు), Bhima (భీముడు), or Agni (అగ్ని) **పవనాశనము** *n.* : A creature that lives on air పాము. **పవనుడు** or **పవమానుడు** *n.* : The god of the air. Wind. the god of wind.

**పవలు** : Same as పగలు.

**పవాడము** or **పావాడము** *n.* : A pretended immolation of a human victim who is afterwards resuscitated. A vow or determination to effect an object.

**పవి** *n.* : A thunderbolt పిడుగు, మెరుపు.

**పవిత్రము** *adj.* : Pure clean, purified పరిశుద్ధము. *n.* : The sacred thread of the twice-born castes.

**పవిది** : Same as పగిది.

**పవ్వళించు, పవళించు, పవ్వడించు** or **పవడించు** *v.n.* : To lie down, recline. శయనించు. పవ్వళింత or పవళింత *n.* : The act of reclining or lying down, పవళించుట, శయనము.

**పశువు** *n.* :n. A beast, an animal, నాలుగు కాళ్ల జంతువు. A domestic animal such as a cow, buffalo, goat, or sheep. **పశుపతి** *n.* : A name of Siva, as the master or ruler of all living creatures. పశుప్రాయుడు a brutish or ignorant man.

**పశ్చాత్తాపము** *n.* : Remorse, repentance, pity, compassion, commiseration, regret, reluctance. దేవర వారు జనుల యందు ధర్మగుణమును మిక్కిలి పశ్చాత్తాపమును గలిగినవారు గనుక as you are a man of a charitable disposition and full of pity. **పశ్చాత్తాపపడు** to repent.

**పశ్చిమము** *n.* : The West. adj. Western, పశ్చిమాంబుధి the Western ocean.

**పశ్యతోహరుడు** *n.* : A deluder, a beguiler, a swindler, a common cheat. పచ్చెపు దొంగ, చూచుచుండగా దొంగిలించువాడు. A goldsmith, కంసాలెవాడు.

**పస***n.* : Sap, essence, సారము. Bloom, vigour, brilliancy. నిగ్గు. కాంతి, సత్తు, సౌరస్యము. Abundance; సమృద్ధి. Skill, చాతుర్యము. **పసపడు** *v.n.* : To be inclined, addicted to, devoted to, రుచిమరుగు.

**పసందు** *n.* : Comeliness, beauty; an ornament or decoration, సొంపు, సొగసు. *adj.* : Comely, handsome, pleasing, nice. పసందగు to become handsome. పసందుచేయు to make handsome, pretty or nice; to prefer or like. ఆయన దీనిని పసందు చేసినాడు he liked this. **పసందుగా** *adv.* : Nicely, agreeably, fashionably.

**పసగరకొను** *v.a.* : To tease, to torment. పీడించు.

**పసగు** *v.n.* : To become evident. విశదమగు.

**పసదనము** *n.* : Adornment, embellishment, అలంకార శోభ. A present of a jewel or cloth, & c., పారితోషికము.

**పసను** *n.* : Crimson or orange colour. ఎరుపు మించిన పసుపు వన్నె. **పసనుగా** *adv.* : Well, properly, duly. చక్కగా, బాగుగా.

**పసపస** *n.* : Raininess, a drizzling rain, వానయొక్క ముసురు.

**పసపు** : See under పసుపు.

**పసరము** or **పసలము** *n.* : A beast, an animal. గోమహిషజాతి.

**పసరించు** *v.n.* : To spread, to extend. వ్యాపించు.

**పసరు** *n.* : The juice or sap of leaves. ఆకు రసము. A medicinal extract. Sap. రసము. Green color, ఆకుపచ్చన. Bilious vomiting.

**పసాదము** *n.* : Blessed food. అన్నము, వంటకము. **పసాపడు** (పసాదము + సాపడు.) *v.a.* : To eat. భోజనము చేయు.

**పసారము** or **పసారు** *n.* : A shop. అంగడి. Charma, grace, తళుకు, మినుకు. పస.

**పసి** *adj.* : Little, tender, young. పసిబిడ్డ or పసిపాప an infant. పసివాడు a little boy.

**పసి** *n.* : Cattle. పశుసమూహము, గోగణము. The smell of cattle, పశ్వాదులమీదిగాలి, వాసన. **పసిపట్టు** *v.n.* : To scent or follow by the nose, as a dog does a fox. పసిగొను to trace out or smell out. వాసనపట్టు. మొసలికుక్కను పసిపట్టి when the crocodile scented the dog. **పసులు** *n.* : plug. Cattle.

**పసిక** : Same as పస.

**పసిడి** *n.* : Gold. బంగారు. Wealth, ధనము, *adj.* : Golden. పసిడికంటి

Same as పైడికంటి. **పసిడికాయ** *n.* : The fruit of the silk cotton tree. పొత్తినూలికాయ. పసిడిరేడు Same as పైడిరేడు.

**పసిమి** *n.* : Yellowness పసుపు వన్నె. Greenness, ఆకుపచ్చన. **పసిమిడి** *adj.* : Green. పసిమిగల. పసిమి రోగము jaundice.

**పసిరిక** (పసరు + ఇక) *n.* : Green or yellow color, పసరువన్నె. Young or tender grass. లేతగడ్డి, పచ్చిగడ్డి adj. Green or yellow. పసరువన్నెగల. **పసిరికపాము** *n.* : A certain green snake that is harmless. పచ్చపాము, బొట్ల పసిరిక a species of the same. **పసిరికపిట్ట** *n.* : The Indian bee-eater, పచ్చపిట్ట. హరితపక్షి. పసిరికాయ.

**పసుపు** or **పసపు** *n.* : Indian saffron or turmeric. **పసుపుచాయ** *n.* : yellow colour. పసుపు పిట్ట or పసుపు ముద్ద *n. Lit.* : The saffron bird.

**పస్తాయించు** *v.n.* : To regret, to be sorry. పశ్చాత్తాపపడు.

**పస్తు** *n.* : A fast, fasting, a starved condition, starving ఉపవాసము, ఉపాసము. **పస్తుండు** or **పస్తుగానుండు** *v.n.* : To be fasting starving.

**పాంకోడు** (for పావకోడు.) *n.* : A weaver's treadle. A sandal for the foot.

**పాంచజన్యము** *n.* : the conch of Vishnu విష్ణుశంఖము. Fire. అగ్ని.

**పాంచాలము** *n.* : the Pubjab. the country north of Delhi, between the foot of the Himalayas and n. the daughter of the king of Panchala; a title of Druapadi, the wife of the five Pandu princes. ద్రౌపది, **పాంచాలిక** *n.* : A doll or puppet. an image carved on pillars, & c. బొమ్మ, నరమృగాది రూపము. **పాంచాలుడు** *n.* : A member of any one of the five castes of artificers, viz., the carpenters, weavers, barbers, washermen, painters. వడ్లవాడు, సాలెవాడు, మంగలవాడు, చాకలవాడు, ముచ్చివాడు, ఈ అయిదు జాతులందు దేనిలోనైనను చేరినవాడు.

**పాంజేబు** *n.* : A silver anklet. గజ్జెగొలుసు.

**పాంక్తేయుడు** *n.* : A respectable guest, a person received in society.

**పాండవులు** *n.* : The Pandus or princes of the house of Pandu.

**పాండిత్యము** or **పాండితి** *n.* : Learning, scholarship, mastery, perfect knowledge or skill. పండితభావము.

**పాండువు, పాండిమ** *n.* : Learning, scholarship, mastery, perfect knowledge or skill. పండితభావము.

**పాండువు, పాండిమ** or **పాండిమము** *n.* : Paleness. తెలుపు. A pale yellow colour, తెలుపు మించిన పసుపు. Leprosy. పాండురోగము.

**పాండ్యము** or **పాండ్యదేశము** *n.* : A country in the Southern part of the Indian peninsula, comprehending

the districts of Madura and Tinnevelly. **పాండీడు** *n.* : A king of the Pandya country. పాండ్యదేశపు రాజు.

**పాంథుడు** *n.* : A traveller. తెరువరి, పథికుడు.

**పాంశువు** *n.* : Dust, పరాగము, దుమ్ము. Manure. సస్యార్థసంచిత గోమయము, ఎరువు.

**పాంసనుడు** *n.* : A contemptible, wicked or bad man. దూషకుడు. కులపాంసనుడు one who is a disgrace to his family.

**పాంసుల** *n.* : An unchaste woman. జారస్త్రీ.

**పాంసువు** *n.* : Dust. పరాగము, ధూళి. **పాంసులము** *n.* : Saltish, earth, saline earth. సుగంధిపాంసులవణె.

**పాక** *n.* : A hut, shed or hovel or mats, a booth. దూలములు లేకుండా కట్టిన ఇల్లు, శాల. Also, a small temple; గుడి.

**పాకనాటిరెడ్లు** *n.* : A certain subcaste of Kapus (కాపులు) who derive their name from the country named పాకనాడు. Also, a sub-caste of the Malas (మాలలు).

**పాకము** *n.* : Cooking, dressing food, boiling, వంట. Maturity, natural or artificial, as the state of being cooked or ripened పరిపాకము. **పాకగేహము** *n.* : A kitchen. వంట ఇల్లు.

**పాకలము** *n.* : A fever in an elephant. ఏనుగులకు వచ్చుజ్వరము, పాకలపు టేనుగు an elephant that has fever. A horse, అశ్వము.

**పాకారి** or **పాకశాసనుడు** *n.* : A title of Indra as the slayer of a giant named పాకః.

**పాకి, పాకీ, పాకీవాడు** or **పాకీమనిషి** *n.* : A scavenger, commonly called as Madrasa Toti. పాకిది a Toti woman.

**పాకు** or **ప్రాకు** *v.n.* : To creep or crawl. **పాకించు** *v.s.* : To train, as a vine or other creepr.

**పాకెన, పాకెన్న, ప్రాకెన్న** or **ప్రాకాన్నము** *a.* : A ceremony performed on the third day of a wedding పెండ్లిలో మూడవనాటి ఉత్సవము.

**పాకోడు** or **పావకోడు** : same as పాకోటి.

**పాక్షికము** *n.* : An alternative. పక్షమున కలిగినది. unfairness, partiality, పక్షపాతము.

**పాగడము** or **పాగడము** *n.* : A silver anklet పాదములందు ఒంకెలుగా చేసియుంచే భూషణము.

**పాగా** or **పాగ** *n.* : A turban. పాగాచుట్టు to tie on or form a turban. Also, a stable అశ్వశాల. A troop of horses, అశ్వసమూహము, పాగాలు Same as పావకోళ్లు, పాగాగుర్రము.

**పాగిడ** *n.* : Thread that remains after a web has been woven.

**పాగు** *n.* : Thick syrup, melted sugar, treacle.

**పాగెము** *n.* : Connection సంబంధము.

**పాచకుడు** *n.* : A cook వంటవాడు.

**పాచి** or **ప్రాచి** *n.* : Rot, foulness, squalor, staleness, nastiness, scurf, (as of the teeth) పండ్లమురికి.

**పాచిక** *n.* : A die in gambling.

**పాచితము** or **ప్రాచితము** *n.* : Compensation, atonement.

**పాచనము** or **పాసనము** *n.* : Looseness of the bowels, విరేచనము. *plu.* : పాచనాలు.

**పాచు** *v.a.* : To remove out of the way. తొలగించు, పాయజేయు. To disentangle, చిక్కెడలించు.

**పాజీ** *adj.* : Vile; worthless, despicable, base, contemptible పనికిమాలిన, క్షుద్రమైన.

**పాజేలు, ప్రాచేనులు** or **పాతచేలు** *n.* : Land under cultivation, as opposed to waste land, (బీడు).

**పాట** *n.* : Music, a song. సంగీతము, పదము.

**పాటచెట్టు** *n.* : ఏకాష్టిలా, అగరుశొంటి.

**పాటకము** or **పోటకము** *n.* : A bank of a river & c. తీరము.

**పాటచ్చరుడు** *n.* : A thief or robber. దొంగ.

**పాటన** *n.* : Adornment. అలంకారము. Putting right, making right; righting, సంస్కారము. Regard ఆదరణము.

**పాటనము** *n.* : Splitting చీల్చుట.

**పాటపాట** *adj.* : Little by little. కొంచెము కొంచెము.

**పాటబండి** *n.* : A kind of carriage ఒక విధమైన గాడి.

**పాటము** *adj.* : Proper, fitting, ఇది కెంపులు చూడడమునకు పాటమైన వేళకాదు this is not a proper time of day to examine the rubies.

**పాటరి** *n.* : A hard working man, a drudge.

**పాటల** or **పాటలి** *n.* : The flower called the Trumpet flower. కలిగొట్టుపువ్వు, **పాటలము** *adj.* : Red, rosy, ruddy. *n.* : Flesh colour. పాటలగంధి a rosy maid. పాటలాధరి cherrylipped పాటల జంటలు red matted locks.

**పాటవము** *n.* : Health. ఆరోగ్యము. Strength, vigour, శక్తత, దార్ఢ్యము. Ability, cleverness, నైపుణ్యము. గానపాటవము skill in singing. brightness, తైక్ష్ణ్యము. అతనికి దృష్టిపాటవము తప్పినది he is losing his eyesight.

**పాటి** *n.* : Degree, extent, quantity, size. ప్రమాణము. Value, character, quality, kind sort. విధము Fitness. Resemblance, equality సామ్యము. *adj.* : Equal. సమము. Common, general సామాన్యము. Due, fit, న్యాయము Of such a size or character.

**పాటించు** *v.n.* : To exceed, to be excessive. మించు, అతిశయించు, నేరువు వాటించి, చాతుర్యముమించి, *v.a.* : To observe, to care for, to

(of the Hindus), i.e., Hindustan, the land between the Himalayas and the Vindhyas.

**పుతపుత** *n.* : Tremor. చలనము. **పుతపుత పోవు** *v.n.* : To be perplexed, వెలవెలబోవు.

**పుతికి** *n.* : A tree.

**పుత్త** *n.* : The posteriors. పృష్ఠము.

**పుత్తడి** or **పుత్తళి** *n.* : Gold. పుత్తడికాసు a gold coin. **పుత్తళిక** *n.* : An image, a doll or puppet, బొమ్మ.

**పుత్తిక** *n.* : A white ant. పుట్టలోనిచెద. A honey bee, తేనె ఈగ.

**పుత్తెంచు** (పుచ్చు + తెంచు) : Same as పుచ్చు.

**పుత్రుడు** or **పుత్రకుడు** *n.* : A son. ఔరసపుత్రుడు or **ఔరసుడు** *n.* : An adopted son. **పుత్రి** or **పుత్రిక** *n.* : A daughter. A copy or transcript from an original. పుత్రవాత్సల్యము parental affection, love towards children. **పుత్రోత్సవము** *n.* : Rejoicings on account of the birth of a son. **పుత్రకామేష్టి** *n.* : A religious sacrifice performed for the purpose of obtaining a son.

**పుదియబొట్టు** *n.* : An upright caste mark worn on the forehead. ఊర్ధ్వ పుండ్రము.

**పుదీనా** *n.* : Mint, Indian peppermint, Mentha sativa.

**పుద్గలము** *n.* : Matter, substance (in a philosophical sense.) పుద్గలాస్తికాయ matter as comprising all bodies composed of atoms Colebr.

**పునః** *prep.* : Again, (in composition.) Thus పునర్విమర్శ or పునర్విచారణ a review, re-trial. ఈ దావా హైకోర్టు వారి వల్ల పునర్విచారణకు పంపబడ్డది this suit is remanded by the High Court for a re-trial. పునఃచేసిన విచారణ a repeated inquiry. పునః పునః again and again. పునఃప్రతిష్ఠ re-consecration. **పునర్జన్మము** *n.* : A second birth. Metempsychosis, **పునర్భవము** *adj. Lit* : Being born again, మరల పుట్టిన. *n.* : A nail. గోరు. **పునర్భువు** *n.* : A re-married widow, మారుమనువుది, దిధిషువు. **పునర్వసు** *n.* : The seventh of the lunar mansions. See పునాస. **పునశ్చరణ** *n.* : the Repetition of a certain prayer, or charm, మంత్రమును మరలమరల పఠించుట. **పునస్కారము** *n.* : A word like & c. ఆ విగ్రహము పూజా పునస్కారము లేక పడియున్నది homage and the like is no longer offered to that image. **పునస్సంధానము** *n. Lit* : Bringing together again. మరల కూర్చుట. A preliminary ceremony.

**పునాది** *n.* : A foundation of a house, & c., a basis, హస్తిభారము.

**పునాస** or **పునాసలు** *n.* : the first crop of the year which consists of grain of an inferior kind, కొర్రలు, బొబ్బర్లు మొదలగు ధాన్యము.

**పునిస్త్రీ** *n.* : A woman whose husband is living.

**పునీతుడు** *n.* : A sinless or holy man, పవిత్రుడు.

**పునుక** or **పున్క** *n.* : the skull, తలచిప్ప యొక్క యెముక, కపాలము. **పునుక తాలుపు** *n.* : The bearer of skulls, i.e., Siva.

**పునుగు** *n.* : The perfume called Civet. See జవ్వాది. **పునుగుచట్టము** *n.* : A civet bag or gland sold as a drug. **పునుగుపిల్లి** *n.* : The civet cat. **పునుగుబెండ** or కస్తూరిబెండ *n.* : Muskyrice A fragrant sort of rice called *Muradazalli.*

**పునెము** : See పున్నెము.

**పున్న** *adj.* : Young. **పున్నతేలు** *n.* : A young scorpion. వాడు పున్నతేలు వలె అంటించి ఊరక ఉండినాడు he played the part of an innocent looking scorpion.

**పున్నమ** *n.* : The lunar day on which the moon is full. పౌర్ణమి.

**పున్నాగము** *n.* : A white flower like tuberose : సురపొన్న. A white lotus, తెల్లకలువ. A chief, a pre-eminent man, పురుష శ్రేష్ఠుడు.

**పున్నెము** or **పున్నియము** : Same as పుణ్యము.

**పుష్పము** *n.* : A flower, పువ్వు.

**పుప్పి** *n.* : Decay, rottenness, పుచ్చుడము. పుప్పిపురుగు an insect found in rotten timber, నుసిపురుగు *adj.* : Decayed, rotten. పుప్పిపల్లు a decayed tooth.

**పుప్పించు** *v.a.* : To send, పంపు.

**పుప్పొడి** *n.* : The dust, pollen or farina of a flower. పుష్పపరాగము.

**పుబ్బ** *n.* : The name of the eleventh lunar mansion.

**పుయిలోడు** *v.n.* : To draw back, వెనుదీయు. To hesitate, సంకోచించు. To melt,yield, be kind or tender. To blush, be ashamed. దాక్షిణ్యపడు, సిగ్గుపడు.

**పుయ్యి** or **నల్లపుయ్యి** *n.* : A thorny shrub.

**పురందరుడు** *n.* : A name of Indra.

**పురంధ్రి** *n.* : A mistress of a family, a matron, a good woman. కుటుంబిని, కుటుంబమును పోషించు స్త్రీ.

**పురజా** *n.* : A daily account of the receipts and disbursements of a village; also sea customs. piece, bit, rag. A note, memorandum. లెక్క చిట్టా. రోజుపురజా a shopkeeper's day book.

**పురడించు, పురుడించు** or **పురణించు** *v.n. & a.* : To resemble. To vie with, emulate, to condemn, to subdue. పోలు, సరిపోలు, తిరస్కరించు, నిర సించు. To excel, వర్ధిల్లు, విజృంభించు.

**పురట** *n.* : An old form of పుట.

**పురణించు** or **పురడించు** *v.n.* : To excel, increase, వర్ధిల్లు, విజృంభించు.

**పురపుర** *adv.* : Much, greatly, మిక్కిలి.

**పురము** *n.* : A city, or town. పట్టణము. A house, ఇల్లు. A storey, మేడ.

**పురవచేప** *n.* : A fish, a sort of Clupea. Russell's Fishes. Or, a species of.

**పురస్కరించు** *v.a.* : To set in front, as a leader, ముందుంచుకొను. to worship, to revere, పూజించు. **పురస్కృతము** *adj.* : Placed in front, put forward. ముందుంచబడిన. Worshipped or honored. సన్మానింపబడిన. పురస్కారము. పురస్కృతి or **పురస్క్రియ** *n.* : the act of setting a person in front; worshipping.

**పురస్సరుడు** *n.* : One who walks in front. A leader, a chief, ముందు నడచువాడు.

**పురహరుడు, పురారి** or **త్రిపురహరుడు** *n.* : An epithet of Siva.

**పురాకృతము** *adj.* : Formerly done. ముందుచేయబడిన. *n.* : The good or evil acts committed in a former birth. పూర్వజన్మము నందు చేయబడిన శుభాశుభకర్మము.

**పురాణము** *adj.* : Old, ancient, పురాతనము. *n.* : An ancient story, or legend, a mythological tale, a rhapsody or string of stories. The name of a class of books in Indian literature. **పురాణ దంపతులు** *n.* : The 'primeval pair', a phrase for Siva and Parvati, or Vishnu and Lakshmi. A phrase like Adam and Eve.

**పురాతనము** *adj.* : Ancient, old. బహు దినములది, **పురాతనులు** *n.* : plu. The ancients, పూర్వులు.

**పురాయించు** *v.n.* : To excel, to increase. వర్ధిల్లు, విజృంభించు.

**పురావలోకనము** *n.* : Looking again, reperusal.

**పురావృత్తము** *n.* : An ancient story. పూర్వకథ, ఇతిహాసము.

**పురి** Same as పురము. పురి *n.* : A twist. మెలి. A peacock's tail. పింఛము. **పురికొలుపు** *v.a.* : To spur on, move, instigate, incite, stir up, rally. మొనయు, ప్రేరేపించు, ఎచ్చరించు, నూలు కొలుపు, పుల్లలు పెట్టు. పురికొస *n.* : A large poisonous spider or tarantula. **పురిపెట్టు** *v.a.* : To twine or twist. **పురియెక్కించు** *v.a.* : To incite. **పురివిచ్చు** *v.a.* : To untwist or unravel a thread. *v.n.* : To separate, withdraw, retreat. వేరగు, వీడిపోవు. **పురులోము** (పురులు + ఓము.) *v.n.* : To be enraged. క్షాత్రము మెరయించు.

**పురిటితీగె** *n.* : A creeper.

**పురిడిపిట్ట** *n.* : A quail. ముక్కుపురిడి a snipe. See పూరేడు.

**పురీషము** *n.* : Dung, excrement, faeces, మలము. మూత్రపురీషములు urine and faeces.

**పురుగు** or **పురుపు** *n.* : A worm, any insect or reptile that has no wings. క్రిమి, కీటకము. గుల్లపురుగు a shell

fish. వారి పురుగు లేకుండా చేసినాడు he exterminated them. వాడు చెడు పురుగు he is a vile wretch. పురుగు పట్టిన infested with insects, decayed.

**పురుడించు** *v.n. & a.* : To resemble. పోలు, సరిపోలు.

**పురుడు** *n.* : Parturition, child birth. Ceremonial uncleanness for ten days after the birth of a child, జాతాశౌచము. పురుడుపుచ్చు to put away a woman's uncleanness. పురిటిల్లు or పురుటిల్లు the house wherein a birth has happened, ప్రసవగృహము.

**పురుడు** *n.* : Likeness, similarity. సమానత, సామ్యము.

**పురుదొన** *n.* : A tree that is commonly used for fuel.

**పురువు** or **పుర్వు** : See పురుగు.

**పురుషుడు** *n.* : A man. A husband. పురుషకారము an attempt of man, human effort, పురుష ప్రయత్నము. **పురుషోత్తముడు** *n. Lit* : the best of men. The Almighty. **పురుషము** *n.* : A person in verbs. క్రియలమీది విభక్తుల సంజ్ఞ. ప్రథమ పురుషము the third person. మధ్యమ పురుషము the second person. ఉత్తమ పురుషము the first person. **పురుషరత్నము** or మగలింగము *n.* : A species of violet or phallus flower, Wight. **పురుషాయితము** *n.* : Man-fashion; playing the husband. **పురుషార్థము** *n.* : An object of desire. The principal thing or object in life. i.e., ధర్మార్థకామ మోక్షములు the gratification of desire, acquirement of wealth, discharge of duty, and final emancipation.

**పురుహూతుడు** *n.* :An epithet of Indra.

**పురె** or **పురే** *interj.* : Ah ! alas !

**పురోగము** or **పురోగమము** *n.* : Going before, preceding. పురోగామి, **పురోగముడు** or పురోగుడు *adj.* : and *n.* : One who precedes or goes in front of, a herald, a leader. అగ్రేసరుడు, ముఖ్యుడు, ముందర నడుచువాడు.

**పురోణీ** *n.* : A short note or letter : a bill : a note of hand. చీటి.

**పురోధనుడు** *n.* : A family priest. పురోహితుడు.

**పురోభాగము** *n.* : The front. **పురోభాగము** *n.* : One who is malevolent or censorious, ఎల్లప్పుడును దోషములు వెదకువాడు.

**పురోభావి** *adj.* : Probable, likely to happen.

**పురోసూచకము** *n.* : Prognostication, a foreboding, an omen or protent.

**పురోహితుడు** *n.* : A family priest.

**పుర్ర** *adj.* : Left. ఎడమ, వామము. **పుర్రచెయ్యి** *n.* : the left hand, ఎడమ చెయ్యి, పుర్రచెయ్యివాటము గలవాడు. a left handed man.

**పుర్రు** *n.* : Mash, slush, ooze, soft mire, a loose motion of the bowels. పలుచని బురద, మలము మొదలైనవి. The noise made in tearing a cloth బట్టచినిగే ధ్వని.

**పుర్రె, పుర్రియ** or **పురియ** *n.* : The skull. The head when cut off. **పుర్రెడు** *n.* : A skull-ful, as much as fills a skull. పుర్రెలి *n.* : A quail.

**పుర్వు** : Same as పురుగు.

**పుల** *adj.* : Yellowish, white also, పుల్ల. *adj.* : **పులకండము** *n.* : Sugar-candy. కల్కండ, కండచక్కెర.

**పులకచేయు** *v.a.* : To harrow land.

**పులకలు** *n. plu.* : A bristling, a glow, a tingling or glowing of the skin, as in a blush, the hair of the skin being erected. గగురుపాడుచుట. గగుర్పాటు. Fever, జ్వరము, **పులకాంకితుడు** *n.* : One who glows or tingles with ecstasy. గగుర్పాటు కలిగించాడు. **పులకాంకురము** *n.* : A bristling. a tingle, glow, shudder, think గగురువు, **పులకించు** v.n. :in glow bristle or tingle. **పులకరించు** *v.n.* : be feverish or started.

**పులగము** or **పుల్గము** *n.* : A dish made of rice lended with green gram. ఈ భాషలోని వాడుక మాటలు పులగము వలెనున్నవి. this language is a mere hodge podge.

**పులప** *n.* : A mess of various roots. boiled with lime juice. కందగాని నల్లేరుగాని యెనిపి పులుసు పెట్టి వండినది.

**పులపొడుచు** or **పుల్పొడుచు** *v.n.* : To look without winking, the eyes, to see, రెప్పవేయక చూచు.

**పులము** *n.* : Same as పులకరము. adj. Large, broad, విపులము.

**పులస** *n.* : A sort of fish.

**పులసరము** *n.* : Indigestion నా కడుపులో పులసరమున్నది I am suffering from indigestion. Enthusiasm, spirit ఉద్రేకము. **పులసరి** *adj.* : Proud గర్వముగల పులసరితనము pride, arrogance. గర్వము.

**పులాకము** *n.* : A grain of boiled rice. అన్నపుమెతుకు. Brevity, సంక్షేపము.

**పులావు** *n.* : A kind of rich food prepared by Mahomedans.

**పులి** or **పుల్ల** *adj.* : Acid, sour పులికడుగు sour washings, i.e., water in which raw rice has been washed and is then left to ferment. పులికూడు food that has turned sour. **పులికాపు***n.* : A mixture of tamarind in water with which copper or brass images are scoured. పులిగంజి sour gruel. **పులిగడుగు** *v.a.* : To Wash (కడుగు) pearls & c., in (పులి) acid, to restore their brilliancy To scour, burnish. **పులిగాయము** *n.* : scar ఆరిన మచ్చ, పుంటిమచ్చ. **పులిచించలము** *n.* : A medicinal plant. అగ్నిజిత్తు, **పులిచింత**

or **పులిచంచలి** *n.* : Yellow wood sorrel. **పులిచెలిక** a fresh field, one lately left fallow. పులితేనుపు, పులితేన్పు, పులితేపు or **పులిత్రేపు** *n.* : Acid belching, అజీర్ణపు తేపు. **పులిమెట్టు** *n.* : The sediment of water in which raw rice has been washed తేర్చిన కడుగు యొక్క అడుగుది. **పులియు** *v.n.* : To turn sour. పులియ, పులియాకు or **పుల్లాకు** n. A leaf on which one's food has been taken, విస్తరాకు పులియబారు Same as పులియు, **పులివెలగచెట్టు** *n.* : A species of wood apple. **పులివరుగు** *n.* : Dried and sour fruits, pickled fruit.

**పులి** *n.* : A tiger. పెద్దపులి, చిరుతపులి a cheetah, leopard or panther, ఈగపులి the fly tiger, i.e., a spider. **పులిగోరు** A tiger's claw, used as the central ornament of a necklace. **పులిచెవులాకు** *n.* : Tiger's ears, a certain medicinal plant. **పులి జూదము** A game like drafts. **పులి పెంజెర** *n.* : The snake called కాటు కరేకుపాము.

**పులినము** or **పుళినము** *n.* : A sandbank; a sandhill, ఇసుకదిబ్బ.

**పులిపిరి, పుల్పిరి, పులిపిరికాయ, పులిపులి** or **పులిపులికాయ** *n.* : Callus, hard skin, callosity, as that of a wart. A wart. A villain, a scoundrel. పులిపురికేమి నొప్పి, i.e., what feeling has a scoundrel ? **పులిపులి** *adj.* : Tormented. పీడితము. **పులిపులిగాగ** *adv.* : Easily. into slics, తూలాయమానముగా.

**పులిరుసు** : See as పుల్లిరుసు. See under పుల్లు.

**పులు** or **పుల్లు** *n.* : Grass కసవు. Also foulness in gems, రత్నాదుల మాలిన్యము. పుల్గృహము a grass house. కనకపులు golden grass adj. Little, mean. పులుమానిసి a little or low man. **పులుద్రుమాను** n. A tree which belongs to the family of the Palms. తాటిచెట్టు మొదలైన తృణ ద్రుమము. **పులికాసి పురుగు** *n.* : An insect with green wings, పచ్చరెక్క పురుగు. A low person, అల్పుడు. **పులుకాసి పులుగు** *n.* : A parrot.

**పులుకు పులుకు** or **పుల్కుపుల్కు** *n.* : Blinking పులుకుపులుకునచూచు *v.n.* : To blink or view with blinking eyes : to look piqued, మిణకరించుచు చూచు.

**పులుగాకు** *n.* : Harm, mischief. ఉపద్రవము.

**పులుగు** *n.* : A bird పక్షి. A mark or sign, గురుతు, జాడ. **పులుగుపిట్ట** *n.* : An owl గుడ్లగూబ. **పులుగరి** or **పుల్గరి** *n.* : One who understands a sign, జాడయెరిగినవాడు, **పులుగు బొల్లడు** or **పులుగురేడు** *n.* : An eagle, గరుత్మంతుడు. **పులుగురాయి** *n.* : An emerald, పచ్చ, గారుత్మతము **పులుదిండిరాయి** or **పులుదిండిచలువ** *n.* : A sapphire ఇంద్రనీలమణి.

**పులుగుడు** *n.* : A certain medicinal plant. వాతఘ్ని.

**పులుచు** or **పులుసు** *n.* : A certain tree, perhaps.

**పులుప** *n.* : An acid chutney, పుల్లని ఊరుబిండి.

**పులుము** or **పులుముకొను** *v.n.* and *a.* : To scour or rub in washing or bathing రుద్దు, నలుపు. To beat కొట్టు, కండ్లు పులుముకొనుచు లేచినాడు. **పులుముడు** *n.* : Rubbing రుద్దడము, **పులిమిపుచ్చు** *v.a.* : To evade. అడిగిన దానికి ఉత్తరము చెప్పకుండా మాయచేయు.

**పులుసు** *n.* : Acidiry, an acid, as the juice of tamarinds. Pride, self conceit. అతని పులుసు వంచిరి they humbled his pride. *adj.* : Acid sour పులుసుకూర vegetables dressed with acids, పులుసు పోసివండిన కూర.

**పులోముడు** *n.* : The name of a Rishi, slain by Indra. **పులోమ** *n.* : The daughter of Puloma who was ravished by Indra and became his wife, శచీదేవి, **పులోమత్తు** *n.* : The slayer of puloma. an epithet of Indra.

**పుల్కశుడు** or **పుల్కసుడు** *n.* : A man of the chandala or Pariah caste. చండాలుడు, శ్వపచుడు, అధముడు.

**పుల్పొడుచు** : Same as పులపొడుచు ?

**పుల్ల** *n.* : A small bit or piece of stick. పుల్లలు small pieces of wood for fuel.

**పుల్ల, పుల్లటి** or **పుల్లని** *adj.* : Sour, acid, unripe, raw. Whitish, pale duncoloured, or reddish, yellow grizzled, like a lion. **పుల్లనీళ్ళు** *n.* : stored rice water కూటినీళ్లు, గంజి.

**పుల్లటి** *n.* : A club, కఱ్ఱ నాటుచేయువాడు, గురికిపెట్టుకొను.

**పుల్లబడు** or **పుల్లవడు** *v.n.* : To be stunned. భ్రమానుపడు, స్తంభించు. నిశ్చేష్టితుడగు.

**పుల్లరి** : See under పుల్లు.

**పులసిల్లు** *v.n.* : To turn pale or pallid, వివర్ణమగు

**పుల్లింగము** or **పులింగము** *n.* : The masculine gender

**పుల్లిరికి** *n.* : A kind of shrub.

**పుల్లు పులు** *n.* : Grass; foulness in precious stones. గడ్డి, రత్నాదుల మాలిన్యము *adj.* : Little, small అల్పము. **పుల్లంటురాయి** *n.* : A sapphire, ఇంద్రనీలము.

**పుల్లెన** *n.* : Aplant used in medicine, also called లాల్ద్బీరు.

**పుళింద** *adj.* : Barbarain, savage, tude, పుళిందదేశము a certain country inhabited by savages.

**పువ్వు, పువు** or **పూవు** *n.* : A flower a cock's wattles. **పువ్వుబోడి** or **పువ్వుబోణి** *n.* : A mymph, lady, fair woman. **పువ్వు ముడుపు** or **పూలముడుపు** *n.* : placing flowers in the hair, a ceremony performed with

pregnant women సీమంతకరము see పూవు.

**పుష్కరము** *n.* : The tip of an elephant's trunk. ఏనుగుతొండము చివర. A lotus, మెట్టతామర. The revolution of twelve years. A feast held once every twelve years at certain holy rivers as the గోదావరి పుష్కరము, కృష్ణ పుష్కరము. **పుష్కరిణి** *n.* : A flowery lake, a pond wherein lotuses grow. కోనేరు. A female elephant.

**పుష్కలము** *adj.* : Excellent, eminent, chief, best, much, many శ్రేష్ఠము, పూర్ణము, నిండారు, సమృద్ధము, అధికము.

**పుష్టి** *n.* : Fatness, Strength, increase. బలుపు. **పుష్టము** *adj.* : Cherished, nourished పోషింపబడిన, **పుషితము** *adj.* : Nourished, nurtured, reared, isostered పోషింపబడిన.

**పుష్పము** *n.* : A flower. పువ్వు. Menses, స్త్రీరజస్సు. **పుష్పంధయము** *n.* : A hee. తుమ్మెద.

**పుష్యము** *n.* : The lunar month (December January, or January February) in which the moon's change takes place when the sun is in Capricorn. **పుష్యమి** *n.* : The eight of the lunar mansions. **పుష్యరాగము** *n.* : A topaz.

**పుసలాయించు** *v.a.* : To cax, persuade. బుజ్జగించు, **పుసలాయించు** *n.* : Coaxing, persuasion.

**పుసి** *n.* :The rheum of the eyes. నేత్రమలము, వాని కండ్లు పుసులు కట్టినవి his eyes are full of gummy rheum. పుసికాయలు granulations in aa wound or sore.

**పుసుకు** *adv.* : pop ! slapdash, suddenly, abruptly. పుసుకువచ్చు to pop out, పుసుకున మాట్లాడు to blurt out or say heedlessly.

**పుస్తకము** or **పుస్తము** *n.* : A book, a volume.

**పుస్తము** *n.* : A cake of flesh మాంసపు చక్కిలము. plaster, లప్పము.

**పుస్తు** *n.* : Stinking, a foul scent, a varnish stink. దుర్గంధము, కంపు.

**పుస్తె** *n.* : The mark of marriage, being a small gold disc worn round the neck by married women తాళిబొట్టు. See మంగళసూత్రము.

**పూ** (for పూవు) *n.* : A flower. పువ్వు, **పూగుత్తి** *n.* : A cluster of flowers, a nosegay. **పూనీరు** *n.* : Essence, distilled water. ఆవిరినీళ్ళు హిమాంబువు, పన్నీరు, **పూనూనె** *n.* : The oil extracted from the champaka flower, సంపంగినూనె. **పూబోడి, పూబోణి** or **పువ్వుబోడి** *n.* : A beautiful woman.

**పూగము** *n.* : The arecapalm. పోకచెట్టు.

**పూచి** or **పూచికగడ్డి** *n.* : A sort of long stiff grass of which brooms are made, తృణభేదము.

**పూచీ** or **పూచి** *n.* : Responsibility. పూచీ నామీద లేదు I am not responsible for it. **పూచీపడు** *v.n.* : To undertake the responsibility. పూతప్పాచీలెక్కలు accounts necessary for current business పూచీపట్టు or **పూచీపట్టు** *v.n.* : To be bent upon or firmly resolved, to persist. పూనుకొను.

**పూచు** *v.n.* : To flower, bloom, blossom, bud, shoot out, open or expand, పుష్పించు.

**పూజ** or **పూజనము** *n.* : Worship, reverence, respect, veneration, obeisance, homage, adoration. అర్చన. **పూజనీయము** *adj.* : Venerable, honourable.

**పూజె** *n.* : Painting or filagree work on pots. A bead or spangle; particularly, drops or beads of gold attached to golden jewels.

**పూజ** : Same as పూజ. **పూజారి, పూజరి** *n.* : An officiating Brahmin or priest of a temple అర్చకుడు.

**పూట** *n.* : A time కాలము. A part of day, సంధ్య. A day, దినము. Security, surety, bail. ప్రతిభూత్వము. **పూటకూళ్లమ్మ** a woman who makes her living by preparing food for daily wages.

**పూటము** *n.* : Weight, బరువు, భారము. పడవ పూటమైనది the boat is filled with the due quantity of goods.

**పూడ** *n.* : the anus.

**పూడు** *v.n.* : To be filled or closed up : to fall in, as a well or pit. బావి పూడిపోయినది. the well has fallen in. **పూడిక** *n.* : The filling up, stuff, that has fallen in.

**పూడులు** or **పూండ్లు** *adj.* : Many అనేకములు, ఏడులు పూడులుగాగ for many years.

**పూత** *n.* : Rubbing, besmearing, పూయుట, చర్చ.

**పూతన** *n.* : The name of an ogress అది రెండోపూతన she is a perfect fiend.

**పూతము** *adj.* : Strained, cleaned, cleansed వడియబోసిన, వడకట్ట బడిన, తూర్పెత్తిన. Pure, purified, పవిత్రమైన.

**పూతిగంధి** *n.* : A stink, a foul smell, దుర్గంధము.

**పూదె** or **పూదియ** *n.* : A bead of gold బంగారుపూస. Also, పూజె.

**పూదెకట్టు** *v.n.* : To form into a gold bead బంగారు పూసగానేర్పడు.

**పూనిగొల్లలు** *n.* : A particular class of shepherds.

**పూను** *v.n.* : To attempt యత్నించు, ఉద్యమించు. *v.a.* : To take; to undertake; to wear; to bear; to feel or suffer, పొందు, వహించు, పైన వేసికొను, ధరించు, ఆరంభించు, అంగీకరించు.

**పూనె** *n.* : A casket, a small box. బరిణె.

**పూప** *n.* : A tender fruit just formed, పువ్వుపిందె. An infant, శిశువు. The pupil of the eye, కంటిపాప. *adj.* : Tender, young, లేత.

**పూపము***n.* : A cake, భక్ష్యము, పిండివంట.

**పూపు** or **పూన్పు** *n.* : An undertaking, effort, attempt, పూనిక.

**పూయము** *n.* : Pus or matter from an abscess or sore, నింగిన నెత్తురు, చీము.

**పూయు** *v.n.* : To bear or produce, as flowers, పూచు, ఆ భూమి ఉప్పు పూస్తున్నది. that ground produces salt.

**పూరము** *n.* : A flood, a flow, the flowing of the tide. ప్రవాహము. *adj.* : Filled, నిండిన. **పూరకము** *adj.* : Filling, completing. *n.* : That which fills or completes, filling up. A citren.

**పూరా** *adj.* : Full, complete, సంపూర్ణమైన.

**పూరి** *n.* : Grass. The milk given by animals మృగముల చనుబాలు. **పూరి ఇల్లు** or **పూరిల్లు** *n.* : A thatched house.

**పూరుదొన్నె** *n.* : A plant.

**పూరేడు** *n.* : A bird of the quail genus. A quail మిాలవల్లంకి, డాబ, గోమిడ.

**పూర్ణము** *adj.* : Full, filled నిండిన. Complete, all, entire, సమస్తము. Strong, powerful, able, శక్తిగల, **పూర్ణకము** *n.* : A filling up, as, పాదపూర్ణకము a peg in a verse; any useless word inserted to fill the measure, as ఒగి, తగన్, ఇల, & c. **పూర్ణకుంభము** *n.* : An ornamented vase filled with water and used in marriages, & c. **పూర్ణుడు** *n.* : One who is full or well skilled. వాడు విద్యలో పూర్ణుడు he is an accomplished scholar.

**పూర్తి** *n.* : Fullness భర్తీ, నిండుట. Completion, termination, end, సమాప్తి.

**పూర్వము** *adj.* : First, former, prior, preceding, initial, before in front of; old, ancient. మొదటిది. **పూర్వ జన్మము** *n.* : A former birth. **పూర్వ పక్షము** or **పూర్వసిద్ధాంతము** *n.* : An argument, one side of a question inlogic, వాదము. **పూర్వార్ధము** *n.* : A former half. **పూర్వాషాఢ** *n.* : The name of a lunar constellation. **పూర్వోత్తరము** *n.* : The whole of an affair, from the first (పూర్వము) to the last (ఉత్తరము).

**పూలి** or **తెల్లపూలి** *n.* : A certain plant.

**పూలి** *n.* : A star pagoda worth 3.5 rupees. పూలీలు plu. star pagodas.

**పూవు** *n.* : A flower పువ్వు, **పూలమట్ట** *n.* : A kind of fish. **పూలముడుపు** *n.* : Adorning the head with flowers.

**పూషుడు** *n.* : The sun.

**పూస** *n.* : A bead, మణి, A joint of a finger, వ్రేలులో కీలు. **పూసకజ్జెము** *n.* : The sweetmeat called maccaroons. **పూసలవాడు** *n.* : One who sells beads, one who polishes precious stones. రత్నములు సాన పెట్టువాడు.

**పృక్తము** *adj.* : joined, united, కూడుకొనిన.

**పృచ్ఛ** *n.* : Questioning, a question, query, ప్రశ్నము, అడుగుట.

**పృతన** *n.* : An army, host, సేన, దండు.

**పృథ** *n.* : The mother of the Pandus, కుంతీదేవి.

**పృథక్** *adv.* : Alone, separately. **పృథగ్జనుడు** *n.* : An ignorant man, a fool, a man of low caste, a sinner, a wicked man. నీచుడు, మూర్ఖుడు, పాపి. **పృథగ్విధము** *adj.* : Of different sorts. పెక్కు విధములుగల.

**పృథివి** or **పృథ్వి** *n.* : The earth. పృథివీ పతి a king.

**పృథు** or **పృథువు** *adj.* : Great, big. **పృథు తరువు** a big tree. **పృథుకంఠము** *n.* : A male cricket.

**పృథుకము** *n.* : An infant. పిల్ల, బిడ్డ. Parched corn, first scalded and then bruised to remove the husk. అటుకులు.

**పృశ్ని** *n.* : A ray of light, కిరణము. A dwarf, మరుగుజ్జువాడు. A savage. కిరాతుడు.

**పృషతము** or **పృషత్తు** *n.* : A drop of any liquid. జలబిందువు. the porcine deer. దుప్పి.

**పృషదంశకము** or **పృషదంశకము** *n.* : A cat. పిల్లి.

**పృష్టము** *adj.* : Asked. అడుగబడిన.

**పృష్టి** *n.* : A ray of light, కిరణము.

**పృష్ఠము** *n.* : the back. వీపు. The rear, పశ్చాద్భాగము. The posteriors. ముడ్డి.

**పెం** or **పెన్** *n.* : A contraction for పెను large. పెంజిలువ (పెను + చిలువ) *n.* : A large rock snake. **పెంజీకటి** Thick darkness.

**పెంకి తీగ** *n.* : The name of a large climbing woody shrub.

**పెంకు** *n.* : A potsherd or cullet. A tile, a pantile.

**పెంకె** *adj.* : Obstinate, stubborn, impudent. **పెంకెపురుగు** *n.* : A weevil in grain.

**పెంచు** or **పెంచిక** *n.* : A potsherd.

**పెంచు** or **పెనుచు** *v.a.* : To nourish, support, take care of. To adopt or rear a child, పోషించు, సాకు. To increase, improve. To extend or swell. To exaggerate, to multiply.

**పెంచెపుదండ** *n.* : A sort of crook or staff.

**పెంజెర** : See under పెం.

**పెంట** *n.* : A heap, as of dirt, sweepings or manure. ఎరువు. ash, a dunghill. పీనుగు పెంటలు heaps of corpses. **పెంటకట్టు** to manure a land, to dung a field by penning sheep or goats in it.

**పెంటిపడు** *v.n.* : To match or equal. To pair, జతగూడు, కనగూడు.

**పెండ** or **పేడ** *n.* : Cowdung, గోమయము. The dung of any clean animal.

**పెండలము** *n.* : The yam.

**పెండియము, పెందెము, పెందరము, పెండారవము, పెండెరవము** or **పెండేరము** *n.* : An ornament worn like a garter on one leg.

**పెండె** or **పెండెబద్ద** *n.* : A lathi or small rafter, commonly called a reaper, a strip of wood. ఇంటి వాసముల మీద అడ్డముగా వేసి కట్టే కొయ్య.

**పెండెము** or **పెండియము** *n.* : A door made of strips of bamboo, a wooden gate. పశువులదొడ్డియొక్క ద్వార కవాటము. A wooden bar used to fasten a door. అడ్డకర్ర See పెండియము.

**పెండ్లి, పెండిలి** or **పెళ్లి** *n. Lit* : Taking a wife. Marriage. **పెండ్లికూతురు** or **పెండ్లికొమార్తె** *n.* : The bride, వధువు. **పెండ్లికొడుకు** or **పెండ్లి కుమారుడు** *n.* : The bride-groom.

**పెంపు** *n.* : Greatness. మహత్వము, అధిక్యము, అతిశయము. Honour, గౌరవము. Rearing, nourishing, fostering, సాకుట. Increase, growth, వృద్ధి. Plenty, సమృద్ధి. **పెంపుడు కొమారుడు** or దత్తపుత్రుడు an adopted son. **పెంపుడుతల్లి** an adoptive mother. **పెంపుడుతండ్రి** an adoptive father.

**పేకలు** *v.n.* : To come up, i.e., be torn up by the roots, పెల్లగిల్లు. To give way, yield. To get ready to travel. ప్రయాణమగు.

**పెక్కణము** or **ప్రెక్కణము** *n.* : Dancing with gestures. అభినయంముతో కూడిన నృత్యము.

**పెక్కలి** *n.* : A tree like the Love Apple.

**పెక్కు** *pron.* : Many, అనేకము. పెక్కేల why so many ? పెక్కులు many (things) అనేకము. *adj.* : Many, plentiful.

**పెగడ, ప్రెగడ** or **ప్రెగ్గడ** *n.* : An elder, senior; a noble, a gentleman, పెద్దవాడు.

**పెగలు** : Another form of పెకలు. అప్పు ఎక్కడను పెగలలేదు I could not borrow money anywhere.

**పెగ్గడి** or **పెగ్గురు** : Same as బెగ్గురు a crane.

**పిచ్చారి** *n.* : A stubborn man, a stupid or ignorant man, మూర్ఖుడు.

**పెచ్చు** *n.* : Peel, peelings, rind. ఫలాదులపై త్వక్కు, తొక్క Surplus, excess, premium, profit in exchange. హెచ్చు, మార్కము, పైపెచ్చులు incidental profits like fees. adj. Much, great, అధికము. *adv.* : Excessively, మిక్కిలి.

**పెటపెట** *n.* : A crashing or gnashing noise. A loud sound. కొయ్య మొదలైనవి బద్దలగు ధ్వని.

**పెట్ట** *n.* : A female of animals. పశుపక్షిస్త్రీ జాతి. A hen. ఆడుకోడి.

**పెట్టు** *v.n.* : To happen, కలుగు. To put, place. ఉంచు. To lay (eggs), to bring forth (young), కను. To wear,

ధరించు. To give, ఇచ్చు. **పెట్టుబడి** *n.* : Money advanced or laid out. An outlay.

**పెట్టె** or **పెట్టియ** *n.* : A box, a chest. A coil, as of a snake. **పెట్టెబండి** *n.* : A palanquin coach, a closed carriage.

**పెట్లదిమ్మె, పెట్లు, పెట్లుప్పు, పెట్లుప్పు ద్రావకము** : See under పెటులు.

**పెఠిల్లు** *n.* : The noise produced by a blow or thunder, & c. *adv.* : Bang ! slapdash ! పెఠిల్లు పెఠిల్లున *adj.* : Aloud. Bang !

**పెడ** *adj.* : Large, పెద్ద. Hinder, back, behind వెనుకటి. Wrong, erroneous, audacious. విపరీతము, పెడ యుక్తులు, wicked devices. **పెడకట్టె** or **పెడసరకట్టె** *n.* : A stubborn person, మూర్ఖుడు, మూర్ఖురాలు.

**పెడలు** *n.* : The backyard of a house, పెరడు.

**పెడసరము** *n.* : Stubbornness, obstinancy. మూర్ఖ్యము, పెడసరకట్టె Same as పెడకట్టె. See under పెడ.

**పెడిసెపిట్ట** *n.* : The Rose-colored Pastor or Cholam bird.

**పెడులు** : Same as పెటులు.

**పెడ్డ** : Same as బెడ్డ.

**పెణక** or **పెడక** *n.* : A pent roof, one side of a slopping roof. ఇంటియొక్క ఒక భాగపు కప్పు. The back side of a leaf. ఆకుయొక్క వెనుకటి భాగము. చిప్ప పెణక the gable end of a roof.

**పెతరులు** *n. plu.* : Forefathers or ancestors. పితృదేవతలు. పెతరులసామి the lord of the ancestors. i.e., Yama, యముడు. **పెతరులుచుక్క** the constellation called మాఘనక్షత్రము.

**పెత్తల్లి, పెత్తండ్రి, పెత్తనము** : See under పెద్ద.

**పెదవి** *n.* : The lip. అధరము.

**పెద్ద** or **పెద** *adj.* : Great, big, large, గొప్ప, అధికమైన, long, high, tall, పొడుగైన. Loud, Chief, principal. ముఖ్యమైన, శ్రేష్టము. Respectable, honest, honourable. Old, aged, Senior, *n.* : An elder, or senior. జ్యేష్ఠుడు, జ్యేష్ఠురాలు, పెద్దవాడు. **పెత్తండ్రి** (పెద్ద + తండ్రి) *n.* : A father's elder brother : the husband of a mother's elder sister. **పెత్తల్లి** n. A mother's elder sister. The wife of a father's elder brother. **పెత్తనము** or **పెద్దతనము** *n.* : Power, authority, headship. Greatness, rank, respectability, chieftainship. **పెద్దపులి** *n.* : A royal tiger. వ్యాఘ్రము. **పెద్దపులుగు** *n.* : An owl. **పెద్దమనిషి** or పెద్దమనుష్యుడు *n.* : An aged person. a gentleman, an honest man, a man of respectability.

**పెద్దవీధి** *n.* : A highway, a public road, రాజవీధి, రాజమార్గము. **పెద్దవేలుపు** *n.* : brahma, బ్రహ్మ, సురజ్యేష్ఠుడు. **పెద్దవేలు** *n.* : the thumb, బొటనవేలు, అంగుష్ఠము.

**పెన్, పెం** or **పెసు** *adj.* : Great, large, heavy.

**పెన** *n.* : A twist, మెలిక. A cord coupling two animals together, atic, a band, బంధము, **పెనుగు** *v.n.* : To be twisted, మెలిగొను. To surround, చుట్టుకొను. to join, unite, కలయు.

**పెనము** *n.* : An iron plate for baking cakes on. చెరుకు పెనము a sugar boiler like a great dish. మంటి పెనము an earthen frying pan.

**పెనయు** *v.n.* : To twine, కలయు. To struggle, to be implicated. పెనగు. **పెనచు** To cause to struggle. *n.* : A quarrel, వివాదము. Enmity, విరోధము. **పెనపరి** *n.* : A quarrelsome person, వివాదశీలుడు. One who is fond of creating enmity, భేదశీలుడు.

**పెనిమిటి** or **పెన్మిటి** *n.* : A husband.

**పెను** *adj.* : Great (in any sense); large, chief. పెనుమాల the greatest of villains. పెనువాన a great rain. **పెనుసిగ్గు** great shame. **పెన్నిధి** (పెను + నిధి) *n.* : A great treasure. **పెన్నెరులు** *n.* : Long tresse, flowing hair.

**పెన్న** *n.* : The name of the river Pennar which falls into the sea near Nellore. పినాకినీనది.

**పెన్నడపులుగు** (పెన్ + నడపులుగు) *n.* : A large sort of crane. కుదరము.

**పెన్నేరు** *n.* : The branched winter cherry. అశ్వగంధ, పెన్నేరుగడ్డ the bulbous root of this plant.

**పెమ్మె** *n.* : Another form of పెరిమె.

**పెయ్య** or **పెయ్యదూడ** *n.* : A heifer, a female calf, పాలు విడిచిన ఆడుదూడ. A calf, దూడ. A young cow, పడుచు ఆవు.

**పెయ్యెర** *n.* : A certain forest shrub called, అల్లిపెయ్యెర a species.

**పెర** *n.* : A honey comb. పెరతేనె honey in the comb. తెట్టెతో నుండు మకరందము.

**పెరక** *n.* : A tile. పెంకు.

**పెరజు** *n.* : A sort of snake.

**పెరడు** *n.* : the back yard of a house, ఇంటి వెనుక దొడ్డి, పాటిపెరడు a piece of ground manured by cattle confined there for that purpose. కూరపెరడు a kitchen.

**పెరవణి** *n.* : Dancing, capers, gambols. పేరణియాట, తాండవము.

**పెరసు** *n.* : Flesh మాంసము.

**పెరిక** or **పెరికె** *n.* : A sack, గోనెమూట. **పెరికెనెట్టి** *n.* : A drover of laden cattle. **పెరికాటము** *n.* : Carrying goods on bullocks.

**పెరిమ** or **పెరిమె** *n.* : Love, affection. ప్రేమ. Greatness, పెద్దరికము, గొప్పతనము, అతిశయము.

**పెరుకు** or **పెర్కు** *v.a.* : To tear out, uproot, pluck up by the roots, to pull out. పీకు, పెల్లగించు. To carry, మోయు.

**పెరుగు, పెర్గు, పెరువు** or **పెర్వు** *v.n.* : To grow, increase, వర్ధిల్లు. ఎదుగు, విజృంభించు. To accumulate. To grow up as a child. To bristle up, as a porcupine. To attempt, ప్రయత్నించు.

**పెరుమాళ్ళు** *n.* : A name for Vishnu, విష్ణువు. (prov.) పెరుమాకోయిల or **పెరుమాళ్ళకోయిల** *n.* : Conjeveram, కాంచీపురము.

**పెర** *n.* : A reservoir for water at the-salt pans.

**పెలిస** or **పెలిసె** *n.* : The rose colored pastor or cholam bird.

**పెలుతురు** or **పెల్కురు** *v.n.* : To start, be alarmed. అదరిపడు To be troubled through fear, & c. భయాదుల చేత విలవిలపోవు, విహ్వాలమగు.

**పెలుచ, పెల్చ, పులచన** or **పెల్చన** *n.* : Greatness, అతిశయము, ఆధిక్యము. Anger, wrath, ఆగ్రహము. Hardness, harshness, కాఠిన్యము *adj.* : Great. అధికము. **పెలుచ** *adv.* : Excessively, exceedingly, much.

**పెల్ల** or **పెళ్ళ** *n.* : A lump, clod; a chip, a flake; a raw brick. **పెల్లగించు** or **పెళ్లగించు** *v.a.* : To pull out, root out, draw out.

**పెల్లు** *n.* : Excess, greatness అతిశయము, ఆధిక్యము, పెల్లు or పెల్లుగా *adj.* : Much, great, excessive, *adv.* : Greatly, exceedingly, vastly, much.

**పెళపెళ, ఫెళఫెళ, పెళ్లు** or **పెళుక్కు** *n.* : The noise produced in breaking a thing suddenly.

**పెళుచు** or **పెళుసు** *adj.* : Brittle, harsh, విరసమైన. పెళుచు మాటలు harsh-words. *n.* : Stiffness, Inflexibility Brittleness. A mean or stubborn wretch. మూర్ఖుడు.

**పెళ్లమ్రాను** *n.* : A harrow. పాపటము, నేలను చదువునుచేయు యంత్రము.

**పెళ్లి** : Same as పెండ్లి.

**పెళ్లున** *adv.* : Loudly, alound. భేరీ మృదంగములు పెళ్లున మోగెను the great drums resounded aloud.

**పెళ్లెము** *n.* : A flour consisting of a mixture of several substances used in making liquors, మద్యము చేయుటకు అనేక వస్తువులు చేర్చి చేసిన పిండి.

**పెసలు** *n. plu.* : The pulse called green gram. Heyne. పచ్చపెసలు. **పెసర** adj. Of or belonging to the పెసలు pulse, as పెసరచేను, పెసరపప్పు & c. One sort is పిల్లిపెసర.

**పేక** *n.* : The warp, or cross threads in a web. బట్టలోని అడ్డనూలు.

**పేగు** or **ప్రేగు** *n.* : An entrail, gut, or bowel. **పేగుజారు** *v.n.* : To have rupture or hernia, బుడ్డదిగు.

**పేచకము** *n.* : An owl, పైడికంటి. The tip or root of an elephant tail, ఏనుగు యొక్క తోక మొదలు. **పేచకి** *n.* : An elephant గజము.

**పేచిక** *n.* : A plant. జారగడ్డి.

**పేచీ** *n.* : Responsibility, business. Pecuniary embarrassment, trouble. తొందర, తంటా. **పేచీకోరు** a troublesome fellow. తంటాలమారి.

**పేట** *n.* : A suburb or division of a large city. శాఖానగరము. A city or town. నగరము. A string as of pearls. హారములో నొకసరము. **పేటంచు** *n.* : The ornamented woven edge of a cloth.

**పేటనబెట్టు** *v.n.* : to attempt, యత్నించు.

**పేటము** *n.* : A large basket, పెద్దగంప.

**పేటాడు** *v.n.* : To break. భేదించు. to prowl about. To play a game with balls tossed up in the air and kept going round.

**పేటి, పేటిక** or **పేటీ** *n.* : A chest. పెట్టె. లింగ పేటి the small silver box containing the lingam worn on the breast by Jangama. **పేటి** *n.* : A waist band, belt, నడికట్టు.

**పేటు** : A flake, బిళ్ల, పట్టె, ఆ గోడగచ్చు పేటులెత్తినది the plaster of the wall came of in flakes. The top of a hill, పర్వతశిఖరము.

**పేడ** or **పేండ** *n.* : The dung of cattle. గోమయము. The dung of any animal. **పేడగువ్వ** *n.* : A species of pigeon. **పేడపురుగు** *n.* : A beetle.

**పేడి** or **పేడె** *n.* : A hermaphrodite, a eunuch, an impotent man. గడ్డము మీసాలు లేనివాడు, నపుంసకుడు.

**పేడు** *n.* : A piece, cutting, chip, or splinter. చెక్కవేళ్లు ballets of wood.

**పేడు** or **పేను** *v.a.* : To twist entwine. పేను. తొడమీద దారము పేనుచుండగా while he was twisting the thread on the thigh.

**పేణి** or **పేణీ** *n.* : A kind of cake made of wheat and sugar.

**పేద** or **పేదా** *n.* : A foot soldier, భటుడు. Also, a pawn (in chess).

**పేద** *adj.* : Poor, indigent, బీద. Timid, పిరికి. Slender, lean, thin, as the waist. **పేదరికము** *n.* : Pauperism, poverty. దారిద్ర్యము.

**పేనా** *n.* : A pen. కలము.

**పేను** *n.* : A louse. Plu. పేలు lice. **పేనుకొరుకుట** *n.* : A disease arising from lice which destroy the hair.

**పేను** *v.n.* and *v.a.* : To twist, or entwine. కలిపి పేను to twist together. See పేడు.

**పేపర** *n.* : A heron : the species called a Tiger Bittern.

**పేళము** *n.* : A medicinal plant having a leaf like that of the vine. **పిచ్చపేపాళము** the wild sort.

**పేము** or **ప్రేము** *n.* : A rattan or cane.

**పేయము** *adj.* : Drinkable. అపేయము no fit to be drunk.

**పేరంటము, పేరంట్రము** or **పేరటము** *n.* : Gossiping. The attendance of married women at each other's

houses on any domestic festival. such as a wedding. **పేరంటాలు** or **పేరటాలు** *n.* : A married woman, the mistress of a house. A lucky woman, i.e., a woman whose husband is alive. పుణ్యస్త్రీ, పునిస్త్రీ.

**పేరణి, పేరవణి** or **పేరణము** *n.* : A kind of dancing, skipping. భాండోపరి నృత్యము. Capers, gambolling. నటనము.

**పేరము** : See పేరెము.

**పేరస్తు** *n.* : A list, catalogue, జాబితా, పట్టీ.

**పేరిమి** or **పేర్మి** *n.* : Excess, greatness, eminence. అతిశయము, గౌరవము. Affection, friendship. ప్రేమ, స్నేహము. **పేరిమికాడు** *n.* : A great man, గొప్పవాడు, ఘనుడు.

**పేరివము** *n.* : Coolness, శైత్యము. పేరివము, అనగా అధికశీతల భావము.

**పేరీదు** or **పేరీతచెట్టు** *n.* : the large date tree. ఖర్జూర వృక్షము.

**పేరు** *n.* : A name, an appellation. నామము. Fame, celebrity, notoriety. **పేరు** or పేరుకొను *v.n.* : to congeal, curdle, harden or thicken, as melted butter or curds. ఘనీభవించు, దట్టమగు. **పేరడవి** (పేరు + అడవి) *n.* : A great forest, a wilderness. మహారణ్యము. **పేరోలగము** *n.* : A great court, or assembly, నిండు సభ.

**పేరెము** or **పేరము** *n.* : Course, pace, running, a gallop. గుఱ్ఱపు పరుగు, సామాన్యపు పరుగు. పేరెముపారు or **పేరెమెత్తు** *v.n.* : To run, to gallop.

**పేరొజము, పేరోజము** or **పేరోదనము** *n.* : A kind of sapphire. ఒకవిధమైన మరకతము. A kind of inferior precious stone, ఒకవిధమైన క్షుద్రమణి.

**పేలవము** *adj.* : Soft, meek, easy, మృదువు. Thin, sapless, పలుచని.

**పేలా** *n.* : A kind of cup for drinking water.

**పేలాలు, పేలగింజలు, పేలలు** or **ప్రేలలు** *n.* : Malted grain, fried, grain, parched corn. **పేలపిండి** *n.* : Flour made or parched grain. పరులసొమ్మువానికి పేలపిండి he devours his neighbour's goods like a bit of bread.

**పేలిక** *n.* : A rag, a bit or scrap of cloth, a remnant, a tatter, పీలిక.

**పేలు** (plu. of పేను.) *n.* : Lice.

**పేలు** or **ప్రేలు** *v.n.* : To swell out through heat, సెగచేత ఉబుకు. To break out in prickly heat, or any eruption. To be fried, to be parched. To gabble, brag, chatter, to talk nonsense.

**పేళ్లు** *n.* : The plural of పేరు a name, and of పేడు a chip.

**పేపు** : Same as పేగు.

**పేశలము** *adj.* : Dexterous, clever, నేర్పు గల, చతురము. delicate, soft,

smooth. Agreeable, రుచికరము, మృదువైన.

**పేశి** *n.* : An egg, a foetus, అండము. A lump of flesh, మాంసపు ముద్ద.

**పేషిగీ** *n.* : An advance of pay.

**పేష్కషు** *n.* : Rent paid to the government by the proprietor of a permanently settled estate under Regulation, xxv. of 1802. Tribute paid by a Zemindar, కప్పము.

**పేష్కారు** *n.* : A revenue officer next to an Amaldar.

**పేసము** *n.* : Juice, sap. తాటి or **మామిడి పేసము** the yellow juice of the ripe palm or mango fruit. This is spread out and dried, then preserved in cakes called తాటితాండ్ర, మామిడితాండ్ర.

**పై** or **పయి** *n.* : the upper part of any thing. **పైచుంగుడి** petty sums that remain over. **పైవిరోధము** Seeming enmity. **పైపనులు** the further acts; also, out-door work. **పైపడు** or **పైబడు** *v.n.* : To fall upon, attack, పైకొను, కవియు. To exceed మీరు. **పైపాటు** *n.* : An attack or encounter, కవియుట.

**పైంటు** or **పయింటు** *n.* : An appointment. పైంటుచేయు to appoint.

**పైకము** *n.* : A flock of cuckoos, పికముల సమూహము.

**పైకము** or **పయికము** *n.* : A small copper coin. డబ్బులో నాలుగవ వంతు, దమ్మిడి.

**పైకీలిచేప** *n.* : A fish of the perch kind, ten inches long and with a forked tail, the body striped with yellow and brown fillets and the second analspine very large.

**పైజారు** or **పయిజారు** *n.* : A shoe, slipper. ముచ్చె, జాతి, జోళ్ల, చెప్పులు. **పైజారుమట్ట** *n.* : The Remora or sucking fish.

**పైట, పంబట** or **పయట** [from పయ్యెద. (పయి+ఎద)] *n.* : A woman's mantle, formed by throwing the train or end of the cloth over her breast and head.

**పైఠ** : Same as పైట.

**పైడి** or **పయిడి** *n.* : Gold, బంగారు. Money, ధనము. A dowry, ఉంకువ. adj. Golden, gold coloured, bright yellow. **పైడికంటి** or **పయిడికంటి** *adj.* : Golden eyed, బంగారువన్నె కన్నులు గల. *n.* : The spotted owlet. **పయిడిపత్తి** *n.* : A kind of fine golden colored cotton. **పైడిరాయడు** or **పైడిదొర** *n.* : The lord of wealth, i.e., Kubera.

**పైతృకము** or **పైత్రము** *adj.* : Ancestral, derived from or relating to ancestors.

**పైత్యము** or **పైత్తము** *n.* : Bile, biliousness, melancholy, madness, delirium, imbecility.

**పైద** or **పయిద** *n.* : A child, a boy, పిల్లకాయ.

**పైదలి** or **పయిదలి** (from పయ్యెద; lit: పయ్యెద గలది.) *n.* : A woman. స్త్రీ.

**పైనము** or **పయనము** *n.* : A journey.

**పైమాయిషీ** *n.* : the survey or measurement of lands. నేలలు కొలవడము.

**పైర** or **పయిర** : Same as పయర.

**పైరము** or **పయిరము** *n.* : A milch cow. పాడిపైరములు, పాడిపశువులు.

**పైరు** or **పయిరు** *n.* : Growing corn, a crop. వరి మొదలయిన సస్యము. **పైరులయెకి మీడు** *n.* : The moon. పయిరుపెట్టు to plant or sow corn. పయిరు చేయు to cultivate.

**పైలుమాను** *n.* : A boxer or wrestler. జెట్టివాడు.

**పైశాచికము** (from పిశాచము.) *adj.* : Pertaining to the demons or fiends. *n.* : A form of marriage in which the bride is carried away by force. **పైశున్యము** *n.* : Information, espionage, roguery, కొండెము, కొండెకానితనము.

**పైష్టికము** *n.* : A cake of flour. A kind of beer made from a fermented paste. పిష్టము, అనేక ధాన్యసార కృతమద్యము.

**పైసరము** or **పయిసరము** *n.* : Sexual intercourse.

**పైసలు** or **పైసలా** *n.* : A settlement, decision, decree. తీర్పు, పరిష్కారము.

**పొంకణము** or **పొంకనము** *n.* : A purse, a pouch.

**పొంకము** *n.* : Proportion, fitness, suitableness, neatness, grace, beauty, trimness, పొందిక, సొగసు మాటల పొంకము elegance of speech.

**పొంగలి** or **పొంగళి** *n.* : Rice boiled with milk. పొంగలిపండుగ a Hindu festival at which this dish is used, the Pongal feast, సంక్రాంతి, సంక్రమణము, సంక్రమాణము.

**పొంగిలి** *n.* : A flock of birds. పశువుల సమూహము. Food, ఆహారము.

**పొంగు** *v.n.* : To effervesce; to boil or bubble up, overflow, boil over. To swell. To forment. To exult, to be overjoyed, clated, to be in ecastasy, సంతోషించు. **పొంగు** *n.* : Effervescence, boiling or bubbling up, overflowing. Excess of joy. సంతోషము. Pride, గర్వము.

**పొంచు** *v.n.* : To lie in wait : to crouch or lurk. పొంతురు they will lie in wait. **పొంచు** or **పొంచిక** *n.* : Lurking, eavesdropping, lying in ambush. పొంచుండే దొంగ an eavesdropper.

**పొంజు** or **పోజు** *v.a.* : To split (grass) into filaments. చీల్చు.

**పొంటె** or **పొంటేని** *adv.* : By reason of, on account of, for, కొరకు, నిపత్తింబు. జగత్త్రయిహితముపొంటె, అనగా లోకత్రయమునకు ఉపకారార్థముగాను

**పొండు** *v.* : imperative plu. Begone ! Go ye.

**పొంత** *n.* : Neighbourhood, closeness, nearness. సమీపము. A way, path, దారి. A bank, తీరము, దరి.

**పొంతనము** *n.* : A happy conjunction of stars, గ్రహమైత్రి, కూటము.

**పొందు** or **ఒందు** *v.n.* : To wink, (కన్ను) వాలు. *v.a.* : To gain, obtain, get, acquire. To reach, attain to. To have, enjoy. To suffer, experience, meet with joy, grief or death, & c. ప్రాపించు. **పొందిక** *n.* : Fitness, agreement, aptness. ఇమిడిక. Intercourse, సహవాసము, కలయిక.

**పొంపిరి** *n.* : Thickness, సాంద్రత *adj.* : Thick, సాంద్రము, **పొంపిరిగా** *adv.* : Thickly.

**పొంపు** *n.* : The nape or back of the neck. మెడ వెనుకటి భాగము, మెడపొంపు. Grace, beauty, ఒప్పు. **పొంపెసలారు** v.n. To be fine or beautiful. ఒప్పగు.

**పొంబనటులు** *n.* : Golden plantain trees, (a phrase in poems.)

**పొకారు** or **పోకారు** *v.n.* : To be ruined, నాశమగు.

**పొకాలు, పొకాలిపోవు, పోకాలు** or **పోకాలిపోవు** *v.n.* : To go off, to be freed, వెడలు, పోవు. to perish, to be ruined. నాశమైపోవు.

**పొక్కలి** *n.* : One of the three legs or projecting lumps supporting the boiler on an earthen fireplace, పొయ్యిమీది ఎత్తుగడ్డలు, మూడురాళ్లు పెట్టినపొయ్యి.

**పొక్కి** *n.* : A mark or sign, గురుతు. Danger, అపాయము.

**పొక్కిలి** *n.* : The navel. బొడ్డు. a dent, గుంట. పొక్కిలిదూలి, పొక్కిలిపాప or పొక్కిలిపాపడు lit : the navelborn, i.e., Brahma, బ్రహ్మదేవుడు.

**పొక్కు** *v.n.* : to be blistered or excoriated. బొబ్బలేచు. పొక్కిన scalded. నానోరు పొక్కినది my mouth is burnt or sore. To be afraid. ఉలుకు, భయపడు. To grieve much or be afflicted. దుఃఖించు.

**పొగ** or **పొవ** *n.* : Smoke, steam, vapour. ధూమము.

**పొగడ** or **పొవడ** *n.* : వకుళవృక్షము.

**పొగడు** or **పొవడు** *v.a.* : To praise, laud, applaud. To compliment. flatter. **పొగడిక, పొగడు** or **పొగడికోలు** *n.* : Praise. స్తోత్రము. the act of praising. స్తుతించుట. **పొగడిత** or **పొగడ్త.**

**పొగరు** *n.* : Pride, presumption, arrogance, insolence, గర్వము. Length, ధైర్యము. A shade or color. A strong stifling smell, తీక్ష్ణగంధము. **పొగరుబోతు** *n.* : A proud or arrogant man, గర్వశీలుడు.

**పొగులు** or **పొవులు** *v.n.* : To grieve, to pine with grief, to languish. దుఃఖము చేత తపించు. To burn.

రగులు. కుములు. **పొగిలించు** *v.a.* : To afflict, to grieve.

**పొచ్చెము** *n.* : Deceit : a trick, feint. A spot. A fault, defect, న్యూనత, కపటము, వంచన, కల్మషము. **పొచ్చెపు** *adj.* : Deceitful. కపటమైన, పంచనైన.

**పొట** *n.* : A hollow, a cup. దొప్ప. ఆకుపొట a leaf-cup.

**పొటకర** or **పొటకర్ర** : Same as పొట్టకర్ర. See under పొట్ట.

**పొటకరించు** *v.n.* : To shoot out a new, as lopped trees. పైకుబ్బు. to excel, అతిశయించు. వర్ధిల్లు.

**పొటపొట** or **బొటబొట** (of tears flowing) *adj.* : Fast, gushingly, welling.

**పొటమరించు, పొటమరిల్లు** or **పొటమరిలు** *v.n.* : To rise or swell up, as a young shoot or a boil, బొబ్బ, చిగురులోనగునవి పుట్టు.

**పొటము** or **పొడము** *v.n.* : To be born, to rise. పుట్టు.

**పొటి** : Another form of పొట్టి. **పొట్టిపొట్టి** *adj.* : Trifling, petty. అల్పము.

**పొటుకు** or **పొటుక్కు** (anuk) *adv.* : Suddenly said of sunset or sunrise, or of leaves falling from a tree.

**పొటేలు, పొట్టెలు** or **పొట్టేలు** *n.* : A ram. గొర్రెపోతు, మేకపోతు, మేషము.

**పొట్ట** *n.* : the belly, pauch, కడుపు. **పొట్టకర్ర, పొట్టకర, పొటకర్ర** or **పొటకర** *n.* : An unopened ear of corn. **పొట్టపట్టెడ** *n.* : A saddle grith, టంగువారు, టంగు. **పొట్టకూడు** *n.* : Food given in lieu of wages.

**పొట్టి** or **పొటి** *adj.* : short small in size. పొట్టింపు చీరణము. a kind of short chisel.

**పొట్టియ** *n.* : A scorpion, తేలు.

**పొట్టు** *n.* : Husk, bran. ఉముక. The scales of fish. పొట్టు ధాన్యము grain that has a coat or husk, as వడ్లు, అరిగలు, కొర్రలు, చామలు వరిగెలు, & c. పొట్టుకర్ర an empty sprout in a ear of corn.

**పొట్టెలు** : See పొటేలు.

**పొట్రేను** (పొట్టి + రేను.) *n.* : A kind of tree.

**పొట్ల** (lit : that which has spots. పొడలుకలది.

**పొట్లము** *n.* : A packet, pack, bundle, little bag, paper or case to hold perfume, powder or medicine : medicine tied up in a cloth for the purpose of formentation.

**పొట్లు** *v.n.* : పాచిపట్టు, బూజుపట్టు.

**పొడ** *n.* : Appearance, in figure, shape. గ్రూపు, చూపు. A mod, speck, mark, a scruff or cruption on the skin. Variegated colour. పొడలపురుగు a spotted worm or serpent. **పొడకట్టు** *v.n.* To make an appearance, to seem, appear, be visible, కనబడు, ప్రత్యక్షమగు, తోచు.

**పొడము** or **పొడ్ము** *v.n.* : To be produced, to arise. పుట్టు, కలుగు. **పొడమించు** *v.a.* : To create, engender. పుట్టించు.

**పొడి** *n.* : Powder, dust. చూర్ణము. Solder, rosin, metallic cement. **పొడిబియ్యము** dry rice. పొడిపడ్డ వాతెరలు lips parched with grief. పొడిదగ్గు a dry cough. **పొడిచీకటి** *n.* : Twilight, darkness.

**పొడుగు, పొడువు, పొడగు** or **పొడవు** *n.* : Height, length, stature, ఎత్తు. **వెలపొడుగు చీర** an expensive.

**పొడుచు** *n.* : To rise (as the sun or moon, a star, or the tide.) ప్రొద్దు పొడుచు, ఉదయించు. **పొడుచువాడు** A wicked man, దుర్జనుడు.

**పొడుము** *n.* : Powder, snuff, **పొడుముకాయ** or పొడుమకాయ *n.* : A snuff box.

**పొణక** *n.* : A large grain basket. ఈతపేము మొదలైనవాటితో కట్టి ధాన్యాదులు పోసే పెద్దబుట్ట.

**పొణకుకఱ్ఱ** or **పొణికికఱ్ఱ** *n.* : A light kind of wood like deal or fit.

**పొతక** *n.* : A bundle of leaves. ఆకులు మొదలైన వాని కట్ట, పొత్తర. పొతకగ in a bundle, in a crowd, గుంపుగా పొట్లముగా.

**పొతము** : Same as పొట్లము A crowd, గుంపు.

**పొతుకు** *n.* : A line drawn round a stack of corn. ధాన్యపురాశి చుట్టు గీసెడు గిరి.

**పొత్తము** *n.* : A book, పుస్తకము, గ్రంథము. A poem, కావ్యము.

**పొత్తర** *n.* : A pack or bundle or leaves. ఆకులలోనగువానికట్ట.

**పొత్తరము** or **పొత్రము** *n.* : A roller or pestle for grinding spies, & c. శిలాపుత్రిక, గుండ్రాయి, పొత్తరముల్లు.

**పొత్తి** *n.* : A thin soft, old cloth, మెత్తని సన్నని పాత వస్త్రము. An integument, coat; skin, bark, నార, పట్ట. కొబ్బరి గల మొదలైన వాటిని పొదిగియుండేది.

**పొత్తు** *n.* : Friendship, partnership, holding in common. స్నేహము, సహవాసము, విశ్వాసము, ఉమ్మడి, అవిభక్తిత.

**పొత్తెము** or **పొత్తెపుమట్టి** *n.* : a red earth, sand or dust with which boxers cover the floor of their gymnausium, so as not to be hurt, గరిడీసాలయందు క్రిందపరిచే యెఱ్ఱమన్ను.

**పొత్రము** or **పొత్తరము** *n.* : A roller or pestle used in grinding.

**పొద** *n.* : A bush, a shrub, గుల్మిని.

**పొదక** *n.* : A loud cry పెద్ద ఎలుగు, **పొదకలెత్తు** *v.n.* : To raise the voice or shout. పెద్దగొంతు పెట్టు.

**పొదడు** *n.* : A short man, a dwarf. పొట్టివాడు, వామనుడు, **పొదిటి** *adj.* : Short పొట్టి.

**పొదము** *n.* : imperative. Let us go.

**పొదలు** *v.n.* : To increase, to flourish or thrive, be generated, be produced.

అభివృద్ధియగు, పెరుగు, ఉద్భవించు, చెలగు, విజృంభించు, ప్రకాశించు. **పొదలించు** *v.a.* : To undertake. పూనుకొను. **పొదలిక** *n.* : Increase, growth, పెంపు, వర్ధనము.

**పొదచెట్టు** *v.a.* : To hint సూచించు To impute, attribute, ఆరోపించు.

**పొది** *n.* : An udder, పొదుగు. Weight భారము. A quiver, అమ్ములపొది. A multitude, సమూహము. A barber's pouch మంగలవాని అడపము.

**పొదికట్టు** *n.* : The ledge of a pandal. పందిలి. The side of a door : a door still. A pandal or varanda in front of a house, వాకిటి ముందరి పంచపాక.

**పొదిగిలి** *n.* : The side of the entrance or principal door of a house. An armpit, ప్రక్కకు సందిటికి నడిమి భాగము, కౌగిలించిన చంక. పొదిగిట (locative case.) By the door post, In the embrace.

**పొదుంక** or **పొది** *n.* : A parcel or packet. పొది weight. భారము.

**పొదుగు** *n.* : The udder of a cow. పొదుగు కోసి పాలు తాగు to cut of the udder to drink milk. a proverb like that of killing the goose that laid golden egs.

**పొదుగు** or **పొదువు** *v.a.* : To cover; to envelope, to surround, to encircle, కప్పు, ఆవరించు. **పొదివికొను** *v.a.* To surround, to encircle, చుట్టుకొను పరివేష్టించు, **పొదుగు** *n.* : Baby-linen. పొత్తిగుడ్డలు.

**పొదుపు** *n.* : Thrift, moderation, frugality, careful management. Increase, వృద్ధి.

**పొదురు** *v.n.* : To blossom, పూచు, **పొదిరించు** *v.a.* : To cause to blossom, పూచునట్లు చేయు.

**పొద్దు** or **ప్రొద్దు** *n.* : The sun. Time, period. **పొద్దుపొడిచెను** the sun arose. **పొద్దుగూకె** (or క్రుంకెను) the sun has set.

**పొన** *adj.* : Visible, అగుపడుచున్న, దృగ్గోచరమై, పొనపొన or పొనపొనగా adv. indistincly, slowly, gently. చూచాయగా, రవంత రవంత, మెల్లమెల్లగా.

**పొనము** *n.* : Outward show, పైమినుకు.

**పొనరు** or **ఒనరు** *v.n.* : To happen, occur, ఆగు, పొసగు, కలుగు, సంభవించు. *n.* : Happening, కలుగుట. Suitability harmony, agreement, పొందిక.

**పొనలు** *v.n.* : To flame, జ్వలించు.

**పొనిక** or **పొనుగు** *n.* : A kind of grass, ముంజిగడ్డ.

**పొనుగు** *adj.* : short, పొట్టి dull looking, not bright, తేజములేని, పొనుగుపడు, పొనుగుపోవు, పొనువడు or **పొన్పడు** *v.n.* : To become dull in color, to grow cool or calm, చల్లారు, నిస్తేజమగు To come to ruin నశించు.

**పొనుపు** or **పొంపు** *n.* : Courage, heroism, పరాక్రమము.

**పొన్న** *adj.* : Same as పొన.

**పొన్న** *n.* : A tree పున్నాగము. Various species are called నేలపొన్న, కొలపొన్న, ముయ్యాకుపొన్న a sensitive species. కోలాగుపొన్న and సురపొన్న are other species.

**పొన్నంగి** *n.* :The bird called in Hind : Naorangi or nine coloured.

**పొన్నగంటికూర** *n.* : A certain potherb. A medicinal plant, మత్స్యాక్షి.

**పొన్నట్టు** *n.* : A wooden ladle. ఆబక.

**పొన్నాడ** *n.* : A species of leopard ఒకవిధమైన చిరుతపులి.

**పొన్నారి** or **పొన్నరి** *adj.* : Beautiful, మనోజ్ఞము. *n.* : My darling. చిన్నారిపొన్నారి.

**పొన్ను** and Tam. ఫోన్. Kan. మెన్ను *n.* : gold బంగారు. A ring, rim, ferrule on a stick or a pestle. రోకటి పొన్ను an iron rim of ring on each end of a pestle. **పొన్నరిదళము** *n.* : Orpiment. (పొన్ను + అరిదళము.)

**పొప్ప, వప్ప, వెర్రిపొప్ప, వెర్రివప్ప** *n.* : A fool or simpleton.

**పొయి, పొయ్యి** or **ప్రొయ్యి** *n.* : A fireplace, hearth, oven.

**పొర** *n.* : A fold or plait, as of cloth or of fat. మడత A coat, as of an onion. A layer or stratum of soil. A film over the eye. The disease called a Cataract. The skin of a snake, పాము యొక్క కుబుసము.

**పొరపొచ్చెము** *n.* : Fraud, deceit, guile; a trick feint. కపట కల్మషము. **పొరపోవు** *v.a.* : Top err, mistake. To go the wrong way in drinking or eating పొరదానెక్కు, పొరయెక్కు.

**పొరంబోకు** or **పోరంబోకు** *n.* : Waste land unfit for cultivation. సాగుబడికి రాని భూమి.

**పొరక** *n.* : A blade of grass (గడ్డి) పోచ, ఈనెపుడక.

**పొరచి** *n.* : A thing borrowed for use. చేబదులు పుచ్చుకొన్న ధనాదికము, ఎరువు అడిగి తెచ్చుకొన్నది.

**పొరట** *n.* : One side or page of a leaf. పుట.

**పొరటు** *n.* : **పొరంటు** *v.a.* : To fry, grill, toast. పొగచు.

**పొరడు** *n.* : A hump గూని, గూను **పొరడుపోవు** *v.n.* : To become hump-backed. గూనుపడు.

**పొరయు** *v.n.* : To happen, occur. కలుగు. To lie in wait, పొందు. To agree with, కలుగు, సాగతు. To gain. To feel, (anger, love, surprise.) పొందు, *v.a.* : To cause to obtain పొందించు.

**పొరలు, పొర్లు, పొరలాడు, పొర్లాడు, పొరలబడు** or **పొర్లబడు** *v.n.* : To roll over, to roll on the ground; to wallow. To be in excess, to overflow. To continue, ప్రవర్తిల్లు.

**పొరి** *n.* : Same as పొలి. *adj.* : Strong, great. అత్యంతము. *adv.* : Exceedingly, very much. మిక్కిలి, అత్యంతము. firmly, దృఢముగా. Duly, regularly, క్రమముగా, often, మాటి మాటికి, తరచుగా. Again, మళ్లీ. **పొరిపుచ్చు** or **పొరిపుచ్చు** *v.a.* : To kill. చంపు. To confuse, కలచు.

**పొరివిళంగాయలు** *n.* : A sort of cakes.

**పొరుగు, పొరువు, పొర్గు** or **పొర్వు** *n.* : A side, ప్రక్క. The part or side adjoining the next house, ఇరుగునకు ప్రక్క The neighbourhood or vicinity. Nearness, సమీపము. The side opposite to one's house తన ఇంటికి ఎదుటి భాగము. నీ పొరుగునున్న వారు your neighbours.

**పొర్లాడు** or **పొరలాడు** : See under పొరలు.

**పొల** or **పొలను** *n.* : Flesh, meat, మాంసము. The stench of bad meat. మాంసపు దుర్గంధము. A scale of fish. **పొలదిండి** *n.* : A cannibal, a carnivorous creature, a Rakshasa, రాక్షసుడు, క్రవ్యాధుడు.

**పొలకు** *n.* : A kind of grass తృణశ్రేణి. A kind of fruit, కట్వంగఫలము.

**పొలకువ** *n.* : A trace, జాడ. వానియింట్లో కత్తి అనే పొలకువలేదు there were no signs of a knife in his house, there was not such a thing as a knife in his house. పొరిపొలకువలేకుండా చేసినాడు he exterminated them.

**పొలతి** or **పొలతుక** *n.* : A lady, a fair girl. స్త్రీ.

**పొలపము** *n.* : The act of blowing, or spreading as wind, విసరడము, వీవడము, ప్రసరణము, వ్యాపనము. Smell, వాసన. Brightness, ప్రకాశము. adj. Spread, వ్యాపించిన, వ్యాప్తము.

**పొలపొల** *adv.* : Much, very much. **పొలపొలపొక్కు** *v.n.* : To be much efflicted.

**పొలమగు** *v.n.* : To happen, to come into one's possession, దొరకు, కలుగు.

**పొలమారు** or **పొరపారు** *v.n.* : To make a mistake, ప్రమాదపడు. To go the wrong way (in swallowing) వానికి పొలమారినది.

**పొలము** *n.* : A field, corn land. చేను, పైరు పెట్టు నేల. **పొలమరి** *n.* : A cultivator. పొలముకాపు.

**పొలయలుక** *n.* : A lover's quarrel, ప్రణయకలహము.

**పొలయు** *v.n.* : To wander, సంచరించు. To blow, as wind, వీచు, విసరు. To spread over. వ్యాపించు, ప్రసరించు. To approach, సమీపించు. To enrer, ప్రవేశించు.

**పొలస** *n.* : A sea fish like the bream.

**పొలసు** : Same as పొల. పొలసుదిండి Same as పొల.

**పొలి** *n.* : Freshness, bloom. An offering to some village diety, బలి. profit, gain, లాభము, పస, మేలు. **పొలిమేర** *n.* : A boundary or limit, సరిహద్దు.

**పొలికిచెట్టు** *n.* : A certain tree of which some species are called కుమ్మరపొలికి and ఎఱ్ఱపొలికి.

**పొలియు** *v.n.* : To be spoiled or ruined, చెడు. To die. చచ్చు. **పొలియిక** *n.* ruin, నాశము. death, మరణము.

**పొలుచు** or **పొల్చు** *v.n.* : To appear, seem. అగుపడు. To become visible, ప్రత్యక్షమగు. To be aggreable, ఒప్పు. To become firm, స్థిరమగు. Also, another form of పొడుచు.

**పొలునోరు** (for పొల్లునోరు) *n.* : A wry mouth, వంకరనోరు.

**పొలుపు** or **పొల్పు** *n.* : Beauty, elegance, gracefulness, agreeableness. సొంపు. Manner, mode, వైఖరి, రీతి. Firmness, స్థైర్యము.

**పొలువ** : Same as పలువ.

**పొలుపడు** or **పొల్లపడు** *v.n.* : To decrease. తరుగు, తగ్గు, క్షయించు.

**పొలుసు** or **పొలసు** *n.* : A scale of a fish. మత్స్యము మీద నుండే పొలుసు.

**పొల్తి** or **పొల్తుక** : Same as పాలతి or పొలతుక.

**పొల్ల** or **పొల్లకట్టు** *n.* : Pithless or blasted grain. గింజపట్టని ధాన్యము. బూగరపొల్లు, నిస్సారమైన ధాన్యము.

**పొల్లపుచ్చు** *v.a.* : To cause to decrease, తగ్గించు, క్షీణింపజేయు.

**పొల్లాయి** *n.* : Certain fees paid on every thrashing floor.

**పొల్లు** *n.* : Pithless grain in an ear. బొత్తిగా గింజలు పట్టని వడ్ల సమూహము. Trash, worthless stuff. తాలు, పనికిరానిది, The consonant sound of a letter, etc., A useless word, a slip of the tongue. A lie, a falsehood. అనృతము.

**పొల్లు** : Same as పొరలు.

**పొవ** : Same as పొగ.

**పొవయు** or **పొగయు** *v.a.* : To smoke or emit smoke. To grieve, mourn, or be dejected.

**పొసగు** *v.n.* : To agree, fit, suit, be consistent with. to happen, take place, occur, befal. ఒనగూడు, ఒప్పు, పొందుపడు, చక్కబడు, ఇముడు, సరిపడు, అనుకూలించు.

**పొసపొస** *adv.* : Rapidly, one after another, త్వరగా.

**పొసరాకు** *n.* : A pungent strong smelling leaf used in checking a cough.

**పోక, పోవక** (neg. p. of పోవు.) : Without going. Also for పోకు, i.e., పోవద్దు don't go. (the final a being intensive.) **పోకడ** *n.* : Going, departure, going off. గమనము, గతి Behaviour, conduct. నడత, ప్రవర్తనము. **పోకాలు** *v.n.* : To go,

as anger, sorrow, & c. పోవు. **పోకిరి** *n.* : A wicked man, a villain. rogue.

**పోక** *n.* : The areca or betel-nut palm, **పోకబంతిపువ్వు** *n.* : The flower called Bachelor's button. **పోకముడి** *n.* : the knot that secures a woman's petticoat at the girdle.

**పోకు** *n.* : Conduct, behaviour, నడవడి Loss, నష్టి Bedewed grass, మంచుకప్పిన గడ్డి.

**పోగండుడు** *n.* : A deformed man. అంగహీనుడు.

**పోగర** *n.* : A graver, or small chisel used by goldsmiths, శలాక, కంసలవాని పనిముట్టు. పోగరపని carved work. **గుండుపోగర** a rod for making rings. **దుబ్బోగర** a tapping chisel.

**పోగు** *n.* : A thread, a string. తంతువు, దారము. A heap, a crowd, an assembly. పోగు కుప్ప, సమూహము.

**పోగొట్టు** *v.a.* : To lose. To do away with, to remove.

**పోచాయించు** *v.a.* : To cause to arrive, to cause to convey or conduct. అందజేయు.

**పోచి** or **పోచీ** *n.* : The place near the wrist, the wrist, మునికట్టు మీ చోటు, మనికట్టు. పోచీలు a sort of bracelets worn at the wrists by women.

**పోచికోలు** *n.* : worthlessness, uselessness. పోచికోలుగానిచ్చు to give away as useless.

**పోచిళ్లు** *n.* : A superstitious rite (ఉపశ్రుతి) regarding omens : a few grains of rice (అక్షతలు) put in water are flung on the roof of a neighbour's house : he who so casts them sits in a corner and listens for any words he can overhear in the family : the words are put together and a meaning is elicited.

**పోచ** *n.* : A blade of grass, గడ్డి పరక. A bit. లేశము, దారపోగు. a bit of hemp. నూలిపోచ a bit of thread. గడ్డిపోచ a bit of grass. వాముపోచ a grain of mustard. జందెపు పోచ a sacred thread.

**పోచావణీ** or **పోంచావణీ** *n.* : Insurance on goods.

**పోజు** or **ప్రోజు** *v.a.* : To clean or prepare cotton with the hands for spinning.

**పోట** or **పోటన** *adj.* : Large. పెద్ద. *n.* : A woman that has mostaches. మీసము గల ఆడుది. A servant woman, దాసి. **పోటకత్తి** *n.* : A bill-hook, a wood cutter's knife, అడవినరికే కత్తి. **పోటకందులు** white dhall. **పోటనబంతి** *n.* : A large ball. పుట్టచెండు. **పోటముంజి** *n.* : A large modesty piece. పుట్టగోచి.

**పోటకము** *n.* : Small-pox, మశూచికము. **పోటగళము** *n.* : A fish, చేప. A kind of grass, కిక్కిసకసపు. A reed, రెల్లు.

**పోటి** *adj.* : Similar, like, resembling, ఈడైన, మారు. **పోటి** or **పోటీ** *n.* :

Emulation, competition, rivarly. స్పర్ధ. A prop. ఆసరా. **పోటీగాడు** *n.* : One who has a prop or support. పోటిగలవాడు.

**పోటు** *n.* : A thrust, a stab, a blow. పొడుపు, కత్తిపోటు. A throb of pain. పొడుపు, నొప్పి. **పోటరితనము** *n.* : Heroism.

**పోడి** or **పోణి** *n.* : Beauty, grace, ఒప్పు. *adj.* : Beautiful, ఒప్పిదమైన, **పోడిగా** *adv.* : Well, properly, duly, ఒప్పుగా. **పోడిమి** or **పోణిమి** *n.* : A sign or mark, లక్షణము. Brightness, splendour పస, వన్నె. Proportion, fitness, neatness, సొంపు, Economy, management, prudence.

**పోడు** *n.* : A down, a piece of scrub, jungle covered with bushes, land cleared from jungle for the purpose of cultivation as కొండపోళ్లు. పోడుకొట్టు to clear away brushwood, to remove underwood, చేనికొరకు చెట్లునరకివేయు. **చిరివేరు పోళ్లు** Chayroot grounds, చాయవేళ్లు పైరగుభూమి.

**పోత** (from పోయు) *n.* : Pouring, పోయుట. Casting, as of melted metal. Bathing, washing. Eruption of the Smallpox.

**పోతము** *n.* : A vessel, boat, ship. ఓడ. The young of any animal, పిల్ల. శిశువు. An elephant ten years old, పదేండ్ల ఏనుగు.

**పోతరము** *n.* : Fatness, pride, hauteur, గర్వము, మదము, కండకావరము, కొవ్వు. **పోతరించు** *v.n.* : To become fat, to fatten, to pick up flesh. To become proud or conceited, కొవ్వు, మదించు.

**పోతు** *n.* : The male of certain birds, animals and plants పశుపక్షులలో మగది. ఆబోతు an ox. వృషభము. ఎనుబోతు a male buffalo. మేకపోతు a he-goat, a ram. **నక్కపోతు** a male fox. **పోతురాజు** or **పోతరాజు** *n.* : The name of a rustic god, like Pan, worshipped throughout the Telugu.

**పోత్రము** *n.* : The shout of a hog, పందిముట్టె. **పోత్రి** *n.* : A pig, పంది, వరాహము.

**పోని** *adj.* : Resembling, similar, like. వంటి, పోలిన. మన్మథుంబోనివాడు one as handsome as Manmadha.

**పోపు** *n.* : Grass. గడ్డి, కనపు.

**పోయు** *v.n.* : to arise, to be born or produced, పుట్టు. **పోయించు** *v.a.* : To cause to cast or pour; to erect. గట్టుపోయించు to raise a bank. విగ్రహములు పోయించిరి they had some statues cast.

**పోరంబోక** or **పోరంబోకు** : See పోరంబోకు.

**పోరిచి** : Contempt, disregard, అలక్ష్యము. intention, design, use, advantage, gain, ప్రయోజనము.

**పోరడు** or **పోరిగాడు** *n.* : A youthful person, a youth, పడుచువాడు. a boy, బాలుడు. **పోరి***n.* : A girl, బాలిక.

**పోరు** *v.n.* : To fight, contend, struggle. కలహించు, యుద్ధము చేయు. పోరి సాధించె he mastered it with difficulty. **పోరాట** or **పోరాటము** *n.* : A combat, a fight, a dispute, కలహము, యుద్ధము.

**పోరువ** *n.* : A cloth, sheet సెల్లా. A layer పొర.

**పోర్కాడించు** or **పోరకాడించు** *v.a.* : To bathe an infant. నీళ్లుపోయు.

**పోలక, పోలంక, పోల్క, పోలుక, పోలుగ** or **పోలువ** *n.* : A Sand Grouse, జాంపోల్క or జాముపోలంక, పెద్దపోలక, సందపోలక or చిన్నపోలక are species.

**పోలక** or **పోలకమ్మ** [(పోలు a town + అక (అక్క)] *n.* : A certain village goddess. ఒక గ్రామదేవత.

**పోలడు, పోలిగాడు** or **దూడలపోలడు** *n.* : An eagle. పసులపోలిగాడు the bird called the Black Drongo.

**పోలానిగంటలు** *n.* : bells tied to the neck of an elephant.

**పోలీసు** *adj.* : Belonging to the Police. పోలీసువాడు or పోలీసుజమాను.

**పోలు** *v.n.* : to be fit or agreeable. ఒప్పు, తగియుండు. To be proper, యుక్తముగు. To be possible, శక్యముగు.

**పోలుకర్ర** *n.* : A shaft of a carriage.

**పోలుగ** : See పోలక.

**పోలేరు** or **పోలేరమ్మ** (పోలు + ఏరు.) *n.* : A village goddess.

**పోళీ** *n.* : A cake made of wheat, pulse and treacle. బొబ్బట్లు.

**పోళ్లు** *plu.* : of పోడు.

**పోవు** *v.n.* : To go, proceed. To pass, cease, disappear. To be lost, to die. **పోదోయు** *v.a.* : To baffle, to push back, to thrust away. **పోని** (neg. part. of పోవు) who or which goes not.

**పోషించు** *v.a.* : To nourish, cherish, maintain, support, patronize. **పోషకుడు** *n.* : A patron, protector. ఉదరపోషకులు those who make a god of their belly. **పోషణము** *n.* : Nourishing, cherishing.

**పోసనము** *n.* : Milk. పాలు. A coating, painting, పైపూత. brightness, brilliance, కాంతి.

**పోసరము** : Another form of పోతరము.

**పోసరించు** *v.n.* : Another form of పోతరించు.

**పోసరెక్క** *n.* : A kind of fish. మత్స్యభేదము.

**పోసూడు** : Same as పాపోసు.

**పోస్టు** *adj.* : Belonging to the postal department. పోస్టాఫీసు, పోస్టు జమాను.

**పోస్తకాయ** or **పోస్తుకాయ** *n.* : A capsule of the poppy used medicinally. నల్లమందు కాయ.

**పోహణ** *n.* : Joining, uniting, కూర్పు. Skill, నేర్పు. A fact or occurrence, సందర్భము, వ్యవహారము, పని.

**పౌండ్రదేశము** *n.* : The ancient name of a country including the greater part of Bengal. పౌండ్రుడు a native of the పౌండ్ర country.

**పౌగండుడు** *n.* : A boy, a youth. బాలుడు. **పౌగండ** *adj.* : Appertaining to youth

**పౌజు** or **పవుజు** *n.* : An army, troops, దండు. A series, row. బారు.

**పౌత్రుడు** పుత్ర *n.* : A son's son. కొడుకు కొడుకు, మనుమడు. **పౌత్రి** *n.* : A grand-daughter. పుత్ర పౌత్ర ప్రపౌత్రాది through all generations.

**పౌనఃపున్యము** *n.* : Frequency, repetition. మరలమరల చెప్పుట. **పౌనఃపునిక** *adj.* : Repeated.

**పౌరము** *adj.* : Belonging to a city or town. (పురము) పౌరపతులు the ladies of the place : citizens' wives. **పౌరుడు** *n.* : A citizen. పౌరులు citizens, townsfolk.

**పౌరాణము** *adj.* : Relating to the Puranas. **పౌరాణికము** *adj.* : Mythological; old, as a story. **పౌరాణికుడు** *n.* : One who knows the Puranas, పురాణము తెలిసిన వాడు. A public reader of a Purana. A bard, ministrel.

**పౌరుషము** *n.* : Manliness. పురుష భావము. Courage, పరాక్రమము. A resolution, effort, attempt. పురుష ప్రయత్నము. A vow, ప్రతిజ్ఞ.

**పౌరోగవుడు** *n.* : An overseer of the kitchen. పాకగృహాధ్యక్షుడు, వంటయింటి అధికారి.

**పౌరోహిత్యము** *n.* : The office of priesthood. పురోహిత కృత్యము.

**పౌర్ణమాసి** or **పౌర్ణిమ** *n.* : the lunar day on which the moon is full. పున్నమ. పౌర్ణమి a corruption of పౌర్ణిమ.

**పౌలస్త్యుడు** *n.* : An epithet of Kubera the god of riches. Also, of Ravana. **పౌలస్త్యదిక్కు** *n.* : The north, as being the quarter of Kubera.

**పౌలు** or **పవులు** : Same as పగులు to break.

**పౌలోమి** (from పులోమ.) *n.* : the name of the wife of Indra, శచీదేవి.

**పౌషము** *n.* : The month called పుష్యమాసము.

**ప్యాదా** *n.* : A footman or peon, బంట్రోతు.

**ప్ర** *prefix.* : signifying Very, much, excessively.

**ప్రంగ** or **ప్రగ్గ** : Same as పంగ.

**ప్రకటము** *adj.* : Public, notorious. ప్రసిద్ధము, వెల్లడి, స్ఫుటమైన. "ప్రకట బలాఢ్యులు" ప్రకటన or **ప్రకటనము** *n.* : Publication, notification, announcement.

**ప్రకరణము** *n.* : An introduction, prologue or prelude. A chapter or section in a book.

**ప్రకరము** *n.* : A heap; a quantity; a multitude. సమూహము.

**ప్రకర్షము** *n.* : Good, excellence, మేలు, అతిశయము.

**ప్రకల్పితము** *adj.* : Contrived, made, fabricated, ఉత్పాదితము.

**ప్రకాండము** *n.* : The stem or trunk of a tree, the part between the root and the branches. adj. Excellent, ప్రశస్తము. గోప్రకాండము an excellent cow.

**ప్రకామము** *adv.* : Voluntarily, willingly. యథేప్సితము, ఇచ్చవచ్చినట్లు.

**ప్రకారము** *n.* : Way, manner, mode, similitude, likeness, పోలిక, సాదృశ్యము, రీతి, విధము. ప్రకారము or **ప్రకారముగా** *adv.* : According to, accordingly, as, in the same way as, ఆ ప్రకారము చేసినాడు he did accordingly, యథా ప్రకారము as usual.

**ప్రకాశము** *n.* : Sunshine, ఎండ Light, splendour, lustre, వెలుగు.

**ప్రకీర్ణము** *adj.* : Spread abroad, published, promulgated; expanded, opened, scattered, dispersed.

**ప్రకృతము** *adj.* : Present. ప్రకృతకార్యము the present business. *n.* : The present time. *adv.* : At present, just now, pro tempore.

**ప్రకృతి** *n.* : Nature, the goddess of nature. The world, the universe, the original or natural condition of a thing. **జడప్రకృతి** a dull state, stupefaction.

**ప్రకోపము** *n.* : The height or crisis of any affair. మర్మము. జ్వరప్రకోపములో in the height or crisis of the fever. **ప్రకోపించు** *v.n.* : to be at its crisis. జ్వరము ప్రకోపించినప్పుడు when the fever was at its height.

**ప్రకోష్ఠము** *n.* : The fore-arm. మోచేతి కిందినుంచి మణికట్టుదాక నుండు చెయ్యి, ముంజేయి. A part of the frame of a door. A court yard in a house, an open space surrounded by buildings, తొట్టికట్టు.

**ప్రక్క** : Same as పక్క.

**ప్రక్కి, ప్రక్కె** or **ప్రక్కె** *n.* : A tree so called Tanarix gallica. వేతసము, పిచులము.

**ప్రక్రమము** *n.* : Order, క్రమము. Time, అవసరము. Proceeding, going, beginning. కార్యప్రథ మారంభము.

**ప్రక్రియ** *n.* : Power, అధికారము. A chapter, ప్రకరణము. Word building, శబ్దరూపము కలిగిన విధము.

**ప్రక్వణము** or **ప్రక్వాణము** *n.* : The note of a lute. వీణాధ్వని.

**ప్రక్షాళనము** *n.* : The act of washing well, చక్కగా కడుగుట. **ప్రక్షాళితము** *adj.* : Well washed, చక్కగా కడుగబడిన.

**ప్రక్షిప్తము** *adj.* : Well thrown, cast or rejected, చక్కగా విసిరివేయబడిన, నిరస్తమైన. Well united, చేర్పబడ్డది. ప్రక్షిప్త శ్లోకము a spurious verse.

**ప్రఖ్యాతము** *adj.* : Much celebrated, very famous renowned, మిక్కిలి ప్రసిద్ధమైన. **ప్రఖ్యాతి** *n.* : Celebrity, fame, renown, మిక్కిలి ప్రసిద్ధి.

**ప్రగండము** *n.* : The upper arm. మోచేతికి మీది భాగము, దండచెయ్యి.

**ప్రగల్భ** *n.* : A bold woman. ప్రౌఢనాయిక. **ప్రగల్భత** *n.* : Energy, confidence, audacity, insolence, ప్రౌఢత్వము, దౌష్ట్యము, ప్రగల్భములు పలుకుట.

**ప్రగాఢము** *adj.* : Much, excessive, అధికమైన. Hard, దృఢమైన.

**ప్రగ్గము** : Same as పగ్గము.

**ప్రగ్రహము** *n.* : A rein, rope, కళ్లెమును దూర్చి రౌతుపట్టే లగాము, పగ్గము. Confinement, చెర. A prisoner. a captive, కైదుచేయబడ్డది.

**ప్రగ్రీవము** *n.* : A window, a lattice, a balcony in a fort wall. ప్రసాదమందలి కిటికీ. A bolster, అర్ధచంద్రాకారమైన తలగడ.

**ప్రఘణము** or **ప్రఘాణము** *n.* : A covered terrace, or a small portico before the door of a house. తలవాకిటి అరుగుమీద వసారా, చోపా, లేక చిన్న గది.

**ప్రచండము** *adj.* : Fierce, vehement, wrathful, fervid, exasperated, offended. సహింపశక్యముకాని, చేరరాని, వాడిమిగల, సాధ్యముకాని. **ప్రచండుడు** *n.* : A fierce, vehement, terrible man, ప్రతాపశాలి. వాడు తర్కములో ప్రచండుడు he is mighty in logic.

**ప్రచయము** *n.* : A multitude, assemblage. సమూహము. A long drawn note in music. అనుదాత్త స్వరవిశేషము.

**ప్రచారణము** *n.* : putting in practice causing one to act. ఆచరింప జేయుట.

**ప్రచారము** *n.* : Going, proceeding, సంచారము. Custom, usage, ఆచారము. appearance, minifestation.

**ప్రచురము** *adj.* : Excessive, much, many. అధికము, మిక్కుటము, Public, notorious.

**ప్రచేతనుడు** or **ప్రచేతుడు** *n.* : The god of the ea, i.e., Varuna, వరుణుడు.

**ప్రచోదితము** *adj.* : Prescribed, directed, sent. ప్రేరేపింపబడ్డ.

**ప్రచ్ఛన్నము** *adj.* : Covered, private, secret, concealed, disguised, కప్పబడిన, గూఢమైన, మరుగైన. *n.* : A private door within a house; a loop hole. దొడ్డిదోవ, అంతర్ద్వారము, ఇంటిలోపల ఉండే ద్వారము.

**ప్రచ్ఛాదనము** *n.* : An upper or outer garment. ఉత్తరీయము, పైబట్ట. A covering, concealing, మూత. **ప్రచ్ఛాదితము** *adj.* : Covered, clothed, concealed, మూయబడ్డ, కప్పబడిన.

**ప్రచ్యూతము** *adj.* : Fallen, slipped. జారిన.

**ప్రజ** *n.* : Progeny, offspring, posterity, సంతతి, People, folk, the community, subjects, జనము. *Plu* : ప్రజలు. people, men. **ప్రజాపతి** *n.* : The lord of men; a name of the Creator, బ్రహ్మ.

**ప్రజనము** *n.* : Impregnation : pregnancy of cattle, తొలిచూలు, చూలు. Birth, production, పుట్టుక.

**ప్రజ్ఞ** *n.* : Intelligence, understanding, good sense, cleverness. **ప్రజ్ఞానము** *n.* : Knowledge, wisdom. తెలివి, బుద్ధి.

**ప్రజ్వలించు** *v.n.* : To burn or be inflamed. మండు. To shine or glitter. ప్రకాశించు. **ప్రజ్వలనము** *n.* : Burning, flaming, మండుట.

**ప్రడీనము** *n.* : The first flight of a bird; flying rapidly. పక్షిగతి భేదము, పక్షియొక్క మొదటి యెగురు.

**ప్రణతి** *n.* : A bow, salutation, reverence, obeisance నమస్కారము. **ప్రణమిల్లు** *v.n.* : To bow, to prostrate oneself, to bow down, నమస్కారము చేయు.

**ప్రణయము** *n.* : Affection, love, friendship, friendly or fond, regard, acquaintance. ప్రణయ కలహము lover's quarrels, discord between man and wife. స్నేహము, ప్రేమము, మంచిమాటలాడడము, వినయము.

**ప్రణవము** *n.* : The name of the sacred syllable O M, the mystic name of God. ఓంకారము.

**ప్రణామము** *n.* : A bow, salutation; homage. నమస్కారము, ప్రణతి.

**ప్రణాళి** *n.* : A watercourse, channel, canal. నీళ్లుపోవు దారి.

**ప్రణిధి** *n.* : A spy or emissary, చారుడు, Asking, solicitation, ప్రార్థన.

**ప్రణిపాతము** *n.* : A Salutation, reverence అభివాదము.

**ప్రణీతము** *adj.* : Dressed, cooked. వండబడిన. made, done, constructed. చేయబడిన.

**ప్రణుతము** : Much praised, celebrated. మిక్కిలి స్తోత్రము చేయబడిన. **ప్రణుతి** *n.* : Great praise, మిక్కిలి పొగడిక. **ప్రణుతించు** or **ప్రణుతిచేయు** *v.a.* : To praise. స్తోత్రము చేయు.

**ప్రతతి** *n.* : A company, crowd, విస్తారము, సమూహము. A creeping plant, లత.

**ప్రతలము** *n.* : The open hand, with the fingers extended. చాచినవ్రేళ్లు గల అరచెయ్యి. One of the infernal regions, అధోలోక భేదము.

**ప్రతాపము** *n.* : Splendour, brilliancy, heat, వేడిమి, తేజము. majesty, valor. **ప్రతాపించు** *v.n.* : To show one's valor, ప్రతాపము చూపు.

**ప్రతారణము** *n.* : A delusion, trick, cheating, deceiving, deception. మోసము, వంచన, మోసపుచ్చుట.

**ప్రతి** *a.* : Sanskrit particle, prefixed to words of that language, and implying Opposition or substitution,

exchange, return, **ప్రతివేదము** each Veda. **ప్రతిదినము** every day. ప్రతిసంవత్సరము each year. **ప్రత్యేకము** one by one.

**ప్రతికక్షి** : the opposite party, **ప్రతివాది** a defendent.

**ప్రతికారము** or **ప్రతిక్రియ** *n.* : A return of offices, either good, or bad. Revenge, retaliation. Remedying, counteracting.

**ప్రతికూలము** *adj.* : Contrary, adverse, unfavourable, reverse, inverted. అనుకూలము కాని, విరుద్ధమైన. ప్రతికూలమైన గాలి an adverse wind.

**ప్రతికృతి** *n.* : An effigy, figure, image. ప్రతిమ.

**ప్రతిగృహీతుడు** *n.* : One who receives alms.

**ప్రతిగ్రహము** *n.* : An acceptance of alms. The act of receiving anything. A gift. **ప్రతిగ్రహించు** *v.a.* : To accept, or receive alms.

**ప్రతిఘటించు** *v.a.* : To oppose, ఎదిరించు. **ప్రతిఘటితము** *adj.* : Opposed contradicted.

**ప్రతిఘము** *n.* : Anger, wrath, rage : opposition. క్రోధము, ప్రతిఘాతము.

**ప్రతిఘాతము** *n.* : A blow in return, a blow for a blow, మారుదెబ్బ. Wreaking vengence, పగదీర్చుకొనుట.

**ప్రతిచ్ఛాయ** *n.* : Refraction of light. A reflected image. ప్రతిమ.

**ప్రతిజ్ఞ** *n.* : An agreement, engagement, undertaking, asseveration, determination, resolution, vow, శపథము. Assent, అంగీకారము. **ప్రతిజ్ఞాతము** *adj.* : Acknowledged, admitted. అంగీకరింపబడ్డది.

**ప్రతిదానము** *n.* : The return or redelivery of a deposit, barter, exchange. దానమిచ్చిన దానిని మరల నిచ్చుట.

**ప్రతిద్వంద్వి** *n.* : An antagonist, or opponent, శత్రువు.

**ప్రతిధ్వని** *n.* : An echo. మారుమ్రోత.

**ప్రతిన** *n.* : A vow, determination. ప్రతిజ్ఞ, పంతము.

**ప్రతినామము** *n.* : A second name or alias. మారుపేరు.

**ప్రతినిధి** *n.* : A resemblance or equivalent; a substitute, deputy, representative. మారు.

**ప్రతిపక్షము** *n.* : The opposite side or party. ఎదుటికక్షి, ఎదుటి కక్షివాడు.

**ప్రతిపక్షి** or **ప్రతిపక్షుడు** *n.* : An enemy, a defendant, an opponent, A respondent. శత్రువు.

**ప్రతిపత్తు** *n.* : The first day of either lunar fortnight, i.e., the first of the moon's increase or wane. పాడ్యమి.

**ప్రతిపదము** *n.* : A synonym. పర్యాయ పదము.

**ప్రతిపాదకము** *adj.* : That which gives, effects, or causes, కలుగజేసే. Explanatory, demonstrating, proving. తెలియజేసే.

**ప్రతిపాలకుడు** *n.* : One who protects or defends. A king, a protector. రక్షకుడు. **ప్రతిపాలనము** *n.* : Protecting, defending, cherishing, రక్షణము.

**ప్రతిఫలము** *n.* : A return, requital, remuneration, reward.

**ప్రతిఫలించు** *v.n.* : To reflect or give the image of ప్రతిబింబమగుపడు. **ప్రతిఫలనము** *n.* A reflection of animage.

**ప్రతిబంధము** *n.* : An obstacle, impediment, hindrance. **ప్రతిబంధకము** adj. Impeding, obstructing.

**ప్రతిబింబము** *n.* : A reflection, as in a mirror, resemblance. ప్రతిఫలము, **ప్రతిబింబించు** *v.a.* : To reflect back, as a mirror does ప్రతిఫలించు.

**ప్రతిభ** *n.* : Understanding, intellect, light splendour బుద్ధి.

**ప్రతిభటుడు** *n.* : An enemy శత్రువు.

**ప్రతిభువు** *n.* : A surety, పూటబడ్డవాడు, పూటకాపు.

**ప్రతిభేదము** *n.* : A various reading in a manuscript పాఠాంతరము.

**ప్రతిమ** or **ప్రతిమానము** *n.* : An image, idol, picture. A resemblance. విగ్రహము, పోలిక.

**ప్రతిమాల** *n.* : An exercise analogous to capping verses, reciting verse for verse, as a trial of memory or skill అంతాది గ్రంథము.

**ప్రతిమోత** *n.* : An echo. ప్రతిధ్వని. "కులగిరులెల్ల ప్రతిమోతలియ్యంగ".

**ప్రతియత్నము** *n.* : A desire, వాంఛ. An effort, endeavour, పూనిక. A reform సంస్కారము.

**ప్రతిరోధము** *n.* : Opposition ఎదిరించుట. **ప్రతిరోధి** *n.* : An opponent, ఎదిరించువాడు.

**ప్రతిలోమము** *adj.* : Not right, reverse, inverted, contrary to the natural course or order, against the hair or grain.

**ప్రతివసించు** *v.n.* : To live, to be. వసించు, ఉండు.

**ప్రతివాక్యము** *n.* : An answer ఉత్తరము, మారుమాట.

**ప్రతివాది** *n.* : A respondent or defendant. ప్రతివక్షిగానుండువాడు. **ప్రతివాదించు** *v.a.* : To defend in argument, to reply to charges. ప్రతికక్షియై మాట్లాడు, ఎదురాడు.

**ప్రతివిధానము** *n.* : A preventative, remedy. ప్రతిక్రియ, పరిహారము.

**ప్రతిశ్యాయము** *n.* : Cold, catarrh. పడిసెము.

**ప్రతిశ్రయము** *n.* : An assembly, a place of sacrifice. సభ, సత్రశాల.

**ప్రతిషేధము** *n.* : prohibition, forbidding అడ్డగింత, **ప్రతిషేధించు** *v.a.* : To forbid, prohibit అడ్డగించు.

**ప్రతిష్ఠంభము** *n.* : An obstacle, obstruction, ప్రతిబంధము, అడ్డగింత.

**ప్రతిష్ఠ** *n.* : Staying, standing, నిలుపుట, స్థితి. Frame, celebrity, కీర్తి, Consecration, dedication.

**ప్రతిసరము** *n.* : A thread tied upon the wrist at the time of some particular ceremonies. కంకణము, దీక్షాదుల యందు ముంజేతగట్టిన నూలు సూత్రము, తోరము.

**ప్రతిసీర** *n.* : A screen or wall of cloth. పరదా, తెరచీర.

**ప్రతిస్పర్ధ** *v.* : Rivalry, పోటి. **ప్రతిస్పర్ధించు** *v.n.* : To behave as a rival, పోటీచేయు.

**ప్రతిహతము** *adj.* : Disappointed, opposed, obstructed. విరుద్ధమయిన. అందుకు ప్రతిహతమైన ఒక లెక్క a cross account.

**ప్రతిహారము** or **ప్రతీహారము** *n.* : A gate, or door. ద్వారము. ప్రతిహారుడు, ప్రతిహారి or **ప్రతీహారుడు** *n.* : A door keeper, or porter.

**ప్రతిహింస** : Revenge, retaliation. కసితీర్చుకొనడము.

**ప్రతీకత** *n.* : The body as being a system of limbs. **ప్రతీకము** *n.* : A limb, a member, a part, a portion, అవయవము.

**ప్రతీకారము** *n.* : Revenge, retaliation, vengeance. A remedy పగతీర్చుకొనడము. చేసిన పనికి బదులు చేయడము.

**ప్రతీకాశము** *adj.* : (In composition) Like, resembling. సమానమైన. సూర్యబింబ ప్రతీకాశము bright as the sun.

**ప్రతీక్షించు** *v.n.* : To look for, to hopefor, to expect. ఆశతో ఎదురుచూచు. **ప్రతీక్షణము** *n.* : Expectation, hope, ఎదురుచూచుట. **ప్రతీక్ష్యుడు** *adj.* : A venerable or respectable person. పూజ్యుడు.

**ప్రతీచి** *n.* : The west quarter. పడమర, **ప్రతీచీనము** *adj.* : Western, west. పడమటిది.

**ప్రతీతి** *n.* : Knowledge, common report, traitional, belief, a general impression; notoriesty, reputation, fame. వదంతి, ప్రసిద్ధి. **ప్రతీతము** *adj.* : Famous, celebrated, renowned, known, ప్రసిద్ధమయిన. **ప్రతీతుడు** *n.* : A famous man, ప్రసిద్ధుడు.

**ప్రతీపము** *adj.* : Disobedient, refractory, perverse, cross, contradictory. విరుద్ధమైన.

**ప్రతీరము** *n.* : A shore, or bank. నద్యాదితీరము, గట్టు.

**ప్రతోదము** *n.* : A goad. ములుగోల, మునికోల.

**ప్రతోళి** *n.* : A high road, the principal road through a town or village. పెద్దవీధి, రథ్య.

**ప్రత్తి** or **పత్తి** *n.* : Cotton(used of the plant or of the uncleaned product.) విత్తులతో నుండి దూది.

**ప్రత్యంతరము** *n.* : Another copy. A different manuscript.

**ప్రత్యక్పుష్పి** *n.* : A plant, *Achyranthes aspera.* ఉత్తరేను.

**ప్రత్యక్షము** *adj.* : Perceptible, perceivable; present, cognizable by any to the organs of sense.

**ప్రత్యగ్రము** *n.* : New, recent, fresh, క్రొత్త.

**ప్రత్యపకారము** *n.* : Returning evil for evil. Tit for tat.

**ప్రత్యయము** *n.* : Knowledge, apprehension. జ్ఞానము. Trust, faith, belief, విశ్వాసము. Confidence, An oath, ordeal శపథము.

**ప్రత్యర్థి** *n.* : An opponent, defendant, rival, ill wisher, enemy. ప్రతివాది, శత్రువు.

**ప్రత్యవాయము** *n.* : Sin. A reverse, a contrary course or proceding. Disappointment, disagreement. దోషము. దీనిని చేయుడము వల్ల ఏమిన్ని ప్రత్యవాయములేదు there is no harm in doing it.

**ప్రత్యాహము** *adv.* : Every day, daily, ప్రతిదినము.

**ప్రత్యాఖ్యాతము** *adj.* : Prohibited, forbidden, denied, refused. Removed, set aside. Discouraged, నిరాకృతము. ప్రత్యాఖ్యాతుండయ్యె he was discouraged or refused. **ప్రత్యాఖ్యానము** *n.* : Rejection, refutation, disallowance, disregard, denial, refusal. నిరసనము, కూడదనడము.

**ప్రత్యాదిష్టము** *adj.* : Same as ప్రఖ్యాతము.

**ప్రత్యాబ్దికము** *n.* : An anniversary of a death. ఏటేటవచ్చే శ్రాద్ధము.

**ప్రత్యామ్నాయము** *adj.* : Instead of, in lieu of, in place of.

**ప్రత్యాలీఢము** *n.* : Standing with one leg advanced, as when drawing the bow; straddling. విలుకాడు ఎడమ కాలు ముందరికిచాచి కుడికాలు వెనుకకు ఉంచి నిలుచుట.

**ప్రత్యాశ** *n.* : Hope. Vain hope.

**ప్రత్యాసత్తి** *n.* : Connection, relation, familiar intercourse or association with. సంబంధము.

**ప్రత్యాహారము** *n.* : A withdrawal or restraining of the organs. so as to be indifferent to disagreeable or agreeable excitement.

**ప్రత్యుత్తరము** : An answer, reply or rejoinder.

**ప్రత్యుత్థానము** *n.* : A welcome given to a guest by rising and meeting him, civility to a guest, polite reception. గృహాగతమహోత్మానం ప్రకృతవినయే, ఎదురుకొని లేచుట.

**ప్రత్యుద్గమము** *n.* : Going to meet a guest. ప్రత్యుత్థానము. **ప్రత్యుద్గమించు** *v.n.* : To go to welcome a guest, ఎదురుకొనిపోవు.

**ప్రత్యుద్యాతము** *adj.* : Returning, coming, back, మళ్లీవచ్చునట్టి.

**ప్రత్యుపకారము** *n.* : Doing good in return. A return for good offices; a return of favours.

**ప్రత్యుషము** or **ప్రత్యూషము** *n.* : Dawn, morning, ప్రభాతము.

**ప్రత్యూహము** *n.* : An obstacle, impediment, hindrance, విఘ్నము.

**ప్రత్యేకము** *adj.* : Separate, distinct, వేరువేరు.

**ప్రథ** *n.* : Fame, celebrity, ప్రసిద్ధి.

**ప్రథనము** *n.* : A battle, fight. యుద్ధము.

**ప్రథమము** *adj.* : First, initial, prior, chief, principal. మొదటి, ముఖ్యము.

**ప్రధి** *n.* : the periphery of a wheel : the tire, బండికల్లుకు చుట్టువేసిన ఇనుపకట్టు.

**ప్రథితము** *adj.* : Famous, celebrated; made known, declared. ప్రసిద్ధమైన. **ప్రథితి** *n.* : Fame. ప్రఖ్యాతి.

**ప్రథిమ** or **ప్రథిమము** *n.* : A Greatness, bigness, విరివి.

**ప్రదక్షిణము** *n.* : Circumambulation. Paying homage by solemnly walking round it with the right hand towards it.

**ప్రదము** *adj.* : That which bestows. వర్షప్రదమైన మేఘము a rainy cloud. దేవానాంచ భయప్రదం terrific even to gods.

**ప్రదరము** *n.* : An arrow, బాణము. A fracture, a breaking : చీలుట, విరుచుట. A disease of the womb, menorrhagia. కుసుమరోగము.

**ప్రదర్శకుడు** *n.* : One who shews clearly. A teacher, expounder, prophet. విశదపరిచి చూపువాడు. **ప్రదర్శనము** *n.* : Showing, explaining.

**ప్రదానము** *n.* : A great gift, donation. గొప్ప ఈవి.

**ప్రదేశము** *n.* : A place, situation, region, country, district. చోటు. కంఠప్రదేశము the region of the neck or throat. వారు ఈ ప్రదేశములందు లేరు they were not in these parts.

**ప్రదేశిని** *n.* : The forefinger. తర్జని, జుట్టనవ్రేలు.

**ప్రదోషము** *n.* : Evening; the first part of the night. The evening of a particular lunar day, in which the recital of the Vedas is forbidden. రాత్ర్యారంభము A fault, transgression, sin. దోషము.

**ప్రద్యుమ్నుడు** *n.* : A name of Manmadha. మన్మథుడు.

**ప్రద్యోతనుడు** *n.* : The sun. సూర్యుడు.

**ప్రధనము** *n.* : A fight, battle. యుద్ధము.

**ప్రధానము** *n.* : Nature, the natural state of any thing; the cause of the material world. ప్రకృతి, పరమాత్మ. **ప్రధాని** a minister. మంత్రి.

**ప్రన్నన** or **ప్రన్నదనము** *n.* : Beauty, అందము.

**ప్రప** *n.* : A place for refreshment, where water is given to passers by. చలిపందిలి.

**ప్రపంచము** *n.* : The world, the Universe, భూలోకము. Family life, సంసారము. Extent, expanse, విరివి.

**ప్రవత్తి** *n.* : A seeking or taking refuge. గతి వేరేలేదని పాదములను పట్టుకొనుట, శరణుచొచ్చుట. **ప్రపన్నము** *adj.* : Taking refuge with, reaching, arriving at, seeking, adhering to. ప్రపత్తిచేసిన.

**ప్రపదము** *n.* : The point of the foot; the tip of the toes. పాదము చివర. The upper surface of the foot, మీగాలు, ముంగాలు.

**ప్రపాతము** *n.* : A fall, cascade, నద్యాది తీరము, కొండచరియ.

**ప్రపితామహుడు** *n.* : A great-grandfather, ముత్తాత. ప్రపితామహి a great grand-mother. వృద్ధప్రపితామహుడు a great-grandfather's father.

**ప్రపౌత్రుడు** *n.* : A great-grandson. పౌత్రునికొడుకు, మునిమనుమడు. **ప్రపౌత్రి** a great grand daughter. పౌత్రుని కూతురు, మునిమనుమరాలు.

**ప్రపుల్లము** *adj.* : Blown, blooming. వికసించిన.

**ప్రబంధము** *n.* : A treatise, book, work, composition. కల్పించిన కథ గల గ్రంథము, కావ్యము.

**ప్రబలము** *adj.* : Mighty, powerful, strong. మిక్కిలి బలము గల Important, strong. మిక్కిలిబలము గల.

**ప్రబుద్ధుడు** *n.* : One who is awake, మేలుకొన్నవాడు. A man who has become acquainted with reality; an enlightened man.

**ప్రబ్బ** or **ప్రబ్బలి** *n.* : The rattan tree. వేతసి, పేము, బెత్తపు చెట్టు.

**ప్రబ్బు** *v.n.* : To spread, వ్యాపించు. To happen, occur, కలుగు, వర్తిల్లు. To flourish or thrive. పెరుగు. హెచ్చు, విజృంభించు, వర్ధిల్లు.

**ప్రభ** *n.* : Light, radiance, brightness, splendour, వెలుగు, తేజస్సు, ప్రభావము. **ప్రభాకరుడు** *n.* : The maker of light, i.e., the sun. సూర్యుడు. **ప్రభాతము** *n.* : The dawn, or morning. ఉదయకాలము, తెల్లవారువేళ, వేకువ. **ప్రభావము** *n.* : Majesty, dignity. మహాత్మ్యము, తేజస్సు. **ప్రభాసితము** adj. Shinning, luminous, glorious వెలిగెడి.

**ప్రభంజనము** *n. Lit.* : That which breaks thoroughly. Wind, a breeze. గాలి, వాయువు. **ప్రభంజనుడు** *n.* : The god of the winds. వాయుదేవుడు.

**ప్రభవ** *n.* : The name of a Telugu year. **ప్రభవము** *n.* : Birth, పుట్టుక, ప్రభవించు.

**ప్రభిన్నము** *adj.* : Detached, severed, separated. నరకబడిన, పగిలిన, ప్రత్యేకింపబడిన. *n.* : An elephant in rut. నూతనమత్తగజము.

**ప్రభువు** *n.* : A lord, master, ruler, అధిపుడు. చిత్తము మహాప్రభూ yes, please your honor. **ప్రభుత్వము** *n.* : Power, supremacy, lordship, sovereignty, government.

**ప్రభూతము** *adj.* : Much, abundant. అధికము. Produced, సంభూతము.

**ప్రభృతి** *n.* : A beginning, మొదలు. adv. After that, thence, beginning with, & c. బాలాత్ప్రభృతి ever since my youth. శివహరిప్రభృతులు Siva, Hari and the rest. మునిప్రభృతి జనములు the ascetics and the rest.

**ప్రమ** *n.* : Knowledge of the truth, true knowledge, యథార్థజ్ఞానము.

**ప్రమత్తము** *adj.* : Very intoxicated. మిక్కిలి మదించిన, మిక్కిలి మత్తెక్కిన. Insane, వెర్రి. **ప్రమత్తుడు** *n.* : A very drunk man.

**ప్రమథుడు** *n.* : An attendant on Siva. శివ భటుడు, పారిషదుడు. **ప్రమథాధిపుడు** *n. Lit* : the lord of Pramathas, an epithet of Siva, శివుడు.

**ప్రమదము** *n.* : Joy, pleasure, delight. ఆనందము, సంతోషము. **ప్రమదవనము** or **ప్రమదావనము** *n.* : A ladies' pleasure - ground, or park. అంతఃపుర స్త్రీలు విహరింపదగిన ఉద్యానవనము. **ప్రమద** *n.* : A wanton girl, an attractive woman; a maid, damsel, lady, అతికామవతి, అతిగర్వవతి, స్త్రీ.

**ప్రమాణము** *n.* : Measure, scale; standard; limit; quantity, size, bulk, extent, అంగుళీమానము, జేన, మూర, గజము మొదలైనవి.

**ప్రమాదము** *n.* : A mistake, error : neglect (of study, & c.) తప్పుట, ఏమరుపాటు, పరాకుపడుట. Danger, insecurity, hazard, peril.

**ప్రమిద, ప్రమిదె** or **ప్రమ్మిద** *n.* : A saucer for oil, used as a lamp.

**ప్రమీల** *n.* : Lassitude, enervation, exhaustion from indolence or fatigue. కునికిపాటు, అలసటచేత సొమ్మసిలి పోవడము.

**ప్రముఖము** *adj.* : Chief, principal, best, most excellent, first. ముఖ్యమైన, మొదటిదైన. **ప్రముఖుడు** *n.* : A chief, a principal man, a leader, ముఖ్యుడు.

**ప్రముదితుడు** *n.* : One who is very pleased, మిక్కిలి సంతోషించినవాడు.

**ప్రమేయము** *n.* : That which may be known for a certainty, an object of knowledge, subject యథార్థముగా ఎరుగదగినది.

**ప్రమేహ** *n.* : Diabetes.

**ప్రమోదము** *n.* : Joy, delight ఆనందము. **ప్రమోదించు** *v.n.* : To rejoice, be joyful, ఆనందించు.

**ప్రమోదూత** *n.* : The name of a Telugu year.

**ప్రమ్ము** *v.a.* : To sorround, పరివేష్టించు.

**ప్రయతుడు** *n.* : A holy or pious person; one purified by austerity and mortification. పునీతుడు, పూతుడు.

**ప్రయత్నము** *n.* : A great attempt, endeavour, or effort. మిక్కిలి యత్నము. దైవప్రయత్నము. దైవ ప్రయత్నమువల్ల ఇట్లు జరిగినది it pleased God that matters turned out thus. **ప్రయత్నించు** *v.n.* : To try very hard,

strive, make a great effort, మిక్కిలి యత్నించు.

**ప్రయాగ** or **ప్రయాగము** *n.* : The name of a holy place, Prayag. (Allahabad) తీర్థవిశేషము. **ప్రయాగలు** *n.* : A certain sort of grain.

**ప్రయాణము***n.* : A journey, departure.

**ప్రయాసము** or **ప్రయాస** *n.* : Toil, violent effort, trouble, difficulty, pain. శ్రమము.

**ప్రయుక్తము** *adj.* : Endowed with, associated or connected with, applied, employed. గల, కూడుకొన్న, ప్రయోగింపబడిన, See ప్రయోగము.

**ప్రయుతము** *n.* : A million. పదిలక్షలు.

**ప్రయోగము** *n.* : An application, use or employment, as of a weapon, tool, word, or a spell. **ప్రయోజకుడు** *n.* : One who uses. The original instigator of any act. A clever man, a genius. కార్యమును నెరవేర్చువాడు. **ప్రయోజనము** *n.* : Use, advantage, profit.

**ప్రరోహము** *n.* : A bud, a shoot, మొలక, అంకురము.

**ప్రలంబము** *n.* : A garland of flowers, & c. worn round the neck. హారము. A branch, శాఖ.

**ప్రలాపము** *n.* : Unmeaning or incoherent speech, prattle, mere ejaculation. విలాపము, పలవరము, పలవ రింత, అర్థములేనిమాట, అక్కర లేని మాట Lamentation, wailing.

**ప్రలోభనము** *n.* : Tempting, seduction. వలపించడము. A bait to catch animals with, మృగములను పట్టుకొనుటకు పెట్టు మచ్చు.

**ప్రలోభము** *n.* : Great selfishness, covetousness, greed, మిక్కిలి లోభము, **ప్రలోభించు** *v.a.* : To make one desire eagerly, to allure, ఆసగొనజేయు.

**ప్రల్లదము** *n.* : Harshness of speech. పారుష్యము. Pride, arrogance; bragging, a vain of wicked word, nonsense. కొవ్వు, గర్వము, పనికిమాలిన కూత, దుర్భాషణము. A wicked act, దుష్కృత్యము.

**ప్రల్లదనము** or **ప్రల్లదము** *n.* : Pride, arrogance గర్వము, అహంకారము, కొవ్వు. **ప్రల్లదురాలు** *n.* : A wicked woman, దుష్టురాలు.

**ప్రళయము** *n.* : Destruction. The final destruction of the world. కల్పాంతము Danger, calamity, అపాయము.

**ప్రవక్త** *n.* : One who talks well, an eloquent man, చక్కగా మాట్లాడువాడు. **ప్రవచనీయము** *adj.* : That which is fit to be well said, చక్కగా మాట్లాడదగినది.

**ప్రవణము** *adj.* : Bent, bowed. వంగిన, Attached to, adhering to, తత్పరత గల, ఆసక్తి గల.

**ప్రవర** or **ప్రవరము** *n.* : A name, పేరు. Offspring, descendants; family, lineage. గోత్రము, సంతతి, కులము.

**ప్రవరము** *adj.* : Noble, excellent. శ్రేష్ఠమైన. **ప్రవరుడు** *n.* : An excellent man, శ్రేష్ఠుడు, మేటి.

**ప్రవర్గ్యము** *n.* : A certain ceremony or sacrifice. అగ్నిష్టోమాద్యంగ భూతమైన యాగ విశేషము. **ప్రవర్గ్యుడు** *n.* : An officiating priest. పురోహితుడు.

**ప్రవర్తకుడు** *n.* : One who carries on or manages, నడుపువాడు. **ప్రవర్తన** or **ప్రవర్తనము** *n.* : Conduct, behaviour, నడత, ఆచారము. **ప్రవర్తమానము** *adj.* : Current, as a year, నడుచుచున్న.

**ప్రవర్తులు** *n.* : Purging, diarrhoea. భేదులు, విరేచనములు.

**ప్రవర్ధిల్లు** *v.n.* : To increase, grow, improve, flourish, prosper, మిక్కిలి వృద్ధిపొందు. **ప్రవర్ధించు** *v.a.* : To cause to flourish మిక్కిలి వర్తిల్లజేయు. **ప్రవర్ధమానము** *adj.* : Flourishing, thriving, increasing. మిక్కిలి వృద్ధి పొందుచుండే.

**ప్రవహణము** *n.* : A covered carriage or litter. మనుష్యులు మోయు వాహనము. అందలము మొదలయినవి.

**ప్రవహించు** *v.n.* : To run or flow, (as a river). పారు. **ప్రవాహము** *n.* : A stream, flood, current, వరద, వెల్లువ. Continuous passage or flow, unbroken succession, continuity. పరంపర.

**ప్రవాదము** : report, వదంతి.

**ప్రవాళము** *n.* : A coral, పగడము. A shoot, sprout, new leaf, అంకురము, చిగురు, నవపల్లము. The neck of a lute, వీణాదండము.

**ప్రవాసము** *n.* : Absence from one's home or land, living abroad, remaining away from home. పరస్థల వాసము, పరదేశగమనము, ప్రవాస ముగా నుండువాడు or ప్రవాసగతుడు one who is from home.

**ప్రవాహము** : See under ప్రవహించు.

**ప్రవిమలము** *adj.* : Most pure, spotless, perfectly innocent. నిర్మలమైన, స్వచ్ఛమైన.

**ప్రవిశ్లేషము** *n.* : Separating, parting. ఎడబాయడము.

**ప్రవిష్టము** *adj.* : Entered, gone in, entered upon (as an affair,) engaged in. ప్రవేశించిన, చొరబడిన.

**ప్రవీణము** *adj.* : Skilful, versed in, conversant. నిపుణత గల. **ప్రవీణత** or **ప్రావీణ్యము** *n.* : Cleverness, proficiency, skill, ability.

**ప్రవృత్తి** *n.* : Pace, manner of walking, నడక. Entrance, ప్రవేశము. Means of livelihood, బ్రతుకుతెరువు. A story, వృత్తాంతము.

**ప్రవృద్ధము** *adj.* : Full grown, expanded, diffused : spread abroad or dispersed. వృద్ధిపొందిన, ఆదోకగా పెరిగిన.

**ప్రవేశము** *n.* : An entering upon or engaging in entrance. చొచ్చుట;

చొరవ. **ప్రవేశనము** *n.* : Insertion, entering. ప్రవేశపెట్టడము. **ప్రవేశ పెట్టు** *v.a.* : To introduce, instal, induct, admit, enter, entertain or take into service.

**ప్రవ్రజ్య** *n.* : A roaming, travelling about, (particularly as a religious mendicant.) Abandonment of the world. కార్యార్థపర్యటనము, సన్యాసాశ్రమము. ప్రవ్రజితుడు an ascetic.

**ప్రవ్వ** *n.* : A pot, కుండ.

**ప్రశంస** *n.* : Praise, commendation, eulogy. స్తోత్రము, స్తుతి. A subject, topic: mention. ప్రస్తావము. ఆ ప్రశంస తెచ్చినాడుకాడు he made no mention of the matter. **ప్రశంసించు** *v.a.* : To praise, స్తుతించు.

**ప్రశాంతి** *n.* : Perfect peace of mind, tranquility మిక్కిలి శాంతి.

**ప్రశ్న** or **ప్రశ్నము** *n.* : A question, query, demand, inquiry.

**ప్రసంగము** *n.* : Addiction to, connection with. A conversation, talk, discussion. ప్రస్తావము, సల్లాపము, సంగతి. **ప్రసక్తి** *n.* : A topic, or subject of conversation.

**ప్రసన్నము** *adj.* : Clear, clean, bright. నిర్మలము. Complacent, pleased, gracious, benignant.

**ప్రసరము** *n.* : Spreading, extending. వ్యాప్తి, వ్యాపనము, వ్యాపించడము. **ప్రసరణము** *n.* : extending, spreading. వ్యాపించడము.

**ప్రసవము** *n.* : Bringing forth, bearing (as young), parturition. కానుపు. Birth, production, పుట్టుక. A flower, a blossom, పువ్వు. **ప్రసవించు** *v.a.* : To be brought to bed, give birth to, (బిడ్డ) కను.

**ప్రసవ్యము** *adj.* : Pertaining to the right hand, కుడిది. Pertaining to the left hand. ఎడమది. Favourable, అనుకూలము Contrary, reverse, inverted, reverted. ప్రతికూలము.

**ప్రసాదము** *n.* : Clearness, నైర్మల్యము. Composure of mind. స్వాస్థ్యము favour, kindness, grace, అనుగ్రహము.

**ప్రసాధనవ** *n.* : Dress, embellishment, decoration. వేష విశేషము, వస్త్రాద్యలంకృత శోభ.

**ప్రసారణము** *n.* : Stretching. చాచుట. Pulling, తిగుచుట.

**ప్రసారము** *n.* : The act of spreading, వ్యాపనము, See ప్రసరము.

**ప్రసిద్ధి** *n.* : Celebrity, fame, notoriety, ఖ్యాతి. **ప్రసిద్ధము** *adj.* : Known, celebrating.

**ప్రసూత** or **ప్రసూతిక** *n.* : A woman in childbed, బాలెంతరాలు. **ప్రసూతి** *n.* : Childbed, parturition, bringing forth young, labour. బిడ్డకనడము, కానుపు. Birth, పుట్టుక. A child, బిడ్డ.

**ప్రసూనము** *n.* : A flower blossom. పుష్పము.

**ప్రసృతము** *adj.* : Stretched, lengthened. కొనసాగిపెరిగిన. Dispersed,

extended, spread abroad. ప్రవృద్ధము. **ప్రసృతి** n. The palm of the hand hollowed so as to hold liquids. పుడిసిలి, చేర.

**ప్రసేవకము** *n.* : The globes of a lute. వీణ కరివె.

**ప్రస్తరము** *n.* : A stone, రాయి. A jewel, a precious stone, రత్నము, మణి.

**ప్రస్తరించు** *v.n.* : To spread, extend, విస్తరించు.

**ప్రస్తవము** *n.* : That which concerns one, an object, విషయము.

**ప్రస్తావము** *n.* : An opportunity, occasion, కార్యోచిత సమయము.

**ప్రస్తుతము** *adj.* : Much praised, mentioned, present. *adv.* : At present, just now. **ప్రస్తుతించు** *v.a.* : To praise or applaud greatly, మిక్కిలి స్తోత్రము.

**ప్రాకు** or **పాకు** *v.n.* : To mount up, to get up, to climb. ఎక్కు. To creep, crawl. రొమ్ముతో జరుగు. Dirt, stain, మాలిన్యము. Moss, పాచి. **పాకుడు** *n.* : The act of climbing పాకుట.

**ప్రాకృతము** *adj.* : Low, common, vulgar. నీచమైన. *n.* : The colloquial or vernacular language derived directly from Sanskrit. **ప్రాకృతుడు** *n.* : A boor, clown, or rustic. పామరుడు.

**ప్రాకెన, ప్రాకెన్న** or **పాకెన్న** *n.* : A particular ceremony observed on the third day of a marriage. పెండ్లిలో మూడవనాటియుత్సవము.

**ప్రాగల్భ్యము** *n.* : Skilfulness, cleverness. ప్రౌఢిమ. సామర్థ్యము, ప్రగల్భత్వము.

**ప్రాచి** *n.* : The East, తూర్పుదిక్కు. Moss, పాచి. Dirt, filth, mouldiness, sliminess, as upon a stone near water. మాలిన్యము. **ప్రాచీనము** *adj.* : Eastern, Placed towards the East. పూర్వ దిక్కుది. Ancient, old. పూర్వకాలపుది. **ప్రాచ్యము** *adj.* : Eastern, easterly, తూర్పుదిక్కు నందలిది.

**ప్రాచితము** *n.* : Expiation, ప్రాయశ్చిత్తము.

**ప్రాచీరము** *n.* : A bound, hedge, fence, wall, an enclosure, a rampart, కంచె, కోట.

**ప్రాచుర్యము** *adj.* : Excessive. enormous. బహుళమైన. Abundance, plenty, బాహుళ్యము. ప్రచురత్వము.

**ప్రాచేతసుడు** *n.* : An epithet of వాల్మీకి.

**ప్రాజాపత్యము** *n.* : Influence, authority, power, అధికారము. A kind of sacrifice. ఇష్టిభేదము A form of marriage, మీరిద్దరు కూడి ధర్మము చేయుడని పెండ్లికొడుకుతో చెప్పి కన్యనిచ్చి చేయు వివాహము.

**ప్రాజ్ఞుడు** *n.* : A sage, a wise, or learned man. పండితుడు. An able man. సమర్థుడు. **ప్రాజ్ఞ** or **ప్రాజ్ఞి** *n.* : A wise or clever woman.

**ప్రాజ్యవ** *adj.* : Much, many. విస్తారమైన, అధికమైన.

**ప్రాడ్వివాకుడు** *n.* : A judge, వ్యవహార దర్శని, తగవరి.

**ప్రాణము** *n.* : Air, wind, breath, life, vitality, the living soul. గాలి, హృదయమందలి గాలి, ఉసురు. **ప్రాణస్నేహము** intimate friendship. **ప్రాణనాథుడు** or **ప్రాణేశుడు** *n.* : The lord of (her) life, i.e., a husband or lover, మగడు. **ప్రాణవాయువు** *n.* : Oxygen gas, **ప్రాణాచారము** See ప్రాయోపవేశము. **ప్రాణాయామము** *n.* : A ritual mode of breathing, while mentally reciting certain prayers, stopping one nostril and inhaling or exhaling with the other. నాసికారంధ్రముల వద్దనుండు వాయువును మంత్రపూర్వకముగా నిరోధించుట. **ప్రాణి** *n.* : A being, or living creature. జంతువు.

**ప్రాత** or **పాత** *adj.* : Old, ancient. పురాతనమైన, పూర్వము. Worn out.

**ప్రాతః** *adv.* : In the morning, at dawn. తెల్లవారి, ప్రాతఃకాలము early in the morning, ప్రాతర్వాయువు a morning breeze.

**ప్రాతికూల్యము** (from ప్రతికూలము.) *n.* : Contradiction, opposition. విరుద్ధము, ప్రతికూలత్వము, అనుకూలముకామి.

**ప్రాతిపదికము** *n.* : A crude Sanskrit root, a word in its uniflected form, ధాతువు, ప్రకృతి.

**ప్రాథమికుడు** *n.* : The first man, a chief man, ప్రథముడు. **ప్రాథమ్యము** *n.* : Importance, ప్రథమత్వము.

**ప్రాదుర్భవించు** *n.* : To appear, to become manifest. అగుపడు, ప్రత్యక్షము, To be born, పుట్టు.

**ప్రాదుర్భావము** *n.* : Appearing manifestation అగుపడడము, Birth, పుట్టుక.

**ప్రాదేశము** *n.* : The span from the thumb to the fore-finger. లొడితెడు.

**ప్రాధాన్యము** (from ప్రధానము.) *n.* : Supremacy, dominion. ప్రాముఖ్యత, ప్రధానత్వము.

**ప్రాధేయపడు** *v.n.* : To beseech, మిక్కిలి ఆశతో వేడుకొను.

**ప్రాపించు** *v.a.* : To obtain, get attain to, పొందు. **ప్రాపు** *n.* : A prop. A protection, support, a refuge; patronage; a person on whom one depends, ఆసరా, ఆశ్రయము. **ప్రాప్తము** *adj.* : Obtained gained, acquired.

**ప్రాబల్యము** *n.* : Power, vigour, predominance. ప్రబలత్వము. ఇప్పుడు క్రైస్తవమతము ప్రాబల్యములోనున్నది the Christian religion has now the predominance. **ప్రాబల్యముగా** *adv.* : Predominantly.

**ప్రాభవము** *n.* : Preeminence, supremacy, dominion. ప్రభుత్వము, దొరతనము.

**ప్రామాణికము** *adj.* : Based on authority, authoritative. Credible. True, just, fair, right, faithful, equitable, యథార్థమైన.

**ప్రామిడి** *n.* : Fraud, deceit. మోసము, భ్రమ. Cruelty, క్రౌర్యము. A cruel

**లుప్తము** *adj.* : Disappearing. Cut off, rejected, as a vowel by elision. లోపించినది.

**లుబ్ధము** *adj.* : Coveous, greedy, desirous, avaricious. లోభము గల. **లుబ్ధకుడు** *n.* : A selfish man, a miser. పిసినిగొట్టు. A fowler, huntsman. బోయవాడు.

**లులాయము** *n.* : A wild male buffalo. కారుదున్నపోతు. **లులాయి** *n.* : A female buffalo. అడవిగేదె.

**లులి** *n.* : Littleness, a little. తక్కువ. లులిపడు or become low or less. హీనమగు.

**లుల్లిగాడు, లుల్లెగాడు** or **లుల్లెగాడు** *n.* : A bankrupt, a spendthrift. A man in distressed circumstances. కీడ్పడినవాడు. A low man, అధముడు.

**లూలు** or **లూటీ** *n.* : Plunder, loot, sacking కొల్లపెట్టడము. Danger, ఉపద్రవము. A lachrymal abcess, a boil near the eye. దవడలోని వ్రణము. **లూటీచేయు** or లూటాయించు *v.n.* : To plunder.

**లూత** *n.* : A spider, సాలెపురుగు.

**లూనము** *adj.* : Cut, కోయబడిన.

**లూమము** *n.* : A tail, తోక.

**లూలామాలము** *n.* : Cheating, wheedling, defrauding. మోసము, వంచన.

**లెంక** *n.* : A servant, భటుడు, సేవకుడు.

**లెంట** *n.* : Alum, పట్టిక.

**లెండి** *v.* : imperative plu. Rise ye. A colloquial expression like "To be sure"! you see! of course! you know !".

**లెంప** *n.* : A side, a cheek. చెంప, తట్టు, ప్రక్క. **లెంపకాయ** *n.* : A slap on the cheek. చెంపకాయ.

**లెక్క** *n.* : Number, సంఖ్య. An account, a sum in arithmetic, reckoning. గణితము. (from లక్ష్యము.) Esteem, regard. లక్ష్యము, లెక్కలేని numberless.

**లెప్ప** or **లెప్పము** *n.* : An aim, a butt, గురి, లక్ష్యము.

**లెస్స** *n.* : Good, well being, weal, a good state, health, right. శుభము, క్షేమము, బాగు, మంచి. plu. లెస్సలు. *adj.* : Good, క్షేమయుక్తము. Excellent. శ్రేష్ఠము.

**లే** *adj.* : A contraction for లేత tender, as **లేజెమట,** లేగొమ్మ, లేగాడ్పు, లేనడుము. **లేనెల,** & c. లేవయసు tender age **లేనగవు** a slight laugh, a smile. **లేతోట** a blooming garden. **లేకసవు** tender grass.

**లే** : The base of the negative forms లేక, లేని, లేదు, & c. **లేక** past participle of లేదు.

**లేనివారు** : the absent; the poor. **లేమి** *n.* : Nullity, not being, absence, want, poverty. కలుగమి, ఉండమి, దారిద్ర్యము. **లేమిడి** *n.* : Poverty, want. దారిద్ర్యము. **లేరు** *v.* : 3rd. pers. plu. They are not. **లేవు** *v.* : (neuter) They are not.

**లేండ్లు** *n.* : A Antelopes. జింకలు.

**లేక** *Conj.* : Or, else. ఇల్లు లేక తోట a house or a garden. **లేక లేక** *adv.* : At last. లేక లేక వానికి ఒక కొడుకు పుట్టినాడు at last he had a son born to him. **లేకపోవు** *v.n.* : To be in want of. విహీనముగానుండు. వాడు అప్పుడు తెలివిలేకుండినాడు he was then out of his senses.

**లేక** *n.* : A letter of correspondence, జాబు. A row of thick-set trees, ఎడములేక మిక్కిలి దగ్గిరగానుండు వృక్షముల వరుస. A multitude, సమూహము.

**లేక** *n.* : A servant. భటుడు, లెంక.

**లేకరి** *n.* : A writer, a penman. లేఖకుడు, లేఖరి, వ్రాతకాడు.

**లేకి** *n.* : Grain dropped down on the ground, రాలిన ధాన్యపుగింజలు. A worthless wretch, a vagabond. దేవురుగొట్టు, పనికి మాలినవాడు, పనికి మాలినది, అప్రయోజకుడు.

**లేకుంటే, లేకపోతే** or **లేకపోయినా** *adv.* : Or else, otherwise.

**లేకునికి** *n.* : The state of being in want of. లేకపోవుట, అతడక్కడ లేకునికి for his being absent there.

**లేఖ** (from లిఖ్ to scratch.) *n.* : A letter an epistle. జాబు. A line, a row, రేఖ, పఙ్క్తి, వరుస. **లేఖకుడు** *n.* : A scribe, writer, clerk. వ్రాతకాడు, లేకరి. **లేఖిని** or **లేఖని** *n.* : A pen. వ్రాసేకలము. **లేఖుడు** *n.* : A god, a deity, దేవత.

**లేగ** *n.* : A sucking calf. క్రొత్తగా పుట్టినదూడ. A calf, దూడ, వత్సము, మేతపట్టని దూడ.

**లేచు** *v.n.* : To rise, get up, arise. ఉత్థితమగు. పొట్టమరించు, రేగు. To rise from sleep, నిద్రలేచు, మేలుకొను.

**లేట** *n.* : A bough or branch. కొమ్మ, శాఖ. లేట మొగముపడు to be turned away, as the face, విముఖమగు.

**లేడి** or **లేటి** *n.* : An antelope. కురంగము. జింక. **లేడికంటి** *n.* : A bright - eyedgirl, a girl or woman with gazelle-like eyes. మృగాక్షి. *Plu.* : లేళ్లు.

**లేత** *adj.* : Young, tender, soft. తరుణమైన, కోమలమైన, లేతయెండ soft sunshine. లేతవన్నె a light tint. Easy, చులకన.

**లేదు** *n.* : A bear, ఎలుగుబంటి. **లేదుబంతి** or **లేదుబంతీ** *n.* : A lie, బొంకు.

**లేపనము** *n.* : Smearing, plastering, anointing, అలకడము, పూయడము.

**లేపు** *v.a.* : To cause to rise, to raise, లేవజేయు. To rouse, awake, stir up.

**లేబరము** *adj.* : Empty, శూన్యము.

**లేమ** *n.* : A woman. స్త్రీ *adj.* : Tender, young, లేత.

**లేమి, లేమిడి** : See under లే.

**లేలిహానము** or **లేలిహాసము** *n.* : A snake, పాము.

**లేవ** *n.* : A horse's face, గుఱ్ఱపు తలాటము.

**లేవడి** *n.* : Want, లేమి. Poverty, దారిద్ర్యము. *adj.* : Poor, దరిద్రము. Low, base, vile, mean. నీచమైన, అల్పమైన.

**లేవడీ** *n.* : Disgrace. లేవిడీకొట్టు to disgrace openly by crying Fie!

**లేశము** *n.* : Littleness, కొంచెపుదనము. A little, a small portion : a particle, atom. adj. Very little. కొంచెము.

**లేహనము** *n.* : Licking, నాకుట. లేహము.

**లొంక** *n.* : A dell, a valley. కోన.

**లొంగు** or **లోగు** *v.n.* : To submit, to yield, to be humble. లోకువగు, తగ్గు. To withdraw, retreat, వెనుదీయు.

**లొండు** *n.* : A pond, tank, జలాశయ విశేషము.

**లొంప** *n.* : A small house, కొంప.

**లొగ్గు** or **లొంగు** *v.n.* : To submit, to yield, to be humble. లోబడు.

**లొచ్చు** or **లొజ్జు** *adj.* : Inferior, less, deficient. తక్కువ.

**లొట** : Same as లొట్ట. లొటకజిట్ట Same as లొట్టకన్ను జిట్ట.

**లొటలొట** *adv.* : Sounding like a pot when struck. Quickly. దడదడ.

**లొటసచ్చి** *n.* : Carbonate of Soda.

**లొటారము** *n.* : A hole, బొక్క, బిలము. *adj.* : Empty, pithless. నిస్సారమైన. **లోకబాంధవుడు** *n.* : The universal friend i.e., the sun, సూర్యుడు. **లోకమాత** *n.* : An epithet of Lakshmi. **లోకాలోకము** *n.* : A mountainous belt bounding the world. చక్రవాళపర్వతము. **లోకారాధ్యుడు** *n.* : The universally adored, i.e., God, the Lord. ఈశ్వరుడు. **లోకులు** *n. plu.* : People, folk, the community, జనులు, లోకులేమందురు what will people say ? **లోకేశుడు** *n.* : The lord of the world, i.e., Bramha, చతుర్ముఖుడు. A king, రాజు. **లోకోక్తి** *n.* : A proverb, సామెత. **లోకోత్తరము** *adj.* : Best in the world. శ్రేష్ఠమైన.

**లోకువ** *adj.* : Subordinate, inferior, subject to. అధీనము, తక్కువ.

**లోగడ** *n.* : the intervening space or time, అంతరాళము. The past time, గతకాలము.

**లోగడప** *n.* : The inner door. రెండో ద్వారబంధము.

**లోగిలి** or **లోగలి** *n.* : A house. బవంతి. The interior of a house, గృహాంతర్భాగము. *plu.* : లోగిండ్లు. Gen. లోగిటి.

**లోగు** *v.n.* : to yield, submit. retire, retreat, go back. వెనుకదీయు. లొంగు, లోబడు, లోకువగు, అడగు. to enter చొచ్చు.

**లోచనము** *n.* : The eye, కన్ను.

**లోచెయ్యి, లోచెయి, లోజెయ్యి** or **లోజెయి** *n.* : The palm of the hand. అరచెయ్యి.

**లోచు** *v.a.* : To cause to submit, లోగజేయు.

**లోచూపు** *n.* : Inner vision, spiritual discernment, second sight, జ్ఞానదృష్టి.

**లోట** *n.* : A well, a pond, జలాశయ విశేషము.

**లోటా** *n.* : A small drinking vessel. ఒకవిధమైన చిన్న పానపాత్రము.

**లోటు** *n.* : Loss, detriment, deficiency. తక్కువ, నష్టము, లోపము. **లోటుపోవు** *v.n.* : To become deficient. to prove a loss, నష్టియగు, లోపమగు.

**లోడి** or **లోడీ** *n.* : Dumb-bells, ముగ్దరు, సామునేర్చువారు తిప్పేటిది.

**లోడు** *n.* : A cushion to lean on. ఒరుగు దిండు. *v.a.* : To rake up as with a finger. వ్రేలులోనగువానితో కెల్లగించు.

**లోతక్కువ** *n.* : The rest, residue, remainder, what is deficient or wanting. మిగత. adj. Remaining, as a balance, కడమ.

**లోతు** *n.* : Depth, నిమ్నము. **లొతిడి** *adj.* : Not deep, shallow. లోతులేని.

**లోధ్రము** : Same as లొద్దుగు.

**లోను** *n.* : The inside. లోపల. The heart or mind. మనస్సు. **లోనగు** *v.n.* : To be gained, seduced, brought over. లోబడు. వారిమోసములకు లోనైనాడు he was snared by their guile.

**లోపము** *n.* : Deficiency; a defect, a flaw, fault; something wanting; a hiatus, omission, disappearance.

**లోపల** *n.* : The inside, లోను, అంతరము. **లోలోపల** *adv.* : Secretly. రహస్యముగా, మర్మముగా.

**లోప్త్రము** *n.* : Plunder, booty, stolen goods, దొంగిలించిన సొమ్ము.

**లోబడు** *v.n.* : To submit or yield, to consent. To be in one's power, to be subject to one లొంగు, స్వాధీనమగు, సమ్మతించు, తగ్గు.

**లోభము** *n.* : Covetousness, cupidity, avarice, eagerness; miserliness, stinginess. పిసినితనము. **లోభి** *n.* : A miser, a covetous or a greedy man. పిసినిగొట్టు.

**లోమము** : Same as రోమము.

**లోమశము** *n.* : A polecat. బూతపిల్లి, పూతిమార్జాలము.

**లోయ** *n.* : A pit or hollow place in a hill, a deep crack or opening. పర్వతము మీద మిక్కిలి లోతుగానుండే నెరియ, కొండపగులు. A valley.

**లోల** *n.* : A crone, beldame, wretch. **లోల** or **లోలము** *adj.* : Trembling, wavering moving, shaking, tremulous, unsteady. చంచలము, కదలునట్టి. **లోలలోచన** or **లోలాక్షి** *n.* : A girl with rolling eyes or a swimming glance.

**లోవ** *n.* : a valley, లోయ. The eaves of a house, ఇంటిచూరు. A burrow in the ground, నేలబొరియ.

**లోవంక** *adj.* : Bent inwards. లోనికి వంగిన.

**లోవరి** *n.* : An apartment, తొట్టికట్టు.

**లోవి** *n.* : A large brass water pot. నీళ్లు తెచ్చుకొనే ఇత్తడి పాత్ర. A cooking vessel, వంటకుండ. A vessel, స్థాలి.

**లోవు** *v.n.* : Same as లోగు.

**లోవయినము** or **లోవైనము** *n.* : That which is past, the past. కడచిన విషయము. *adj.* : Past former, older.

**లోష్టము** *n.* : A clod or lump of earth. మంటిగడ్డ. లోహలోష్టములందు సమభావము కలవాడు he who looks upon gold as dross.

**లోహము** *n.* : Metal in general, అష్టలోహ సామాన్యము. Iron, ఇనుము. పంచలోహములు the five metals, viz., gold, silver, brass, bronze and iron. అష్టలోహములు include lead, tin and another metal called ధీవరము. **లోహకారకుడు** *n.* : A blacksmith, కమ్మరి.

**లోహితము** *n.* : Ruby colour, redness, రక్తవర్ణము, రుధిరము. Blood నెత్తురు. adj. Red, ఎఱ్ఱని.

**లౌకికము** (Vulgarly, లౌకికము) *n.* : Business, wordly affairs. ఉద్యోగము, లోకవ్యాపారము.

**లౌడి, లవుడి, లౌణి** or **లవుణి** *n.* : A club or mace, పరిఘము.

**లౌల్యము** : See under లోల.

**లోహము** *adj.* : Metallic, లోహవికారమైన.

## వ

**వంక** *n.* : A side, quarter, direction, పక్క, దిక్కు. Crookedness, a bend. A pretence or pretext. **వంక సన్నములు** *n. plu.* : A sort of rice. వడ్లలో భేదము.

**వంకాయ** (వంగ + కాయ) *n.* : The vegetable called-brinjal.

**వంకి** *n.* : An arrow. బాణము. A dagger, బాకు. A sort of hook, కొక్కి.

**వంగ** *n.* : The Brinjal or Egg plant, వార్తాకము.

**వంగము** *n.* : Lead, tin. సత్తు. తగరము. వంగభస్మము the calx or ashes of lead. **వంగదేశము** *n.* : The ancient name of Bengal.

**వంగసము** or **వంగడము** *n.* : A family, race, lineage. వంశము, కులము.

**వంగు** *v.n.* : To bend, bow, stoop. To become crooked. To become low or humble. వంగు, ఒరుగు, నమ్రమగు.

**వంచన** *n.* : Cheating. fraud, craft. ఒకరిని దగాచేయడము, మోసము, కపటము. ఆత్మవంచన self-deception, wronging oneself.

**వంచె** or **వంచియ** *n.* : A sack, గోనె.

**వంచ, వంచము** or **వంచి** *n.* : The ace, at dice. ఒకటి.

**వంచాడించు** or **వంచాళించు** *v.n.* : To be frightened or alarmed, బెదరు.

**వంచు** *v.a.* : To bend, bow down; to make a thing crooked, to make one stoop; to humble, lower, reduce, వంగజేయు, వంగదీయు.

**వంజరము** or **వంజళము** *n.* : The coal-fish, seer-fish or scomber, Gadus carbonarius, resembling a very fine baddock.

**వంజలము** or **వంజుళము** *n.* : A sort of bird with a remarkbly sweet whistle.

**వంజెరగు** *n.* : The end of a woman's garment, కొంగు.

**వంజ** *n.* : A barren woman, sterile cow, గొడ్డావు, గొడ్రాలు. వంజలు the cross pieces that support the ribs of an umbrella.

**వంజు** or **ఒంజు** : Same as వంజరము.

**వంట** *n.* : Cooking or dressing food, cookery. వండడము, పాకము.

**వంటి** *adj.* : Like, similar to. నావంటి like me. బొగ్గువంటి like charcoal. నీవంటి like three, అటువంటి, ఇటువంటి such.

**వంటు** *n.* : Convenience, propriety, అనుకూల్యము, అనువు.

**వంటెము** or **వంటియము** *n.* : A district or taluq, తాలూకా.

**వండ** *n.* : Danger, ఆపద. Silt, బురద. **వండనీళ్లు** muddy water.

**వండు** *v.a.* : To cook, boil, (food, oil, & c.); distil (spirits); to fuse iron. వంటచేయు, పక్వము చేయు. ఒంటి వంట సారాయి spirits only once distilled. **వండించు** *v.* : To have food cooked. పచనము చేయించు.

**వండుసున్నము** *n.* : Fine lime plaster.

**వంద్ర** or **వందర** *n.* : A favourable lease or rent. వంద్రభూమి land unfit for cultivation.

**వంత** *n.* : Vexation, regret. మనోదుఃఖ రూపమైన విచారము. Sorrow, grief, సంతాపము. Pain, బాధ. A cry, ఏడ్పు.

**వంతు** *n.* : A share, portion, part. A turn, time, or but by rotation. పాలు, భాగము, వరుస. Likness, సామ్యము.

**వంతుడు** *n.* : Affix meaning Possessed of, gifted with, having, possessing. ధైర్యవంతుడు A brave man.

**వంతెన** *n.* : A bridge.

**వంద** *n.* : A hundred, శతసంఖ్య, నూరు.

**వందనము***n.* : An obeisance, salutaion, అభివాదనము, నమస్కారము. Praise, స్తుతి. Thanks.

**వందర** *n.* : A piece, fragment, bit. తునక. Also, a favourable lease or rent. వందరభూమి and unfit for cultivation.

**వందిలి** *n.* : Calamity, embarrassment.

**వందు** *v.n.* : to grieve, sorrow, be afflicted. దుఃఖపడు, విచారపడు, సంతాపించు.

**వందె** or **వందియ** *n.* : A kind of grass, తృణవిశేషము.

**వందొందు** *n.* : A kind of fish.

**వంద్యుడు** : See under వందనము.

**వంధ్య** *n.* : A childless woman. గొడ్రాలు. A barren cow. గొడ్డావు. **వంధ్యము** *adj.* : Barren, as a tree, కాయని (చెట్టులోనగునది).

**వంపు** *n.* : Crookedness; a bend, curve. వక్రత్వము, వంకర. తలవంపులు hang-

ing the head; shame, disgrace. adj. Bent, crooked, వంగిన, వంకరైన.

**వంబతాడు** *n.* : A certain rope belonging to a waterlift. కపిలకువేసే ఒకతాడు.

**వంశము** *n.* : A race, line, lineage, family, stock, extraction; a dynasty. **వంశవృక్షము** *n.* : A genealogical tree.

**వకవకలు** or **వకావకలు** *n. plu.* : Splashings, చెదరుటలు. Pieces, fragments, bits, బద్దలు.

**వకాలతు** *n.* : Agency, attorneyship, power of attorney. **వకీలు** *n.* : An attorney or agent. A vakil or pleader in a law court.

**వకుళవము** *n.* : The plant termed Mimusops clengi, పొగడచెట్టు.

**వక్క** *n.* : A bit, fragment, shiver or piece, as of glass, or areca nut. తునక, పోకచెక్క. వక్కలు areca nut bits or fragments. తెల్లవక్కవడ్లు a kind of rice, ఒక విధమైనవడ్లు.

**వక్కణ** or **వక్కాణ** *n.* : The heading of a letter, & c. Compliments written at the head of a letter, జాబు మొదలైన వాటికి మొదటవ్రాసే వాడుక మాటలు.

**వక్కరము** *n.* : Same as వంకర. **వక్కరాలు** *n.* : A jade, scold. An impostor. కుటిలస్త్రీ. వంచకురాలు.

**వక్కాకు** or **వక్కలాకులు** *n.* : Betel nut, i.e., betel and nut. తాంబూలము, ఆకువక్క.

**వక్కాణించు** *v.a.* : To tell, narrate, describe. చెప్పు, వాక్రుచ్చు. to write a commentary on, to comment on, వ్యాఖ్యానముచెప్పు.

**వక్కి** *adj.* : Lean, fleshless. బక్కయైన, పలచని, కృశము. **వక్కిపక్షి,** వక్కికట్టె or వక్కివాడు *n.* : A starveling, బక్కవాడు. **వక్కు** *v.n.* : To become lean. బక్కచిక్కు, కృశించు. *n.* : A heron, బకము.

**వక్త** *n.* : One who speaks, మాట్లాడువాడు. A speaker, an orator.

**వక్త్రము** *n.* : The mouth, face, countenance, ముఖము, నోరు.

**వక్రము** *adj.* : Crooked, awry, bent, curved, twisted. వంకరైన. Cruel, perverse, wicked.

**వక్షము** or **వక్షస్సు** *n.* : The chest. రొమ్ము. **వక్షోజము** or **వక్షోరుహము** *n.* : A woman's breast, స్తనము.

**వక్ష్యమాణము** *adj.* : That which is about to be said, చెప్పబోయెడిది.

**వగ** : Grief, vexation, melancholy, regret. remorse. దుఃఖము, సంతాపము, విచారము, శోకము. Intention, ఆలోచన. Mode, way, manner, విధము, రీతి, దోవ, గతి. **వగకత్తె** or **వగలాడి** *n.* : A coquette, belle. శృంగార చేష్టలు గల స్త్రీ, విలాసవతి. A rogue, a deceiver, మాయలాడి. పశ్చాత్తాప పడు To cry ఏడ్చు *v.a.* : To consider, think, విచారించు, ఆలోచించు, తలచు.

**వగరు, వగరము, వగరుపు** or **వగర్పు** *n.* : Hard breathing, panting. శ్వాసరోగము. **వగరుచు** or **వగర్చు** *v. n.* : To breathe hard, to pant, రోజు.

**వగరు** or **ఒగరు** *n.* and *adj.* : Astringent.

**వగైరా** *adj.* : Etcetera, and so forth. ఇత్యాది.

**వగ్గు** or **వక్కు** *adj.* : lean, skinny, decrepit. ముదిమిచేత ఎండివరుగుగా నుండే, బక్కచిక్కిన. ముసలివగ్గు a decreptit old man.

**వచనము** *n.* : Speech, speaking. a word. మాట, A sentence. A dictum, an aphorism, a rule. **వచించు** or వచియించు *v.a.* : To say, speak, tell, relate, పలుకు.

**వచ్చ** *n.* : A canker worm or blight which destroys trees. చెట్టుకు పట్టి బొత్తిగా నాశముచేసే ఒకవిధమైన చీడ.

**వచ్చు** *v.n.* : To come, arrive. To happen, occur, take place. చేరు, సంభవించు, కూడు, ప్రాప్తమగు.

**వజా** *n.* : Deduction, substraction, మినహాయింపు.

**వజీరు, వజీరుపడు, వజ్జీరుడు** or **వజ్రీడు** *n.* : A 'vizier' or minister. మంత్రి. A hero, శూరుడు. A commander, జోదు.

**వజ్జరము** or **వజ్రము** *n.* : A kind of sea fish. ఒకవిధమైన సముద్రపు మత్స్యము. glue used by carpenters, చెక్కను అతుకుటకు వేసే జిగట.

**వజ్రము** *n.* : A diamond, రవ, నవ రత్నములలో నొకరత్నము.

**వజ్జ** *n.* : An expedient, ఉపాయము, వెరపు.

**వటకము** *n.* : A kind of cake, వడియము, A pill, a bolus. మాత్ర.

**వటగ, వటారి** or **వకారి** *adj.* : Clever, skilful, నేర్పుగల, సమర్థతగల.

**వటము** *n.* : The Banyan or Indian fig tree. మర్రిచెట్టు. వటపత్రము a fig leaf.

**వటారము** or **వటారు** *n.* : A lodge. బస. A palace, నగరు.

**వటారి** : See under వటగ.

**వటించు** v.n. : To starve. పస్తు ఉండు, ఉపవాసము చేయు. వాడు అన్నానికి లేక వటించినాడు he starved for want of food.

**వటుడు, వటువు** or **వటుకుడు** *n.* : A bachelor, an unmarried Brahmin, a celibate. బ్రహ్మచారి. A boy, బాలకుడు.

**వట్ట** *n.* : The bar that turns the centre post of a sugar mill.

**వట్టము** *n.* : The agio allowance, a rate of exchange, abatement.

**వట్టి** *adj.* : Empty, mere, plain, simple, naked, downright, utter, gross, false, vain; unprofitable, groundless. **వట్టివేరు** *n.* : A fragrant grass usually called Cuscus. **వట్టిపోవు** *v.n.* : To dry, become dry, be drained.

**వట్నము** *n.* : A sack or gunny bag filled with grain. ధాన్యాదులు నించిన గోనె. వట్నాలకఱ్ఱ a stick used to carry such a bag.

**వట్ర** or **వట్రన** *n.* : Roundness. వర్తులము, గుండ్రన, వట్రవట్రని or వట్రముగా నుండే *adj.* : Round.

**వఠర, వఠరి** or **వఠారి** : Same as వటారి. See under వటగ.

**వడ** *n.* : Heat, వేడిమి, ఎండసెగ, తాపము. Trouble, pain, labour, శ్రమము. A sort of cake, గారె.

**వడకట్టు** : Same as వడియబోయు. See under వడియు.

**వడకు** *n.* : The North. ఉత్తరపుదిక్కు. **వడకుగుబ్బలి** or **వడకుకొండ** *n.* : The Himalayas. హిమవత్పర్వతము. నడకుత్రోవ same as ఉత్తరాయనము.

**వడకు** or **వణకు** *v.n.* : To tremble, shake, quiver, shudder కంపనము నొందు, కంపించు. *n.* : Trembling, shaking, shuddering.

**వడకు** : See వడుకు.

**వడదోలు** *n.* : A leather rope, used by toddy drawers. గవళ్లవాడు నడుమునకు కట్టుకొనే తోలు.

**వడప** *n.* : The web which surrounds the lower parts of the stem leaves of a palm tree, జవట.

**వడపు** *n.* : A den : the spot under a overhanging cliff.

**వడపోయు** or **వడబోయు** : Same as వడియగట్టు. See under వడియు.

**వడము** *n.* : A very thick rope. మోకు. A garland, దండ. తేరివడము a rope. used to drag a car.

**వడలు** or **వడులు** *v.n.* : To fade, or wither. పుష్పాదులువాడు.

**వడవడ** *adv.* : Violently (shaking), గడగడ.

**వడసారము** or **వడారము** *adv.* : Totally, entirely, బొత్తిగా.

**వడి** *n.* : Quickness. briskness, celerity, rapidity; sharpness, violence. శీఘ్రము, వేగము. Prowess, courage. శౌర్యము, క్షాత్రము. Time, కాలము as in ఇంచుకవడి. కొంతవడి. పెద్దవడి.

**వడికట్టు** or **వడిగట్టు** : Same as వడియగట్టు. See under వడియు.

**వడియము** *n.* : A cake made of black gram.

**వడియు** *v.n.* : To flow, to drip down or trickle as tears from the eyes, to distil or fall by drops. **వడుపు** *n.* : The state of being emaciated, వడియుట, కృశించుట.

**వడిసెల** or **వడిసె** *n.* : A sling for throwing stones. నడుమరాయి పెట్టి తిప్పి రువ్వే త్రాటి సాధనము.

**వడుకు** *v.a.* : To spin thread. రాట్నమును తిప్పి పత్తిని నూలుగా చేయు. **వడుకుడు** *n.* : The act of spinning cotton into thread.

**వడుగు** or **వడువు** *n.* : Mode manner, style, way. విధము, రీతి. **వడుగు వడువు** or **వడుగడు** *n.* : A Brahmin bachelor, బ్రహ్మచారి.

**వడుచు** and వడుపు : See under వడియు.

**వడుసు** *n.* : The act of being torn when a cloth is handled to be ironed or bleached. మోటుతనముగా చలువ చేయుట చేత వస్త్రమునందు పడుగు పేకలు సందిచ్చి వంకరగా తొలగుట.

**వడె** or **వడియ** *n.* : A peg, చిలుకకొయ్య.

**వడ్డన** : See under వడ్డించు.

**వడ్డి** n. Interest on money. ధనమునకు వచ్చు వృద్ధి. ధర్మవడ్డి legal interest. వడ్డికి వడ్డి compound interest. వడ్డికి ఇచ్చు to lend on interest. **వడ్డిబ్రతుకు** *n.* : Living by lending money at interest.

**వడ్డించు** *v.a.* : To help at meals, to serve up a meal, అన్నమిడు. వాడన్నమాటలను నీకునీవే యేల వడ్డించు కొంటున్నావు. why do you take his words to yourself ? **వడ్డన** or **వడ్డెన** *n.* : Serving out, or helping food. ఇడడము, వడ్డించడము. వడ్డన అయినది dinner is served. రెండవ వడ్డన the second course.

**వడ్డె** : See ఒడ్డె.

**వడ్రంగి, వడ్లంగి, వడ్లవాడు**or **వడ్లబత్తుడు** *n.* : A carpenter. **వడ్రంగవము, వడ్లపని, వడ్రము** or వడ్లంగి తనము *n.* : The trade of a carpenter.

**వడ్లు** *n.* : Paddy, rice in the husk, rice grain. వరిధాన్యము, శాలిధాన్యము.

**వణకు** or **వణుకు** : See వడకు.

**వణిక్కు** or **వణిజ్య** *n.* : Trade, traffic, commerce వాణిజ్యము, వర్తకము, క్రయవిక్రయములు.

**వణితవము** *n.* : A district, country, తాలూకా, వంటెము.

**వతంసము** or **అవతంసము** *n.* : A crest; an ornament on the head; an earning. శిరోభూషణము, సిగబంతి.

**వత్త** *n.* : A dried vegatable anything that has dried up or withered వరుగు.

**వత్తి** *n.* : A wick. దీపపు వత్తి, మైనపువత్తి a wax candle. వత్తివలెనున్నది it is as soft as a wick.

**వత్తుగా** *adv.* : Accordingly, ప్రకారముగా, విధివత్తుగా according to rule.

**వత్సము** *n.* : The breast, the chest. రొమ్ము. A year. సంవత్సరము. A calf ఆవు లేగదూడ. A boy, బాలుడు, **వత్సతరము** *n.* : A steer, తరిపిదూడ. **వత్సలత** *n.* : Tenderness, affection, love. స్నేహము, విశ్వాసము. **వాత్సల్యము వత్సలము** *adj.* : Affictionate, kind. ప్రేమగల, విశ్వాసముగల.

**వత్సనాభము** or **వత్సనాభి** : Same as వసనాభి. Same as నాభి. **వత్సరము** *n.* : A year. సంవత్సరము, అబ్దము.

**వదంతి** *n.* : Talk, report, rumour. లోకప్రవాదము.

**వదనము** *n.* : The face, countenance, mouth. ముఖము, నోరు. **వదన** *adj.* : Having a face. చంద్రవదన having a face as bright as the moon.

**వదనిక** or **బదనిక** *n.* : A parasite plant, *Epidenron tesseloides* and other species. జీవంతికావృక్షము, వృక్షరుహ.

**వదరు** or **వదురు** *v.n.* : To spread. అడరు, వ్యాపించు. To prattle, chatter, jabber. ప్రేలు.

**వదలు** or **వదులు** *v.n.* : To be loosened, to be slackened or untied; to cease, depart, disappear. **వదలివేయు** or **వదలుకొను** *v.a.* : To abandon or leave, to desist from, get rid of, మానుకొను, త్యజించు.

**వదాన్యము** *adj.* : Liberal, generous, munificent. బహుప్రదమైన, మిక్కిలి ఇచ్చునట్టి.

**వది** *n.* : A pit to catch elephants in. A trap. మాటు.

**వదినె** or **వదినియం** *n.* : An elder brother's wife. అన్నభార్య.

**వదుండు** *n.* : One who speaks. మాటలాడువాడు, ప్రియంవదుడు one who uses kind words.

**వదులు** : Same as వదలు. adj. Loose, బిగుతుకాని, **వదులుడి** (వదులు + లూటి) *n.* : A crack. బీటిక.

**వదె, వదియ** or **వందె** *n.* : A kind of grass తృణవిశేషము.

**వద్ద** or **ఒద్ద** *adj.* and *affix.* : Near, with, by, at, to. సమీపము.

**వద్దు** : (contracted from వలదు the neg. aor. of వలయు to will) Do not, must not, See వలదు.

**వధ** or **వధము** *n.* : Killing, slaying, murder, చంపడము, మారణము.

**వధువు** or **వధూ** *n.* : A woman, lady. ఆడది, స్త్రీ. A wife. జాయ, పెండ్లాము. **వధూటి** *n.* : A woman వనిత. A virgin కన్యక A daughter-in-law, కోడలు.

**వధ్యము** *adj.* : Deserving death, condemned to die. చంపదగిన. **వధ్యుడు** *n.* : A culprit : one who is condemned to death, చంపదగినవాడు.

**వనట** : See under వనరు.

**వనము** *n.* : A forest, a wood, అరణ్యము, అడవి. An orchard, grove, fruit garden, తోట, తోపు. Water, జలము. **వనజము** *n.* : A lotus or water-lily తామరపువ్వు. A wild elephant. A wild bird **వనజలోచనుడు** *n.* : An epithet of Vishnu. విష్ణువు. **వనజ సంభవుడు** *n.* : The one who sprang from the lotus, i.e., Brahma, చతుర్ముఖుడు. **వనజాక్షి** *n.* : The lotus-eyed; a poetical word for a lady. వనిత. **వనస్పతి** *n.* : A tree which bears fruit without flowering.

**వనరు** *v.n.* : To grieve pine, sorrow. దుఃఖపడు, శోకించు, విలపించు దీనాలాపములాడు, వనరు.

**వని** *n.* : A forest, వనము, అడవి. **వనిక** *n.* : A forest, అడవి. A park, grove. తోట, తోపు.

**వనిత** *n.* : A woman, damsel. స్త్రీ.

**వనీపకుడు** *n.* : A beggar, యాచకుడు.

**వనౌకసము** *n.* : A monkey, కోతి.

**వన్నె** or **వన్నియ** *n.* : Colour, hue, రంగు, వర్ణము. Beuaty, అందము. Ornament అలంకారము, శృంగారము. brightness, కాంతి. Fame ప్రసిద్ధి Manner, విధము. A paint, వర్ణపు పూత. **వన్నెకాడు** or **వన్నెలాడు** *n.* : A beau, a handsome man. శృంగారవంతుడు, సొగసుకాడు.

**వన్య** *n.* : A multitude of groves or forests. A quantity of water, a flood, a deluge, వనసమూహము, ప్రవాహము.

**వప** *n.* : The mucous, or glutinous secretion of the flesh or bones : a caul of fat. కడుపులో బొడ్డువద్దనుండే బట్ట వంటి పొర.

**వపనము** *n.* : Shaving, ముండనము, గొరుగుట. Sowing, విత్తుట. **వప్త** *n.* : One who sows, విత్తెడువాడు. Father, తండ్రి.

**వపువు** or **వపుస్సు** *n.* : The body, శరీరము.

**వప్రము** *n.* : A fort, a citadel, కోట. A mud wall, a rampart, the glacis of a fort కోటకొరడు, పుట్టకోట.

**వమధువు** *n.* : Water ejected from the elephant's trunk. ఏనుగు తొండపు తుంపురు. Vomiting, వాంతి.

**వమనము** *n.* : Vomiting, వాంతి.

**వమ్ము** *adj.* : Vain, fruitless. వ్యర్థము, నిరర్థకము. **వమ్ముపోవు** *v.n.* : To become useless, వ్యర్థమగు. To be wasted or lost, నష్టమగు, పాడైపోవు.

**వమ్రి** *n.* : The white ant. చెద. A kind of black ant. చెట్టునతెట్టె పెట్టేనల్లచీమ.

**వయసు** or **వయస్సు** *n.* : Age, time of life, any period of life. ప్రాయము, ఈడు. Youth, యౌవనము, వయసు వచ్చినవాడు a full grown boy.

**వయాళి** or **వయ్యాళి** *n.* : Gallopping, speed, going at a rapid pace. సవారి, పరుగు, విహారము.

**వయ్యము** or **వాయము** *adj.* : Vain, useless వ్యర్థము.

**వర** *n.* : A limit మేర, పర్యంతము. ఇదివరలో before this time. అదివరలో before that time. Kind. sort.

**వరండము** *n.* : A hayrick or bundle of hay. గడ్డివామి, గడ్డికట్ట A pimple on the face. ముఖముమీది మొటిమ.

**వరకము** *n.* : The multiplier in Arithmetic. A rut cut by water. Imprisonment with hard labour.

**వరకు** or **వరకు** *n.* : An intricacy, difficulty, చిక్కు, వలపు, కపటపు వంచన.

**వరగచేప** *n.* : A kind of fish, మత్స్యవిశేషము.

**వరగలించు** *v.n.* : To shine, or glitter, ప్రకాశించు.

**వరట** *n.* : A goose. A female swan ఆడుహంస. *n.* : A lump of dried cowdung ఎండిన పేడచెక్క, వరటు varatu.

**వరడు** *n.* : An old fox. ముదినక్క. A large kind of fox. పెద్దజాతినక్క.

**వరణము** *n.* : An outer building, enclosure, or wall. ప్రాకారము.

**వరత్ర** *n.* : A leathern thong or girth. టంగువారు.

**వరద** *n.* : The overflow of a river, a torrent or flood. An inundation. నదిలోనుంచి బైటికివచ్చిన క్రొత్తనీరు, ప్రవాహము. **వరదగుడి** *n.* : A halo round the sun or moon, సూర్యాది పరివేషము.

**వరదుడు** : See under వరము.

**వరపు** *n.* : Drought, want of rain. అనావృష్టి., వానలేమి.

**వరము** *n.* : A boon or blessing sought in prayer, a divine gift. దేవతాదుల వల్ల పడసిన అనుగ్రహము.

**వరలు** *v.n.* : To shine or be splendid. ప్రకాశించు, వెలయు. To continue, to be, to behave. ప్రవర్తిల్లు. To spread, వ్యాపించు.

**వరవ** *n.* : A channel of supply to an artificial lake or tank. చెరువునకు నీళ్లు వచ్చుట కేర్పరచిన కాలవ.

**వరవడి, వరువడి** or **ఒరవడి** *n.* : The top line, a copy set to school boys learning to write, మేలుబంతి.

**వరవు** or **వరవుడు** *adj.* : Slavish, servile, ఊడిగపు. *n.* : A servant or slave. దాసి, సేవకుడు.

**వరస** or **వరుస** *n.* : A line or row, పజ్క్తి. A series or order, పరంపర. A mode, way, క్రమము, విధము. Relationship, బంధుత్వ క్రమము. Usage, వాడుక. A turn, relief, or time, వంతు.

**వరహా** or **వరా** *n.* : తొమ్మిది చిన్నముల యెత్తు బంగారపు ముద్రిక.

**వరాటకము** or **వరాటిక** *n.* : The small shell called a cowri which is used as a coin. గవ్వ.

**వరాశి** or **వరాసి** *n.* : A coarse cloth. ముతకబట్ట.

**వరాహము** *n.* : A boar or hog. అడవిపంది. వరాహావతారము the thrid incaranation of Vishnu in the shape of a boar. **వరాహకూర్చము** n. A brush made of hog's bristle.

**వరి** *n.* : Rice in the husk, sally called paddy. వడ్లు, వరిచేను or వరిమాగాణి a rice field. **వరిబీజము** *n.* : Swelled testicle, orchitis, hydrocele, or hernia. ఒకపక్క వాచిన వృషణము.

**వరించు** or **వరియించు** *v.a.* : To desire, wish for, covet. To choose for (one's) husband. పొందు, కోరు, వలచు.

**వరిగెలు** : Same as వరగలు.

**వరిష్ఠము** or **వరీయము** *adj.* : Very excellent, supreme, best, most preferable. మిక్కిలి శ్రేష్ఠమైన. **వరిష్ఠుడు** or వరీయుడు *n.* : A chief, a noble man. మిక్కిలి గొప్పవాడు, అతిశ్రేష్ఠుడు.

**వరుగు** *n.* : Vegetables, fruit or fish preserved by drying. ఎండబెట్టిన కాయలు మొదలైనవి.

**వరుజు** *n.* : A ridge to retain water in corn fields. మళ్లకు కట్టిన గట్టు, గనుమ.

**వరుడు** : See under వరము.

**వరుణుడు** *n.* : Varuna, the Hindu Neptune, who is the god of the waters and regent of the west. **వరుణము** *n.* : Water, జలము.

**వరువట్టులు** or **వరువట్లు** *n.* : Quite empty or dry (things) మిక్కిలివట్టులు. **వరువట్లుగొను** *v.n.* : To dry up entirely, బొత్తిగా ఎండిపోవు.

**వరువాయి** *n.* : The dawn, morning, ప్రాతఃకాలము.

**వరుస** See వరస.

**వరూథము** *n.* : Armour, a piece, a piece of armour, a coat of mail. కవచము.

**వరూథిని** *n.* : An army, సేన. Also, the name of a mountain nymph. ఒక దేవతాస్త్రీ యొక్క పేరు.

**వరేణ్యము** *adj.* : Chief, noble, principal, pre - eminent. శ్రేష్ఠమైన, ముఖ్యమైన. **వరేణ్యుడు** *n.* : A chief, or pre-eminent man, శ్రేష్ఠుడు.

**వర్గము** *n.* : A class or tribe, a group or set of things, the whole group or body of a number of similar things. సజాతీయ సమూహము. A chapter, అధ్యాయము.

**వర్చస్సు** *n.* : Form, figure, shape, రూపము. Light, lustre. ప్రభ, జ్వాల, తేజము.

**వర్జించు** *v.a.* : To relinquish, give up, abandon. త్యజించు, విడిచిపెట్టు. **వర్జనము** *n.* : Quitting, abandonment, shunning, avoiding. విసర్జనము, మానుకొనడము.

**వర్ణము** *n.* : Colour, hue, tint. రంగు. A tribe, class, caste, order. కులము, జాతి. A letter of the alphabet, అక్షరము. వర్ణవివేచన discrimination of caste. వర్ణక్రమము the order of the letters, spelling. **వర్ణమాల** *n.* : The alphabet, అక్షర సమామ్నాయము. **వర్ణి** *n.* : An unmarried Brahmin boy. A bachelor, బ్రహ్మచారి, వటుడు.

**వర్తకము** *n.* : trade, traffic, commerce. బేరము, వ్యాపారము. A sort of quail. Perdic oilvacca. వెలిచెపిట్ట, మినవల్లంకిపిట్ట.

**వర్తనము** *n.* : Conduct, behaviour, నడవడి. Staying, abiding. ఉనికి, స్థితి. Profession, occupation, livelihood. వృత్తి, వ్యాపారము, జీవనోపాయము. An act. పని, కృత్యము. **వర్తమానము** *n.* : Situation, condition, circumstance. స్థితి, సంగతి.

**వర్తులము** *adj.* : Round, circular, globular, spherical. గుండ్రని, ఉర్టువైన, బటువైన.

**వర్త్మము** *n.* : A road, path, way, course, మార్గము, త్రోవ.

**వర్దీ** *n.* : Report, news; an order, warrant. జప్తువర్దీ a warrant of attachment.

**వర్ధకి** *n.* : A carpenter, వడ్లవాడు.

**వర్ధిలు, వర్ధిల్లు** or **ప్రవర్ధిల్లు** *v.n.* : To grow, increase, improve, flourish, thrive, prosper. వృద్ధిబొందు, పెరుగు. **వర్ధిష్ణుడు** or **వర్ధిష్ణువు** *n.* : One who prospers or flourishes. వృద్ధి బొందువాడు.

**వర్మము** or **వర్మువు** *n.* : Mail, armour. కవచము. **వర్మితము** *adj.* : Armed, accoutred, కవచాలంకృతమైన.

**వర్యము** *adj.* : Chief, principal, ముఖ్యమైన, శ్రేష్ఠమైన. **వర్యుడు** *n.* : A chief, leader. ముఖ్యుడు, శ్రేష్ఠుడు.

**వఱ్ఱ** or **ఒఱ్ఱ** *n.* : A pungent taste. కారము. **వఱ్ఱమీను** *n.* : A kind of fish, మత్స్యభేదము.

**వఱ్ఱు** *n.* : A heap or quantity. అతిశయము. A flood, inundation. వరద, ప్రవాహము. **వఱ్ఱె, వఱ్ఱియ** or **ఒఱ్ఱె** *n.* : A crack. బీటిక. A rick of corn, చిన్నకుప్ప. A rick of straw, చొప్పవఱ్ఱె.

**వర్షము** *n.* : Rain, a shower, వాన. A year, సంవత్సరము. **వర్షాభావము** want of rain, **వర్షకాలము** or **వర్షాకాలము** *n.* : The rains or rainy season. వానకాలము.

**వర్షీయుడు** *n.* : A very old man.

**వర్షోపలము** *n.* : A hailstone, వడగల్లు.

**వర్ష్మము** *n.* : The body, శరీరము.

**వల** *n.* : A net, జాలము. Love, కామము. **వలకాక** *n.* : Amorous desire, మన్మథతాపము. (క్షేత్రయ). **వలకాడు** *n.* : A lover. కాముకుడు. **వసు వలకారి** *n.* : One who causes another to fall in love, వలపించువాడు, లేక వలపించునది. **వలకారితనము** *n.* : Prettiness, gracefulness. శృంగారభావము.

**వల** *adj.* : Right, కుడి. వలచేయి or వలకేలు the right hand.

**వలకట్టు** *n.* : To make a thing convenient, అనుకూలపరుచు. **వలకడ** *n.* : The South side. దక్షిణపుదిక్కు. **వలచుట్టు** *n.* : The act of walking round anything. వలగొనుట.

**వలంతి** : See వలతి.

**వలకు** or **వలకువు** : Same as వలను.

**వలగ్నము** *n.* : The middle part of the body, దేహముయొక్క మధ్యము. The waist, నడుము.

**వలచు** or **వల్చు** *v.n.* : To smell or emit perfume. వాసనకొట్టు. **వలపు** or **వల్పు** *n.* : Love, affection, foundness, మోహము, కామము. A desire. కోరిక, Smell, fragrance, పరిమళము. **వలపించు** *v.a.* : To inveigle, tempt, enamouor cause to love. మోహింపజేయు.

**వలత్** *adj.* : Shaking, moving, చలించే, కదిలే.

**వలతి** or **వలంతి** *n.* : A genius, a skilful person. నేర్పరి. A woman, ఆడుది A place, చోటు.

**వలదు** *adj.* : Big, great, స్థూలమైన, గొప్పయైన, అధికమైన. *n.* : Greatness, ఆధిక్యము, గొప్పతనము.

**వలదు** or **వద్దు** *v.* : Ought not, must not, do not.

**వలన** : See under వలను.

**వలనము** *n.* : Moving, turning. కదిలించడము, తిప్పుడము, కంటిపాప తిరుగుట.

**వలను** *n.* : A side, direction. వైపు, దిక్కు, పార్శ్వము. A method, manner, విధము, రీతి. Grace, excellence, ఒప్పిదము. Art, skill, a stratagem. ఉపాయము, నేర్పు.

**వలపల** *n.* : The right side. కుడిప్రక్క, దక్షిణపార్శ్వము.

**వలపు** : See under వలచు.

**వలభి** *n.* : The wooden frame of a thatched roof.

**వలమానము** *adj.* Moving, కదలునట్టి, చలించుచున్న.

**వలము** *n.* : Abundance విస్తారము. Stoutness, bigness, స్థూలత్వము, లావు. *adj.* : Stout, స్థూలము.

**వలమురి** *n. Lit* : That which has its volutes formed from right to left. The conch of Vishnu. విష్ణుశంఖము. వలమురితాలుపు an epithet of Vishnu. విష్ణువు.

**వలయము** *n.* : A bracelet, an armlet, any thing round. కడియము, మురుగు, చక్రము, ఉంగరము, మండలము, గుండ్రనిది.

**వలయు** *v.n.* : To be liked, desired or wanted. ఇష్టమగు, విహితమగు. To be needful, or necessary, ఆవశ్యకమగు, To be proper, యుక్తమగు To be surrounded, వలయితమగు.

**వలవల** or **విలవిల** *adv.* : Bitterly, much greatly, జలజలమని, జొటజొటమని. వలవలయేడ్చు to weep bitterly. Flutteringly, as a bird does when it alights on the ground.

**వలవలన** *adj.* : Loosened. వదలిన.

**వలస** *n.* : Emigration, fleeing, flight from home for fear of the king or a hostile army, expatriation. స్వదేశములో నుండడమునకు ఉపద్రవము వచ్చి పరదేశమునకు లేచిపోవడము. **వలసపిట్ట** *n.* : The golden plover.

**వలాహకము** *n.* : A cloud, మేఘము.

**వలి** *n.* : A fold, ముడుత. See వలీముఖము. *n.* : Cold, coldness, చలి. Shivering through cold, కంపము. **వలివెలుగు** or **వలివెల్గు** *n.* : The Moon, చంద్రుడు.

**వలికి** or **వల్కి** *n.* : A kind of bird, also called సారసపక్షి or బెగ్గురు.

**వలిచలు** *n. plu.* : Roof laths, పెండెలు.

**వలితము** *adj.* : Surrounded చుట్టబడిన. Shaken, చలనమునొందిన.

**వలిదము** *n.* : A sort of cloth. వస్త్ర విశేషము.

**వలిపము, వలిపెము** or **వల్పము** *n.* : A fine sort of muslin. రవసెల్లా, సన్నని తెల్ల వస్త్రము. A clean cloth, మడుగుబట్ట.

**వలియు** *v.n.* : To become thin, సన్నగిలు. To be tired or fatigued, డయ్యు.

**వలీకము** *n.* : The edge of a thatched roof, eaves, ఇంటిచూరు.

**వలీముఖము** *n.* : A monkey, వానరము, కోతి.

**వలుకు** or **వళుకు** *n.* : An intricacy, difficulty. వరను, చిక్కు. A dispute, తగవు.

**వలుద, వలుంద** or **వల్ద** *adj.* : Big, large, stout, స్థూలమైన, గొప్ప.

**వలువ, వలువము, వలువు, సల్వము** or **వల్వ** *n.* : A fine garment, a cloth, వస్త్రము.

**వలె, వలెను** or **వలెనే** *adv.* : Like, resembling, according to, as though. రీతిగా, పోలికగా. **వలె** or **వలెను** (from వలయు) See వలయు.

**వలెవాటు** : See వల్లెవాటు.

**వల్కము** *n.* : The bark of a tree, the fibre of a tree or plant. చెట్టుపై పట్ట, లేక నార. **వల్కలము** *n.* : The bark of a tree, చెట్టుపై నార.

**వల్గ** *n.* : A bridle, a rein. గుర్రపు కళ్లెము తగిలించేవాగె. వాగ.

**వల్గత్** *adj.* : Moving, కదులుచున్న. *n.* : An eyelash, కనురెప్పమీది వెంట్రుక.

**వల్మీకము** or **వల్మికము** *n.* :n. An ant hill, పుట్ట. వల్మీకములజొచ్చు వన భుజంగంబులు the serpents enter the ant hills.

**వల్ల** : another form or వలన. A postposition used as a case ending in the 5th case of nouns and pronounce. **వల్లకాని** *adj.* : Impracticable, impossible. అసాధ్యమైన. **వల్లమాలిన** *adj.* : Much, excessive; impracticable, అపరిమితమైన. **వల్లగానుండు** *v.n.* : To be convenient, practicable, possible, feasible. సాధ్యముగా నుండు.

**వల్లకాడు** (వల్లడి + కాడు) *n.* : A cemetery, a place for burning or burying corpses. శ్మశానము.

**వల్లకి** *n.* : The Indian lute. వీణె, విపంచి.

**వల్లడి** *n.* : A causeless or unaccountable danger or calamity. అకారణమైన ఆపద. Plunder, కొల్ల, **వల్లడి కాడు** *n.* : One who causes danger without a cause. అకారణముగా ఆపదను కలుగ జేయువాడు. A plunderer, కొల్లపెట్టువాడు.

**వల్లభము** *n.* : A horse of a good breed. మేలుజాతి గుర్రము. *adj.* : Dear. ప్రియమైన.

**వల్లము** or **వల్ల** *n.* : A purse తిత్తి. సంచి.

**వల్లరసి** *n.* : A tree called *Walsure ternata.*

**వల్లరి** *n.* : A tender twig with the sprouting leaves on it. చిగిరించిన లేతకొమ్మ. A bunch of flowers. A compound pedicle, a composite flower; a creeper. పూగుత్తి, చిగురు గుత్తి, తీగె.

**వల్లవుడు** *n.* : A cook, వంటవాడు. A herdsman. గొల్లవాడు. **పల్లవి** n. A cowherdess, a milkmaid. గొల్లది.

**వల్లి** or **వల్లిక** *n.* : A creeper, or climbing plant. తీగ, లత.

**వల్లించు** *v.a.* : To learn or get by heart, to repeat from memory or by rote. వల్లెవేయు, పాఠముచేయు. See వల్లె.

**వల్లిగము** *n.* : An iron hoop which forms the rim of a leathern bucket. బొక్కెన పైని ఇనుప వలయము.

**వల్లువము** : Same as వల్లము.

**వల్లూరము** *n.* : Dried flesh, a dry rasher or steak. ఎండినమాంసము, కరకట్టు, కరవాడు.

**వల్లె** or **వల్లియ** : A noosed rope; a noose for catching cattle. పోవుచున్న యెద్దును కొమ్ములకు వేసి పట్టుకొనే త్రాడు, పాశము. The noose of Varuna. **వల్లెవాటు** or **వలెవాటు** *n.* : A scarf, a term for the upper garment, if gracefully arranged round the neck. సొగసుగా వేసికొన్న ఉత్తరీయము, వల్లెయొక్క వాటువంటివాటు.

**వల్వ** Same as వలువ, *adv.* : Sweetly. Also, the infinitive form of the verb వలచు, వల్వక or వలవక without wishing. వల్వము Same as వల్వ, వలువ or వలువము.

**వళక్షము** *adj.* : White, తెల్లని.

**వళవు** or **ఒళవు** *n.* : A stratagem, trick, device. A secret. ఉపాయము, గుట్టు, మర్మము, బండనలము, తంత్రము.

**వళాగ్రము** *n.* : A superior species of the areca (or betel) nut. క్రముకభేదము.

**వళావళి** *n.* : Excessive joy or pride, కుతూహలము, విజృంభణము.

**వళాసము** *n.* : A bag, pouch, సంచి.

**వళి** *n.* : A fold of the skin or fat forming lines across the belly over the navel. కడుపుమీది ముడత, శరీరపు ముడత. Any fold, ముడుత. A rhyming letter, యత్యక్షరము.

**వళుకు** *n.* : Justice. A dispute, తగవు. A quality, గుణము, ధర్మము.

**వశము** *n.* : Possession, custody, charge. Subjection, submission, లోకువ, స్వాధీనము. **వశపరుచుకొను** *v.n.* : To take possession of, to take under one's control. **వశీకరణము** *n.* : The act of over powering, subduing, or inveigling by charms, spells or drugs. మందుమాకుల చేత స్వాధీనము చేసికొనడము, వశ్యము చేసుకొనడము.

**వషట్కృతము** *adj.* : Burnt as an offering, అగ్నియందు వేల్చబడిన (హవిస్సు).

**వస** *n.* : Sweet flag : Acorus calamus. వసపాలు the root of this, macerated in milk as pap and given to an infant. **వసనాభి** *n.* : Indian Aconite, Aconstum ferox.

**వసంతము** *n.* : Spring time. వసంత ఋతువు. Water mixed with turmeric and lime powder, which is

thrown over people on festive occasions. **వసంతుడు** *n.* : The god of Spring.

**వసత్** *adj.* : Residing in, remaining at, dwelling in. ఉండే, వాసము చేసే.

**వసతి** *n.* : A house, dwelling. ఇల్లు. Convenience, commodiousness, comfort. హాయి, సౌఖ్యము, అనుకూలము.

**వసనము** or **వస్నము** *n.* : Staying, living. ఉనికి, A cloth, robe, వస్త్రము.

**వసము** *n.* : Submissiveness, having under one's control, స్వాధీనత, అధీనత. adj. Submissive, obedient. అధీనము. Possible, శక్యము.

**వసల** or **వసలా** *n.* : A tenon, or piece of wood joined on to another, కొయ్యకు అతుకు వేయు కొయ్య.

**వసార** or **వసారా** *n.* : A verandah. పంచాది, పంచపాళి.

**వసి** *n.* : A spike, a wooden pin. కొయ్యమేకు. **వసివారు** *v.n.* : To fade much, to lose the first brilliancy. మిక్కిలివాడు, కనుగందు.

**వసించు** or **వసియించు** *v.n.* : To dwell, reside, lodge, live. To be, remain ఉండు, వాసముచేయు, నివసించు.

**వసిష్ఠుడు** *n.* : The name of a celebrated hermit బ్రహ్మమానసపుత్రుడు. **వసిష్ఠ వాక్యము** *n.* : Vasistha's dictum. A peremptory command.

**వసులపాతర** *n.* : A sort of fighting cock. ఒక విధమైన పందెపు పుంజు.

**వసులు** *v.n.* : To slip out, be dislocated. తొలగు. **వసిలిపోవు** *v.n.* : To slip out, or be dislocated. తొలగిపోవు.

**వసువు** *n.* : Gold. బంగారు Wealth, riches, ధనము. A gem, a jewel, రత్నము. **వసువులు** or **అష్టవసువులు** *n. plu.* : Eight demi-gods called Vasus They are ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అవలుడు, ప్రత్యూషుడు, అసులుడు, ప్రభాసుడు. **వసుంధర, వసుగర్భ, వసుధ** or **వసుమతి** *n.* : The earth. భూమి, **వసుదేవుడు** *n.* : The father of Krishna. కృష్ణుని తండ్రి.

**వసూలు***n.* :A collection of money, జమ.

**వస్తాదు** *n.* : A henden, a captan, a tutor.

**వస్తి** *n.* : The abdomen or lower part of the belly పొత్తికడుపు. The end of a cloth, బట్టయొక్క మొదటిబద్దె.

**వస్తువు** *n.* : A thing, article, matter, substance, పదార్థము, దినుసు, సరుకు.

**వస్త్రము** *n.* : A cloth, clothes, raiment, dress, చేలము, బట్ట.

**వహవ్వా** *interj.* : Well done, Bravo !

**వహి** *n.* : A book, పుస్తకము. An account book. లెక్క పుస్తకము.

**వహించు** or **వహియించు** *v.a.* : To bear, support, sustain, assume, undertake. **వహనము** *n.* : Carrying, bearing, వహించుట. Anything that carries. A ship, ఓడ. **వహ్ని** *n.* : Fire, the god of fire. అగ్ని.

**వా** (Short for వాయి) *n.* : The mouth, the face. నోరు. **వాతెర** *n.* : The lower lip; lit, the screen of the mouth. పెదవి, అధరోష్ఠము. **వాపాఠము** *n.* : Recitation repeating verses by rote. ముఖస్థముగా నుండడము. **వాపోవు** *v.n.* : To cry out, to chatter or babble. To cry or bewail, రోదనము చేయు. అక్కరలేని మాటలాడు, ఏడ్చు.

**వాంచు** *v.a.* : To bow down, to decline, to bend. వంగజేయు.

**వాంఛ** *n.* : Wish, desire, attachment. ఇచ్ఛ, కోరిక, కాంక్ష. **వాంఛించు** *v.a.* : To desire, long for, wish fancy, like. ఇచ్ఛించు, కోరు, కాంక్షించు.

**వాండ్రు** or **వాండ్లు** *n.* : They those people వారు.

**వాంతి** *n.* : Vomiting. కక్కడము, వమనము, డోకు కొనడము. వాంతి భ్రాంతి or వాంతిభేది vomiting and purging, cholera.

**వాంశికుడు** *n.* : A flute-player, a piper. పిల్లంగ్రోవి నూదువాడు.

**వాక** *n.* : A side. వైపు, కరవాక the shore side. A river, a stream, ఏరు, నది.

**వాకకాయ, వాక్కాయ** or **వాకల్వికాయ** *n.* : The tree called *Carissa carandas*; also, *Carissa spinarum,* the fruit of which is edible. పెద్ద కలివికాయ.

**వాకబు** *adj.* : Skilled, versed in, experienced, accustomed to. *n.* : Experience. అనుభవము, వాకబు చేయు to ascertain by making enquiries.

**వాకము** *n.* : Level సమము, A side, ప్రక్క, Convenience, అనుకూలము.

**వాకర** *n.* : Retching to vomit, ఓకిలింత.

**వాకిలి** *n.* : A door, a door way, a front yard. తలవాకిలి an entrance into a house, a gate way, ద్వారము, గృహద్వారము, plu. వాకిండ్లు, వాకిళ్లు or వాకిళులు.

**వాకుడు** *n.* : A sort of prickly nightshade, *Solanum jacquini*, కంటకారిక.

**వాక్కు** or **వాకు** *n.* : Speech, speaking. A word, పలుకు, మాట. **వాగ్దత్తము** a promise. **వాగ్దానము** giving a promise. వాక్సహాయము interest, recommendation. వాక్పటుత్వము power of speech, eloquence. **వాక్యము** *n.* : A sentence, కర్తృకర్మ క్రియా సంబంధము గల పద సమూహము. **వాగ్దేవత** or **వాగ్దేవి** *n.* : The goddess of speech, Saraswati, సరస్వతీదేవి. **వాగ్ధాటి** *n.* : Readiness of speech, వాగ్ఝరి. **వాఙ్మూలము** *n.* : A deposition, an oral statement. వాచాచెప్పినది. వాచా చెప్పిన దానిని వ్రాసినది.

**వాగ** : Same as వాగె.

**వాగడుపు** *n.* : A swollen belly. వాచిన కడుపు.

**వాగర** *n.* : A painting brush. తూలిక.

**వాగరత** or **వాగర్త** (వాగులు + అరత.) *n.* : The sea-side or shore. సముద్ర తీరము.

**వాగరా** *n.* : A channel, or water course by which water comes into a reservoir. చెరువుకు నీళ్లువచ్చే కాలువ.

**వాగళ్లము** or **వాగళము** (వా + కళ్లము.) *n.* : The circular space round a thrashing floor. కళ్లము చుట్టునుండు చోటు.

**వాగాయిత్తము** : Same as వాగ్వాదము. See under వాక్కు.

**వాగీశుడు** : See under వాక్కు.

**వాగు** *v.n.* : To sound, ring, or emit sound. మోగు. To talk or chatter, అక్కరలేని మాటలాడు, వదరు.

**వాగుర** *n.* : A net, snare, noose, toils or nets for birds or animals. ఉరి, వల. **నాగురికుడు** *n.* : A hunter, a snarer of birds or animals. ఉరులు వలలుపన్ని వేటాడి జీవించేవాడు.

**వాగె, వాగ** or **వాగియ** *n.* : The rein of a bridle, గుర్రపు కళ్లెమును తగిలించేవారు.

**వాచ** *n.* : Another form of వాక్కు. **వాచంయముడు** *n.* : A sage or prophet, మునీశ్వరుడు, మౌని. **వాచకము** *n.* : A word, a significant sound, శాస్త్రిశిక్షిత వాక్కు, వాచ్యార్థమును తెలుపు శబ్దము. (Vulgarly) fluency in reading, వడిగా చదివే శక్తి. **వాచస్పతి** *n.* : The lord of speech, i.e., Brihaspati. **వాచా** *adv.* : Orally, verbally, viva voce, by word of mouth. ఆయన వాచా చెప్పినాడు he said it orally. **వాచాలుడు** *n.* : A talkative man, one who talks idly or blamably, a tattler, వాగుపోతు, ప్రేలేవాడు, మాటకారి.

**వాచరచు** : See under వా.

**వాచారు** *v.n.* : To lament పలవించు, ప్రలాపించు.

**వాచు** *v.n.* : To swell. నొప్పిచేత లావగు. To pine, long, be eager. దేవురించు, ఏకరు.

**వాచూరు** *n.* : The eaves of a house. ఇంటి చూరు చివర, ముంజూరు, వాచూరు పట్టె అనగా ఇంటి ముంజూరును మూసేది.

**వాజపేయము** *n.* : A particular kind of sacrifice, యజ్ఞభేదము.

**వాజి** *n.* : A horse, గుర్రము. A bird, పక్షి. An arrow, బాణము. **వాజిగంధ** *n.* : The name of a plant, Physalis fleauosa, పెన్నేరు.

**వాజివీ** *adj.* : Just, right, reasonable, proper. న్యాయమైన, సరియైన, తగిన.

**వాజ** *n.* : Disgust, రోత. *adj.* : Disgusting, రోతగల.

**వాజము** *n.* : A kind of bird. ఒక విధమైన పక్షి.

**వాటము** *adj.* : Handsome, pretty. అందమైన. Convenient, అనుకూలమైన. *n.* : Convenience, అనుకూలము.

**వాటి** or **వాటిక** *n.* : A garden plet, or orchard. తోట. A place, the site of a house or building. ప్రదేశము, స్థలము.

**వాటు** *n.* : The act of throwing. వైచుట. A blow, stroke, దెబ్బ. A mode, manner, way, fashion, విధము, రీతి. Convenience. కత్తివాటు an incision or cut.

**వాడ** *n.* : A ship, నౌక. **వాడంగి** *n.* : A boat man, ఓడవాడు. The beams of a boat, దోనెకు లోతట్టు వేసే దూలము. **వాడగాలి** *n.* : Wind that blows from the sea, a strong wind.

**వాడ** *n.* : A street, a range or row of houses. వీధి, ఇండ్ల వరుస. Fragrance, scent, పరిమళము.

**వాడి** *n.* : Sharpness of weapons or instruments. ఆయుధాదుల కరుకు, పదును. Heroism, శౌర్యము. **వాడిమగడు** *n.* : A hero, శూరుడు.

**వాడు** *pron.* : in the third person masculine singular. He, that man, ఆ పురుషుడు.

**వాడు** *v.n.* : To wither or fade. మ్లానమగు. **వాడించు** or **వాడుచు** *v.a.* : To cause to wither, వాడజేయు.

**వాడెదవ** *n.* : The end of sugar-cane, చెరుకు చివర.

**వాణి** *n.* : Voice, speech, sound, వాక్కు, పలుకు. The name of the Goddess of Speech, సరస్వతి. ఆకాశవాణి or గగనవాణి a voice from heaven, a voice heard from the sky.

**వాణీశుడు** *n.* : Brahma, as husband of Saraswati, బ్రహ్మదేవుడు.

**వాణిజ్యము** *n.* : Traffic, trade, commerce. క్రయవిక్రయములు చేసే వైశ్యవృత్తి. **వాణిజుడు** *n.* : A trader, merchant, వర్తకుడు, వణిజుడు.

**వాణిని** *n.* : An actress, a dancer, a public singer. నాట్యకత్తె, ఆటకత్తె.

**వాత** (from వాచు.) *n.* : A burning, a brand, a cautery, the mark which it produces. కాలిన లోహముతో రోగము వచ్చిన పశ్వాదులను కాల్చడము.

**వాతము** *n.* : Air, wind, వాయువు, గాలి. Rheumatism, gout, inflamation of the joints. **వాపోతము** *n.* : An infant breeze, a gentle wind, పిల్లగాలి. **వాతాయనము** *n.* : A window, కిటికీ, **వాతాశి** *n.* : A serpent, సర్పము.

**వాతికాసు** or **వాతిబియ్యము** : See under వాయి.

**వాతూలము** *n.* : Wind గాలి. A whirlwind, a gale, a hurricane, సుడిగాలి.

**వాతెర** : See under వా.

**వాత్సల్యము, వాత్సల్యత** or **వత్సలత** *n.* : Parental love, fondness. విశ్వాసము, పుత్రాదుల యందు గలుగు ప్రేమ, పుత్రవాత్సల్యము paternal kindness.

**వాదనము** *n.* : Sound, sounding; beating. వీణాదిధ్వని, వాయించడము.

**వాదము** *n.* : A dispute, discussion, contention. మాటల పూర్వకమైన కలహము, వాగ్వాదము, తగవు. Alchemy, రసవాదము.

**వాదోడు** *n.* : Assistance in word or in speaking, మాటకు సహాయము.

**వాదర** *n.* : The edge of a sword, ఖడ్గాదితీక్ష్ణధార.

**వాదిత్రము** *n.* : A kind of musical instrument. నాల్గు విధములైన వాద్యము. Music, వాద్యధ్వని.

**వాద్యము** *n.* : Any musical instrument. మద్దెల డోలు సన్నాయి వీణె తాళములు మొదలగునవి.

**వాన** *n.* : Rain, a shower, వర్షము. **వానకోకిల, వాన కోయిల** or **వాన కోవెల** *n.* : The Coel or Indian Cuckoo. Also used for a swallow or martin. చాతకపక్షి. **వానతరి** *n.* : The rainy season. వర్షాకాలము, వర్షఋతువు. వానవెచ్చెలి. **వానపాము** or **వానవేగు** *n.* : An earthworm; lit : a rain worm.

**వానప్రస్థుడు** *n.* : A hermit, a recluse. తృతీయాశ్రమమందుండు వాడు. వానప్రస్థము living in a forest.

**వానరము** *n.* : A monkey, or ape, కోతి. వానరుడు a monkey; a mischief-maker, చెడ్డపని చేయువాడు.

**వానస్పత్యము** *n.* : A tree which bears blossoms and fruit; as the mango, Eugenis, & c. పూచికాచేచెట్టు. A tree which bears fruit without flowering is called వనస్పతి.

**వాని** *pron.* : Of him, his. వానియొక్క, వానిన్ or వానిని (the acc. singular of వాడు or the acc. plug. of అది that) Him, or them. Those things, వాటిని. never trust those animals which have tusks, claws, or horns.

**వానీరము** *n.* : A sort of cane or rattan, Calamus rotang. వేతనము.

**వాను** *v.a.* : To make, as pots, (కుండలు) చేయు. **వానించు** *v.a.* : To get (pots) made; to have. **వానీడు** *n.* : A man of the Banian caste, వానెకులము వాడు. An epithet of Kubera. కుబేరుడు.

**వానదండము** : See వాయదండము.

**వాపసు** *n.* : Restitution, returning. వాపసు చేయు to return, తిరిగి ఇచ్చు.

**వాపి** *n.* : A large oblong pond, pool, or lake. పెద్దకోనేరు. A well with steps, నడబావి.

**వాపితము** *adj.* : Sown, as seed. విత్తబడిన. Shaven, గొరగబడిన.

**వాపు** (from వాచు) *n.* : Swelling, protuberance, intumescence, శోఫ, వాచుట. Pining or longing, ఆశ, దుఃఖించుట, ఏకట.

**వాపుచ్చు** *v.a.* : To open the mouth, నోరు తెరచు. To say or tell, చెప్పు. వాపుచ్చని unsaid. that cannot be said, చెప్పని, చెప్పగూడని, **వాపోవు** v.a. To cry out, **అరచు** To cry, bewail, weep, ఏడ్చు.

**వామ** : See under వామము.

**వామదేవుడు** *n.* : A name of Siva, శివుడు.

**వామనము** *adj.* : Dwarfish, short, పొట్టి. *n.* : A tree termed ఊడుగుచెట్టు. **వామన గుంటలు** *n.* : A tablet with fourteen holes for playing at a kind of game. గవ్వలు గాని చింతగింజలు మొదలైనవాటిని గాని వేసి ఆడే రెండు వరుసలుగా ఏడేసి గుంటలుగల పీట. **వామనుడు** *n.* : A dwarf, పొట్టివాడు. An epithet of Vishnu, విష్ణువు.

**వామము** *adj.* : Left, not right. సవ్యము, ఎడమ, Charming, lovely, రమ్యమైన. Crooked, వక్రము, Short, పొట్టి, హ్రస్వము.

**వామలూరము** or **వామలూరువు** *n.* : An ant hill, or mole hill, especially the mounds of earth thrown up by the white ant. పుట్ట.

**వామి** *n.* : A heap as of straw, a stack, any heap, రాశి, ప్రోగు, కుప్ప. A mare, ఆడ గుర్రము. A she-ass, వేసడము, ఆడగాడిద. **వామిదొడ్డి** *n.* : A stack-yard. గడ్డివేయు పెరడు.

**వామింట** or **వాయింట** *n.* : A small shrub, the leaves of which are used medicinally. అజగంధిని.

**వాము** : See ఓమము.

**వాయ** *n.* : A quantity of grain put in a mortar to be pounded at one time; so much grain as the mortar holds at once. దంచుటకు రోటిలో నొకసారి పోయు ధాన్యము.

**వాయుగొట్టు** or **వాచగొట్టు** *v.a.* : To beat so as to cause a swelling. To cause to swell. To make one pine for, వాచునట్లుచేయు, ఏకారునట్లు చేయు.

**వాయదండము** or **వాపదండము** *n.* : A loom, సాలెవాడు నేత సరితట్టెడు పలక.

**వాయనము** *n.* : A cake or cakes offered to the Deity and then given as a present to a Brahmin woman at the commencement of the performance of a vow, వ్రతోద్యాపన కాలమునందు ఉపాయనముగా నిచ్చెడి మోదకము.

**వాయము** *adj.* : Useless, vain, వ్యర్థము.

**వాయవ్యము** *adj.* : Pertaining to the wind, వాయుసంబంధమైన. *n.* : The north-western corner of the earth, the North-west quarter, వాయవ్య దిక్కు.

**వాయసము** *n.* : A crow, కాకి, వాయసఫల న్యాయమనగా కాకతాళన్యాయము. **వాయసారాతి** *n.* : An owl. గుడ్లగూబ. (lit. the foe of the crows).

**వాయి** *n.* : The mouth, నోరు. The face, ముఖము. The edge of any cutting instrument, కత్తియంచు.

**వాయించు** *v.a.* : To beat, strike, sound or play on a drum, a lute, & c. మేళము మొదలైన వాటిని కొట్టు, వీణెమీటు, సన్నాయి మొదలైనవాటిని ఊదు. చదువును గుంటబెట్టి గంట వాయించు to forget what one has learnt.

**వాయిదా** *n.* : A stated period for the discharge of a debt or for the payment of a sum of money, గడువు An adjournment.

**వాయిదార** *n.* : A crooked sword వంకలు గల కత్తి.

**వాయువు** *n.* : Air, wind, గాలి, A rheumatic distemper, rheumatism, వాతరోగము. అజీర్ణవాయువు a species of dyspepsia. **వాయుసఖుడు** n. Lit : the friend of the wind, i.e., fire, అగ్ని.

**వార** *n.* : A skein of thread for weaving, containing eight punjams, ఎనిమిది పుంజముల నూలు. Variance, difference, discrepancy, especially in calculation. (లెక్కలో) ఎచ్చుతక్కువలు.

**వారక** *adv.* : Constantly, unintermittingly, continually, perpetually, సంతతము, శమింపక, ఎడతెగక.

**వారకము** *n.* : A stipend : pay given in advance : money advanced to cultivators to be received again without interest when the crop is reaped. సాగుబడి కాలములో ఇచ్చి ఫలకాలములో వడ్డి లేకుండ మళ్లీ రాబట్టుకొను రూకలు. తకావి.

**వారడ** *n.* : A bit of palmyra leaf, తాటాకు చివ్వ.

**వారడి** *n.* : Deficiency, difference in exchange, loss లోపము, నష్టి, ఆవారడి యిందులో కలిసి వచ్చినది that deficiency is made up by this (gain).

**వారడు** *v.a.* : To give up, చాలించు.

**వారణము** *n.* : Resistance, opposition, warding off a blow, guarding, defence; a shield, నివారించడము, వారించుట. ప్రతిషేధము, డాలు.

**వారణాసి** *n.* : Benares. కాశీ పట్టణము.

**వారబట్టు** (వా + రాన్ + పట్టు) *v.a.* : To drink, ఆపోశించు. To dry up, ఇంకించు.

**వారము** : Another form of వారువము.

**వారము** *n.* : A day of the week, దినము. ఆదివారము మొదలైనది. A time, తడవ, ఆవృత్తి. A multitude, a flock or herd, a quantity, a heap.

**వారయాత్రికుడు** *n.* : A relation by marriage, a relation who comes to witness a wedding. పెండ్లిచుట్టము.

**వారలు** *pron.* : They.

**వారవాణము** *n.* : A piece of armour; a quilted jacket. కవచము, దూది బొంత చొక్కాయ.

**వారసుడు** *n.* : An heir, master, lord, owner, ఒకని సొమ్మునకు హక్కుదారుడు.

**వారావధి** or **వారధి** *n.* : A bridge, వంతెన.

**వారాహి** *n.* : A wild sow, అడవి ఆడపంది.

**వారి** *afix.* : According to, by; as తారీఖువారి according to date, ఆసామివారి man by man.

**వారి** *pron.* : in the genitive case. Of them, వారియొక్క.

**వారి** *n.* : Water, జలము, నీళ్లు. **వారాశి, వారిరాశి** or **వారాన్నిధి** *n.* : A collection of waters. The ocean,

సముద్రము. **వారిజము** *n. Lit* : The water - born, i.e., a lotus or water lily. పద్మము. **వారిధి** or **వారినిధి** *n.* : The sea, సముద్రము. **వారిధి కన్య** *n.* : Lakshmi, the sea-born goddess, లక్ష్మి.

**వారించు** *v.a.* : To do away, drive away, warn off or ward off, avert. To guard, defend, prevent, clude, or oppose. To dissue, forbid. నివారించు, అడ్డగించు, ప్రతిషేధించు.

**వారిణ** or **వారిణె** *n.* : The cord with which the large iron bucket is fastened to the hanging arm of a picota. బానను ఏతపుగడకు కట్టే దారము.

**వారు** *n.* : A strap of leather. తాడువలె నిడువుగా కోసిన చర్మపుచీలిక, సన్నగా కోసిన తోలు.

**వారు** *pron.* : They, వాండ్రు.

**వారుణి** *n.* : The West, the region of Varuna. పడమటిదిక్కు, Any spirituous liquor, కల్లు.

**వారువము** or **వార్వము** *n.* : A horse, గుఱ్ఱము.

**వార్చు** : See వారుచు under వారు.

**వార్త** *n.* : Tidings, intelligence, news, talk, conversation, a report వర్తమానము, వృత్తాంతము, మాట, సంభాషణ. **వార్తావహుడు** or **వార్తికుడు** *n.* : A messenger, వెళ్లి వర్తమానము తెలిసికొని పోయి చెప్పువాడు.

**వార్తాకము** *n.* : The Brinjal, Egg plant, వంగచెట్టు, వంగకాయ.

**వార్తికము** *n.* : A gloss, a commentary, సూత్ర వివరణము గాను సంగ్రహము గాను ఉండే వాక్యము, ఉక్తానుక్తార్థము లను తెలిపెడి గ్రంథము.

**వార్ధకము** *n.* : One age, ముసలి తనము. An assembly of old men, ముసలివాండ్ర సమూహము.

**వార్ధి** : Same as వారిధి.

**వార్ధుషికుడు** *n.* : A usurer. వడ్డిచేత జీవించువాడు.

**వార్పు** : See under వారు.

**వార్వము** : Same as వారువము volcanic fire under a sea, బడబాగ్ని.

**వార్షికము** *adj.* : Pertaining to a year, limited to a year. సంవత్సర కాలపరిమితిగల.

**వాలకము** *n.* : Deceit, మోసము. Hypocrisy, pretence, వేషము.

**వాలధి** or **వాలహస్తము** *n.* : A hairy tail, రోమ గుచ్ఛవత్పుచ్ఛము, ఏనుగు గుఱ్ఱము లోనగువాని తోక.

**వాలము** *n.* : A tail, తోక, A sword, ఖడ్గము. A royal tiger, బెబ్బులి.

**వాలయించు** or **వాలాయించు** *v.n.* : To be compelled or forced, నిర్బంధపడు. *v.a.* : To oppress, force, compel, నిర్బంధించు.

**వాలరుగుడు** (వాలు + అరుగుడు) *n.* : A tailless monkey, a baboon, వాలిడికోతి.

**వాలాయము** *n.* : Force, compulsion, నిర్బంధము. *adj.* : Inevitable, అనివార్యము. Constant, నిరంతరము.

**వాలారు** *adj.* : Sharp, as a sword. Swordlike, resembling a sword, వాడియైన కత్తివలె నుండే. వాలారుతూపు a sharp arrow.

**వాలార్చు** *v.a.* : To brandish a sword కత్తిని ఝుళిపించు.

**వాలిక** *adj.* : Long, నీడుపైన. దీర్ఘమైన. *n.* : A pit in the roof of the mouth, అంగిటిగుంట. **వాలికనడ** *n.* : A certain pace in horses, అశ్వగమన భేదము.

**వాలు** or **వ్రాలు** *v.n.* : To bend or weigh down. To light or perch. To hang loose; to fall down. కొమ్మ మొదలైనవి వంగు, చెట్టుమీది పక్షి దిగు, కిందికి దిగు, దిగువపడు, వంగుజారు, ఒరగు. To increase, అతిశయించు.

**వాలుమెకము, వాల్మెకము** or **వాలు మృగము** *n.* : The sworded beast, i.e., the wild boar. అడవిపంది.

**వాలుక** *n.* : Sand, ఇసుక.

**వాలుగ** *n.* : A kind of fish. **వాలుగకంటి** *n.* : A beautiful eyed woman, a woman whose eyes are as beautiful as those of a fish.

**వాలూరు** *v.n.* : To delay, ఆలస్యమగు.

**వాలెము** : Another form of వాలాయము.

**వాల్మీకి** *n.* : The name of the author of the Sanskrit Ramayana.

**వాల్లభ్యము** *n.* : Authority, rule, ఆధిపత్యము, దొరతనము, Love, affection, Influence, ప్రీతి, విశ్వాసము, బలము, చొరవ.

**వాళి** or **వాళీ** *n.* : Custom, practice, usage, experience, వాడుక. A cattle path, పశువులు పోవుదారి, మా ఇంటివాళి the custom in my family. అది నాకు వాళిలేదు I am not accustomed to it.

**వావదూకుడు** *n.* : An eloquent man, an orator, వక్త, లెస్సగా మాట్లాడు శక్తి గలవాడు, యుక్తియుక్తముగా మాట్లాడు వాడు, వాగ్మి.

**వావాడు** *n.* : An address, ఉపన్యాసము.

**వావి** *n.* : Legality, lawfulness, consaguinity, egitimacy. వరుస. Relationship, బంధుత్వము.

**వావింట** or **వాయింట** *n.* : A small shrub, which is edible and medicinal, అజగంధి, బర్బరి.

**వావిక** *n.* : The pit at the bottom of the throat on the breast bone. కంఠము మొదట నుండు గుంట.

**వావిరి** *n.* : Order, series, క్రమము, అనుగతి Greatness, glory, Patience, quiet, resignation. సహనము. *adj.* : Great, much, అధికము. Following, అనుగతము. Difficult to obtain, ఉత్కృష్టము.

**వావిలి** *n.* : The Five leaved Chaste tree, శేఫాలిక, నిర్గుండి, నల్లవావిలి a shrub

called Justicia ganderusa, Another species is called కొండవావిలి.

**వావురము**: Another form of వారువము. Also, a conveyance, వాహనము.

**వాశితము** or **వాసితము** *n.* : The chirping of birds, or the cry of animals. మృగపక్షుల ధ్వని.

**వాస** : Same as వాసము.

**వాసంతవము** *adj.* : Vernal. వసంత ఋతుసంబంధమైన. *n.* : A cuckoo. **వాసంతి** *n.* : A species of wild jasmine, వసంతకాలపు మల్లె, అడవిమొల్ల.

**వాసకసజ్జిక** *n.* : A woman who expects to meet her husband. తాను అలంకరించుకొని మగనికోసరము కనిపెట్టుకొని యుండు స్త్రీ.

**వాసన** *n.* : Smell, scent, odour, fragrance. Flavour, పరిమళము. Notion, recollection from memory.

**వాసము** or **వాస** *n.* : A rafter of a building. ఇంటి శ్రేణుల మీద వేసెడిది.

**వాసము** *n.* : A house, habitation, abode, dwelling, residence. గృహము.

**వాసరము** *n.* : A day, దినము, వాసరాంతము the close of the day.

**వాసరా** *n.* : Compensation, చెల్లగా ఇచ్చినది.

**వాసవుడు** *n.* : Indra, ఇంద్రుడు.

**వాసి** *n.* : Difference, తారతమ్యము, భేదము, Greatness, ఆధిక్యము, గొప్పతనము. Profit, లాభము, Fame, renown, ప్రసిద్ధి. **వాసికెక్కు** *v.n.* : To rise to celebrity.

**వాసి** *n.* : A resident, inhabitant, dweller. నివసించువాడు, నగరవాసులు citizens, గ్రామవాసులు villagers, వనవాసి a hermit.

**వాసించు** *v.n.* : To dwell, live. To smell or be fragrant. పరిమళించు.

**వాసితము** *adj.* : perfumed, scented. పరిమళింపజేయబడిన.

**వాసుకి** *n.* : The name of a king of the Serpents. ఒక సర్పరాజు.

**వాసుదేవుడు** *n. Lit.* : The son of Vasudeva, i.e., Krishna, కృష్ణుడు.

**వాసె, వాసియ** or **వాసెగ్రోలు** *n.* : A flute or fife, పిల్లంగ్రోవి.

**వాసెన** *n.* : A cloth tied over the mouth of a vessel, particularly of one in which cakes are boiled by steam. కుండ మూతికి కట్టిన గుడ్డ.

**వాస్తవము** *n.* : Reality, truth. తథ్యము, యథార్థము, **వాస్తవము** or **వాస్తవికము** *adj.* : True, real, genuine, యథార్థమైన, తథ్యమైన, వాస్తవికార్థముthe true, real, or literal meaning.

**వాస్తుకము** or **వాస్తూకము** *n.* : A potherb, చక్రవర్తికూర.

**వాస్తువు** *n.* : The site of a house; a house, a habitation, గృహమునకు నిర్ణయింప దగిన భూమి, గృహము, **వాస్తవ్యము** adj. Fit to dwell in, వసింపదగిన.

**వాహనము** n. : A vehicle, or conveyance of anykind; a carriage, car, horse,

& c. పాలకీ గుర్రము మొదలైనవి. **వాహము** *n.* : A horse, గుర్రము.

**వాహిత్థము** *n.* : The part of an elephant's forehead between the frontal lobes. ఏనుగుయొక్క పిన్నుదుటి బుడుసు కిందిస్థానము.

**వి** : A particle and prefix, implying intensity, muchness separation as in విఖ్యాతి, వియోగము.

**వి** : An affix, a contraction for అవి or ఇవి. Thus ఇవి నావి these are mine. ఈ బట్టలు అతనివి these clothes are his.

**వింగడము** or **వింగళము** *adj.* : Separate, వేరు, ప్రత్యేకమైన. Spacious. విశాలమైన. Beautiful, సుందరము. Strange, విపరీతము. **వింగడముగ** adv. Separately. వేరుగా, ప్రత్యేకముగా, **వింగడించు** or **వింగళించు** *v.a.* : To separate, put as under, divide. ప్రత్యేకముచేయు, విభజించు, వేరుపరుచు.

**వింజ** *n.* : Surprise, wonder. విస్మయము.

**వింజరము :** The seer-fish.

**వింజామర** or **వింజామరము** *n.* : A white whisk or chowri, the tail of the Bos grunniens. తెల్లని చామరము. **వింజామరుటావులు** *n.*: *plu.* : A sort of firework, బాణవిద్యలో భేదము.

**వింజిలి** *n.* : A certain fish.

**వింజము** *n.* : The Vindhya mountains.

**వింట** : The ablative of విల్లు a bow. **వింటి.** The genitive of విల్లు. Or of belonging to a bow. విలు సంబంధమైన. **వింటికోల** *n.* : A bow-like instrument used by masons. **వింటిపట్టు** *n.* : The part of the bow where the arrow is fixed.

**వింట** *n.* : Hearing, వినుట. **వింటి** the same as వింటిని, విన్నాను.

**వింటాలము** *n.* : A certain feat in wrestling.

**వింత** *n.* : Curiosity, wonder; oddity, oddness; an odd thing, a rarity, a thing that causes wonder, a marvel, ఆశ్చర్యము, అద్భుతము.

**విందు** *n.* : A treat, entertainment, banquet, feast. **విందుపురుగు** *n.* : A kind of spider.

**విందువు** *adj.* : Intelligent, knowing, wise. లౌకికవైదికకారజ్ఞుడైన, తెలిసిన.

**వింధ్యము** *n.* : The Vindhya mountains.

**వింశతి** *pron.* : Twenty, ఇరువది సంఖ్య. **వింశము** adj. Twentieth. ఇరువదవ.

**వికచము** *adj.* : Expanded blown, open as a flower, వికసించిన.

**వికటము** *adj.* : Large, great, విస్తర్ణమైన, గొప్ప, విరళమైన. Very, crooked. మిక్కిలి వంకరైన. Horrible, frightful, Changed in form or appearance, Reverse, contrary.

**వికత్థనము** *n.* : Praise, స్తోత్రము. Ironical applause, egotistical boasting, irony, ironical or unmerited praise. మిష.

**వికరణిదూలములు** *n. plu.* : The cross lower beams of a shelving roof. చిప్ప పెణకలందు వేసే దూలములు.

**వికర్తనుడు** *n.* : The sun, సూర్యుడు.

**వికలము** *adj.* : Defective, imperfect, mutilated. Decayed, impaired. Confused, agitated. Withered. waning విచ్ఛిన్నమైన, భగ్నమైన, చెడిన, కలుషమైన. **వికలితము** *adj.* : Confused, confounded: decayed, impaired, withered. కలుషితమైన, శిథిలమైన. **వికలుడు** *n.* : A fool, one who is in confusion.

**వికల్పము** *n.* : Confusion, doubt, indecision, ambiguity, an alternative opinion, option.

**వికవిక** or **వికావిక** *adv.* : Much, aloud (a word used of laughter) పకపక.

**వికసించు** or **వికసిల్లు** *v.n.* : To open, blow, expand, as a flower. పువ్వు మొదలైనవి విరియు, వికాసము నొందు.

**వికారము** *n.* : A change of form, nature of quality, alteration; a transition from the quiescent state of the mind. Disease, sickness. Oddness, queerness, ugliness. తిరస్కారము, ప్రకృత్యవ్యధాభావము, మారురూపము నొందుట, రోగము.

**వికీరము** *n.* : A bird, పక్షి. A piece, ఖండము.

**వికీర్ణము** *adj.* : Scattered, spread shout, dispersed, sprinkled, చెదరిన, వెదచల్లబడిన, విక్షిప్తమైన.

**వికీరణము** *n.* : Scattering, వెదజల్లడము.

**వికృతము** *adj.* : Changed, altered, transformed, Imperfect, deformed, faded. వికారమైన, విరూపమైన, విజాతీయమైన, వికలాంగమైన. **వికృతి** *n.* : Change, transformation, metamorphosis; distortion, depravity.

**విక్కము** *n.* : A young elephant, ఏనుగుపిల్ల.

**విక్కవిరియు** : See under విరియు.

**విక్కు** *v.n.* : To stretch out (as the limbs) To swell with pride. ఒడలు విరుచుకొను, నిక్కుకొను, గర్వించు, విజృంభించు.

**విక్రమము** *n.* : Herosim, valour, power, might, energy. శక్తి, అధికబలము, ప్రతాపము, సాహసము, A foot, పాదము. A footstep, పాదవిక్షేపము. **విక్రముడు, విక్రమాదిత్యుడు** or **విక్రమార్కుడు** *n.* : A certain king, the founder of an era wherein the year 1960 is coeval with 1903. A.D.

**విక్రయము** *n.* : Selling, sale, vending. అమ్మడము. **విక్రేత** *n.* : A seller, vender. అమ్మేవాడు.

**విక్రియ** *n.* : Change, alteration of mind, form or condition. వికారము, కించిత్ప్రకృత్యన్యధాభావము.

**విక్రీడితము** *adj.* : Well played or danced. మిక్కిలి ఆడబడిన.

**విక్షేపము** *n.* : Throwing, propelling, casting. వేయడము, విసిరివేయడము,

ఎగరవేయడము. Confusion, perplexity, distress of mind. క్షోభము, కదలిక.

**విక్షోభము** *n.* : Agitation, distress of mind, anxiety, వ్యాకులత, చిత్తక్షోభ.

**విఖ్యాతి** *n.* : Great fame, celebrity. మిక్కిలి ప్రసిద్ధి. **విఖ్యాతము** adj. Very famous, celebrated. మిక్కిలి ప్రసిద్ధమైన.

**విగడియ** *n.* : The sixtieth part of a గడియ, i.e., of a period of 24 minutes.

**విగతము** *adj.* : Quite gone, disappeared. అంతర్హితమైన, బొత్తిగా పోయిన. Gloomy, obscure.

**విగళితము** *adj.* : Much fallen, dropped, మిక్కిలి జారిన, పతితమైన.

**విగాహించు** *v.n.* : To sink, as in water. మునుగు, క్రుంకు.

**విగుర్వించు** (విరుచు + విరుచు) *v.a.* : To break well or thoroughly, చక్కగా విరుచు.

**విగ్రహము** *n.* : War, a battle, యుద్ధము. An image, idol, form, shape; the body. ప్రతిమ, శరీరము, **విగ్రహించు** *v.n.* : To quarrel, to fight, కలహించు, పోరు.

**విగ్రుడు, విఖ్యుడు** or **విఖ్రుడు** *n.* : A noseless person, ముక్కిడి.

**విఘటిక** or **విఘడియ** : Same as విగడియ.

**విఘట్టనము** *n.* : Rubbing, friction, striking. ఒరసికొనుట, కొట్టడము.

**విఘసము** *n.* : The residue of food offered to the gods, to the manes, to a venerable guest, or to a spiritual preceptor. దేవతాతిథి శిష్టాన్నాదికము.

**విఘాతము** *n.* : A hindrance, obstacle, impediment, difficulty, stumbling - block. అడ్డంకి, ప్రతిబంధకము. Evil, harm, damage, చెరుపు. A great blow, పెద్దదెబ్బ.

**విఘూర్ణనము** *n.* : A whirl, gyration. గిరగిర తిరగడము. **విఘూర్ణితము** *adj.* : Spinning, turning, whirling round. గిరగిరతిరిగే.

**విఘ్నము** *n.* : A hindrance, impediment, obstacle, obstruction, అడ్డంకి, ప్రతిబంధము, **విఘ్నపడు** *v.n.* : To be obstructed or hindered, అడ్డిపడు.

**విఘ్నేశుడు, విఘ్నేశ్వరుడు** or **విఘ్నరాజు** *n.* : The usual name of Ganesa (corresponding to Janus) వినాయకుడు. A pot-bellied man, a glutton.

**విచక్షణము** *adj.* : Wise, clever, able, skillful. తెలిసిన, సమర్థుడైన.

**విచారణ** *n.* : Investigation, examination, inquiry, search, research, యథార్థ నిరూపణము, వివేచన, నిష్పాదనము, ఉచితానుచితములు విచారించడము, పరిశీలన, చర్చ.

**విచికిత్స** *n.* : Doubt, uncertainty; an error, mistake. సంశయము, సందేహము.

**విచికిలము** *n.* : A kind of Jasmine; మల్లెచెట్టు, మల్లెపువ్వు, దవనము.

**విచిత్రము** *n.* : Surprise, wonder, astonishment. విస్మయము, చోద్యము, ఆశ్చర్యము. a variegated color, చిత్రవర్ణము.

**విచేష్ట** *n.* : Motionlessness, నిశ్చేష్ట. **విచేష్టించు** *v.n.* : To move about much, to be active.

**విచ్చేయు** *v.n.* : To come, వేంచేయు.

**విచ్చ** *n.* : A small ball of thread. చిన్ననూలు ఉండ.

**విచ్చలవిడి** *n.* : Independence, freedom, స్వాతంత్ర్యము. *adj.* : Independent, free, స్వతంత్రము.

**విచ్ఛాయ** *n.* : A flaw in a precious stone.

**విచ్చు** *v.n.* : To become open or loose, to burst asunder, as a ripe fruit, to be cracked, split or broken, to be dispersed. విరియు, వికసించు, వీడు, చీలు. **విచ్చుకత్తి** *n.* : A drawn sword, ఒరదూసినకత్తి. **విచ్చుమొగ్గ** *n.* : An opening bud, విరియు మొగ్గ.

**విచ్ఛాయము** *n.* : A flying shadow, as that of a flock of birds. పక్షులయొక్క నీడ.

**విచ్ఛిత్తి** *n.* : Parting, separation, ఎడబాటు. Loss, destruction, భంగము. Cutting, నరుకుట.

**విజనము** *adj.* : Solitary, private, lonely, uninhabited. నిర్జనమైన.

**విజయము** *n.* : A great conquest, a complete triumph, a great victory. మిక్కిలి గెలుపు. **విజయదశమి** *n.* : The tenth day of the month Asvayuja, being the day after the festival to Sarasvati, when all books, arms and instruments of trade are worshipped. **విజయ స్తంభము** *n.* : A pillar of victory. జయించి నాటిన స్తంభము. **విజయు** *adj.* : Victorious, triumphant. జయమును పొందిన, జయము గల. *n.* : A conqueror. జయించినవాడు.

**విజాతి** *n.* : A different species, వేరైన జాతి.

**విజిగీష** *n.* : A great desire to conquer, emulation, rivalry. మిక్కిలి జయింపనిచ్ఛ.

**విజితము** *adj.* : Subdued, overcome, conquered. జయింపబడిన. **విజితుడు** *n.* : One who is defeated or conquered, జయింపబడినవాడు.

**విజృంభణము** *n.* : Budding, expanding. వికసనము, వ్యాపకత్వము.

**విజ్ఞప్తి** : Same as విజ్ఞాపనము and విన్నపము.

**విజ్ఞాతము** *adj.* : Celebrated, famous, known, understood. ప్రసిద్ధమైన, తెలిసికొనబడిన.

**విజ్ఞానము** *n.* : Knowledge of science, learning. విశేషజ్ఞానము, శాస్త్రాదుల యందలి జ్ఞానము.

**విజ్ఞాపనము** or **విజ్ఞప్తి** *n.* : Representing, informing. విన్నపము. A petition, request, prayer, making a representation.

**విజ్ఞుడు** *n.* : A skillful man, one who is conversant with (a subject), a wise or learned man. నిపుణుడు, నేర్పరి.

**విజ్జు** *v.n.* : To spread, వ్యాపించు. *n.* : Kicking about, తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము.

**విజ్జోడు, విజ్జోడుగానుండే** or **విజ్జోడైన** *adj.* : Odd, not even, not a pair, discordant.

**విటంకము** *n.* : A dovecote, an aviary. కపోతపాలిక, కొణిగయందలి గువ్వగూడు.

**విటకాడు** or **విటకత్తె** : See విటుడు.

**విటతాటము, విటతటము, విటతాటనము** or **వీటతాటము** *n.* : Confusion, disorder, తారుమారు. adj. Confused, disorderly, తారుమారైన.

**విటపము** *n.* : A branch of a tree with its new sprouts or shoots చిగిరించిన కొమ్మ. A branch, కొమ్మ. A clump, బోదెలేని చెట్టు. **విటపి** *n.* : A tree. వృక్షము. A banyan tree, మర్రిచెట్టు.

**విటుడు, విటకాడు, విటపురుషుడు** *n.* : A lover, a gallant or paramour. పల్లవుడు.

**విట్చరవము** *n.* : A domestic pig, సూకరము, ఊరపంది.

**విడంబనము** *n.* : Imitation, copying, అనుకరించడము, అనుకరణము.

**విడద్రొక్కు** or **విడనాడు** : See under విడు.

**విడవలి** *n.* : A kind of grass used for thatching the roofs of houses. వట్టివేరు కసువు. విడవటిల్లు a house thatched there with.

**విడి** *n.* : A red tint, అరుణకాంతి, Clearness, transparency, brilliancy, నైర్మల్యము, స్వచ్ఛత. Heroism, courage, valour, ప్రతాపము, పరాక్రమము. **విడాకు** *n.* : A loose leaf, Divorce. **విడిసంజ** *n.* : The ruddy dawn or evening, ఎర్రసంజ, విడిపుష్పము an ustrung flower. **విడిది** *n.* : Halting, విడియుట. A lodging, a residence, దిగుబస. విడిసినచోటు. **విడివడు** or **విడిపడు** *v.n.* : To separate, విడు, విడబడు. To slip, జారు, To escape, get free, break loose, to shake off (shame), విడిపించుకొను, జంకు విడుచు. **విడివేట** *n.* : Falconry, డేగవేట.

**విడియ, విడియము, విడెము** or **విద్యము** *n.* : Betel and nut, తాంబూలము.

**విడియు** *v.n.* : To halt, alight, stay. lodge, వసించు, (ప్రయాణికులు దారిలో నొకచోట) దిగు, బసచేయు.

**విడు** *v.n.* : To separate, become loose, వీడు To fall asunder, తనకుతానే వదులు, వీడిపోవు, విరిసిపోవు.

**విడుచు** or **విడ్చు** *v.n. & a.* : To relinquish, leave, quit, abondon, give up, loosen, slacken, untie, undo, To cease, to terminate. చాలించుకొను, మానుకొను, వదలుకొను.

**విడూరశిల** *n.* : The stone called Cat's eye or Lapis lazuli. వైడూర్యము.

**విడ్యెము** : Same as విడియ and విడియము, See under విడి.

**విడ్డూరము** *n.* : Obstinacy, stubbornness, enmity, మూర్ఖత్వము, శత్రుత్వము.

**విద్యము** : Same as విడియము. See under విడి.

**విద్వరము** *n.* : Danger, ఉపద్రవము.

**విణ్మయము** *adj.* : Covered with dung, filthy, foul, పురీషమయమైన.

**విత** : See వితా.

**వితండము** *n.* : Wrangling, controversy, contention. స్వపక్షపాతముగా వాదించెడు వాదము, దుర్వివాదము, అడ్డమాడడము.

**వితంతువు** *n.* : A widow, విధవ.

**వితంసము** *n.* : A net, a chain or other thing made to confine beasts or birds. మృగపక్షిబంధనోపకరణము, వలలు ఉరులు మొదలైనవి.

**వితతము** *adj.* : Stretched, extended, expanded, spread, diffused. విస్తృతమైన, విరివిచేయబడిన. **వితతి** *n.* : An assemblage, quantity, cluster, సమూహము.

**వితథము** *adj.* : False, untrue, అసత్యమైన. *n.* : A falsehood, అబద్ధపు మాట.

**వితము** *n.* : Manner, way, mode, kind, sort. విధము. **వితమరి** *n.* : A skilful person, కార్యదక్షుడు. A husbandman, a peasant, కాపువాడు.

**వితరణము** *n.* : Bounty, liberality. దానము, ఈవి, త్యాగము.

**వితర్కము** *n.* : Reasoning, discussion, doubt, deliberation; a conjecture, opinion, inference. ఊహ, తర్కము, తర్కించడము, సంశయము.

**వితర్ది** or **వితర్దిక** *n.* : A raised seat, or terrace, usually called a pyal. వేదిక. అరుగు, తిన్నె.

**వితలము** *n.* : The name of the second region in Patalam, the infernal or nether world, ద్వితీయాధోలోకము.

**వితస్తి** *n.* : A span; twelve fingers' breadth. జేన, పండ్రెండు అంగుళముల మేర.

**వితా** or **విత** *adj.* : Useless, vain, వ్యర్థము, వృథా. **వితావిత** *adj.* : Quite useless, మిక్కిలి వ్యర్థము.

**వితాకు** *n.* : Horror, confusion, నిశ్చేష్టత, ఎటును తోచక కలవరపడి యుండడము. Forgetfulness, absentmindedness, పారవశ్యము, పరాకు.

**వితాన** *adv.* : In the manner of, like విధముగా, రీతిగా.

**వితానము** *n.* : An awning, tester or canopy, మేలుకట్టు. A heap, a quantity, సమూహము, Extent, విరివి. Empty, శూన్యము, Dull, మందము.

**వితీర్ణము** *adj.* : Crossed, passed, దాటబడిన, Given, ఇయ్యబడిన.

**విత్త** *n.* : A very small sack. మిక్కిలి చిన్నగోనె.

**విత్తనము** : See under విత్తు.

**విత్తము** *n.* : Wealth, riches, ధనము. *adj.* : Known, తెలియబడిన. Obtained, gained, పొందబడిన. Famed, ప్రసిద్ధి నొందిన. Investigated, inquired into, విచారింపబడిన.

**విత్తు** *n.* : He who knows. తెలిసినవాడు, వేదవిత్తు skilled in the Vedas.

**విత్తు** *v.a.* : To sow, విత్తుమొలువవేయు, చల్లు. *n.* : A seed; a testicle, విత్తము, బీజము. **విత్తనము** *n.* : A seed, విత్తు, బీజము.

**విదగ్ధము** *adj.* : Skillful, clever, సమర్థ మైన, నేర్పుగల.

**విదరము** *n.* : Splitting, చీల్చుట.

**విదర్భము** *n.* : A dry, or desert soil, మరుస్థలము. **విదర్భ** a city of that name.

**విదలించు** or **విదల్చు** : See under విదులు.

**విదళనము** *n.* : Breaking, rending, splitting, బద్దలుచేయుట. **విదళము** *n.* : Split pulse. కందులు మొదలైనవాటి పప్పు. Cuttings, chips. పేళ్లు, బద్దలు. **విదళితము** *adj.* : Rent, torn, split, Blown, expanded. పగులగొట్టబడ్డ, చించబడ్డ, వికసించిన.

**విదారణము** *n.* : Tearing, splitting, severing, చీల్చుట. **విదారించు** *v.a.* : To tear, split, పగులగొట్టు, చీల్చు.

**విదాహము** *n.* : Great thirst. మహత్తైన దప్పిక.

**విదిక్కు** *n.* : An intermediate point (or half-point) of the compass, as south-east, south-west, north-west, north-east. రెండు దిక్కుల నడుమ, మూల, ఆగ్నేయాది కోణములు.

**విదితము** *adj.* : Known, understood, evident, plain. తెలియబడిన, స్పష్టమైన, 'వీరు దిక్పాలురు విదితయశులు'.

**విదియ** *n.* : The second day after full moon or new moon. పక్షమందు రెండవ తిథి.

**విదీర్ణము** *adj.* : Torn, split, burst. చీల్చబడిన, Expanded, opened, విచ్చిన.

**విదుడు** *n.* : (In composition), one who knows. తెలిసినవాడు, ఎరిగినవాడు.

**విదులు** or **విదురు** *v.n.* : To fall or drop down. **విదిలింపులు** *n. Plu.* : Chastisement, reprimand, చీవాట్లు.

**విదుషి** *n.* : A learned woman. పండితురాలు.

**విదూరము** *adj.* : Very far or remote. నిండాదూరమైన. వివేకదూరుడు he who is wholly devoid of wisdom.

**విదూషకుడు** : A wag, jester, buffoon. హాస్యగాడు, శృంగారనాయక సచివులలో నొకడు.

**విదేశము** *n.* : A foreign country, abroad, any place away from home పరదేశము, అన్యదేశము.

**విదేహి** *adj.* : incorporeal bodiless, without a body, శరీర విహీనుడైన.

**విద్దె** or **విద్దియ** *n.* : Science, knowledge, learning. చదువు A trick; guile.

**విద్య** *n.* : Knowledge, science, learning, education; an art, చదువు, జ్ఞానము Conjuring, juggling. మహావిద్య the great art,i.e., magic.

**విద్యమానము** *adj.* : Existent, present. వర్తమానము, ఉంటూ ఉండే *n.* : Condition, state స్థితి.

**విద్యుత్తు** *n.* : Lightning. మెరుపు. **విద్యోతించు** *v.n.* : To shine, ప్రకాశించు, వెలుగు.

**విద్రధి** *n.* : A deep seated or internal abscess. గర్భములో పుట్టి నాభిలో బైలు వెళ్లే వ్రణ భేదము. A disordered liver, కడుపులోని బల్ల.

**విద్రవము** or **విద్రావము** *n.* : Fight, retreat, running away from a battle field. పారిపోవడము. Flowing out, leaking.

**విద్రుచు** : Same as విదురుచు or విదిలించు. See under విదులు.

**విద్రుతము** *adj.* : Liquified, melted; flown, running, కరగి నీరుగాకారె.

**విద్రుమము** *n.* : Coral, పగడము. A tender or young leaf or shoot. చిగురు.

**విద్వాంసుడు** *n.* : A learned man, a man of letters. పండితుడు.

**విద్వేషము** *n.* :Enmity, hatred.

**విధ** *n.* : Plenty, సమృద్ధి. **విధము** *n.* : Kind, sort, way, manner, mode, state. ప్రకారము.

**విధవ** *n.* : A widow. పెనిమిటిలేనిది. A term of scorn, applied to both sexes.

**విధాత** or **విధాతృడు** *n.* : A name of Brahma, the creator, బ్రహ్మ.

**విధానము** *n.* : Doing. చేయుట. A command, rule, ordinance, ఆజ్ఞ.

**విధి** *n.* : An order, command, rule, law, నియోగము, విధానము. **విధించు** *v.a.* : To order, command, ordain, prescribe, allot, adjudge, assign. ఆజ్ఞాపించు, నిర్ణయించు, ఏర్పాటు చేయు, కట్టడచేయు. **విద్యుక్తము** *adj.* : Prescribed, legal, యథావిధియైన.

**విధుంతుదుడు** *n.* : A name of Rahu, రాహువు.

**విధురము** *adj.* : Agitated, distressed, overcome with anxiety or distress; bewildered, confused. Separate, absent, భయవివశమైన, విహ్వాలమైన, ఎడబాటు నొందిన, వైకల్యమునొందిన, **విధురుడు** *n.* : A widower, భార్య చచ్చినవాడు.

**విధువు** *n.* : The moon, చంద్రుడు Vishnu, విష్ణువు.

**విధూతము** *adj.* : Shaken, కదలింపబడిన.

**విధేయము** *adj.* : Obedient, చెప్పినట్టు వినే. వినయ విధేయముగా with humble obedience. **విధేయత** *n.* : obedience.

**విధ్వంసము** *n.* : Great ruin, destruction. మిక్కిలి ధ్వంసము, నాశము, **విధ్వంసి తము** *adj.* : Ruined, destroyed, పాడు చేయబడ్డ.

**వినతము** *adj.* : Bowed, bent, stooping, humble, modest. Trained, disciplined, వంగిన, క్రమమైన, గురు శిక్షితమైన, **వినతి** *n.* : Humility, modesty, reverence వినయము. A salutation bowing నమస్కారము.

**వినని** *adj.* : Unheard of, not heard of. శ్రుతము కాని, Not hearing. వినని వాడు a deaf man.

**వినమితము** *adj.* : Much bowed down, declined, humbled, conquered, మిక్కిలి పంచబడిన, వంగిన, జయింపబడ్డ.

**వినమ్రము** *adj.* : Much bent, bowed, humble modest మిక్కిలి వంగిన, లొంగిన.

**వినయము** *n.* : Humility, modesty, gentleness, mildness, reverence, వినతి, వినమ్రత.

**వినా** or **వినాగా** *adv.* : Save except, without, తప్ప.

**వినాయకుడు** : A name of Ganesa, విఘ్నేశ్వరుడు.

**వినాశము** *n.* : Great ruin, total loss, destruction, annihilation.

**వినిందించు** *v.a.* : To blame much, మిక్కిలి నిందించు.

**వినికి, వినికిడి** or **వినిపించు** : See under విను.

**వినిమయము***n.* : barter, exchange, ఒక వస్తువును ఇచ్చి మరొకటిని పుచ్చుకోవడము, వస్తువుల మారుపు. A pledge, deposit, security, కుదువ.

**వినియోగము** *n.* : Using, use, utility, advantage, serviceableness, ఉపయోగము.

**వినిర్గతము** *adj.* : Gone out, departed from. అవగతమైన, బయలువెడలిన. "నిత్యప్రతాపి వినిర్గతపాపి".

**వినిర్మలము** *adj.* : Very pure, or clear, నిష్కల్మషమైన.

**వినిర్ముక్తము** *adj.* : Liberated, let loose or free, exempt, free from, విడువబడిన.

**వినివారణము** *n.* : Prevention; an obstacle, hindrance.

**వినివేదితము** *adj.* : Offered, as sacrifice. నైవేద్యము చేయబడిన.

**వినిష్క్రాంతము** *adj.* : Going out, setting out బయలువెడలిన.

**వినిష్ఠ్యూతము** *adj.* : Cast, thrown, sent, directed, despatched, ejected from the mouth, spit. వినిర్గతమైన, ఉమ్మివేయబడిన.

**వినీతము** *adj.* : Humble, modest, trained వినయముగల, శిక్షితమైన.

**వినీలము** *adj.* : Black. నల్లని.

**విను** *n.* : The sky, ఆకాశము. **వినుసిగ దేవర** *n.* : Siva.

**విను** *v.a.* : To hear, to listen to, ఆకర్ణించు. To pay attention to, give heed to, obey. **వినిపించు** or **వినుచు** *v.a.* : To cause to hear. వినజేయు.

**వినుతము** *adj.* : Laudable, praise worthy, స్తుతింపదగిన.

**వినూత్నము** or **వినూతనము** *adj.* : Novel, new, fresh, నవీనమైన, కొత్త.

**వినోదము** *n.* : Play, sport, pastime; an interesting pursuit, pleasure స్త్రీ పురుషులు క్రీడాదులచేత కాలయాపన చేయడము, క్రీడ, వేడుక, విలాసము, మృగయా వినోదము pleasures of the chase.

**విన్కలి** : See under విను.

**విన్కి** : Same as వినికి, See under విను.

**విన్న** *adj.* : Pale. వివర్ణమైన. **విన్నదనము** or **విన్నన** *n.* : Dejection, sorrowfulness, ఖేదము, చిన్నతనము.

**విన్ననువు** *n.* : Skill, నేర్పు. Manner, విధము.

**విన్నపము** *n.* : A petition, request. మనవి, విజ్ఞాపనము.

**విన్నము** *adj.* : made known, తెలియబడిన. Considered, విచారింపబడిన.

**విన్నవించు** *v.a.* : To represent, tell, narrate మనవి చేయు, విజ్ఞాపనము చేయు, విజ్ఞాపించు.

**విన్నాణము** *n.* : Capacity, skill, dexterity. సామర్థ్యము, నేర్పు, చాతుర్యము.

**విన్ను** (another form of విను) *n.* : The sky.

**విన్యసించు** *v.a.* : To keep, to place or put, ఉంచు.

**విపంచి** or **విపంచిక** *n.* : A lute. వీణ.

**విపక్వము** *adj.* : Raw, not boiled, పండని, పరిపక్వము కాని.

**విపక్షము** *n.* : An enemy's side, శత్రుపక్షము.

**విపణము** *n.* : Selling, అమ్మకము. **విపణి** *n.* : A shop, a stall, a market place. అంగడి, అంగళ్ల బజారు, అంగడి వీధి. A merchant, వర్తకుడు.

**విపత్తి** or **విపత్తు** *n.* :n. A crisis; a sad event, calamity, misfortune, disaster, ఆపద, ఇడుమ. **విపన్నుడు** *n.* : One who is unfortunate, ఆపన్నుడు, ఆపదనొందినవాడు.

**విపథము** *n.* : A wretched road, a bad path, చెడుత్రోవ.

**విపరి** *n.* : Exchange, విపరిదస్తావేజు a deed of exchange.

**విపరీతము** *n.* : Contrariety, reverse, queerness. Abundance. విపర్యయము, వ్యత్యస్తము. **విపర్యయము** or **విపర్యాసము** *n.* : That which is opposite, contrary, reverse. Difference, వ్యత్యాసము.

**విపశ్చిత్తు** or **విపశ్చితుడు** *n.* : A learned man. విద్వాంసుడు.

**విపాకము** *n.* : Ripeness, maturity, Result, event. The fruit or consequence of action. The crisis or fulness of time. పరిపాకము, పరిణామము, పాకము, భాగ్యము.

**విపాటనము** *n.* : Breaking, dashing to pieces. బద్దలు చేయడము.

**విపాదిక** *n.* : Sores or blisters in the hands and feet. A kibe or ulcerated chilblain. పాదస్ఫోటము.

**విపినము** *n.* : A forest, wood, jungle, అడవి.

**విపులము** *adj.* : Extended, huge, big, vast, large, much, deep. విరివియైన, విస్తారమైన. **విపుల** *n.* : The earth, భూమి.

**విప్పు** *v.a.* : To open, untie, loose. ముడివిప్పు to untie a knot. కథను విప్పు to solve a riddle. **విప్పుగు** *adj.* : Large, great, wide. విశాలమైన.

**విప్ర** : See under విప్రుడు.

**విప్రకృష్టము** *adj.* : Remote, distant. దూరమైన.

**విప్రతిపత్తి** *n.* : Disbelief, unbelief, want of confidence, అపనమ్మిక, Confusion of mind, కలత. Enmity, విరోధము.

**విప్రయోగము** *n.* : Separation, especially of lovers. వినియోగము, స్త్రీ పురుషుల యెడబాటు.

**విప్రలంభము** *n.* : Separation. ఎడబాయుట. Deceiving (by a false affirmation or by not keeping a promise), a quarrel. విసంవాదము, ఒప్పుకొని లేదని పోట్లాడడము. **విప్రలబ్ధ** *n.* : A mistress whose lover is not true to appointment. సంకేతస్థలమందు ప్రియునిగానక మోసము పోయి దుఃఖపడు నాయిక. **విప్రలబ్ధము** *adj.* : Tricked, cheated. వంచింపబడిన.

**విప్రలాపము** *n.* : A self - controdictory expression or statement, nonsense విరుద్ధమైన మాట విప్రశ్నిక ములో A witch, సోదెకత్తె.

**విప్రియము** *adj.* : Disliked, disagreeable, displeasing, అనిష్టమైన, అసహ్యామైన.

**విప్రుడు** *n.* : A Brahmin. బ్రాహ్మణుడు. **విప్రవినోదులు** *n. plu.* : A certain class of Brahmins who are jugglers. గారడివిద్య గాండ్రైయుండే బ్రాహ్మణులు.

**విప్లవము** *n.* : Ruin; a national calamity. దేశోపద్రవము.

**విఫలము** *adj.* : Fruitless. నిష్ఫలమైన.

**విబుధుడు** *n.* : A god, an immortal, వేలుపు, దేవత. A learned man, a teacher, విదుషి.

**విబూది** *n.* : Ashes, బూది, భస్మము, విబూదిపత్రి a plant called *Ocimum* basilicum.

**విభ** *n.* : Lustre, light. తేజస్సు. **విభాకరుడు** or **విభావసుడు** *n.* : The sun, సూర్యుడు.

**విభక్తము** *adj.* : Divided, proportioned. విభజింపబడిన, పంచబడిన. **విభక్తి** *n.* : A share, విభాగము.

**విభవము** *n.* : Wealth, riches, సంపద, ధనము, ఆ ఉత్సవము విభవముతో జరిగినది the festival was grandly performed. **విభవ** *n.* : The name of a Telugu year.

**విభాగము** *n.* : A share, part, portion, పాలు. Division into shares. పంపకము, పంచుట.

**విభాతము** *n.* : Dawn, daybreak. ప్రాతఃకాలము.

**విభావము** *n.* : Acquaintance. Attraction or excitement; that which attracts or excites, as dress or perfumes, పరిచితి, కామోద్దీపనము.

**విభావరి** *n.* : Night, రాత్రి.

**విభావసుడు** : See under విభ.

**విభాష** *adj.* : (In Telugu grammar) optional.

**విభిన్నము** *adj.* : Broken. భగ్నమైన, విభిన్నచిత్తులై with broken hearts.

**విభీతకము** *n.* : A tree called *Beleric myrodalan*, or *Terminalia belerica*. కర్షఫలము, తాండ్రచెట్టు.

**విభీషణము** *adj.* : Formidable, fearful, terrific, alarming. మిక్కిలి భయంకరమైన, దారుణమైన. **విభీషణుడు** *n.* : The name of Ravana's brother.

**విభు** *adj.* : Omnipresent, all pervading, eternal. నిత్యము, సర్వగతము. **విభుడు** or **విభువు** *n.* : Lord, master, ruler, స్వామి, ప్రభువు. దైవమే విభువు God is lord alone, God is above all.

**విభూతి** *n.* : Blessedness, divine excellence or power. Happiness, సంపద, ఐశ్వర్యము. **విభూతిపండ్లు** *n.* : Balls of white ashes, తెల్లనిబూడిద ఉండలు.

**విభూషణము** *n.* : An ornament, decoration. ఆభరణము.

**విభేదము** *n.* : Dividing, breaking wounding. Difference, discrepancy, distinction, separation. Enmity, విచ్ఛేదము, పథక్త్వము, వైపరీత్యము, శత్రుత్వము.

**విభ్రమము** *n.* : Turning round, whirling. An error, mistake; doubt, misapprehension, భ్రాంతి, సంశయము. Female dalliance, love, beauty, విశోభ, అలంకారము, విలాసము.

**విభ్రాజిత** or **విభ్రాజి** *adj.* : Splendid, luminous, shining. ప్రకాశితమైన.

**విమతుడు** *n.* : A dissenter, one of another opinion, an opposer; one who is malevolent or spiteful, an ill wisher, an enemy, విరుద్ధమైన మతము గలవాడు, అన్యమతస్థుడు, శత్రువు.

**విమర్దనము** *n.* : Grinding, rubbing, pounding, trituration. నూరడము, పూయడము.

**విమర్శ, విమర్శము** or **విమర్శనము** *n.* : Examination, scrutiny, investigation; an inquiry, trial. విచారణ.

**విమలము** *adj.* : Pure, stainless, unspotted. Clear, apparent, evident, sound. నిర్మలమైన, ఒప్పిదమైన.

**విమాత** *n.* : A step mother, సవతితల్లి.

**విమానము** *n.* : The chariot of a god, దేవతలు ఆకాశమందు ఎక్కి తిరిగెడి రథము.A car, vehicle, carriage. An emperor's palace. చక్రవర్తియొక్క సౌధము.

**విముక్తము** *adj.* : Quite liberated, freed, redeemed. మిక్కిలి విడువబడిన, నివృత్తమైన, విమోచనము చేయబడిన.

**విముఖుడు** *n.* : One who has turned away his face, పరాఙ్ముఖుడు.

**విమోచనము** *n.* : Liberation, liberating. విముక్తి. నాకర్మ విమోచనమైనది my troubles are over.

**విమోహము** *n.* : Great or excessive passion or love, మిక్కిలి మోహము.

**వియత్** or **వియత్తు** *n.* : The sky, ఆకాశము. **వియద్గంగ** *n.* : The heavenly Ganges, ఆకాశగంగ.

**వియమము** or **వియామము** *n.* : Pain, బాధ.

**వియుక్తము** *adj.* : Separated, sundered. వియోగముగల, **వియుక్తుడు** *n.* : One who is separated, వియోగి.

**వియోగము** *n.* : Separation, disunion, absence, especially of lovers. Death. ఎడబాయడము, ఎడబాటు, చావు. నాకు భార్యా వియోగమయిన తరువాత after I lost my wife.

**వియ్యము** *n.* : Connection by marriage, binding together, వైవాహిక సంబంధము, ఇచ్చి పుచ్చుకోళ్లు, సంబంధము. **వియ్యంకుడు** *n.* : The father of one's son-in-law or daughter-in-law. **వియ్యపురాలు, వియ్యంకురాలు** or **వియ్యపుసాని** *n.* : The mother of one's son-in-law, or daughter-in-law.

**విరిగి** *n.* : A certain tree called Cordia-myxa. శ్లేష్మాతకము. Also, ground that is cracked, పగుళ్లు వాసిన నేల.

**విరిచికట్టు** *v.a.* : To pinion (a man) or tie his arms behind his back. పెడరెక్కలు కట్టు, చేతులను వెనుకకు మళ్లించి కట్టు.

**విరిదట్టు** *adj.* : Separated. ఎడబాటు నొందిన, వియుక్తము.

**విరిపోటు** *n.* : Grudge, ill will, enmity, పగ, ద్వేషము, భేదము.

**విరియు** *v.n.* : To blow, open or expand, as a flower, వికసించు. To burst, crack or open. To be loosed or dishevelled, as hair.

**విరివాయు** *v.n.* : To split, separate, part, divide. చీలు, పాయలగు.

**విరివి** or **విరివిడి** *n.* : Expanse, width, breadth, extent, విస్తృతి, విశాలత, వెడల్పు, Abundance, విస్తారము.

**విరుగు** *v.n.* : To break or go to pieces. తునియు, భగ్నమగు. To curdle. To fail, to be defeated. ఓడ, దండువిరుగు, ఓడిపోవు.

**విరుగుడు** *n.* : An antiodote, a remedy, విరుపు, నివారణము. **విరగపాటు** *n.* : Pride, haughtiness, గర్వము, బోర్లబడుట, **విరుచు** *v.a.* : To cause to break, to break. To counteract poison. విరుగజేయు.

**విరుద్ధము** *adj.* : Opposed, opposite, reverse, contrary, inconsistent, contradictory, disagreeing with another, hostile, inimical, unfriendly, విరోధముగల, ప్రతికూలమైన, అసంగతమైన, విపరీతమైన, *n.* : Opposition, contrariety, incongruity, enmity. ప్రతికూలత, అసంగతము, శత్రుత్వము, విరోధము.

**విరూపము** *adj.* : Deformed, ill-shaped, ugly. కురూపమైన, Crooked, వంకరైన. Old, చేసి, *n.* : Deformity, ugliness, వికృతరూపము. కురూపము **విరూపాక్షుడు** *n.* : A name of Siva, శివుడు.

**విరేచనము** *n.* : Evacuation by stool, purging. ప్రవృత్తి, భేది, పాచనము.

వానికి నాలుగుమాట్లు విరేచనములు అయినవి he had four motions. **విరేచనకారి** adj. Cathartic, purgative, భేది అయ్యే.

**విరోచనుడు** *n. Lit.* : one that shines: a name of the sun, the moon, or fire, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, Also, the name of Prahlada's Son.

**విరక్తి** *n.* : Dislike, aversion, disinclination : a loathing or disgust at earthly enjoyments. విరాగము.

**విరగడ** : See under విరుగు.

**విరచించు** *v.a.* : To write much; to make, form, frame, compose, విశేషముగా రచించు, చేయు.

**విరజ** *n.* : The name of the river Styx. వైకుంఠము వద్ద ఉండే ఒక నది.

**విరజాజి, విరజాది, విరవాటి** or **విరవాది** *n.* : The Double jasmine. నవమాలికా వృక్షము, దాని పువ్వును.

**విరటుడు** *n.* : The king of the Virata country.

**విరతి** *n.* : Stopping, ceasing, rest, pause, cessation. The caesura or pause in a verse. విరామము, విశ్రాంతి.

**విరథుడు** *n.* : One who is uncoached or flung from his chariot, రథవిహీనుడు.

**విరమించు** *v.n.* : To cease, to be at an end, to rest, తీరు, ముగిసిపోవు, విశ్రాంతి బొందు.

**విరళము** or **విరాళము** *n.* : A certain tax. ఒకవిధమైన పన్ను. **విరళముగా** *adv.* : Distinctly, clearly, స్పష్టముగా, **విరళి** adj. Broad, విశాలము.

**విరవాయు** *v.n.* : To separate, part, divide. వ్రీలు, పాయలగు, **విరవారు** (విర + పారు) *v.n.* : To fly dispersedly. చెదరిపారిపోవు. **విరవిర** *n.* : Blossoming, విరియుటు. Kicking about spasmodically. Paleness.

**విరసము** *n.* : Unpleasantness, bad terms, ill-will disagreement, కలహము.

**విరహము** *n.* : Separation, parting, absence of lovers, ఎడబాటు, వియోగము.

**విరహితము** *adj.* : Separated, left, విడువబడిన. Devoid of, లేని, **విరహితుడు** *n.* : One who is without, or devoid of, లేనివాడు.

**విరహోత్కంఠిత** *n.* : She whose husband or lover is absent. విరహము చేత వేదనపడే నాయిక.

**విరాగము** *n.* : Indifference to the world and the pleasures of sense; absence of desire or passion; stoician, విరక్తి.

**విరాజమానము** *adj.* : Very bright, brilliant, మిక్కిలి ప్రకాశించుచున్న.

**విరాట్టు** or **విరాట్పురుషుడు** *n.* : The Deity, God ఆదిదేవుడు, విరాడ్దేహము the corporeal form of the deity.

**విరామము** *n.* : Rest, respite, interval, remission, pause. end, conclusion, విశ్రాంతి, విరతి, అవసానము.

**విరాలము** or **విరాళము** *n.* : A tax or impost. ఒక విధమైన పన్ను. See

విరాళము. **విరాళి** *n.* : Piety, devotion, భక్తి, విరాళికొలువు to enamour.

**విరావము** *n.* : Sound, ధ్వని, మ్రోత.

**విరి** *n.* : A flower, పువ్వు, adj. Blooming, blown, as a flower, వికసించిన, Dispersed, scattered, dishevelled, తొలగిన, Free from, liberated వీడిన, విముక్తమైన. **విరిబోడి** or **విరిబోణి** *n.* : A blooming girl, a woman, స్త్రీ.

**విరించి, విరించనుడు** or **విరించుడు** *n.* : A title of Brahma, the creator, బ్రహ్మ.

**విరోధము** *n.* : Difference, opposition, contradiction disagreement, discrepancy, enmity, animosity. Detriment, harm, mischief, misdemeanor. ద్వేషము, పగ, విరుద్ధత, గిట్టమి, చెరుపు, అడ్డంకి, **విరోధికృత్తు** *n.* : The name of the Telugu year.

**విఱ్ఱవీగు** *v.n.* : To be proud, swell, be puffed up. గర్వించు, ఉబ్బు, మిక్కిలి నిక్కు.

**విలంఘించు** *v.a.* : To cross over, pass, transgress. మిక్కిలి లంఘించు, అతిక్రమించు, దాటు.

**విలంబము** or **విలంబనము** *n.* : Delay, tardiness, loitering, procrastination. Delaying, retarding. ఆలస్యము చేయడము.

**విలక్షణము** or **విలక్షణత** *n.* : Difference, భేదము.

**విలక్షము** *adj.* : Astonished, surprised, abashed, ఆశ్చర్యము గల, సిగ్గుపడ్డ.

**విలగ్నము** *n.* : The waist. నడుము. adj. Well struck or hit, చక్కగా తగిలిన.

**విలపించు** *v.n.* : To lament, wail; to be in grief or affliction. తలచుకొని తలచుకొని ఏడ్చు, వగరు.

**విలయము** *n.* : Dissolution, destruction, ruin, annihilation. కల్పాంతము, ప్రళయము, వినాశము.

**విలవిల** *n.* : Convulsiveness, తన్నుకొనుట యందగు ధ్వన్యనుకరణము, విహ్వలత. *adv.* : Convulsively, గిజగిజ.

**విలసత్** *adj.* : Shining, splendid. ప్రకాశమైన, **విలసనము** *n.* : Sporting, dallying. విలాసము, క్రీడ, Brightness, ప్రకాశము.

**విలాతి** *n.* : A foreign country. దేశాంతరము. A country, దేశము. **విలాయతి** or **విలాయతు** *n.* : An inhabited country, a foreign country. విలాయతీ గ్రామము a hamlet or dependant village.

**విలాపము** *n.* : Sorrow, sorrowful speech, దుఃఖముతోడి మాట. **విలాపించు** Same as విలపించు.

**విలాపము** *n.* : A label, direction, the superscription on a letter. పైని వ్రాసిన పేరు, జాబు మీద వ్రాసిన చిరునామా, పైవిలాసము. **విజయ విలాసము** the tale of Arjuna. **విలాసవతి** or **విలాసిని** *n.* : A flit, a coquette, a playful girl, స్త్రీ, వేడుకగల స్త్రీ.

**విలియ** or **విలియా** *n.* : Arrangement, order, distribution, classification.

విలియావేయు to compose, arrange in order, assign.

**విలు** or **విల్లు** or **విల్** *n.* : A bow, ధనుస్సు, **విలుకాడు, విల్కాడు, విలుదాలుపు** or **విలుదాల్పు** *n.* : An archer or bowman, ధనుర్ధరుడు, ధానుష్కుడు.

**విలుచు** or **విల్చు** *v.a.* : To buy purchase, కొను To sell అమ్ము.

**విలుప్తము** *adj.* : Obsolete, extinguished, forgotten, erased wanting, విస్మృతమైన, స్ఖలితమైన, మరచిపోయిన, లోపము చేయబడిన.

**విలులితము** *adj.* : Tremulous, shaking, waving, కదిలే, చలించే.

**విలువ** or **విల్వ** *n.* : Price, cost, value, ధర, వెల, క్రయము, విలువకనుచోటు a market, or place for sale. **విలువకాడు** or **విల్వకాడు** *n.* : A buyer, వెలయిచ్చి కొనువాడు, క్రయికుడు.

**విలేపనము** *n.* : Smearing; rubbing with ointment. అంగలేపనము, పూయుట, చందనాదులపూత. **విలేపి** *n.* : Rice gruel, గంజి.

**విలోకించు** *v.a.* : To see, behold, gaze at, view, observe. చూచు, **విలోచనము** n. Seeing, looking at, observing. The eye కన్ను.

**విలోమము** *adj.* : The wrong way, the reverse way, the opposite order or course, against the hair, against the grain, ప్రతిక్రమము.

**విలోలము** *adj.* : Tossed, rolling.

**విల్లు** or **విలు** *n.* : A bow, ధనుస్సు, విల్లునమ్ములు or విల్లంబులు a bow and arrows. విల్లెక్కుపెట్టు to brace, a bow. విల్లెక్కుదించు to unbrace a bow, Gen. Sing. వింటి and the nom. *plu. :* విండ్లు, నూరువిండ్ల దూరములో a hundred bow-shots off. See విలు.

**విళంగము** or **విలంగము** *n.* : A vegetable and medicinal substance considered of great efficacy as a vermifuge, చిత్రతండులము, వాయువిళంగపు చెట్టు.

**విళంబి** *n.* : The name of a Telugu year.

**వివక్ష** *n.* : A wish to speak. చెప్పనిచ్ఛ. Intention, the aim of a speaker, desire. (In Telugu) Difference, distinction, భేదము. **వివక్షువు** *n.* : One who wishes to speak, చెప్పనిచ్ఛించువాడు.

**వివరణము** or **వివరము** *n.* : An explanation, specification, comment; a description, a detailed account, విస్తరించిచెప్పడము, వర్ణనము, టీక, వాఖ్యానము.

**వివర్జితము** *adj.* : Left, abandoned, shunned. త్యజింపబడ్డ.

**వివర్ణము** *adj.* : Pale, pallid, colourless, వికృతవర్ణమైన, నిస్తేజస్కమైన. **వివర్ణుడు** *n.* : One who has turned pale, వెల్లబారినవాడు.

**వివర్తనము** *n.* : Revolving, turning round, revolution, going round, circumambu-

lating. కనీనికాచలన భేదము, పొరలడము, ప్రదక్షిణము, తిరగడము, చుట్టి వచ్చుట, తిరిగి వచ్చుట. **వివర్తము** *n.* : Dancing, నృత్యము.

**వివర్ధనము** *n.* : Increase, అభివృద్ధి.

**వివశత** *n.* : Helplessness, ecstasy, a trance, పరవశత్వము, కోపవివశత a fit of fury. ఆనందవివశత an ecstasy of joy.

**వివస్వంతుడు** *n.* : The sun, సూర్యుడు, A god, వేలుపు.

**వివాదము** or **వివాద** *n.* : A contest, altercation, dispute or quarrel, వాక్కలహము, తగవు. వివాదపడు or quarrel, altercate.

**వివాహము** *n.* : A marriage, wedding, పెండ్లి, పరిణయము. Eight kinds of marriages are distinguished as బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, అసురము, గాంధర్వము, రాక్షసము, and పైశాచము.

**వివిక్తము** *adj.* : lonely or solitary, రహస్యము, ఏకాంతము.

**వివిధము** *adj.* : Various, varied, of different kinds, multiform, diverse. నానావిధమైన, అనేక విధములు గల.

**వివృతము** *adj.* : Open, gaping, expanded, particularized, explained, described. వికసించిన, తెరవబడిన, విప్పబడిన, వివరింపబడిన.

**వివేకము** *n.* : Discrimination, judgement, the faculty of distinguishing, prudence, discretion, సదసద్వివేచన, విభేదజ్ఞానము, తెలివి. **వివేచన** or **వివేచనము** *n.* : Discrimination, examination, investigation. విమర్శ, విచారణ, వర్ణవివేచన discrimination of caste.

**వివ్వచ్ఛము** *n.* : Devastation, destruction. Killing, నాశము.

**విశంకటము** *adj.* : great, large, a giganitc గొప్ప బృహత్తయిన, విరివిగల

**విశంకితము** adj. Alarmed, fearful, suspected. భీతిల్లిన.

**విశదము** *adj.* : White, clear, pure, pellucid. తెల్లని, నిర్మలమైన, పరిశుద్ధమైన. Evident, apparent, manifest. స్పష్టమైన, విశదదుర్మతుల downright villains.

**విశకలితము** *adj.* : disordered, jumbled, suspected వాసస్థానము.

**విశయము** *n.* : A dwelling place, వాసస్థానము.

**విశల్యము** *adj.* : Boneless. Thornless, Free from care or pain, నిర్గత శూలము, నిష్పీడము. **విశల్యకరణి** *n.* : A plant, సంజీవి.

**విశసనము** *n.* : Killing, alaying, slaughter. చంపడము, సంహరించడము. **విశసించు** *v.a.* : To kill, alay. చంపు.

**విశాఖ** *n.* : The name of the 16th lunar mansion. **విశాఖము** *n.* : The act of standing with the legs about a foot apart from each other. **విశాఖుడు** *n.* : A name of Kumarswamy, కుమారస్వామి.

**విశాయము** *n.* : Taking rest by turns (as applied to watchmen) A turn, పర్యాయము.

**విశారదుడు** *n.* : One who is learned, or wise, బాగా చదువుకొన్నవాడు, విద్వాంసుడు. A clever or skilful, famous, or celebrated man; an adept or expert. ప్రగల్భుడు, ప్రసిద్ధుడు, విబుద్ధుడు, నేర్పరి.

**విశాలము** *adj.* : large, wide, broad, spacious. విస్తీర్ణమైన, విరివియైన, గొప్ప. **విశాలాక్షి** *n.* : An epithet of Parvati, Lit. Large-eyed.

**విశిఖ** *n.* : A high way, or carriage road, వీధి, రాజమార్గము. **విశిఖము** *n.* : An arrow, బాణము.

**విశిష్టము** *adj.* : (In composition) Endowed with, possessed of, having. కూడుకొన్న, గల, Excellent, superior, distinguished.

**విశిరస్కుడు** *adj.* : Beheaded, headless. తలనరకబడిన, వాణ్ని విశిరస్కునిగా జేసిరి they beheaded him.

**విశీర్ణము** *adj.* : Loosened, that had lost the cohesion, or connection of its parts; that has fallen or is falling to pieces; వదిలిన, విచ్చిపోయిన, వీడిపోయిన, రాలిపోయిన Withered, decayed. శిథిలమైన.

**విశుద్ధము** *adj.* : Pure, clean, cleansed, purified, pious, holy, virtous, నిర్మలమైన, పవిత్రమైన.

**విశృంఖలము** *adj.* : Unchecked, unfettered, అడ్డులేని, అనర్గళమైన.

**విశేషము** *n.* : Sort, kind, species, variety, భేదము, విధము. A particularity, speciality, peculiarity, singularity. **విశేషణము** *n.* : (in grammar). An adjective. విశేష్య లక్షణములను చెప్పేది. గుణవాచక శబ్దము.**విశేషించు** *v.n.* : To excel. అతిశయించు. **విశేష్యము** *n.* : a noun or substantive నామవాచక పదము, వస్తువాచక శబ్దము.

**విశ్రమము** or **విశ్రామము** *n.* : Rest, repose, cessation from fatigue or work. విశ్రాంతి, ఊరట. In Telugu verse, it denotes a certain kind of rhyme. ఛందస్సులోయతి, పద్యవిరామము.

**విశ్రాణనము** *n.* : A gift, or donation. త్యాగము, ఈవి.

**విశ్రావము** or **విశ్రుతి** *n.* : Great fame, మిక్కిలి ప్రసిద్ధి, ప్రఖ్యాతి.

**విశ్లేదము** *adj.* : Loose, relaxed, వీడిపోయిన.

**విశ్లేషము** *n.* : Separation (especially of lovers), disunion, disjunction. విరహము, వియోగము, ఎడబాటు.

**విశ్వ** *n.* : The earth, భూమి.

**విశ్వము** *n.* : The universe or world, లోకము, జగత్తు, adj. All, universal, entire, సర్వమైన, సమస్తమైన. **విశ్వంభర** *n.* : The earth. భూమి, **విశ్వంభరుడు** *n.* : An epithet of Vishnu or Indra. విష్ణువు, ఇంద్రుడు, **విశ్వకర్మ**

**సంతుష్టము** *adj.* : Delighted, pleased, satisfied. హృష్టమైన, ఆహ్లాదముగల, ఉల్లసితమైన. సంతుష్టాంతరంగుడై being filled with joy.

**సంతోషము** *n.* : Pleasure, satisfaction, joy, delight. ప్రమదము, హర్షము.

**సంత్యక్తము** *adj.* : Deserted, left, quitted, abandoned. విడువబడిన, పరిత్యజింపబడిన.

**సంత్రస్తము** *adj.* : Frightened, alarmed. భయపడిన.

**సంత్రాసము** *n.* : Fear, alarm, భీతి, భయము.

**సందంశము** *n.* : Pincers, కమ్మరవాని పటుకారు.

**సందడి** *n.* : A thick crowd, mob. సమ్మర్దము, ఒత్తుడు, గుంపు Noise, clamour, uproar, a tumult, disturbance, సమ్మర్దధ్వని.

**సందరము** or **సంద్రము** *n.* : The sea.

**సందర్భము** *n.* : Stringing beads, weaving garlands, etc. Meeting, connection, coherence. Convenience, opportunity, occurrence, context, కూర్చుడము, గుచ్చుడము, కట్టడము, సంధించడము, క్రమము, అనుపూర్వి అనుకూలము, సమయము, సంభవించడము.

**సందర్శనము** *n.* : Seeing, looking, a view, A visit, meeting నిరీక్షణము, చూడడము.

**సందష్టము** *adj.* : Bitten, stung. కొరకబడిన.

**సందానము** *n.* : A tether. పలుపు. **సందానితము** or సందితము adj. Tied, bound, కట్టబడిన.

**సంది** : Same as సందు.

**సందిగ్ధము** *adj.* : Doubtful, questionable. సంశయమైన.

**సందిబొందె** (from సందలి.) *n.* : An ornament for the arm, an armlet, బాహుపురి.

**సందియము** *n.* : Doubt, uncertainty, suspicion. సందియపడు Same as సందేశము.

**సందిలి** *n.* : The arm from the shoulder to the elbow. దండచెయ్యి.

**సందు** or **సంది** *n.* : A small opening, a fissure, crack, hole, బొత్త, చిల్లి, బీటిక. Space, an interval. ఎడము, మధ్యప్రదేశము, మధ్యకాలము.

**సందుగు** *n.* : A small box.

**సందె** *n.* : Evening, సాయంకాలము. Daily prayers used by Brahmins, & c. సంధ్యావందనము.

**సందేశము** *n.* : A message, news, tidings. వర్తమానము, సమాచారము.

**సందేహము** *n.* : Doubt, hesitation, suspicion, mistrust, uncertainty. సందేశము.

**సందోహము** *n.* : An assemblage, multitude. సమూహము.

**సంద్రము** : See సందరము. సంద్రుడు Same as సముద్రుడు.

**సంధ** *n.* : A vow, promise. Resolution, determination. ప్రతిజ్ఞ, శపథము. Extent, limit, మర్యాద. మేర, ఆవధి. Also, same as సంధ్య.

**సంధర్షణి** *n.* : India rubber.

**సంధానము** *n.* : Holding together, joining, uniting, కూర్చుట, సంఘటనము. Reconciliation.

**సంధి** *n.* : Connection, union, combination, junction, coalescence. కూడిక, చేరడము, కలియడము. A joint of the limbs, కీలు.

**సంధించు** or **సంధిల్లు** *v.n.* : To be joined to or united with, కూడు. **సంధిల్లు** or **సంధిల్లు** *v.n.* : To happen, occur; to meet, ప్రాప్తమగు.

**సంధుక్షితము** *adj.* : Lighted, inflamed, kindled. రగిలింపబడిన, మండింపబడిన.

**సంధ్య** *n.* : Twilight in the morning or evening. సంధ్య or సంధ్యావందనము morning or evening prayer. ప్రాతస్సంధ్యా వందనము matins.

**సంపంగి, సంపంగె, సంపగియ** or **సంపెగ** *n.* : The 'gold flower'.

**సంపత్తి, సంపత్తు** or **సంపద** *n.* : Fortune, riches, wealth, prosperity. ఐశ్వర్యము, కలిమి, శ్రేయస్సు.

**సంపర్కము** *n.* : Union, connection, contact, కలయిక, చేరిక, కూడిక.

**సంపాకము** *n.* : A tree, *Cassia fistula*, అరగ్వధము, రేలచెట్టు.

**సంపాటము** *n.* : Weighing a jewel with all things connected with it.

**సంపాతము** *n.* : Descending, falling, coming down, a fall. పతనము.

**సంపాదనము** *n.* : Acquisition, earning, getting, acquiring. అర్జనము, గడించుట, సంపాదించుట.

**సంపుటము** *n.* : A casket, a covered box. బరిణ. A volume of a book or magazine. **సంపుటించు** *v.a.* : To close as a flower. To fold the arm. ముకుళించు.

**సంపూజనము** *n.* : Honouring, veneration, esteem, treating with respect. మిక్కిలి గౌరవించడము, సమ్మానము, ఆదరము.

**సంపూర్ణము** *adj.* : Complete, finished, whole, entire : filled, full of, perfect. అఖిలము, సమగ్రము.

**సంవృక్తము** *adj.* : United, joined, సంయుక్తము.

**సంపెంగ** : See under సంపంగి.

**సంపెట** *n.* : A sledge-hammer. ఇనుము సాగగొట్టెడు సమ్మెట.

**సంప్రతి** *n.* : A head accountant. లెక్క సరిచూచు పెద్ద కరణము. An accountant, కరణము.

**సంప్రదానము** *n.* : Giving, bestowing. ఇవ్వడము. In grammar, the Dative case, చతుర్థీ విభక్తి, షట్కారకములలో నొకటి.

**సంప్రదాయము** *n.* : A rule, routine, method, doctrine, custom, convention, system, practice, tradition,

వంశపు తీరు, గురు పరంపర చేత వచ్చినది. పరంపరా ప్రాప్తధర్మము, వాడుక.

**సంప్రయోగము** *n.* : A good use, చక్కని ప్రయోగము. Association, relation, connection. సంబంధము.

**సంప్రసారణము** *n.* : A grammatical term applied to the substitution of ఇ, ఉ, ఋ, ఒ. for య, వ, ర, ల in sandhi.

**సంప్రహారము** *n.* : War, a battle, a fight, యుద్ధము.

**సంప్రాప్తము** *adj.* : Attained, obtained, gained, become arrived, come. పొందబడిన, వచ్చిన, సంభవించిన. కలిగిన, లభించిన.

**సంప్రీతి** *n.* : Affection, kindness. విశ్వాసము, ప్రేమ.

**సంప్రేరణము** or **సంప్రేరణ** *n.* : An exhortation, inatigation. బుద్ధి, బోధన.

**సంప్రేషము** *n.* : Sending. An order, command, పసుపు, నియోగము.

**సంప్రోక్షణము** *n.* : A ceremonial sprinkling of water.

**సంఫుల్లము** *adj.* : Well blown, well expanded, చక్కగా వికసించిన.

**సంబంధము** *n.* : Connection, relation, relationship, relevancy, affinity. సంపర్కము, చుట్టరికము, చేరిక, కూడిక, పొందిక.

**సంబడము** : See సంబళము.

**సంబరము** or **సంభ్రమము** *n.* : Joy, delight.

**సంబరి** : See సంబళి.

**సంబరేను** or **సంబరేణి** *n.* : A kind of shrub. చర్మకష.

**సంబళము** or **సంబడము** *n.* : Wages, hire. బత్తెము. Salary, జీతము Batta, దారిబత్తెము.

**సంబళి, సంబడి, సంబరి** or **చెంబడి** *n.* : A pariah, మాలవాడు.

**సంబళించు** or **సంబడించు** *v.n. & a.* To be convenient. పల్లపడు. To manage, furnish, supply. సమాళించు, నిర్వహించు, తెప్పిరు, పోషించు.

**సంబళిక, సంబెల** or **సంబెళ** *n.* : A wallet or sort of pouch, to hold betel leaf, areca-nut and ime. అడపము, వక్కలాకుసంచి.

**సంబవులు** : See సంబాళిగలు.

**సంబాగువు** *n.* : A raft to cross a river on. ఏరుదాటే సాధనము.

**సంబాధము** *n.* : Difficulty, trouble; a crowded place. ఇరుకు, సంకటము, ఒత్తుడు, సంకట స్థలము, ఇరుకు స్థలము. *adj.* : Narrow, contracted, impassable, impervious; crowded, ఇరుకైన, ఒత్తుడుగా నుండే, చొరడా నకు అసాధ్యమైన.

**సంబారము** or **సంబారు** (సంభారము) *n.* : A mixture of spices for seasoning. Spicery, condiments, curry powder, కూరలలో వేయు రసవర్గము, ఆవాలు మెంతులు జీలకర్ర మొదలైనవి. సంబారపు చింతపండు tamarind mixed with spicery.

**సంబాళించు** *v.a.* : To comfort, console, ఆదరించు.

**సంబాళిగలు, సమ్మాళిగలు** or **సంబవులు** *n.* : Sandals, పావుకోళ్లు. Shoes, slippers, పాపోసులు, పాదరక్షలు.

**సంబావులు** *n.* : plug. A very fine sort of rice కుసుమధాన్యములు. ఉత్తమ మైన వడ్లు. గురుడముక్కు సంబావులు another kind.

**సంబుద్ధి** : See సంబోధనము.

**సంబెల, సంబెళ** or **సంబెల పెట్టె** : See సంబళిక.

**సంబోధనము** *n.* : Addressing, calling to. పిలవడము, ఆమంత్రణము, సంబుద్ధి. In Grammar, the vocative case. **సంబుద్ధి** *n.* : Calling, పిలవడము ఆమంత్రణము, సంబోధనము.

**సంబ్రము** : Same as సంబరము.

**సంభవము** *n.* : Birth, production. The origin, cause, reason. motive. ఉత్పత్తి, పుట్టుక. హేతువు. *Adj.* : Arising from, produced from, descending from.

**సంభారము** *n.* : Provision, preparation. Collection, a multitude, number, quantity, assemblage, సంభీతము, పదార్థసంచయము, సమూహము, సర్వపూర్ణత్వము, గణము.

**సంభావన** or **సంభావనము** *n.* : Honour, esteem, respect, worship. A present, reward, prize gift. Vulgarly. alms or money distributed among Brahmins, సన్మానము, గౌరవము, పూజ, దక్షిణ. **సంభావనీయము** *adj.* : Honorable, worshipful. సన్మానింపదగిన, గౌరవింపదగిన, పూజ్యమైన.

**సంభాషణ** or **సంభాషణము** *n.* :conversation, talk.

**సంభూతము** *adj.* : Born, produced, arisen, spring, ఉత్పన్నమైన పుట్టిన.

**సంభృతము** *adj.* : Well supported. చక్కగా భరింపబడిన Gained, got. సంపాదింపబడిన. Possessed of. Filled, full. నిండింపబడిన. **సంభృతి** *n.* : The act of supporting well. చక్కగా భరించుట.

**సంభోగము** *n.* : Coition, sexual intercourse. రతి, సంభోగించు.

**సంభ్రమము** *n.* : Passion, emotion, confusion, excitement, agitation, flurry, hurry. తొందర, వేగిరపాటు, భయము, తొట్రుపాటు, అత్యాచారము, ఉత్సాహము.

**సంయమని** *n.* : The name of the capital of Yama. యముని పట్టణము.

**సంయమము** *n.* : To traint or control of the passions. Humanity, compassion, the temper that shuns giving pain to others, gentleness. పరపీడాది నివృత్తి, హింసాదులను విడిచి పెట్టుట. **సంయమి** *n.* : A hermit, or monk. ముని, సంయమము గలవాడు.

**సంయుక్తము** *adj.* : Combined, joined, united, connected with, possessed of. కూడుకొనిన, కల. సంయుక్తా క్షరము a double letter as *l* in పిల్లి.

**సంయుగము** *n.* : War; a battle, combat. యుద్ధము.

**సంయుతము** *adj.* : Well combined or joined, united, connected with. మిక్కిలి కూడుకొన్న.

**సంయోగము** *n.* : Union, junction, connection, association with సంగమము, సంసర్గము, కూడిక. **సంయోజితము** *adj.* : Connected, joined, united with. సంలగ్నమైన, మిళితమైన, కూర్పుబడిన.

**సంరంభము***n.* : Haste, flurry, agitation, trepidation, fear. తొందర, ఇష్టానిష్టకార్య జాతత్వర. వేగిరపాటు, తొట్రుపాటు, భయము. wrath, rage, కోపము.

**సంరక్షణ** or **సంరక్షణము** *n.* : Sustaining, support, maintenance, nourishment, guardianship, charge patronage. పోషణ, పాలనము, కాపాడడము.

**సంరావము** *n.* : Sound, noise. ధ్వని, మ్రోత.

**సంరూఢము** *adj.* : Budded, blossomed, grown, అంకురితము, పెరిగిన.

**సంరోధము** *n.* : An impediment, hindrance. ఆటంకము, అభ్యంతరము.

**సంలాపము** *n.* : Discourse, conversation, friendly talk. సల్లాపము, ప్రీతితో గూడిన సంభాషణము, ముచ్చట.

**సంవత్** *n.* : A year, అబ్దము, ఏడు. **సంవత్సరము** *n.* : A year.

**సంవర్తకము** *n.* : The plough of Balarama. బలరాముని నాగలి.

**సంవర్తము** *n.* : A destruction of the universe. ప్రళయము.

**సంవర్తిక** *n.* : The new leal of a water lily. లేత తామర రేకు.

**సంవసథము** *n.* : A village, గ్రామము.

**సంవాదము** *n.* : A conerence, discussion, dispute, contention, wrangling. సంభాషణము, కలహము, తర్కించడము.

**సంవాహనము** *n.* : Carrying, చక్కగా మోసికొనిపోవుట. Handling, rubbing, pressing the limbs, massage, అంగమర్దనము, ఒళ్లు పిసకడము.

**సంవిత్తు** or **సంవిత్తి** *n.* : Wisdom, understanding, intellect. బుద్ధి, తెలివి, జ్ఞానము.

**సంవీతము** *adj.* : Surrounded, enclosed, encompassed. ఆవృతము, ఆవరింప బడిన.

**సంవృతము** *adj.* : Covered, concealed, encompassed, clothed with, చుట్టుకొనబడిన.

**సంవేగము** *n.* : Hurry, hasty త్వర, వేగిరపాటు.

**సంవేది** *n.* : He who knows. ఎరిగిన వాడు, తెలిసినవాడు. **సంవేదితము** *adj.* : Made known, తెలియజేయబడిన.

**సంవేశము** *n.* : Sleep, నిద్ర A seat, పీఠము.

**సంవ్యాసము** *n.* : An upper garment, a cloak. ఉత్తరీయము, పైబట్ట.

**సంశప్తకుడు** *n.* : A picked man or soldier, one of a select band sowrn never to recede and stationed to prevent the flight of the rest, శపథం కృత్వాయుద్ధాదనివర్తిని, తిరిగిపోనని ఒట్టుపెట్టుకొని యుద్ధము చేయువాడు. A hero, శూరుడు.

**సంశయము** *n.* : Doubt, uncertainty, suspicion, hesitation. సందేహము. **సంశయాళువు** *n.* : A suspicious man, an irresolute man. సంశయించు *v.n.* : To doubt, suspect, hesitate. సందేహించు, అనుమానించు.

**సంశ్రయము** *n.* : A refuge, asylum, ఆశ్రయము, శరణము, అండ.

**సంశ్లేషము** *n.* : An embrace, union, connection, junction, coalescence. కౌగిలింత, ఆలింగనము, సంగము. సంధి, కలయిక.

**సంసక్తము** *adj.* : Joined కలిసిన, చేరిన. Near, adjoining, connected or endowed with, అవ్యవహితమైన, సంలగ్నమైన. **సంసక్తి** *n.* : Union, adherence; nearness.

**సంసత్తు** *n.* : An assembly, meeting, audience, కొలువుకూటము, సభ.

**సంసరణము** *n.* : A highway. రాజ మార్గము, బాట.

**సంసరించు** *v.n.* : To be born. జన్మించు.

**సంసర్గము** *n.* : Union, connection, intercourse, సంశ్లేషము, సంబంధము.

**సంసారము** n. The world, the mundane state. Domestic life, secular life. A family, household. పెండ్లాము బిడ్డలతో కూడియుండడము. Birth, పుట్టుక. **సంసారి** a good or respectable woman, కుల స్త్రీ.

**సంసిక్తము** *adj.* : Wet, humid. తడిసిన.

**సంసిద్ధి** *n.* : Nature. స్వభావము. Perfection, completion, accomplishment. లెస్సగా లభించడము, చేకూరడము. **సంసిద్ధుడు** *n.* : One who is perfect or accomplished. సంపూర్ణుడు.

**సంసృతి** *n.* : The world, the mundane state, a domestic life, secular condition; a family, household, సంసారము.

**సంసృష్టము** *adj.* : Connected, united. సంయుక్తమైన, సంశ్లిష్టమైన. **సంసృష్టి** *n.* : Union, connection, సంసర్గము.

**సంసేవనము** *n.* : Waiting on, serving. పరిచర్య చేయడము, ఉపాసన చేయడము.

**సంస్కరించు** *v.a.* : To reform, improve, repair, make better. బాగుచేయు. To purify, sanctify, consecrate, శుద్ధిచేయు, ప్రతిష్ఠించు. To burn a corpse (శవమును) దహనముచేయు. **సంస్కారము** *n.* : The act of making better or improving, reformation. చక్కజేయుట.

**సంస్తంభవము** *n.* : The name of a magic arrow which arrests the progress

of an enemy. శత్రువును భ్రమన్పరచే అస్త్రవిశేషము. **సంస్తంభించు** *v.a.* : To make firm or rigid. స్థాపించు, సిద్ధముచేయు.

**సంస్తవము** *n.* : Praise, స్తోత్రము, చక్కనిస్తుతి. Acquaintance, intimacy. పరిచయము. **సంస్తవకారి** *n.* : One who praises.

**సంస్థానము** *n.* : A state, government, dominion, province. రాజ్యము.

**సంస్థాపనము** : Placing, fixing, establishing. నిర్ధారణ చేయడము, స్థితి కరణము. **సంస్థాపకుడు** *n.* : A founder, author. కల్పించినవాడు, ఏర్పరచినవాడు.

**సంస్థితి** *n.* : Abiding, being, residing with. ఉండడము, **సంస్థితము** adj. Fixed, Established, settled, abiding in. ఉన్నవాడు.

**సంస్పర్శ** *n.* : Touch, contact, feel. తాకడము, చక్కని స్పర్శము. Touched, తాకిన, అంటిన.

**సంస్పృహ** *n.* : Wish, desire, inclination. మిక్కిలి ఆశ, వాంఛ.

**సంస్ఫాలనము** *n.* : Slapping, dashing. చరచడము.

**సంస్మరణము** *n.* : Recollection, remembrance. తలచడము.

**సంహతి** *n.* : A flock, assembly, heap, collection, సమూహము, రాశి.

**సంవహనము** *n.* : Rubbing the limbs. ఒళ్లు పిసకడము. The body, శరీరము.

**సంవహరించు** *v.a.* : to kill, destroy. చంపు. **సంహారము** or **సంహరణము** *n.* : Destruction, annihilation, killing. **సంహృతి** *n.* : Destruction, loss. సంహారము.

**సంహిత** *n.* : A peculiar arrangement of the Vedas into short divisions; a collection or compilation of hymns or prayers or legends extracted from a Veda. శాఖ, వేదపరిచ్ఛిన్న వాక్యవిన్యాసము, శాస్త్రము. **సంహితము** *adj.* : Collected, compiled, joined. సంచితమైన, సంయుక్తమైన, కూర్పబడిన.

**సకర్మకక్రియ** *n.* : An active or transitive verb. కర్మసాపేక్షితమైన క్రియావాచక పదము.

**సకలము** *n.* : The aggregate or whole. సమస్తము, సర్వము, అఖిలము, యావత్తు. *adj.* : All, entire, whole. సమస్తమైన, అఖిలమైన.

**సకలాతు, సకశాతు** or **సగశాతు** *n.* : A kind of woollen cloth. మేలైన కంబళిదినుసు.

**సకి** or **సకియ** *n.* : A female friend or companion చెలికత్తె. a woman, ఆడది. **సకుడు** *n.* : A friend, companion. చెలికాడు, స్నేహితుడు.

**సకిన, సకినె** or **సగిన** *n.* : An artificial bird, the figure of a bird. కృత్రిమపక్షి, కిర్రుబిళ్ల. A doll, బొమ్మ.

**సకియ** : Same as సకి.

**సకిలించు** or **సగిలించు** *v.n.* : To neigh. గుఱ్ఱము కూయు, గుఱ్ఱము హేషారవము చేయు, హేషించు.

**సకుటుసుమారుగా** *adv.* : Here and there, scatteredly, moderately, on an average, సకృత్తుగా.

**సకృచ్ఛముగా** *adv.* : Without reserve, entirely, సమస్తము, ఏమిన్ని దాచకుండా, యావత్తు.

**సకృత్, సకీత్తు, సకృత్తుగా** *adv.* : Rarely, seldom, scarcely. ఎప్పుడైనా ఒక మాటు, అరుదుగా, అపరూపముగా, ఆసకృత్ incessantly.

**సక్తము** *adj.* : Attached, joined, in contact with. లగ్నమైన, తగులుకొనిన (మనస్సు).

**సక్తుచేయు** *v.a.* : To use violence. నిర్బంధము చేయు. సక్తుహుకుము a positive order.

**సక్తువు** *n.* : Flour. పొడిపిండి, పేలపిండి.

**సక్థి** *n.* : The thigh, ఊరువు, తొడ. సక్థిమూలము the root of the thigh.

**సఖి** *n.* : female friend. చెలియ, చెలికత్తె. **సఖుడు** *n.* : A friend, fellow, companion, playmate. స్నేహితుడు.

**సగటు** or **సగుటు** *n.* : Average, సరాసరి. సగటున or an average.

**సగటు** *n.* : The bishop (in chess)

**సగతు** *n.* : Embroidery made of wire in patterns. తీగెమోడిగా వేసిన సరిగె పని.

**సగము** *n.* : Half. అర్ధము. సగానికి సగము ఎక్కువ ఉన్నది it is half as much again. **సగపాలు** or సాబాలు *n.* : A moiety, a half share.

**సగలాడు** *n.* : A woollen cloth.

**సగిన** : See సకిన.

**సగిలించు** : See సకిలించు.

**సగటు** : See సగటు.

**సగుడము** *adj.* : Mingled with treacle. బెల్లముతో కలిసిన.

**సగుణము** *adj.* : Having attributes or qualities.

**సగోత్రుడు** *n.* : A distant. kinsman a kinsman of the same family name. సమాన గోత్రపురుషుడు, జ్ఞాతి, ఏకవంశస్థుడు, దాయ, దాయాది.

**సగ్గారి** or **సగ్గాలము** *n.* : A jackal, నక్క.

**సగ్గిసముగ్గిసలు** *n.* : plug. Suffocation, ఉడ్డుగుడుపు.

**సగ్గు** or **స్రగ్గు** *v.n.* : To decrease, grow less, abate, he diminished, to sink, go down. To die, మట్టుపడు, క్షీణించు, అడగు, తగ్గు, చచ్చు.

**సగ్గుబియ్యము** *n.* : Sago.

**సగ్గెడ** *n.* : A metal vessel, చెంబు.

**సగ్ధి** or **సజగ్ధి** *n.* : Eating together. సహభోజనము, నలుగురుకూడి భోజనము చేయడము, విందు, బంతికుడుపు.

**సచివుడు** *n.* : A minster or counsellor. మంత్రి. A friend, companion or associate, చెలికాడు. A helper. సహాయుడు. కేళిసచివుడు a playmate, or playfellow.

**సచ్చవము** *n.* : A petty loan, చిల్లర రొక్కమప్పు.

**సచ్చు** : Same as చచ్చు, సంపు Same as చంపు.

**సజగ్గి** : Same as సగ్గి.

**సజావు** *adj.* : Straight, honest. Clear, plain. తిన్నని, స్పష్టమైన, ఆటంకములేని.

**సజీవము** or **సంజీవి** *adj.* : Having life, living, alive. సప్రాణియైన. సజీవుడు or సజీవితుడు *n.* : One who is alive. ప్రాణవంతుడు.

**సజ్జ** *n.* : An armour, a piece of armour, కవచము. Adornment, అలంకరణము. **సజ్జక** *n.* : A bed-room, పడకయిల్లు.

**సజ్యము** *adj.* : Strung (as a bow), having a bowstring. అల్లెగల. సజ్యకార్ముకము a bow with the string attached.

**సజ్జ** *n.* : A kind of grain. Holcus spicatus, గంటెలు. An upper story in a house, శిరోగృహము. adj. Read prepared, అయితము.

**సజ్జనకోల** *n.* : A scourge or whip, a rod.

**సజ్జారము** *n.* : A stall or stable for an elephant. రాణు, ఏనుగను కట్టే చోటు.

**సట** *n.* : An untruth, lie; a trick : cunning, intricacy. అబద్ధము, మాయ, మోసము, కపటము, చిక్కు. సటవట మాటలు boasting lies or idle talk, జల్లిమాటలు. A mane, జూలు.

**సడ** *n.* : A thick crop of young sprouts. దట్టమగు నారువరుస.

**సడపు** *v.a.* : To steal, misappropriate, అపహరించు.

**సడలు** or **సళ్లు** శ్లథ. *v.n.* : To become slack or loose, to fall off. వదలు, వీడిపోవు, ఊడు, జారు.

**సడవ** *n.* : A way, దోవ, మార్గము.

**సడి** *n.* : Infamy, disgrace. అపకీర్తి. Slander, reproach, censure, blame. దూరు, అపవాదము, నింద, దూషణ. A trace, జాడ.

**సడించు** *v.a.* : To pound, or beat rice. దంచు. **సడింపులు** or **సడింపుబ్రాలు** *n.* : plug. Rice properly beaten, దంపుడు బియ్యము.

**సడికుడక** *n.* : A kind of cake. అపూప విశేషము.

**సడికె** or **సడికియ** *n.* : A leash for dogs. కుక్క మెడత్రాడు.

**సడుగులు** *n.* : plug. The joints of the hip. కటిప్రదేశమునందలి కీళ్లు. Crooked or cunning words, వంకరమాటలు.

**సడ్డ** *n.* : Care, beed, regard, honor, respect. అక్కర, లక్ష్యము, గౌరవము.

**సడ్డకుడు** *n.* : A co-son-in-law. తోడిఅల్లుడు.

**సణుగు** or **సణగు** *v.n.* : To grumble, to mutter, to mumble. గొణుగు.

**సత్** *adj.* : True, good, virtuous. Excellent, venerable, respectable, pure, holy. యథార్థమైన, ఘనమైన, మంచి, పావనమైన. **సచ్చిదానందము**

God, as the fountain of being, intelligence. **సద్గుణము** virtue, a good quality, సుశీలము. **సన్మార్గము** good or virtuous conduct, మంచి నడత.

**సత** *pron.* : Troisquatre (seven) at dice or cards. ఆరునొకటి, సప్తసంఖ్య.

**సతకడము** or **సతుకుట** (for చదవడము) *n.* : A scornful expression for the word చదవడము reading.

**సతతము** *adj.* : Eternal, continual. నిరంతరము, ఎడతెగని. *adv.* : Always, ఎల్లప్పుడు. **సతము** (from సతతము) *adj.* : permanent. శాశ్వతము.

**సతాయించు** *v.a.* : To tease, torment, annoy. హింసించు, బాధించు.

**సతి** *n.* : A virtuous woman, పతివ్రత. One who burns herself with the corpse of her husband. సహగమనము చేయు స్త్రీ. A woman in general. A name of Parvati, పార్వతి.

**సతిసప్తమి** *n.* : The ablative case absolute. ప్రథమావిభక్త్యర్థమందు వచ్చే సప్తమీ విభక్తి.

**సత్కరించు** *v.a.* : To worship, honour, treat politely. సన్మానించు. **సత్కారము,** సత్కృతి, సత్క్రియ or **సత్కర్మము** *n.* : A good act, an act of piety or charity honor, respect, courteous treatment, మంచిపని, సన్మానము.

**సత్త** *n.* : Essence, sap. సారము. Existence, being. విద్యమానత, ఉనికి. Excellence, goodness, efficacy, మంచితనము, శ్రేష్ఠత్వము, సారస్యము.

**సత్తమము** *adj.* : Best, most excellent, most pure, very holy. మరీమంచి, మిక్కిలి శ్రేష్ఠమైన, పూజ్యమైన.

**సత్తరువు** *n.* : A choultry, a lodge or halting place, a hotel or rest house. సత్రము.

**సత్తా** *pron.* : Seven.

**సత్తి** *n.* : Power, ability, energy, strength, force, vigour. శక్తి. బలము, బలిమి. A goddess, కాళికాదేవి, పార్వతి.

**సత్తు** *n.* : Essence, sap, strength. సారము, బలము. సారాంశము. Pewter, తగరము. Sediment, refuse. (from సత్యం) Truth, సత్యము. **సదసద్వివేకము** descrimination between true and false.

**సత్తువ** or **సత్తువు** *n.* : Strength, vigour, force, power, energy, capability. బలము, శక్తి. సత్తువగల భూమి a rich soil.

**సత్తెవంగ** *n.* : A kind of grain. సస్యవిశేషము.

**సత్యము** *n.* : Truth, veracity, reality. నిజము, యథార్థము. An oath, ప్రమాణము, ఒట్టు.

**సత్రము** *n.* : A kind of sacrifice. యజ్ఞ విశేషము, అనేక దినములు చేసే యజ్ఞము Liberality, munificence. సదా దానము, నిరంతరము ఇవ్వడము, ఎడతెగని ఈవి.

**సత్రాజిత్తు** *n.* : The name of the father of Satyabhama. hence she is called సాత్రాజితి.

**సత్వము** *n.* : Being, existence. ఉనికి Essence, nature, స్వభావము. A substance, thing, వస్తువు. Vigour, power, strength, సత్త, దేహబలము.

**సత్వరము** *n.* : Quickness, celerity. త్వర, వేగము. adj. Quick, త్వరితము, adv. Quickly.

**సద** *n.* : The hair on a leaf. ఆకు మీదినూగు.

**సదనము** *n.* : A house, dwelling, residence. గృహము. బండారుసదనము a treasury, a store-house.

**సదమనము** or **సదసద** *n.* : Destruction, annihilation, death. నాశనము, చావు. సదమదముచేయు to kill, murder, assassinate, destroy, చంపు.

**సదమలము** *adj.* : Very pure. మిక్కిలి నిర్మలమైన.

**సదయుడు** *n.* : One who is kind. దయతో కూడుకున్నవాడు.

**సదరు** or **సదరహీ** *adj.* : A foresaid, above mentioned. పైనచెప్పిన, పైన నుదహరింపబడిన, సదరున. above, పైని. సదరహీలు the above-said persons, పైన చెప్పబడినవారు.

**సదసద** : See సదమదము.

**సదస్సు, సదసు** *n.* : An assembly, a meeting. ధర్మజ్ఞసభ, రాజసభ, సభ.

**సదా** *adv.* : Always, continually. ఎల్లప్పుడు. **సదాగతి** *n. Lit.* : a perpetual motion : an epithet of the wind, వాయువు. **సదాశివుడు** *n. Lit.* : always propitious. An epithet of Siva, రుద్రుడు.

**సదాటు** *adj.* : Strong, vigorous, hale దృఢమైన.

**సదాప** *n.* : A sort of fennel, common anise. మిశ్రేయావృక్షము, కాలేయము.

**సదాముస్తె** *n.* : A certain plant, a kind of cactus జెముడు.

**సదుపాయము** : See under సత్.

**సదృశము** or **సదృక్షము** *adj.* : Similar, like, comparable. సమానమైన, సరి.

**సదేశము** *adj.* : Near, nigh, proximate, adjoining. సమీపమైన, అంతికమైన.

**సద్గతి** : See under సత్.

**సద్దు** *n.* : Sound, noise, tumult, clamour, ధ్వని, సందడి, చప్పుడు, మ్రోత. Interj. Silence! hush, be still, keep quiet.

**సద్మము** *n.* : A house, abode. ఇల్లు.

**సద్యః** or **సద్యము** *adv.* : Instantly, momentarily, at the moment, in an instant. తత్కాలమందు, అప్పుడు. సద్యఃఫలము the immediate result or reward. సద్యకాలము present time. సద్యోఘృతము butter just fried, fresh ghee. సద్యోజలము new fallen rain.

**సధర్మము** *adj.* : Accompanied by virtue. ధర్మముతో కూడిన. Equal,

సమానము. **సధర్మిణి** *n.* : A wife, ధర్మపత్ని.

**సధ్యా** *adv.* : At present, తత్కాలమునకు, ప్రస్తుతమునకు.

**సన్, సన** or **సన్న** *n.* : A year, సన్‌వారు yearly, annual.

**సనగలు, సనిగలు, సెనగలు** or **శనగలు** *n.* : The chick pea, commonly called Bengal gram, చణకము.

**సనాతనము** *adj.* : Eternal, fixed, permanent, స్థిరమైన, శాశ్వతమైన.

**సనాథ** *n.* : A woman who has her lord (or husband) alive. **సనాథము** *adj.* : That which is accompained by. కూడుకొనినది.

**సనాభిధి** *adj.* : Like, resembling. సమానమైన, సనాభుడు or **సనాభి** *n.* : A cousin, జ్ఞాతి, ఏడు తరములకు లోని దాయాది.

**సని** : Same as శని.

**సనీడము** *adj.* : Near, proximate. సమీపమైన.

**సను** : Same as చను.

**సనెకలు** : Same as సన్నెకల్లు.

**సన్న** *n.* : A sign, gesture, token, సంజ్ఞ, జాడ, కనుసన్న a wink. చేసన్న a sign or motion of the hand.

**సన్న** : See సన్నము.

**సన్నదు** *n.* : A patent of office or nobility. An order. A written grant, instrument or diploma, a charter or letters patent, తాకీదు, ఆజ్ఞాపత్రిక.

**సన్నద్ధము** *adj.* : Ready, prepared, accountred, equipped. armed. సిద్ధముగానుండే.

**సన్నము** *adj.* : Thin, lean, slender, small. పలుచని, కృశమైన, సన్నము, సన్నన or సన్నదనము *n.* : Thinness, leanness. Fineness, smallness. సూక్ష్మత్వము, తనుత్వము, పలుచన, కార్శ్యము.

**సన్నయము** *n.* : A reserve force. వెనుకనుండు దండు A crowd, సమూహము.

**సన్నవిడి** *adj.* : Small, fine, (used of species or varieties) సన్న విడి బియ్యము fine rice.

**సన్నహనము** *n.* : An endeavour, effort. ప్రయత్నము. A breast plate, a piece of armour, కవచము.

**సన్నాయి** *n.* : A clarionet. నాగసరము, వాద్య విశేషము.

**సన్నాసి** : Same as సన్యాసి.

**సన్నాహము** *n.* : Preparation. ప్రయత్నము. Armour, mail, accountrements, కవచము. సన్నాహము చేయు to prepare, to make ready.

**సన్నికర్షము** *n.* : Proximity, nearness. సమీపము.

**సన్నికల్లు, సనికల్లు, సన్నెకల్లు** or **సనెకలు** *n.* : A stone on which articles of food, etc., are bruised. నూరుకొనే రాయి. నూరురాయి.

**సన్నిధానము** or **సన్నిధి** *n.* : Proximity, nearness, vicinity, presence. నికటము, సమీపము.

**సన్నిపాతము** *n.* : A sort of paralytic diesease, delirium, convulsions, hysteria, జన్ని. A collection assemblage, multitude, సంచయము, కలయిక. ప్రలాప సన్నిపాతము delirium.

**సన్నిబద్ధము** *adj.* : Round firmly, fast tied. బాగా కట్టబడ్డ.

**సన్నిభము** *adj.* : Like. resembling. సదృశమైన.

**సన్నివిష్టము** *adj.* : Near, present, at hand, entered into, engrossed in, సమీపమైన, ప్రవేశించిన.

**సన్నివేశము** *n.* : An open place, either i.e., a town or its vicinity. పట్టణాది పశ్చాద్భూమి.

**సన్నిహితము** *adj.* : Near, neighbouring, close at hand, adjacent. సమీపమందున్న, సమీపించిన.

**సన్నీ** or **సన్ని** *n.* : A dagger-like sword, a bayonet తుపాకీకొనను చెక్కియుండే బాకువంటి కత్తి.

**సన్నుతి, సన్నుతించు** : See under సత్.

**సన్నె** or **సన్నెకల్లు** : Same as సన్నికల్లు.

**సన్మానము** *n.* : Honor, respect, మర్యాద, గౌరవము.

**సన్మోహన విద్య** *n.* : Glamoury, bewiteching, enchantment. భ్రమింపజేయు విద్య.

**సన్యస్తము** *adj.* : Left or abandoned, consigned or delivered to. త్యజింపబడ్డ.

**సన్యసించు** *v.a.* : To renounce the passions or the world. **సన్యాసి** *n.* : A monk, ascetic, hermit. సన్యసించినవాడు.

**సపత్ని** *n.* : A co-wife : one of several wives, a fellow wife, a rival wife. భార్యలలోనొకతె, సవతి.

**సపర్య** *n.* : Worship, reverence. పూజ, సమస్య.

**సపాట** or **సపాటము** *adj.* : Level, level with the ground, మట్టము.

**సపాదము** *adj.* : And a quarter. పాతికతో కూడుకొన్న. Thus, ఏకపాదలక్షము పాతికతో కూడుకొన్న. a lac and a quarter.

**సపిండుడు** *n.* : A kinsman to the seventh generation in a descent from a common ancestor who has a right to partake of the funeral cake. పిండభాగి, సప్తపురుష పర్యంతజ్ఞాతి, ఏడుతరములకు లోని దాయాది. **సపిండీకరణము** *n.* : The name of a particular rite celebrated on the 12th day after a death. చచ్చిన పండ్రెండోనాడు చేసే సంవత్సరాంత శ్రాద్ధము.

**సప్తము** *n. adj.* : and Seven, the seventh. ఏడు, ఏడవ. **సప్త** *n.* : A musical instrument with seven strings. **సప్తకము** *n.* : Seven, ఏడు.

**సప్తల** *n.* : The double jessamine. నవమాలిక, విరజాజి.

**సప్తి** *n.* : A horse, గుర్రము.

**సప్పము** *n.* : A serpent. **సప్పపు చుక్క** *n.* : The star called ఆశ్లేష.

**సప్రయోజనముగా** *adv.* : Profitably, advantageously, సఫలముగా.

**సప్రాణి** *adj.* : Living, having life. సజీవి.

**సఫణము** *adj.* : Crested, hooded. పడగగల.

**సఫరము** *n.* : The silver fish to the gleam of which in water poets compare the flash of a glancing eye.

**సఫలము** adj. Fruitful, advantageous, efficacious, successful.

**సఫేదా** *n.* : Whitelead used in painting. *adj.* : White, తెల్లని.

**సబబు** *n.* : Reason, ground, cause. కారణము.

**సబము** *n.* : Same as శవము.

**సబరు** *n.* : A top-gallant mast. ఓడ స్తంభములలో కొనది.

**సపబలము** or **సబళము** *n.* : A sort of spear. శక్తి అనే ఆయుధము, ప్రాసము, కుంతము, ఈటె.

**సబాము** : Same as స్వభావము.

**సబిడీ** *n.* : A kind of weapon.

**సబురు** *n.* : A voyage. దరిసబురు sailing along the coast, a coasting trip. లోసబరు sailing far out at sea.

**సబ్జా** *n.* : Green or black colour.

**సబ్నివీసు** *n.* : A writer, paymaster.

**సబ్బండు** *n.* : A jumble or omnium gatherum, dirt, rubbish.

**సబ్బు** *n.* : Soap, చౌకారము, జిడ్డును పోగొట్టు ఒక విధమైన చవుటికారము.

**సబ్బుబియ్యము** or **సగ్గుబియ్యము** *n.* : Sago, ఒక విధమైన ధాన్యము.

**సబ్రహ్మచారి** *n.* : A fellow disciple or student. సతీర్థ్యుడు, సహపాఠి.

**సభ** *n.* : A convocation, court, an assembly, meeting levee, council, association, society. A place of meeting, a hall of audience. సమాజము, సమూహము, గృహము, చావడి, కొలువుకూటము.

**సమ్** చక్కగా. **సమధికము** : very great, very much, మిక్కిలి అధికమైన. **సమాశ్రయము** a good support. **సమాశ్రితము** well supported. **సమాపాదితము** well got or obtained. **సముచితము** very proper or suitable. **సమున్నతము** very high see సం.

**సమంజసము** *adj.* : Just, right, proper, fit, correct, accurate. సమీచీనమైన, యోగ్యమైన, మంచి, తథ్యమైన, న్యాయమైన, ఉపయుక్తమైన.

**సమకట్టు** *v.n.* : To get ready, to try, attempt. యత్నపడు. యత్నించు *v.a.* : to prepare, make ready, సిద్ధపరుచు. To arrange, ఏర్పరుచు. To make, చేయు.

**సమకూడు, సమకూరు** or **సమకురు** *v.n.* : To succeed or take effect, to accrue to, to be got, to be accomplished, to happen, occur.

చేకూరు, లభించు, సిద్ధించు, సంభవించు, కలుగు, ప్రాప్తమగు.

**సమకొను** *v.n.* : To be got, to be obtained; happen, occur. లభించు, ప్రాప్తమగు.

**సమక్షము** *n.* : Presence, sight. ఎదురు. *adj.* : Seen, visible, నయనేంద్రియ గోచరమైన. *adv.* : In sight of, in presence of, before. ఎదుట, ముందర.

**సమగ్రము** *adj.* : Entire, whole, complete. పూర్ణమైన, సమస్తము. సమగ్రత.

**సమజ్య** *n.* : An assembly, meeting. సభ, పరిషత్తు.

**సమత** : See under సమము.

**సమధిగమము** *n.* : Obtaining, పొందుట.

**సమన్వితము** *adj.* : Accompanied by, joined, united, కూడుకొన్న.

**సమము** *adj.* : Like, alike, similar, same, equal, even, smooth, level. Impartial, free from passion, equable. సమానమైన, తుల్యమైన, సదృశమైన, అవిషమమైన, బేసికాని, మిట్టపల్లము లేకుండా ఉండే.

**సమయము** *n.* : An opportunity, occasion. An age, period. Time, season, juncture, crisis, కాలము, ఉచిత కాలము. Leisure, తీరుబాటు. An oath, imprecation. ప్రతిజ్ఞ, శపథము. **సమయోచితము** *adj.* : Seasonale, suitable to the occasion, కాలోచితమైన.

**సమయము** *v.n.* : To be ruined or destroyed, to perish, to die. నశించు, చచ్చు. **సమసిపోవు** *v.n.* : To be ruined or destroyed, to perish, to die. To be expended, consumed, worn out. నశించు, చచ్చు, అయిపోవు, అలసిపోవు.

**సమరము** *n.* : Combat, war, a battle. యుద్ధము.

**సమరసము** : See under సమము.

**సమర్త** or **సమరత** *n.* : Puberty. మొదటిముట్టు. **సమర్తాడు** *v.n.* : To be grown, arrive at puberty (used of a woman), పుష్పవతియగు, ఋతుమతియగు.

**సమర్థనము** *n.* : Perseverance. పట్టినది తగినట్టు. నెరవేర్చుట. Maintaining, establishing, proving, accomplishing, performing, నిర్వాహము, నిర్వహించడము, సాధించడము.

**సమర్పించు** *v.a.* : To offer a thing (to a god, & c.) **సమర్పణము** or సమర్పణ *n.* : The act of offering any thing (to a god, & c.)

**సమవర్తి** : See under సమము.

**సమవాయము** *n.* : A flock, multitude, collection, heap. సమూహము.

**సమవేతము** *adj.* : Mixed, mingled, united. మిశ్రితము, కూడుకొన్న.

**సమష్టి** or **సమిష్టి** *n.* : The whole, the entirety. మొత్తము, సర్వము, సమస్తము.

**సమస్తము** *adj.* : All, whole, entire, complete. సకలము, సర్వము, అంతా. n. The whole, all.

**సమస్థానము** : Error for సంస్థానము.

**సమస్య** *n.* : Part of a stanza proposed by one person to be completed by another as a trial of skill. కవిపరీక్షకోసము ఇచ్చే పద్యపాదము.

**సమాంసమీన** *n.* : A cow which calves every year. ఏటేట ఈను ఆవు.

**సమాఖ్య** *n.* : Fame, కీర్తి. Confederation, convention. బందుకట్టు.

**సమాచారము** *n.* : news, tidings, intelligence, a report, a message. An occurrence, matter, affair. వర్తమానము, వృత్తాంతము, సంగతి, వ్యవహారము.

**సమాజము** *n.* : A multitude, assembly, గుంపు, సమూహము. A society, association, congregation, church, సభ, సంఘము. సమాజికుడు a member of a society, congregation or church.

**సమాధానము** *n.* : Peace, tranquility, satisfaction, consent, agreement, a treaty. A reason, ground. నెమ్మది, సమ్మతి, అంగీకారము, న్యాయము.

**సమాధి** *n.* : A grave, or tomb. శవమును పాతి పైనకట్టినది. గోరీ. Deep meditation on the Deity, devout abstraction, absorption of thought.

**సమానము** (సమాధానము) *n.* : Consent, సమ్మతి.

**సమాపకము** *adj.* : That which completes. ముగించునది. **సమాపక క్రియ** *n.* : A finite verb. అసమాపక క్రియ an incomplete verbal form which cannot finish a sentence.

**సమారాధనము** *n.* : Worship, చక్కని ఆరాధనము.

**సమావేశము** *n.* : Being together at one place. ఒకచోట కూడనుండుట. Entrance, ప్రవేశము. Meeting, కలిసి కొనుట.

**సమాసంజితము** *adj.* : United, combined, connected with. కూడుకున్న, తగులుకొనిన.

**సమాసము** *n.* : Compostion of words, formation of compound terms. A combination of several words into one, all but the final being devoid of the signs of case, a compound word, రెండు మూడు శబ్దములు నేకపదముగా చేర్చడము.

**సమాహారము** or **సమాహరణము** *n.* : An aggregation, collection, assemblage; contraction, abridgment. సంక్షేపము, చెదరినవి ఒకటిగా పోగు చేయుట.

**సమాహితము** *adj.* : Well placed, settled, assembled, compiled, చక్కగా ఉంచబడిన. Promised, agreed, or assented to, అంగీకరింపబడిన, అంగీకృతమైన.

**సమాహ్వాయము** *n.* : A name, an appellation. పేరు. నామధేయము. A battle, యుద్ధము.

**సమితి** *n.* : An assembly, company, సమూహము. War, a battle, యుద్ధము. Union, సంగమము. **సమిత్తు** n. War, a battle, యుద్ధము.

**సమిధ** *n.* : Sacrificial fuel, wood for a sacrifice. ఇధ్మము, చిదుగు. Fire-wood, వంటచెరకు.

**సమీకము** *n.* : War, a combat, a battle, యుద్ధము.

**సమీకరణము** *n.* : Equalization, making equal to. సమానము చేయుట, ఒకటిగాచేయుట.

**సమీకృతము** *adj.* : United. ఒకటిగా చేయబడిన.

**సమీక్షణము** *n.* : The act of looking well, చక్కగా చూచుట.

**సమీచీనము** *adj.* : True, right, correct, fit. proper. యథార్థమైన, సమంజసమైన, యుక్తమైన, తగిన. *n.* : Truth, సత్యము.

**సమీపము** *n.* : Nearness, proximity, దగ్గిర, చేరువ.

**సమీరణము** *n.* : Going well. చక్కగా పోవుట.

**సముఖము** *n.* : Presence, proximity, nearness. ఎదురు, సమక్షము, సమీప్యము. సముఖమునకు వచ్చి రాయబారముచేయు to come into a man's presence and then send an embassy to him, that is, to do an unnecessary thing.

**సముచ్చయము** *n.* : Connection, collocation, conjunction. A collection, assemblage; (gram) a conjuction. చెదరినవాని నొకటిగా పోగుచేయుట, సమూహము, సముదాయము.

**సముతు** *n.* : A combination or league, a strike among workmen. కట్టుపాటు.

**సముదయము** *n.* : The state or act of being well born. చక్కని ఉదయము. A multitude, assembly, quantity. సమూహము, చయము, గణము.

**సముదాయించు** *v.a.* : To comfort, persuade. To appease, lull, ఓదార్చు.

**సముద్గము** or **సముద్గకము** *n.* : A casket, a covered box. పెట్టె. బరిణె.

**సముద్దారుడు** *n.* : One who manages a Samut or subdivision of a Taluq. ఒక సముతుయొక్క అధికారి.

**సముద్రము** or **సముద్రుడు** *n.* : The sea, ocean. అబ్ధి, పారవారము, మున్నీరు, సాగరము, కడలి. There are 7 seas according to Hindu mythology, viz., లవణ సముద్రము the sea of salt, ఇక్షుసముద్రము the sea of sugar, సురాసముద్రము the sea of wine, సర్పిస్సముద్రము the sea of ghee, దధిసముద్రము the sea of curds, క్షీరసముద్రము the sea of milk, and జలసముద్రము the sea of waters. సముద్రనవనీతము. lit. the butter of the ocean, an epithet of the moon. చంద్రుడు. సముద్రపు చిలుక a flamingo, పూకొంగ.

**సమూహము** *n.* : A crowd, multitude, number, flock, heap, quantity, నివహము, గుంపు.

**సమృద్ధము** *adj.* : Ample, full, entire; abundant, plentiful, సంపూర్ణమైన. **సమృద్ధి** *n.* : Fulness, plentitude, abundance. Increase, prosperity, success.

**సమేతము** *adj.* : Having prosessed of, accompanied by. కూడుకొన్న, సహితమైన, కల. సమేతము or సమేతముగా adv. With, together with, along with.

**సమేలము** *n.* : Friendship, familiarity; meeting, ఒద్దిక, చేరిక.

**సమ్మతము** *adj.* : Assented to, agreed to, concurred in, approved of, liked, agreeable, సమ్మతియైన, అంగీకృతము.

**సమ్మదము** *n.* : Joy, pleasure, happiness. ప్రమోదము, ఆనందము. సంతోషము, **సమ్మద** *n.* : A gratuity, donation, gift. పారితోషికము.

**సమ్మర్దము** *n.* : A throng, crowd, press. సంకులము, రాయిడి, ఒత్తుడు.

**సమ్మాననము** *n.* : The act of respecting, గౌరవించుట. **సమ్మానము** *n.* : Respect. గౌరవము.

**సమ్మార్జనము** *n.* : A search, cleaning. శోధనము. **సమ్మార్జని** *n.* : A broom. చీపురు, చీపురుకట్ట.

**సమ్మాళిగలు** or **సంబాళిగలు** *n. plu.* : Sandals. పావుకోళ్లు. Shoes, పాపోసులు. పట్టుసమ్మాళిగలు silk shoes. See సంబాళిగలు.

**సమ్ముదము** *n.* : Great joy. మిక్కిలి సంతోషము.

**సమ్మె** or **సమ్మియ** *n.* : Confederation, league. సమాఖ్య, కట్టుపాటు. సమ్మెజాబు a letter signed by many.

**సమ్మెట** *n.* : A sledge hammer. పెద్దసుత్తె *n.* : A whip, కశ, కొరడా.

**సమ్యక్** or **సమ్యక్కు** *adv.* : All, wholly, properly, duly, fitly. యావత్తు, యుక్తముగా, చక్కగా.

**సమ్రాట్టు** *n.* : A paramount sovereign, an emperor. రాజాధిరాజు.

**సయాం** or **సయామ** *adj.* : Own, సొంత. నా సయాంతమ్ముడు my own younger brother.

**సయ్యన** *adv.* : Quickly, at once. తెప్పున.

**సయి** *adv.* : Together with. కూడా. With, తోడ.

**సయ్యాట** or **సయ్యాటము** *n.* : A joke. సరసము, పరిహాసము. Sport, లీల.

**సయించు** *v.n.* : To be agreeable, to be palatable, to bear, endure, put with, ఓర్చు.

**సయిగ** : Same as సైగ.

**సయితము** *adv.* : Also, కూడా.

**సయిరించు** : Same as సైరించు.

**సరంగు** *n.* : The headman of the sailors in a boat or ship, a boatswain, నావికుల పెద్ద, ఓడమాలిమికాడు, నావికుడు.

**సరంజాము** *n.* : Furniture, things, articles, property. సామాను, వస్తువులు. సరంజాము చేయు to get ready, to supply, కావలసిన వస్తువులను సిద్ధముచేయు.

**సరంబీ** *n.* : A porch, gallery, awning; the ceiling in a house, a house made of shingle or board. సరంబీకొట్టు a room with a ceiling, బల్లకూర్పుచేసి యుండుగది.

**సరకటము** *n.* : Difficulty, hardship. తొందర, సంకటము.

**సరకట్టు** *n.* : A stop on a lute. వీణెమెట్టు.

**సరకు** *n.* : Esteem, regard, care, heed. లక్ష్యము, గౌరవము.

**సరగు** *n.* : Swiftness, speed. త్వర. సరగ or సరగున.

**సరఘ** *n.* : A bee, మధుమక్షిక, తేనెయీగ.

**సరటము** *n.* : A lizard, chamelion. కృకలాసము, తొండ.

**సరడు** *n.* : A kind of gold necklace worn by women.

**సరణి** *n.* : A road, path, way, course. మార్గము, దోవ. A series, వరుస.

**సరత్ని** *n.* : A short cubit, from the elbow to the extremity of the closed fist. ముష్టిబద్ధహస్తము, పిడివెలితిమూర.

**సరదా** or **సర్దా** *n.* : Fondness, affection.

**సరదారు** or **సర్దారు** *n.* : A Sirdar, A leader, a superior officer. అధికారి.

**సరదు, సరుదు, సర్దు** or **సద్దు** *n.v.a.* : To divide equally, సమముగా పంచు. To arrange, క్రమముగా నుంచు.

**సరపణి, సరపిణి, సరపెణి** or **సరఫణి** *n.* : An ornament of gold chains of two or more folds. గొలుసు.

**సరపువ్వులు** or **సరపూవులు** *n. plu.* : Wreaths, garlands of flowers. పుష్పసరములు.

**సరబడి** *n.* : Friendship. స్నేహము. A passage, an entrance, ద్వారము.

**సరభసము** or **సరభసముగ** *adv.* : With speed. వేగముగా, త్వరగా.

**సరమ** *n.* : The name of the wife of Ravana's brother. విభీషణుని పత్ని. A bitch, ఆడుకుక్క. The dog of the gods, వేలుపు కుక్క. *n.* : Fatigue, trouble. శ్రమము. **సరమగొను** *v.n.* : To be fatigued, to be troubled, శ్రమపడు.

**సరము** *n.* : A pond, pool. కొలను. ఇచ్చోటి సరము శరముల్ నిచ్చుల్ గొనినది.

**సరయు** *n.* : The name of a river, నదీవిశేషము.

**సరళము** *adj.* : Straight, direct, level. Upright, honest, artless, simple, sincere, candid. తిన్నని, వంకరకాని, ఋజువైన.

**సరవడి** *n.* : A litter, a palanquin, a sledge.

**సరవి** *n.* : Regularity, order. వరుస, క్రమము.

**సరస** *n.* : Near. is, proximity, సమీపము, దాపు.

**సరసము** *adj.* : Juicy, tasty. Sapid, soft. Good, virtuous. Charming, agree-

able, pleasant, elegant, sweet. Jocose, funny, merry. Easy, cheap. రస యుక్తమైన, సుస్వాదువైన, అంద మైన, మనోహరమైన, పరిహాస మైన, లలితమైన, చవుకైన, సరసోక్తి a jocose, amusing or agreeable expression. *n.* : A joke, jest, fun, merriment, amusement, sweetness, pleasantry. Cheapness.

**సరసర** *adv.* : Quickly, rapidly, hastily. బిరబిర, తీవ్రముగా.

**సరసి, సరస్సు** or **సరసు** *n.* : A pool, pond, lake. మడుగు. కొలను.

**సరసు** : Same as సరస్సు.

**సరస్వతి** *n.* :Speech, The goddess of speech. A certain river. వాక్కు, వాగ్దేవి, నదీవిశేషము.

**సరస్సు** : Same as సరసి.

**సరాగము** *n.* : Friendship, intimacy. ఒద్దిక.

**సరాతి** *n.* : A chamber, room, apartment. అంకణము.

**సరాబు** or **షరాబు** *n.* : A shroff, banker, money changer, cashkeeper.

**సరాళము** or **సరళము** *adj.* : Easy, free, clear. ధారాళమైన.

**సరాసరి** *n.* : An average. సగటు, సమత్వము.

**సరి** *n.* : The end. అంతము. Similarity, likeness. సామ్యము, సమానము, సమము. Propriety, fitness, యుక్తము. **సరిచూచు** *v.a.* : To compare, review, collate. సంప్రతించు, సరిగా నుండజూచు. **సరితూగు** *v.a.* : To counter balance, to be equal in weight, to be equal.

**సరించు** *v.n.* : To go. వెళ్లు.

**సరిక** *n.* : A necklace of a hundred strands. నూరుపేటల హారము.

**సరిగ** or **సరిగె** *n.* : A necklace, హారము. Gold lace, silver lace, & c. జలతారు. సరిగంచుచీర a cloth with gold ends, a cloth trimmed with lace.

**సరిత్** or **సరిత్తు** *n.* : A river. నది, ఏరు. **సరిత్పతి** *n.* : The lord of river, i.e., the sea or ocean, సముద్రుడు.

**సరిపణి, సరిపిణి** or **సరిపెణ** *n.* : A gold or silver chain. బంగారు లోనగువాని గొలుసు.

**సరియ** or **సరి** *n.* : A crack, పగులు, సందు.

**సరియించు** *v.a.* : To supply, to fill (a lamp) with ghee or oil. అఖండమునకు నూనె సిద్ధముచేయు.

**సరీసృపము** *n.* : A serpent, snake, reptile. సర్పము, పాము.

**సరుకు** or సరకు *n.* : Wares, goods, commodities, merchandise. వస్తువులు, దినుసులు. సరుకుగా చెల్లించు to pay in kind. See సరకు.

**సరుగు** *v.n.* : To increase, grow, improve. పెరుగు, వర్ధిల్లు.

**సరుగుడు** *n.* : A hurdle, sledge, drag. A platform. తడక, చలుగుడు, కంప

గట్రవేసి ఈడ్చుకొనివచ్చే చక్రములు లేని తడిక.

**సరుడు** *n.* : An arrow, బాణము. A blunt arrow, గరిలేనిబాణము.

**సరుదు** *n.* : A boundary, ఎల్ల, మేర, సరిహద్దు.

**సరుదు** or **సర్దు** *v.a.* : To make even, or level. To eke out or shift with; to make a little go a good way.

**సరేసు** *n.* : A kind of gum, rosin, వజ్రము, వజ్జిరము.

**సరోజము** or **సరోరుహము** *n.* : A lotus. పద్మము. **సరోజిని** *n.* : A bed of lilies, a pond covered with lotus flowers, తామరకొలను. A lotus, తామర.

**సరోవరము** *n.* : A pond, దివ్యమైన కొలను.

**సర్క** *n.* : A kind of cattle disease.

**సర్కారు** *n.* : The government, Circar. దివాణము, దొరతనమువారు. సర్కారు ఉద్యోగము Government employment.

**సర్గ** or **సర్గము** *n.* : A chapter. అధ్యాయము. **సర్గము** Creation, సృష్టి. Nature, natural property or disposition, స్వభావము. Certainty, నిశ్చయము.

**సర్జము** or **సర్జకము** *n.* : The Sal tree, *Shorea robusta*. Also, the resinous exudation of the Saltree. సాలవృక్షము. ఏపిచెట్టు, వేగసచెట్టు.

**సర్దా** or **సరదా** *n.* : Interest, zeal, ఆసక్తి.

**సర్దారుడు** or **సర్దారు** *n.* : A chief, captain, leader, ruler. అధికారి, పెద్ద. See సరదారు.

**సర్దు** : Same as సరుదు.

**సర్పము** *n.* : A serpent, snake, పాము, సర్పయాగము a serpent sacrifice.

**సర్పి** *n.* : Oil, butter, clarified butter, ghee. ఘృతము, నెయ్యి. Also, a kind of disease.

**సర్రున** or **జర్రున** *adv.* : Quickly, as in slipping down.

**సర్వము** *pron.* : All, the whole. సమస్తము. అంతయు. *adj.* : All, whole, complete, universal, entire, సకలము, అఖిలము. **సర్వతోముఖము** *n.* : Water, నీళ్లు. **సర్వత్ర** *adv.* : Everywhere, in all places, always, at all times. అంతట, ఎల్లప్పుడు. సర్వత్రయిమ్ము give everywhere. **సర్వథా** *adv.* : In all ways, by all means, assuredly, at any rate, అన్ని విధాల. **సర్వాధికారి** *n.* : The ruler of all, అన్నిటికి యజమానుడు. **సర్వేశుడు** or సర్వేశ్వరుడు The Lord of all, the Supreme Being, దేవుడు.

**సర్వల** or **శర్వల** *n.* : A short spear or lance, an iron spit. చల్లకోల, తోమరము, నేజా.

**సర్షపము** *n.* : Mustardseed. ఆవాలు.

**సల** *n.* : A bund or bank raised across a stream to draw off its waters into a different channel.

**సలక** *n.* : A small sack. One eighth of a putti or 2 $^{1}/_{2}$ tooms (తూములు). చిన్నగోనె, ఇద్దున్నిరస.

**సలగ, సలగపార** or **సలవ** *n.* : A kind of spade or hoe. ఒక విధమైన పార, పారచిప్ప.

**సలవాది** or **సలాది** *n.* : A beadle or servant of the Chetty or headman (పెద్దసెట్టి) A crier, పదిమందికి చావు సమాచారము తెలియజేసే పనివాడు.

**సలసల** *adv.* : Loudly, aloud, audibly. కళపెళ.

**సలహా** *n.* : Advice, counsel.

**సలాక** or **శలాక** *n.* : A thin bar or rod, a ramrod, the rib of an umbrella, one of the bars of a cage, peg, a small stake, a fibrous stick, a fibrous stick used as a brush or pencil. లోహదండము, కమ్మి, పుడక, తూలిక, కుందనము చెక్కే ఆయుధము. కనకశలాక a slender rod of gold. పుంటిలో సలాకవేయు to probe a wound. సలాక పరీక్ష probing, a critical examination.

**సలాకు** *n.* : Base metal mixed with gold or silver (a term used by gold-smiths).

**సలాది** : See సలవాది.

**సలాపము** *n.* : A pearl fishery.

**సలాము** *n.* : A Salaam, a bow or salutation. నమస్కారము, నా సలాములు చెప్పు give my compliments.

**సలి** *n.* : Noise. సందడి.

**సలించు** : Same as చలించు.

**సలికము** *adj.* : Small, petty, thin; trembling, అల్పము.

**సలిగ** *n.* : Patronage, protection, interest, influence. ప్రాపు, అండ, ఆశ్రయము.

**సలితము** *n.* : Dismissal from service. కొలువు నుండి తీసివేయుట.

**సలిలము** *n.* : Water, జలము.

**సలుగ** or **సలువ** : Same as సలగ.

**సలుగు** or **పలుపు** *n.* : A porcupine, ఏదుపంది.

**సలుగుడు** or **చలుగుడు** *n.* : A sledge, a vehicle without wheels.

**సలుపు, సళుపు, చలుపు** or **చళుపు** *n.* : A throb, a pang, a shooting pain. పోటు. సలుపు or సళుపు *v.n.* : To throb or shoot as a painful boil, to ache, పోట్లు పొడుచు. **సలపరము,** సలపరింత, సలుపరింత or సళుపరింత *n.* : A pang, throb, pain, ache.

**సలుపు** *v.a.* : To do, make, perform, practise. చేయు.

**సలువ** : Same as సలుగ.

**సలువు** : Same as సలుగు.

**సల్లకి** *n.* : The Gum Olibanum tree, *Boswellia thurifera*. అందుగుచెట్టు.

**సల్లాపము** or **సల్లవనము** *n.* : Conversation, talk. పరస్పర సంభాషణము. **సల్లాపించు** *v.n.* : To talk or converse. పరస్పరము సంభాషించు.

**సల్లోపిల్లో అనియుండు** *v.n.* : To be on good terms. కలిసి మెలిసియుండు. సల్లోపిల్లో అని యుండేవాడు a facetious fellow, a jocose man. కలియ గలుపుగా నుండేవాడు, సరసుడు.

**సళించు** *v.n.* : To grieve, దుఃఖించు.

**సళుపు** : See సలుపు.

**సళువరించు** : See under పలువు.

**సళ్లు** or **సడలు** *v.n.* : To become slack or loose. వదలు, జారు. వాని ఒళ్లు నిండా సళ్లిపోయినది his constitution is much broken down. సడుడు ముసళ్లు to be gone in the lions.

**సవ** *n.* : A trace, జాడ. **సవసవ** *n.* : A slight trace. చూచాయ. సవసవ, సవసవగా or సవసవలుగా *adv.* : Slightly, indistincly, half and half. కొద్ది కొద్దిగా, జాడజాడగా, చూచాయగా.

**సవడి** : Same as సవ్వడి.

**సవతి** or **సవతాలు** *n.* : A fellow wife. సవతి కొడుకు a step son. సవతితల్లి a step mother, మారుతల్లి, మారట తల్లి, మారుడుతల్లి. సవతిపోరు a quarrel between two wives.

**సవతు** *n.* : Equality, likeness, similarity. సామ్యము. *adj.* : Equal, similar. సమానము.

**సవదండవల** *n.* : A kind of net or snare వాగురాభేదము.

**సవదరించు** *v.a.* : To wear, put on, hold. ధరించు, వహించు, తాల్చు.

**సవనము** *n.* : A sacrifice. యజ్ఞము. Bathing preparatory to a sacrifice. స్నానము. **సవనవిరోధి** *n.* : The sacrifice - disturber, an epithet of Siva. శివుడు. **సవము** *n.* : A sacrifice, అధ్వరము, యజ్ఞము. The honey of flowers, మకరందము. Clear toddy, కల్లుతేట.

**సవము** : Same as సగము.

**సవర** *adj.* : Beautiful, fine. చక్కనైన. Level, smooth, చదునైన, నునుపైన.

**సవరము** *n.* : The hair of the yak or Tartarian ox, చమరమృగము which is used by women, a queue. False hair used by women.

**సవరలు** or **సవరవాండ్రు** *n. plu.* : The name of a certain tribe in the Vizagapatam District; also, called Thugs or Phaseegars. ఒక విధమైన చెంచువాండ్లు, కగ్గలు, పాపీగర్లు.

**సవాయి** *n.* : A venereal disease or eruption.

**సవారచేప** *n.* : A species of *Ophicephlus* or snake headed fish.

**సవారీ** *n.* : Riding; any mode of conveyance; a palanquin. కాలిసవారి or గాలిసవారి a walk, an airing. గుఱ్ఱపుసవారి riding.

**సవాలు** *n.* : A question, proposal. అడ్డసవాళ్లు cross questions, cross examination.

**సవి** *conj.* : Saying. ఇతి, అని.

**సవిత** or **సవితృడు** *n.* : The sun. సూర్యుడు. A father, తండ్రి. **సవిత్రి** *n.* : mother, తల్లి.

**సవిధము** *adj.* : Near, proximate, సమీపము.

**సవిస్తరము** *adj.* : Full, complete, సవిస్తరముగా in full, at lenth.

**సవ్యము** *adj.* : Left, hand. వామము, ఎడమ, అపసవ్యము the right. సవ్యకరము the left hand. **సవ్యసాచి** *n.* : Ambidexter; a title of Arjuna, because he used both hands equally well. అర్జునుడు.

**సవ్వడి** or **సవడి** *n.* : A trace, జాడ.

**ససి** *n.* : Soundness, beauty, health. good. బాకు, కుదురు, ఆరోగ్యము. **ససేమిరా** what is the good of this ? **ససిగా** *adj.* : Well, properly, in good health. In good order or repari, బాగుగా, క్రమముగా, కుదురుగా. ఆమెకు ఒళ్లుససిగా నుండలేదు. she is unwell or ill.

**సస్కాని** *n.* : A coin worth about eight pies. రెండు డబ్బుల నాణెము.

**సస్యము** *n.* : Produce, a crop, grain. వృక్షధాన్యాదిఫలము, వరి మొదలైన పంట. **సస్సెము** or **ససి** Same as సస్యము.

**సహ** *n.* : The earth. భూమి. సహ or సహా *adv.* : With, together with, even, also, too. కూడ, సహితము. ప్రస్తుతము సహ even now, and at this very time, and now too.

**సహకారము** *n.* : A grafted mango. తియ్యమామిడి చెట్టు. **సహకారి** or **సహకారుడు** *n.* : An assistant, one who helps, సహాయుడు. **సహపాఠి** *n.*: A fellow student. కూడా చదివెడివాడు. **సహవాసము** *n.* : Association, intercourse, friendship. స్నేహము. **సహోదరుడు** *n.* : A brother. తోడబుట్టినవాడు. **సహోదరి** *n.* : A sister, సోదరి.

**సహనము** *n.* : Patience, endurance, resignation, quiet, liniency, ఓర్పు, తాలిమి.

**సహస్రము** *n.* : A thousand, వెయ్యి. **సహస్రనామములు** *n.* : A thousand names. **సహస్రాక్షుడు** *n.* : Lit, the thousand eyed; an epithet Indra, ఇంద్రుడు.

**సహాయము** *adj.* : Auxiliary, ఉపబలమైన, **సహాయము, సహాయత** or **సహాయ్యము** *n.* : Aid, help, assistance, sucour, తోడు.

**సహారువు** *n.* : a term used in gambling, జూదమందలి పరిభాష.

**సహించు** *v.n.* : To please. be agreeable.

**సహితము** *adj.* : Composed of, accompained by, in company with. మిళితము, కూడుకొనిన, విషసహితము envenomed. *adv.* : With, along with, even, also, too, into the bargain, కూడా.

**సహిష్ణుత** *n.* : Toleration, Patience, endurance. ఓర్పు. తాలిమి, సహించడము.

**సహేతుకము** *adj.* : Having a reason, with a reason, హేతువుతో కూడిన.

or **సైంధవలవణము** *n.* : Salt brought from Sind. సింధుదేశనదీలవణము.

**సైంహికేయుడు** *n.* : A name of Rahu. రాహువు.

**సైకతము** *adj.* : Sandy in general సికతామయమైన, ఇసుకతో సంబంధించిన.

**సైకము** or **సయికము** *n.* : Thinness. సూక్ష్మత్వము. *adj.* : Thin, light, nice, pretty, trim. సూక్ష్మము, అల్పము. సన్నని, తేలికైన, చక్కని.

**సైగ** or **సయిగ** *n.* : A sign, gesture. సంజ్ఞ. కనుసైగ a wink. చెయిసైగ a sign with the hand.

**సైచు** or **సయిచు** *v.n.* : and *a.* : To bear. endure; to pardon, సహించు, మన్నించు.

**సైతము** or **సయితము** *adv.* : Even, too, also, కూడా.

**సైదము** or **సయిదము** *n.* : Wheat flour. గోధుమపిండి.

**సైదోడు** or **సయిదోడు** *n.* : A brother or sister. తోడబుట్టిన వాడు, లేక, తోడబుట్టినది, తోడబుట్టువు.

**సైనిక** *adj.* : Of or relating to an army. దండుసంబంధమైన. **సైనికుడు** *n.* : A soldier, సేనతో సంబంధించినవాడు, బంటు. A general, సేనాధిపతి. **సైన్యము** *n.* : An army. దండు.

**సైరంధ్రి** *n.* : A good woman who being deserted by her husband engages to work in another's house. మగడు విడిచిపోయినందున పరగృహ మందుండి స్త్రీలకు శృంగారించు పతివ్రత.

**సైరించు** or **సయిరించు** *v.a.* : To endure, suffer. సహించు, తాళు. **సైరణ** n. Patience. సహనము.

**సైరికుడు** *n.* : A ploughman. దున్నెడువాడు.

**సైరిభము** *n.* : A wild buffalo. కారెనుపోతు.

**సొంటి** or **సొంటికొమ్ము** *n.* : Dry ginger. పక్వము చేసి యెండబెట్టిన అల్లము, శృంగబేరము.

**సొంతము** *adj.* : Own, private. స్వకీయమైన.

**సొంపు** *n.* : Elegance, grace, సొగసు, అందము. Glee, delight, joy, సంతోషము, ముదము, ఉల్లాసము. వేడుక Happiness, సుఖము. Brightness, cheerfulness, కాంతి, ప్రసన్నత. Abundance, సమృద్ధి.

**సొక్కు** or **చొక్కు** *n.* : Faintness, stupefaction, intoxication, confusion of mind. మయికము, మత్తు, పరవశత, కలవరము, భ్రమ, సొక్కుపొడి intoxicating powder, love powder, a conjuring drug. సొక్కుమందు an intoxicating drug.

**సొగటము** *n.* : A man or piece used in backgammon. సారె.

**సొగటు** *n.* : Withering. వాడుట.

**సొగయు** *v.n.* : To be bewildered, stupefied, deluded. To languish, fade away; to be charmed or touched with love. మూర్ఛిల్లు. చొక్కు పరవశమగు.

ముణుగు. **సొగసుకాడు** *n.* : A beau, a handsome man, అందగాడు. A gallant. విటకాడు.

**సొచ్చెము** *n.* : A remainder, overplus. పెచ్చు, అధికము. A fractional quantity. Small change, loose cash. చిల్లర.

**సొజ్జె** or **సొజ్జి** *n.* : A mess, or dish made of grits of roasted rice or broken rice, boiled after having been heated in a dry state. బియ్యము వేయించి వండిన అన్నము. సొజ్జిబూరె a kind of cake.

**సొటసొట** *n.* : The state of being emaciated. కృశించడము, కార్శ్యము. **సొటసొటపోవు** *v.n.* : To become lean, కృశించు. To be dejected, దిగజారిపోవు.

**సొట్ట** or **చొట్ట** *n.* : Crookedness; a dent, excavation. A bruise made in a metal vessel. లొట్ట, వక్రత, నొక్కు.

**సొడ్డు** *n.* : A slap on the head of a loser in a game. applied with both the winner's bands (Metaphorically) a defect, fault, imputation, ఆటలో నోడినవాని తలమీదవేయు దెబ్బ, లోపము. న్యూనత, కొరత.

**సొత్తు** *n.* : Property, goods. సొమ్ము, ఆస్తి.

**సొద** *n.* : A funeral pile, the fir used in a funeral pile. చితి, చిత్యగ్ని, ఒలికి. Grief, sorrow, చింత.

**సొన** *n.* : Juice that exudes from plants, the acrid juice or milk of some plants, స్రవించునది. చెట్టుకాయ కోసినప్పుడు వచ్చేరసము.

**సొన్నము** or **సొన్న** *n.* : Gold. బంగారు. A certain gold coin, మాడ. **సొన్నారి** *n.* : A goldsmith, స్వర్ణకారుడు,

**సొబగుడు** *n.* : A hand some man, చక్కనివాడు ఆగసాలె వాడు, కంసల వాడు. A lover, sweet heart, విటుడు.

**సొబగు** *n.* : Beauty, prettiness. సౌందర్యము, సొగసు.

**సొబను** *n.* : The foetus of a mare. బడబచూలు.

**సొమ్మ** *n.* : Faintness, swoon. మూర్ఛ. Torpidity, lack of sensation, తిమురు. నా కాలు సొమ్మగా నున్నది. my leg is asleep.

**సొమ్ము** *n.* : money, ధనము. Property, goods, jewels, అధీన వస్తువు, సొత్తు, భూషణము, ఆభరణము.

**సొయ్యక** *n.* : A kind of musical instrument, వాద్యవిశేషము.

**సొరంగము** *n.* :n. A hole in the ground or in a wall. రంధ్రము.

**సొర** or **సొఱ్ఱ** *n.* : The Bottle Gourd. తుంబి. చేదు సొర the bitter gourd, కటుతుంబి.

**సొర** *n.* : Grief, sorrow. వ్యాకులత.

**సొర** or **సొఱ్ఱ, సొరమీను** or **చార** *n.* : A shark, a general name for several ravenous fishes. ఝషము.

**సొరగు** *n.* : Swoon, fainting, మూర్ఛ. A dry leaf, ఎండాకు, *v.n.* : To be lost, disappear, లీనమగు.

**సొరదోకి** *n.* : A wicked person. దురాచారుడు.

**సొరపు** *adj.* : Thin, lean, emaciated. కృశము.

**సొరము** *n.* : The voice. కంఠధ్వని. A musical note, షడ్డాది.

**సొరది** *n.* : Order, regularity, properly, plentifully, much. వరుసగా, క్రమముగా, విశేషముగా, విస్తారముగా.

**సొరుగు** *n.* : the drawer of a table or box. పెట్టెలు మొదలయినవాటిలోని అర. A swoon, మూర్ఛ. *v.n.* : To faint, to swoon. మూర్ఛిల్లు.

**సొలయు** *v.n.* : To languish, faint. సొక్కు, నీరసమొందు, మూర్ఛిల్లు, ఖిన్నమగు. To hesitate, go back, వెనుదీయు.

**సొల్లు కట్టులు** *n. plu.* : Words or sounds used by the manager of a band of dancers. ఆటకొలిపించుటలో నట్టువుగాడు తధిక్కు, తకథైథై అని చెప్పేటివి.

**సొళ్లెము, సొళ్లెము** or **సొళ్లియము** *n.* : A peacock's feather. A turban in which peacock's feathers are worn. నెమలి ఈకలు చుట్టిన పాగ.

**సొన** or **సన** *n.* : A wishper. గుసగుస. సొవసొవ or సవసవ whispers.

**సోకు** *v.n.* : To touch, come in contact with. To be communicated by contagion, to affect or catch, as a distemper. తాకు, తగులు.

**సోగ** *adj.* : Long, all, prolonged. దీర్ఘమైన, నిడుపైన, సోగైనగుండు a pyramidal rook, a shaft. సోగమెడ a long neck. **సోగ** or **సోగతనము** *n.* : Length, నిడుపు, దైర్ఘ్యము.

**సోగు** *n.* : A garland, a necklace. సరము.

**సోడు** *n.* : The crown of the head. మాడు పట్టు, బ్రహ్మరంధ్రము. **సోడుముట్టు** *v.n.* : To spread, pervade, be diffused throughout. అంతట వ్యాపించు. తలకెక్కు, మిన్నుముట్టు.

**సోఢ** *n.* : A clever, able patient, enduring man. సమర్థుడు, సహించువాడు, ఓర్చువాడు. **సోఢము** *adj.* : Borne, suffered, ordured. సహింపబడిన (తప్పు మొదలగునది)

**సోణము** *n.* : The root of the nose. నాసామూలము.

**సోత్ప్రాసము** *n.* : Irony, sneering, praise which is covert censure. సోల్లుంఠనము, ఎత్తిపొడుపుమాట.

**సోద** *n.* : Plaster, గచ్చు, గార.

**సోదన** *n.* : An examination. శోధనము. An omen, శకునము. శకునార్థము రామాయణము మొదలైన గ్రంథము లందు దారము వేసి శోధించుట. **సోదించు** *v.a.* : To examine, to scrutinise. శోధనచేయు.

**సోదరి** *n.* : A sister, తోడబుట్టిన పడుచు. **సోదరుడు** *n.* : A brother, తోడ బుట్టినవాడు.

**సోడా** *n.* : An examination, a search. పరీక్ష. వెదకుట సోదా చేయుor సోదా చూచు to make a search, to search, to examine. సోదా వారంటు a search warrant.

**సోడె** or **సోదియ** *n.* : Fortunetelling. రాబోవు అదృష్టమును చెప్పడము, రాగల శుభాశుభములను చెప్పుట.

**సోదెము** or **సోద్దెము** *n.* : Wonder, astonishment. ఆశ్చర్యము. *adj.* : Wonderful. ఆశ్చర్యకరమైన.

**సోన** *n.* : A drizzle, a slight shower of rain. అల్పవర్షము, సన్నవాన. Rain. వాన.

**సోవనము** : Same as సోపానము.

**సోపానము** or **సోపానము** *n.* : A step of a staircase or of a fight of steps, మెట్టు.

**సోపు** *n.* : Anise seed. మసాలాలో వేయు సంబారపుదినుసు. సీమసోపు the Caraway.

**సోబ** *n.* : A swelling, tumour, శోఫ.

**సోబనము** *n.* : Happiness, good fortune, మంగళము.

**సోబాన** *n.* : A song, each foot of which has the word శోభానే as a chorus.

**సోబె** or **సోబియ** *n.* : A beauty spot; a damask or mahogany tint; a bright or golden tint or spot on the skin, సిబ్బెము.

**సోమ** or **సోమము** *n.* : Toil, fatigue. శ్రమము. courage, పరాక్రమము.

**సోను, సోమలత** or **సోమవల్లి** *n.* : The Moon plant, పుల్లతీగె, తిప్పతీగె. సోమపానము drinking the juice of the *Asclepias*. **సోమయాజి** *n.* : A sacrificer, యజ్ఞము చేసినవాడు.

**సోమరి** *adj.* : Idle, lazy, Slothful. అలసమైన. బద్ధకముగల, మందమైన.

**సోమవారము** *n.* : Monday, ఇందు వాసరము. See సోముడు.

**సోమసూత్రము** *n.* : A vessel with a spout. A basin with a spout and handle. The receptacle or pit on the outside of a temple to receive the water with which the idol has been bathed. ముక్కు చెయ్యి పిడిగల చిన్న పాత్ర, పానవట్టము నుండి నీళ్లుపోవు దారి, లింగాభిషేక జలము పోయి పడుతొట్టి.

**సోమాసి** : Same as సోమయాజి.

**సోమించు** *v.n.* : To resemble. సరిపోలు. To be courageous, పరాక్రమించు. To be arrogant, విజృంభించు. To spread, వ్యాపించు.

**సోమిద** or **సోమెద** *n.* : A tree called Coronilla sesbon, తిప్పతీగ or శణపర్ణి.

**సోము** *n.* : Happiness, pleasure, joy, health. సుఖము. adj. Happy, pleasing, ఆసక్తము.

**సోముడు** *n.* : The moon, the regent of the moon, the god of beauty. చంద్రుడు. See సోమవారము.

**సోయగము** *n.* : Beauty, elegance, harmony, splendour. సౌందర్యము, అందము, చక్కదనము, శాంతి.

**సోరంగి** *n.* : A long snouted fish called the Indian whiting. అరటికాయు అనే చేప.

**సోరణగండి, సోర్ణగండి** or **సోరణము** *n.* : A window, a skylight. గవాక్షము. **సోరణదివియలు** *n. plug.* : Lights kept in the windows. గవాక్షము లందరి దీపములు.

**సోరు** or **సోరుప్పు** *n.* : A salt-petre, పెట్లుప్పు, క్షారము. సోరుప్పు ద్రావకము nitric acid.

**సోల** *n.* : A certain dry measure, equal to a seer. పదునారు డబ్బుల యెత్తు వస్తువు పట్టే కొలది, శాస్త్రకారుడు చెప్పినది తొమ్మన్నూరు గింజలు పట్టేది. **సోలెడు** *adj.* : A small pailful. అరతవ్వెడు.

**సోలము** : See under సోల.

**సోలు** *v.n.* : to reel, stagger, faint; to become stupid. జోగు, వివశత్వము నొందివ్రాలు.

**సోలుపు** *n.* : A line, a row, వరుస, పంక్తి. **సోలుపుగా** *adv.* : In a line or row, వరుసగా.

**సోల్కట్లు** *n.* : Words or sounds used by the manager of a band of dancers. ఆటకొలిపించడములో పట్టువు కాడు తధిక్కు, తకథైథై అని చెప్పేటిది. **సల్లుంతనము** *n.* : Irony, taunt, sneer, jeering, సోత్ప్రాసము. ఎత్తిపొడుపు మాటలు.

**సోళాదొప్పి** or **సోళాందొప్పి** *n.* : A kind of gambling. ద్యూతవిశేషము.

**సోహము** *n.* : I am He, The Deity and I are one. అతడే నేను అతడు అనగా ఈశ్వరుడు, పరమాత్మ; నేను అనగా జీవుడు, జీవాత్మ, అతడే నేననగా జీవాత్మ పరమాత్మలకు భేదము లేదనుట.

**సౌందర్యము** *n.* : Beauty, అందము, చక్కదనము.

**సౌకర్యము** *n.* : Health, good condition, comfort. స్వస్థత, అనాయాసము, మా అప్పకు ఒళ్లు సౌకర్యము లేదు. my father is not well. దేహ సౌకర్యము లేదు. **సౌకర్యముగా** *adv.* : In good health, comfortably, ఆరోగ్యముగా, కుదురుగా, సౌఖ్యముగా.

**సౌకుమార్యము** *n.* : Delicacy, tenderness, మృదుత్వము, సుకుమారత్వము.

**సౌఖశాయనికుడు** or **సౌఖసుప్తికుడు** *n.* : A bard or ministrel, whose duty it is to waken the prince in a morning with music and song. వైతాళికుడు, రాజులను నిద్ర మేలుకొలుపువాడు. సుఖ నిద్రయాయని ప్రశ్నము చేయువాడు.

**సౌఖ్యము** *n.* : Ease, health, relief, comfort. సుఖము, హాయి. ఈ ఇంట్లో నాకు సౌఖ్యము లేదు I am not comfortable in this house. నీకు ఒళ్లు సౌఖ్యముగా నున్నదా are you well ?

**సౌగంధికము** *n.* : The white water lily. *Nymphea lotus*. చెంగలువ. Sulphur, గంధకము.

**సౌచికుడు** *n.* : a tailor, బట్టలు కుట్టువాడు, కుట్రపువాడు, దర్జీ.

**సౌజన్యము** *n.* : Good nature, urbanity, kindness, friendship.

**సౌదామని** or **సౌదామిని** *n.* : Lightning. మెరుపు.

**సౌదాయికము** *n.* : A dowry given by the parents or by the brothers of the bride.

**సౌధము** *n.* : a amansion, a palace. రాజగృహము, నగరు, మేడ.

**సౌనికుడు** *n.* : A butcher. కటికవాడు.

**సౌప్తికము** *adj.* : Connected with or relating to sleep. నిద్రా సంబంధమైన.

**సౌభాగ్యము** *n.* : Auspiciousness. good fortune. మంచి అదృష్టము, సుభగత్వము. **సౌభాగ్యవతి** *n.* : A good wife, a good woman. A woman whose husband is living. ముత్తైదువ.

**సౌమనస్యము** *n.* : Friendliness. favourableness of mind or disposition. మంచి మనసు కలిగియుండడము. స్నేహభావము.

**సౌమ్యము** *adj.* : Lunar, Handsome, pleasing, Mild, gentle, placid. చంద్ర సంబంధమైన. సుందరమైన, శాంతమైన, తిన్నని.

**సౌర** *adj.* : Solar, or belonging to the sun. సూర్యసంబంధమైన, సైరజపము worship of the sun. **సౌరము** or **సౌరమతము** *n.* : The school of the worshippers of the sun. సూర్యోపాసకుల సిద్ధాంతము.

**సౌరమానము** *adj.* : Measured by the sun. solar. సూర్యగతిని బట్టి యేర్పరచ బడ్డ సూర్యసంబంధమైన.

**సౌరభము** or **సౌరభ్యము** *n.* : Odour, fragrance. వాసన, పరిమళము. **సౌరభేయము** *n.* : An ox, బలీవర్థము, ఎద్దు.

**సౌరాష్ట్రము** *n.* : the name of a country and of a certain tune. ఒకదేశము రాగవిశేషము.

**సౌరి** *n.* : A name of Sani. శనైశ్చరుడు. Also, of Yama, యముడు.

**సౌరికుడు** *n.* : An arrack merchant, a wine-seller. సారాయి అమ్మేవాడు, కల్లు అమ్మేవాడు.

**సౌరు** or **సవురు** *n.* : Bloom, beauty, చక్కదనము, Manner, విధము. *adj.* : beautiful, మనోయజ్ఞము.

**సౌవర్చలము** *n.* : Suchal salt, natron, alkali. ఒకవిధమైన ఉప్పు.

**సౌవర్ణి** *adj.* : Golden, made of gold. బంగారుతో చేసిన, బంగారు గల.

**సౌవిదల్లుడు** or **సౌవికుడు** *n.* : A guard over a harem. అంతఃపురపు కావలివాడు.

**సౌవీరము** *n.* : Antimony, colyrium. కాటుకరాయి, నీలాంజనము. Sour rice water, పులికడుగు నీళ్లు.

**సౌశీల్యము** *n.* : Well-disposedness, natural amiability; సుశీలత్వము, సుశీలత, మంచి స్వభావము.

**సౌష్టవము** *n.* : Beauty, goodness, excellence. సుష్ఠుభావము, చక్కదనము, తిన్నదనము. అవయువ సౌష్టవము గలవాడు a well made man, a well proportioned man.

**సౌహార్దము** or **సౌహృదము** *n.* : Friendship, స్నేహము.

**స్కందుడు** *n.* : The name of the god of war, Kumaraswami. కుమారస్వామి.

**స్కంధము***n.* : The shoulder or the head of the humerus. భుజ శిరస్సు. The trunk of a tree, కొమ్మలక్రిందిమాను, చెట్టుబోదె. A chapter, ప్రకరణము. **స్కంధావారము** *n.* : A camp, a battling place. దండువిడిసిన చోటు, శిబిరము. An army, దండు.

స్కనము *adj.* : Fallen down or fro; trickling out or down. చుంత్యవు, గళితము, జారిన.

**స్ఖలనము** *n.* : Stumbling, slipping, tripping, dripping, trickling. చ్యుతి, తొట్రుపడడము, జారడము. **స్ఖాలిత్యము** *n.* : An error, omission, తప్పు, పొరపాటు.

**స్టాంపు** or **స్టాంపు** *n.* : A stamp, ముద్ర, స్టాంపుకాగితము a stamped paper.

**స్తంబము** *n.* : A clump of grass. A sheaf of corn. తృణాదిగుచ్ఛము. దుబ్బు. **స్తంభేరమము** *n.* : An elephant, ఏనుగు.

**స్తంభము** *n.* : A pillar, a post, a stalk, stem, trunk, కంబము.**స్తంభించు** *v.n.* : To stop, to become motionless, stupefied or insenible. నిలిచిపోవు, ప్రమానుపడు.

**స్తనము** *n.* : A woman's breast. కుచము, చన్ను.

**స్తనయిత్నువు** *n.* : A cloud, మేఘము.

**స్తబకము** *n.* : A cluster of blossoms, a bunch of flowers, a nosegay or bouquet, గుచ్ఛము, పూగుత్తి.

**స్తబ్ధము** *adj.* : Fire, stiff, motionless, immovable, paralized, stupefied, stupid, dull. చేష్టారహితమైన, నిశ్చేష్టితమైన, బిరుసుగానుండే.

**స్తవము** *n.* : Praise, స్తోత్రము.

**స్తిమితము** *adj.* : Slow, soft, gentle, dull. మందమైన, తిన్నని అతని ఒళ్లు స్తిమితముగా నున్నది he is a little better. ఇప్పుడు ధర స్తిమితముగా నున్నది at present the sale is dull, మందముగానున్నది.

**స్తుతి** *n.* : Praise, applause. స్తోత్రము. **స్తుతించు** or **స్తుతియించు** *v.a.* : To praise, applaud. స్తోత్రముచేయు, పొగడు. **స్తుత్యము** adj. Laudable, praiseworthy పొగడదగిన, స్తోత్రము చేయదగిన.

**స్తూపము** *n.* : A mound of earth, దిబ్బ.

**స్తేనుడు** *n.* : thief, robber. దొంగ.

**స్తోకము** *adj.* : Little, small, diminutive. అల్పమైన, సూక్ష్మమైన.

**స్తోత్రము** *n.* : Praise, appiguse. స్తుతి. **స్తోత్రించు** *v.a.* : To praise, applaud. స్తుతించు పొగడు, స్తోత్రముచేయు.

**స్తోభము** *n.* : False or deceptive encouragement, deceptive promises. తప్పు ప్రేరేపణ, కపట వాక్యము, మాయమాటలు.

**స్తోమము** *n.* : A mass, heap, quantity, assemblage, multitude, crowd, body, troop, company, crew, gang, club, pack, host, army. సమూహము, గుంపు, దండు. Praise, స్తోత్రము. A sacrifice, యజ్ఞము. ధూమస్తోమము a volume of smoke.

**స్త్రీ** *n.* : A woman. ఆడుది. *adj.* : Female, feminine. స్త్రీ లింగము.

**స్థండిలము** *n.* : A level square piece of ground. prepared for a sacrifice. అగ్నిస్థాపనార్థము చతురస్రముగా బాగుచేయబడిన ప్రదేశము, అలికిన స్థలము.

**స్థగనము** *n.* : A covering, concealment. కప్పడము, అచ్ఛాదనము.

**స్థపతి** *n.* : an architect, a master carpenter or builder. రథకారుడు. An excellent person, శ్రేష్ఠుడు.

**స్థలము, స్థళము** or **స్థలి** *n.* : A place, spot, locality, region, district, స్థానము, ప్రదేశము, పట్టు. Room, space. పరస్థలము a foreign or strange place. పరస్థలపువాడు a person from another place.

**స్థవిరము** *adj.* : Old, aged ముసలి, ఏండ్లుచెల్లిన.

**స్థవిష్ఠము** *adj.* : Very big or fat. మిక్కిలి స్థూలమైన.

**స్థనీయము** *adj.* : Solid, compact. Very stout; great, respectable. మిక్కిలి, స్థూలమైన, గొప్ప, దొడ్డ.

**స్థాణుడు** *n.* : A name of Siva. శివుడు, శాఖా శూన్య వృక్షము, మోడు. A nail, మేకు.

**స్థాత** *n.* : One who is or resides. ఉండువాడు, నివాసి.

**స్థానము** *n.* : A place, situation, spot, site, ground, space, a home, abode, position, post, dignity, స్థలము, ప్రదేశము, పదము, ఉనికిపట్టు. త్రిస్థానములు three shrines; these are ద్రాక్షారామము, భీమేశ్వరము, శ్రీశైలము. **స్థానీయము** *n.* : A city, a town, పట్టణము.

**స్థాపించు** *v.a.* : To set up, erect, found, నిలువు. To eatablish, confirm, ప్రతిష్ఠ చేయు, ఏర్పరచు, నిర్ధారణచేయు.

**స్థామము** *n.* : Bodily strength or vigor, శరీరబలము.

**స్థాయి** *n.* : That which exists. ఉండునది. *adj.* : Existing, ఉన్న. Steady, firm, unchangeable, permanent.

**స్థాలి** *n.* : Any small pot. కుంభము, కుండ, A cooking pot, వంటకుండ. **స్థాలీపులాకన్యాయము** judging of the whole by a part; for the whole pot is boiled if a spoonful is. కుండెడు

అన్నమునకు ఒక మెతుకును పట్టి చూచుట అను న్యాయము.

**స్థావరము** *adj.* : Fixed, stationary, firm, stable, immovable.

**స్థాసకము** *n.* : Perfuming, smearing the body with sandal or fragrant unguents. గంధాదులవైపూత, కుంకుమ మొదలైనవాని పూత.

**స్థాస్నువు** *adj.* : Firm, stable, permanent, నిలకడైన, స్థిరమైన, బహుకాలము ఉండునట్టి.

**స్థితము** *adj.* : Standing, staying, being, situated, ఉన్న, నిలుచున్న. **స్థితి** *n.* : State, condition.

**స్థిర** *n.* : The earth. భూమి. **స్థిరము** *adj.* : Fixed, firm, stable, steady, steadfast, immovable, permanent, lasting, enduring, కదలని, నిలుకడైన, స్థావరమైన, నిశ్చయమైన, నిర్ణయమైన. **స్థిరవారము** *n.* : Saturday, శనివారము, మందవారము, **స్థిరాస్తి** immovable property.

**స్థూణ** *n.* : A post, a pillar, An anvil. An iron image. స్తంభము, దాగిలి, ఇనుపప్రతిమ.

**స్థూరి** *n.* : A pack horse. బరువు మోయు గుర్రము.

**స్థూలము** *adj.* : Large, bulky, thick, fat, corpulent, Corporeal, as opposed to spititual. బృహత్తైన, లావుదైన.

**స్థేమము** *n.* : Bodily strength, శరీరబలము.

**స్థేయుడు** *n.* : A very steady person. మిక్కిలి స్థిరుడు.

**స్థైర్యము** (from స్థిరము) *n.* : Steadiness, steadfastness, stability, స్థిరత్వము, ధీరత, దార్ఢ్యము.

**సౌణేయము** *n.* : A sort of perfume, గండివనము.

**స్థౌల్యము** *n.* : Bulk, largeness, greatness, fatness, corpulence, thickness. స్థూలభావము, బృహత్త్వము, లావు.

**స్నపనము** *n.* : Bathing, washing, ceremonial, ablutions. స్నానము. స్నపనపాత్ర a vessel used for worship.

**స్నస** *n.* : A very fine artery or vein. సన్నపునరము.

**స్నాతకుడు** *n.* : a Brahmin who is a householder, duly initiated after completing his studies. వివాహర్థముగా స్నాతక వ్రతము చేయువాడు, స్నానశీల వ్రతుడు, సమావర్తనముచేసి గృహస్థు అయినవాడు.

**స్నాయువు** *n.* : A tendon, a muscle, described as a tubular vessel attached to the bones at either end, and conveying vital air. సంధిబంధనము, నరము, సన్నపు నరము. స్నాయు బంధనము a ligament. స్నాయు చక్రములు muscle rings.

**స్నిగ్ధము** *adj.* : Smooth, soft, నున్నని. Thick. సాంద్రమైన, చిక్కని Amiable, affectionate, kind, స్నేహము గల.

**స్నుష** *n.* : A daughter-in-law, కోడలు.

**స్నేహము** *n.* : Love, affection, fondness, friendship. ప్రేమ, చెలిమి. Oil, unguent, తైలము, చమురు, ప్రాణ స్నేహము intimate friendship.

**స్పందము** *n.* : Motion, a slight movement, shaking, vibrating, fluttering, quivering, agitation. ఇంచుక కంపము, చలనము, కదలడము, వణకడము.

**స్పర్ధ** *n.* : Emulation, jealousy, envy, vying, competition, rivalry. పోటి, వీరప్రతివీరవాదము, సంఘర్షణ, పరస్పర స్పర్ధలు mutual emulations.

**స్పర్శ** or **స్పర్శము** *n.* : Touch, contact, Feeling, the sense of touch, తాకడము, తగలడమ.

**స్పష్టము** *adj.* : Clear, plain, distinct, apparent. విశదమైన, ఇది స్పష్టమైన అబద్ధము this is an evident lie.

**స్పృక్కు** *n.* : Touching, స్పర్శము. Connection, affinity. సంబంధము. **స్పృశించు** or **సంస్పృశించు** *v.a.* : To touch, feel, తాకు.

**స్పృహ** *n.* : Wish, desire, hope. ఇచ్ఛ, ఆశ, కోరిక, నిస్పృహ void of desire. వారు అందును గురించి నిస్పృహులై యున్నారు they have no hope of it.

**స్ఫట** *n.* : A snake's hood. పడగ. **స్ఫటి** *n.* : A snake, పాము.

**స్ఫటికము** *n.* : Crystal, quartz. పటికపు రాయి.

**స్ఫాయత్** *adj.* : Expanding, విస్తృతమైన.

**స్ఫారము** or **స్ఫారకము** *adj.* : Great, large. భూయిష్ఠమైన, పెద్ద, అధికమైన.

**స్ఫీతము** *adj.* : Swollen, enlarged, spacious, Much, many. పీనమైన, విశాలమైన, బహుళమైన.

**స్ఫుటనము** *n.* : Splitting, భేదించుట.

**స్ఫుటము** *adj.* : Blown, open, expanded. వికసించిన. Clear, plain, manifest, విశదమైన, గ్రహస్ఫుటము or స్ఫుట గ్రహము the true place of a planet.

**స్ఫురణము** *n.* : Quivering, vibrating, tremulous motion, gleaming, sparkling, glittering, shining, blooming, expanding. కదలడము, అదరడము, వణకడము, తళతళమనడము, మెరయడము, ప్రకాశించడము, విజృంభణము. An idea occuring to the mind. తోచుట. **స్ఫురత్** *adj.* : Gleaming, glancing, flashing, sparkling, shining. ప్రకాశించే, తళతళ మని మెరిసే. **స్ఫురించు** *v.n.* : To quiver, tremble, shake, gleam, glitter, To occur or come into the mind. చలించు, కదలు, ప్రకాశించు. తోచు, జ్ఞాపకము నకు వచ్చు.

**స్ఫులింగము** *n.* : A spark of fire. అగ్ని కణము, మిణుగురు.

**స్ఫూర్జిత** *adj.* : Thundering.

**స్ఫూర్తి** *n.* : Excitation, palpitation, vibration, tremulousness. Manifestation. Excess, fulness; expanding, prevalence. Gleaming,

sparkling, shining, ప్రవృత్తి, కంపము, ప్రకాశము, ఉదయము, విజృంభణము, అతిశయము, పరిపూర్ణత. Thinking, తోచుట.

**స్ఫోటము** *n.* : Breaking, bursting. చిట్లడము, చితకడము, భేదనము, బద్దలు చేయడము. A boil, a tumour, కురుపు : **స్ఫోటకము** *n.* : A boil, lain, pustule, blister. కురుపు, బొబ్బ. The small pox, మశూచికము.

**స్మయము** *n.* : Pride, arrogance, గర్వము. Wonder, అద్భుతము, ఆశ్చర్యము. **స్మయమానము** *adj.* : Smiling. చిరునవ్వుగల.

**స్మరణము** *n.* : Memory, recollection, remembering, thought. తలంపు, చింత, జ్ఞప్తి. తలచు.

**స్మరుడు** *n.* : Manmatha, మన్మథుడు, మరుడు, స్మరహరుడు an epithet of Siva, శివుడు.

**స్మారకము** *adj.* : That reminds, that refreshes the memory. తలంపును పుట్టించే. *n.* : Consciousness, sense. స్మృతి, తెలివి, బుద్ధిస్వాధీనము.

**స్మార్తము** *adj.* : Agreeable to or based on the Smritis, legal, canonical, స్మృతిశాస్త్ర సిద్ధమైన.

**స్మార్తులు** *n.* : The followers of the doctrines of Sankara Charya which inculcate the worship of both Vishnu and Siva. శంకరాచార్యులవారి మతమును అవలంభించినవారు.

**స్మితము** or **స్మితి** *n.* : A smile, చిరునవ్వు. మందస్మితము a gentle smile.

**స్మితము** *adj.* : Smiling, Blown, opened, blooming, చిరునవ్వుగల, వికసితమైన.

**స్మృతి** *n.* : Recollection, memory, remembrance, understanding. స్మరణ, తెలివి, తలంపు, బుద్ధి. The code of Hindu law; jurisprudence, a law book or code of laws, ధర్మసంహిత, ధర్మశాస్త్రము.

**స్మేరము** *adj.* : Smiling, laughing, చిరునవ్వుగల. Blown, opened, వికసించిన.

**స్యందనము** *n.* : A car, a war chariot. రథము. A tree called *Dalbargia onyeinensis*. తినిసె వృక్షము, తినాసము, అతిముక్తకము, నెమ్మిచెట్టు.

**స్యందము** or **స్యందనము** *n.* : Oozing, tricking, dropping, flowing, స్రవించుట, కారుట, స్యంది. syandi, *adj.* : Oozing, tricking. స్రవించే, జారె.

**స్యదము** *n.* : Speed, velocity వేగము, వడి.

**స్యన్నము** *adj.* : Flowing, dropping, tricking, జారే, కారే, స్రవించే.

**స్యాలుడు** or **శ్యాలుడు** *n.* : A wife's brother. భార్య తోడబుట్టినవాడు. **స్యాలిక** or **శ్యాలిక** n. A wife's sister.

**స్యూతము** *adj.* : Sown, stitched. కుట్టబడ్డ.

**స్రక్కు** *n.* : A chaplet, wreath, garland, పూదండ.

**స్రగ్గు** or **సగ్గు** *v.* : To go off, diminish, be abated; to pine, to become thin, to die తగ్గు. క్షీణించు, చచ్చు, నశించు.

**స్రజము** *n.* : A chaplet, wreath, garland. పూదండ.

**స్రవము, స్రవణము** or **స్రావము** *n.* : Oozing, tricking, dripping, కారడము, **స్రవంతి** *n.* : A river, నది. **స్రవించు** or స్రవియించు *v.n.* : To ooze, trickle, flow, కారు.

**స్రష్ట** *n.* : The Creator. A name of Brahma. బ్రహ్మ.

**స్రస్తము** *adj.* : Fallen down. dropped. పడిన, జారిన, ప్రస్తోత్తరీయము her fallen robe.

**సావకము** *adj.* : Oozing, trickling, flowing, కారునట్టి.

**స్రావణము** *n.* : The pincers or nippers used by a gold smith, కంసలవాని కొరముట్టు.

**స్రావము** : See స్రవము.

**స్రావి** : Same as సరవి.

**సుంకు** *v.n.* : to withdraw from. వెనుదీయు. To be afraid of. భయపడు To close (as a flower) **ముడుగు** To be folded, to be crumpled, as skin. ముడత పడు. To be diminished, తగ్గు, క్షీణించు.

**స్రుక్కు** or **స్రుచము** *n.* : The ladle with which ghee is poured into a sacrificial fire. ఆజ్యాహుతిచేసే మానిగరిటె.

**స్రుతము** *adj.* : Flowed, dropped, oozed. గళితమైన జారిన, కారిన. **స్రుతి** *n.* : Flowing, dropping, కారడము.

**స్రువము** *n.* : A ladie used at sacrifices. ఆజ్యాహుతిచేసే మానిగరిటె.

**స్రోతస్సు** *n.* : A stream, current, the flow of a river. జలప్రవాహము. **స్రోతస్విని** n. A river, నది, నీరు.

**స్వంతము** *adj.* : Own, private, belonging to one's self. స్వకీయమైన. దాన్ని స్వంతానికి కొనుక్కొన్నాడు he bought it on his own account.

**స్వకము** *adj.* : Proper, peculiar, own. స్వకీయమైన, తన.

**స్వకీయము** *adj.* : Peculiar, own, private, of one's own. సొంతమైన, తన.

**స్వచ్ఛందము** *adj.* : Spontaneous, voluntary, uncontrolled, self-willed, independent. స్వేచ్ఛగా నుండే, యథేచ్ఛముగా నుండే, స్వతంత్రమైన, మనసు నచ్చినట్టు ఉండే.

**స్వచ్ఛము** *adj.* : Clear, transparent, pellueld, white, pure, నిర్మలమైన, నిష్కళంకమైన, శుభ్రమైన.

**స్వతః** *adv.* : Naturally, of itself, instinctively, personally, spontaneously. **స్వతస్సిద్ధము** or **స్వతస్సిద్ధమైన** *adj.* : Self made or self existent, inherent by nature. సహజమైన.

**స్వతంత్రము** *adj.* : Independent, not subject to any other's will, free uncontrolled, head-strong, despotic, యథేచ్ఛయైన, విచ్చలవిడిగా నుండే, పరతంత్రముకాని, పరాధీనముకాని.

**స్వత్వము** *n.* : A natural condition of things. ఉన్నది ఉన్నట్టు ఉండడము.

**స్వనము** *n.* : Sound, noise, ధ్వని. **స్వనత్** *adj.* : Sounding, మ్రోగెడు. స్వనత్కాహళము a pealing trumpet.

**స్వపచుడు** or **శ్వపచుడు** *n.* : A man of a low caste, a Pariah. చండాలుడు, అంతావసాయి, మాలవాడు.

**స్వప్నము** *n.* : A dream, vision, dreaming, కల. sleep, నిద్ర.

**స్వభాను** *n.* : The name of a Telugu year.

**స్వభావము** *n.* : Nature, natural state, property, disposition, peculiarity, inclination, turn of mind. సహజమైన గుణము.

**స్వము** *n.* : Property, wealth, ధనము. Self, తాను, *adj.* : Own, తన.

**స్వయము** *adj.* : One's own, స్వకీయమైన. **స్వయముగా** *adv.* : Of one's own self or accord, spontaneously in person. తానే, తనకుతానే స్వేచ్ఛగా, ఆయన స్వయముగా వచ్చిన came in person. **స్వయంకృతము** *adj.* : Self-done, self-formed. తనకు తానే చేసుకున్న. స్వయంకృతానర్థము harm brought upon oneself. **స్వయంకృతాపరాధము** a sin committed voluntarily. **స్వయంకృషి** *n.* : Personal effort, own labour, self-culture. **స్వయంభువు** *adj.* : Self existent, self formed, self produced. తనకు తానే పుట్టిన, పుట్టినది పుట్టినదిగా ఉండే.

**స్వరము** *n.* : A voice, sound, noise, note, tone, tune. A vowel. An accent. Air breathed through a nostril. కంఠధ్వని, రవము, ధ్వని, తానము, షడ్జాది సంగీత స్వరము, అచ్చు, ఉదాత్తాదివేద స్వరము, నాసాపవనము, ఒక ముక్కుగుండా విడువబడిన గాలి. **స్వరపేటిక** *n.* : The larynx.

**స్వరాట్టు** or **స్వరాటు** *n.* : An epithet of Brahma, బ్రహ్మము.

**స్వరువు** *n.* : Indra's thunder bolt. వజ్రాయుధము.

**స్వరూపము** *n.* : The real nature of a thing, an image, one's own proper shape or body, the natural figure or form, the natural state, condition or purpose. Truth, a definition. స్వభావము. యుదార్థ్యము, వివరము, నిజమైన ఆకారము.

**స్వర్గము** *n.* : The paradise of Indra, in which mortals receive the reward of their virtuous acts, దేవలోకము. మా తండ్రి స్వర్గస్థుడైన తరువాత after my father died.

**స్వర్ణము** *n.* : Gold. కనకము, బంగారు. స్వర్ణరససిద్ధి alchemy. **స్వర్ణకారుడు** *n.* : A goldsmith. కంసలవాడు.

**స్వర్భానువు** or **స్వర్భానుడు** *n.* : The personified ascending node, రాహువు.

**స్వర్లోకము** : Same as స్వర్గము.

**స్వల్పము** *adj.* : Very little, small, few, trifling, insignificant. కించిత్తు,

సూక్ష్మమైన, మిక్కిలి అల్పమైన. స్వల్ప దినములలో in a few days. స్వల్ప దూరము a little way off. స్వల్ప కార్యము a trifling work of business.

**స్వస** *n.* : A sister, తోడబుట్టినది.

**స్వస్తి** : A Skt. particle meaning Excellent; well done! may good attend you! may it be well with you! So be it; A men. n. Welfare, క్షేమము, పుణ్యము, మంగళము, శుభము. **స్వస్తివాచనము** a blessing or benediction, any benedictory speech.

**స్వస్తికము** *n.* : Any lucky or suspicious object. మంగళ వస్తువు. A building or palace facing east, తూర్పు వాకిలిగల మందిరము. The meeting of four roads, చదుకము.

**స్వస్తిముఖము** *n.* : A letter or epistle, జాబు.

**స్వస్థము** *adj.* : Easy, well, at ease, in good health, sound. నెమ్మదిగానున్న, ఆరోగ్యమైన, స్వస్థ చిత్తము a mind at ease. **స్వస్థత** or **స్వస్థము** *n.* : Health, soundness, convalescence. ఆరోగ్యము.

**స్వాంతము** *n.* : The mind, the faculty of thought and feeling. The heart, మనస్సు.

**స్వాగతము** (స్వ+ఆగతము) *n.* : Welcome, salutation, receiving. క్షేమము, కుశలము, కుశల ప్రశ్నము, సుఖముతోడి రాక.

**స్వాతంత్ర్యము** *n.* : Independence. freedom, liberty. స్వతంత్రభావము, స్వతంత్రత, ఆత్మవశత్వము, స్వేచ్ఛాధీనత, విచ్చలవిడిగా నుండడము.

**స్వాతి** *n.* : Arcturus, the fifteenth lunar asterism. చిత్తకు అవతలి నక్షత్రము, పదిహేనో నక్షత్రము.

**స్వాదనము** *n.* : Drinking, పానము, **స్వాదము** *n.* : Taste; రుచి. Tasting, రుచిచూచుట.

**స్వాధీనము** *n.* : Charge, trust, subjection, possession, power, control. వశము, అధికారము.

**స్వాధ్యాయము** *n.* : Inaudible reading, muttering of prayers, study of the Vedas. జపము, వేదాధ్యయనము. The vedas, వేదము. స్వాధ్యాయి one who studies the Vedas. వేదాధ్యయనము చేయువాడు.

**స్వానము** *n.* : Sound, noise, ధ్వని, రవము.

**స్వాపతేయము** *n.* : Wealth, property. విత్తము, ద్రవ్యము.

**స్వాపము** *n.* : Sleep. నిద్ర.

**స్వాభావికము** *adj.* : Natural, innate, inherent, peculiar. స్వభావముచేత కలిగిన, సహజమైన ప్రకృతి సిద్ధమైన.

**స్వాభిమానము** *n.* : Favouritism. తనదనే విశ్వాసము. వానికి స్వాభిమానమే ముఖ్యము he is guided solely by favouritism.

**స్వామి** *n.* : A lord, master, sovereign, owner, proprietor, husband, spiritual guide or preceptor.

**స్వారస్యము** *adj.* : Pleasing, delicious, good, excellent.

**స్వారాజ్యము** *n.* : The celestial region, heaven, స్వర్గరాజ్యము, స్వర్గలోకపు దొరతనము.

**స్వారి** *n.* : A pleasure excursion. వాహ్యాళి, విహారము.

**స్వార్జితము** *adj.* : Self-acquired, obtained or accumulated by one's own labour. తన సంపాద్యమైన, స్వకాయకష్టముచేత సంపాదింపబడ్డ.

**స్వార్థము** *n.* : Regard to one's self, selfinterest, personal benefit. స్వప్రయోజనము, తన మేలు. **స్వార్థపరుడు** *n.* : A selfish man, he who is devoted to his own interest. స్వప్రయోజనమునే సముఖ్యముగా విచారించేవాడు, స్వసుఖమునే విచారించేవాడు.

**స్వాస్థ్యము** *n.* : Ease, happiness, comfort, relief, recovery, abundance of food and reiment. A share in a Brahmin village, a share. నెమ్మది, ఆరోగ్యము, వస్త్రాశనసమృద్ధి.

**స్వాహ** or **స్వాహా** *interj.* : Hail! An exclamation and in making an oblation to the gods.*n.* : The name of the wife of the god of fire. a goddess presiding over burnt offerings, దేవతలకు హవిస్సును ఆహుతి చేసే టప్పుడు చెప్పే మాట, అగ్ని భార్య.

**స్విన్న** *adj.* : Sweating, perspiring. చెమర్చే స్రవించే.

**స్వీకరించు** *v.a.* : To adopt, embrace, acknowledge, receive. అంగీకరించు, గ్రహించు, పుచ్చుకొను. **స్వీకారము** *n.* : Adopting, appropriating.

**స్వీయము** *adj.* : Own, one's own, relating or belonging to one's self. ఆత్మీయమైన. ఆత్మసంబంధమైన, తన. **స్వీయ** *n.* : A virtuous woman, a wife who is entirely devoted to her husband. పతియందు మాత్రము అనురాగము గల నాయిక, పతివ్రత, సాధ్వి.

**స్వేచ్ఛ** *n.* : One's own will or pleasure, liberty, free will, self-will, స్వతంత్ర, యథేచ్ఛ. ఆత్మేచ్ఛ. తన మనసు.

**స్వేదని** *n.* : An iron plate used as a frying pan. పెనము.

**స్వేదము** *n.* : Sweat, perspiration, warmth, heat. ఘర్మము, చెమట, సాత్విక భావభేదము.

**స్వైరము** *adj.* : Self-willed, pertinacious, obstinate. యథేచ్ఛమైన, స్వతంత్రమైన, మూర్ఖమైన. **స్వైరి** *n.* : An independent man, స్వతంత్రుడు. **స్వైరిణి** *n.* : An unchaste wife, an adulteress, a wanton woman పాంసుల, వ్యభిచారిణి.

# హ

**హ** : The letter H.

**హంకరించు** *v.n.* : To be proud. అహంకరించు.

**హంగామి** *adj.* : Temporary, తాత్కాలికమైన. హంగామి సిబ్బంది a temporary establishment.

**హంగు** or **అంగు** *n.* : Convenience, agreeableness. ఒనరు, పొంకము దిగడమునకు హంగు అగులాగున so as to be convenient to get down.

**హంగుపరచు** *v.a.* : To make convenient. అనుకూలపరుచు. **హంగైన** *adj.* : Convenient, agreeable, ఒనరైన.

**హంజిక** *n.* : A certain medicinal root. బ్రహ్మణయష్టిక, చిరితేకు.

**హండ, హండా** or **హండి** *n.* : A large wide mouthed vessel.

**హంత** (from హన్ to kill) *n.* : A murderer, a slayer, a murderess. ఘాతుకుడు, ఘాతుకురాలు. **హంత తనము** *n.* : Cruelty, ferocity. క్రూరత్వము, ఘాతుకత్వము.

**హంతకారము** or **హంతాకారము** *n.* : Food to be given to a guest. అభ్యాగతునికి పెట్టవలసిన అన్నము.

**హంవీరుడు** *n.* : A hero, champion, warrior. క్షత్రియుడు, శూరుడు.

**హంస** or **హంసము** *n.* : A swan. A certain fabulous bird supposed to be a swan. Also, a water-fowl, probably the Ruddy Shieldrake. శ్వేతగరుత్తవు. నీళ్లు విడిచిపాలుద్రాగే పక్షి. **హంసతూలికాతల్పము** a swan's down-bed or couch, a bed stuffed with the wool of the shrub, (జిల్లేడు) or of the silk cotton tree (శాల్మలి or బూరుగు) హంసరెక్కల పరుపు, లేక, బూరుగు దూదిపరుపు. **హంసపాదము** *n.* : A staff, caret or asterisk. ఇక్కడ తప్పిపోయినది అవతల వ్రాసి యున్నదనే దానికి గురుతు.

**హంసాయి** *n.* : A neighbour. హంసాయి గ్రామము a neighbouring village.

**హకీకత్తు** *n.* : An account, a statement, a representation of occurrences of affairs. వృత్తాంతము.

**హక్కసు** *n.* : Spite, hatred, పగ.

**హక్కు** *n.* : A lawful right or title. బాధ్యత. **హక్కుదారుడు.**

**హజారము, హజురు, హుజూరు** or **అజారము** *n.* : Presence. అస్థానము. A royal hall or chamber of audience. A place where persons of distinction sit. ఆస్థానమంటపము. రాజసభ, కొలువు కూటము, నగరికివెలి చావడి.

**హజ్జే** or **అజ్జే** *n.* : A foot. పాదము.

**హట్టము** *n.* : A market, a fair. అంగడివీధి.

**హఠము** *n.* : Obstinacy, violence, severity, contumacy. మూర్ఖత, మొండితనము, ముష్కరిత, బలాత్కారము. **హఠయోగము**

*n.* : Abstract contemplation, whilst suspending the breath. **హఠాత్, హఠాత్తుగా** or **హఠాత్తున** *adv.* : Suddenly, unawares. దబ్బున, లటక్కు, అదరిపాటున.

**హణిగెలు** *n.* : Salutations, reverences. దండములు.

**హతము** *adj.* : Killed, slain, defeated, struck, hit, destroyed, blasted, blotted out. చంపబడ్డ, కొట్టబడ్డ, నాశము చేయబడ్డ, ధ్వంసము చేయబడ్డ, చెరుపబడ్డ, పోగొట్టబడ్డ.

**హత్త** *n.* : Entanglement. తగులుకొనడము, చిక్కుకొనడము.

**హత్తి** *n.* : An elephant, ఏనుగు.

**హత్తు, అత్తు, హత్తుకొను** or **అత్తుకొను** *v.n.* : To adhere to, come in contact with, take to be, attached or addicted to, succeed, attain, approach. అంటుకొను, సక్తమగు, పొందు, కలుగు, డాయు, అంటు, తగులుకొను, సఫలమగు.

**హత్య** *n.* : Killing, slaying, slaughter, murder.

**హదను** or **అదను** *n.* : An opportunity, time. సమయము, కాలము.

**హద్దు** *n.* : A limit, boundary, ఎల్ల, పరిమితి.

**హననము** *n.* : Killing, destroying, చంపడము.

**హనువు** *n.* : The jaw, the upper part of the cheek. చెక్కిలి మీది భాగము.

**హబీసి** *n.* : The name of a country. An Abysinian, an African, a negro, సిద్దీవాడు, నల్లగానుండే ఆఫ్రికాదేశపు మనుష్యుడు.

**హమేషా** *adv.* : continually, always. ఎల్లప్పుడు.

**హయము** *n.* : A horse, గుఱ్ఱము, హయమేధము the sacrific of a horse.

**హయామ** *n.* : Period, time, reign, authority, కాలము.

**హరణము** : See under హరించు.

**హరబ్బి** or **అరబ్బి** *n.* : Arabia. An Arab horse.

**హారము** *adj.* : Expelling, taking away, removing, counteracting evil effects. Stealing. నివారకమైన, పోగొట్టే, దొంగిలించెడి.

**హరామి** *adj.* : Wicked, vicious, దుష్ట.

**హరి** *adj.* : Green, yellow, bay, tawny, పచ్చని, బంగారు వర్ణముగల. *n.* : A name given to Vishnu, Indra and Yama, విష్ణువు, ఇంద్రుడు, యముడు.

**హరించు** or **హరియించు** *v.n.* : To be digested, to waste away, to perish, go off or disappear, as a disease, to subside, క్షయించు, క్షీణించు, జీర్ణించు, అడగు.

**హరిగ** or **అరిగ** *n.* : A shield, కేతనము.

**హరిగోలు** or **అరిగోలు** *n.* : A boat made of wicker work covered with hides, a coracle, చిన్నపుట్టి.

**హరిణము** *adj.* : White, తెల్లని, *n.* : White colour. తెలుపు, శ్వేతవర్ణము. An antelope, కురంగము, ఇఱ్రి. **హరిణి** *n.* : A doe, a female antelope, ఆడులేడి.

**హరితము** *adj.* : Green, verdant. ఆకుపచ్చని. *n.* : Green colour, ఆకుపచ్చరంగు.

**హరిదళము** or **అరిదళము** *n.* : Yellow orpiment, వేషగాండ్రు మూతికి పూసుకొనేటిది.

**హరిద్ర** *n.* : Turmeric. పసుపు.

**హరిస్మణి** *n.* : An emerald. పచ్చ, మరకతము.

**హరిబీకెలు** or **హరిబెయీకెలు** *n.* : Porcupine's quills. ఏదుపందిముండ్లు.

**హరుడు** *n.* : An epithet of Siva. శివుడు.

**హరువు** or **హర్వు** *n.* : Beauty, comeliness, elegance. Skill; a trick. సొగసు, అందము, ఉపాయము, నాణెమైన పని, *adj.* : Fine, pretty, beautiful, clever excellent.

**హరుసము** or **అరుసము** *n.* : Gladness. సంతోషము.

**హర్కారా** *n.* : A messenger, a courier.

**హర్త** *n.* : One who steals or removes, హరించువాడు.

**హర్మ్యము** *n.* : A mansion, palace. రాజగృహము, ధనికుని గృహము. A storeyed house, మిద్దెయిల్లు.

**హర్యక్షము** : See under హరి.

**హర్షము** *n.* : Gladness, joy, exultation. సంతోషము. **హర్షకుడు** *n.* : One who causes joy, one who gives pleasure.

**హలము** *n.* : A plough నాగలి. హలరేఖ in palmistry, a mark in the palm, resembling a plough and denoting victory.

**హలహలము, హాలాహలము** or **హాలాహలము** *n.* : Poison, venom, గరళము.

**హల్కా, హల్కి** or **ఆల్కి** *adj.* : Mean, low, inferior. నీచమైన, క్షుద్రమైన,

**హల్లకము** *n.* : The red lotus. ఎఱ్ఱతామర.

**హల్లకల్లోలము** or **అల్లకల్లోలము** *n.* : A tumult. confusion, disorder, disturbance. తారుమారు.

**హల్లీసకము** *n.* : A dance performed by women moving in a circle and holding sticks in their hands, ఆడంగులు వర్తులముగా నిలిచి ఆడే ఆట, కోలాటము, చేతులు పొడుగుగా నెత్తుకొని ఆడే తాండవము.

**హల్లు** *n.* : A consonant. కకారాద్యక్షరము.

**హల్లోహల** *adj.* : Bewildered, stumbled. తొట్రుపడిన, చీకాకుపడిన.

**హళహళి, హళహళిక, హళాహళి** or **హాళాహళి** *n.* : Haste.

**హళ్లి** *n.* : A cipher, సున్న.

**హవణించు** or **హవనించు** *v.a.* : To wear, to put on, to adorn, to set right. To perform, accomplish. To lay.

ధరించు, అలంకరించు, చక్కబరచు, చెల్లించు, ఉంచు, పెట్టు.

**హవనము** *n.* : A sacrifice, oblation burnt offering. హోమము.

**హవుసు** : Same as హౌసు.

**హవేలి** *n.* : A mansion, a palace నగరు.

**హవ్యము** : See under హవనము.

**హసంతి** or **హసని** *n.* : A portable furnace or fire pot. కుంపటి.

**హసదు, హసాదు** or **అసాదు** *adj.* : Noble, great, దొడ్డ.

**హసనము** or **హసము** *n.* : Laughing, a smile. నవ్వు. **హసించు** *v.n.* : To laugh, smile. నవ్వు.

**హస్తము** *n.* : The hand. చెయ్యి. The arm, భుజము.

**హా** : Ah ! alas ! An interjection expressive of weariness. sorrow, pain, wonder, surprise, or pleasure.

**హాజేరు** *adj.* : Present, ready. హాజరు జామీను bail for producing a culprit. గైరుహాజరు absence. హాజరు పట్టి an attendance register.

**హాజారము** : Same as, హజరము.

**హాటకము** *n.* : gold. బంగారు, హాటకగిరి or హాటకభూధరము the hill called Maha Meru. మహామేరువు. **హాటకగర్భుడు** *n.* : an epithet of Brahma. హిరణ్యగర్భుడు, బ్రహ్మ.

**హాని** *n.* : Loss, damage, detriment, injury, harm, mischief, ruin, peril. తక్కువగుట, నష్టము, చెరుపు, కీడు, చేటు. హాని వృద్ధులు adversity and prosperity.

**హామిక** or **ఆమిక** *n.* : Egotism, pride, vanity, Vigour. గర్వము, కొవ్వు.

**హామితకాని** *n.* : an advance for cultivation on the responsibility of a third person. జామీనుమీద ఇచ్చే వారకము.

**హాయనము** *n.* : A year, సంవత్సరము.

**హాయి** *n.* : Happiness, peace, quiet, comfort. సుఖము, సౌఖ్యము, నెమ్మది, నిమ్మళము. **హారకుడు** *n.* : A thief, robber, plunderer, ravisher, దొంగ, దోచుకొనువాడు, చోరుడు, నాశకుడు.

**హారతి, ఆరతి** or **మంగళహారతి** *n.* : A wave-offering to a diety. An offering of camphor, & c. presented on marriages or such like festivities to prevent the bad effects of an evil eye.

**హారము** *n.* : A necklace, a string of pearls, a garland, a string or row, పేరు.

**హాల** *n.* : Wine, సుర, మద్యము.

**హాలము** *n.* : A plough, నాగలి.

**హాలహలము** or **హాలాహలము** *n.* : Deadly poison. విషము.

**హాలిక** *adj.* : Belonging to a plough, appertaining to farming, agricultural. **హాలికుడు** *n.* : A ploughman, a farmer, a cultivator, a husbandman. కృషికుడు, కాపు, దున్నుకొని బ్రతికేవాడు, రెడ్డి.

**హాలు** *adj.* : Current, present, హాలుసాలు.

**హాల్సాలు** *n.* : The current year, నడిచే సంవత్సరము.

**హాలు** *n.* : A hall.

**హాళి** *n.* : Eagerness, desire, ఆసక్తి. joy, gladness, ఆనందము, సంతోషము, ఉత్సాహము.

**హావడి, హావళి** or **ఆవడి** *n.* : Annoyance, trouble, distress, molestation. ఉపద్రవము, బారి.

**హావము** *n.* : An amorous gesture : dalliance, blandishment. స్త్రీల శృంగార రసభావము వల్ల కలిగే క్రియ, నేత్రాది వికారములచేత తెలియదగిన మనో వికారము.

**హాశ్శీలు, హాస్సీలు** or **హాసీలు** *n.* : Duty, customs, a tax. పన్ను.

**హాసము** or **హాస్యము** *n.* : Laughter, laughing, merriment, sport, fun. నవ్వు, దరహాసము graceful smile. **హాస్యము** *n.* : Joking, jesting. **హాసించు** *v.n.* : To laugh, నవ్వు.

**హాస్తికము** *n.* : A herd of elephants. ఏనుగుల గుంపు. **హాస్తికుడు** *n.* : An elephant driver, మావటివాడు.

**హాహ** *interj.* : How wonderful! Oh! ఆశ్చర్యోక్తి. Alas! alas! ah me! ఖేదోక్తి. **హాహాకారము.**

**హాహుడు** *n.* : One of a class of singers in the heaven of Indra, ఒకజాతి దేవగాయకుడు.

**హింగుది, హింగుదము, హింగుళి** or **హింగుది** *n.* : A small kind of egg plant. Solanum melongena, బృహతి, నేలములక.

**హింగువు** *n.* : A safoetida, ఇంగువ.

**హింగుళము** *n.* : Vermilion, ఇంగిలీకము.

**హిండనము** *n.* : Spread, extension, wandering. వ్యాప్తి, ప్రసరించడము, తిరుగుట.

**హింతాళము** *n.* : The marshy date tree. గిరికతాడిచెట్టు.

**హిందూ** (సింధు) *adj.* : Hindu, ఇండ్యాదేశ సంబంధమైన. **హిందువు** *n.* : A Hindu.

**హిందోళము** *n.* : A certain tune. సంగీతరాగభేదము.

**హింస** or **హింసనము** *n.* : Injury, hurt, harm, evil, torture, mischief, killing. బాధించుట, చంపడము.

**హిక్క** *n.* : Hiccup, hicough, ఎక్కిలి.

**హిజారు** or **ఇజారు** *n.* : A pair of trousers, short breeches, వసిడి పట్టుహిజారు.

**హితము** *adj.* : Good, beneficial, friendly, kind, profitable, మంచి అనుకూలమైన, ప్రియమైన శుభమైన.

**హితవు** or **ఇతవు** : Same as హితము. **హితవరి** or **ఇతవరి** *n.* : A friend. ఇష్టుడు.

**హిమము** *n.* : Dew, frost, snow. మంచు. పాలకూర, Sandal, చందనము. **హిమకరుడు, హిమధాముడు, హిమాంశువు. హిమభానుడు** or **హిమవంతము, హిమాద్రి, హిమాచలము, హిమాలయము** or **హిమ**

**శైలము** *n.* : The snowy mountain, the Himalaya range. మంచుకొండ.

**హిరణ్యము** *n.* : Gold. Wealth, money. బంగారు, సొత్తు, ధనము, రూకలు.

**హీనము** *adj.* : Bad, Low, mean, vile, base. Left, abandoned. తుచ్ఛమైన, నీచమైన, వర్జితమైన, విడువదగిన.

**హీరము** *n.* : A diamond, వజ్రము, రవ.

**హుంకరించు** or **హుంకారించు** *v.n.* : To cry ha! To shout, to yell, to utter a menacing sound. భయంకరముగా హుమ్మను.

**హుంకించు** *v.n.* : To neigh, to groan in making an effort. హుంకించి యొకదుముకు దుమికినాడు he drew in his breath and took a leap.

**హుండి** *n.* : A bill or cheque on a bank, దర్శనహుండి a bill payable at sight.

**హుకుము** *n.* : An order, ఆజ్ఞ.

**హుజుబిక్కొమరుడు** *n.* : An Uzbeck or Tartar. తురకవాడు.

**హుజూరు** *n.* : The presence. Head-quarters, Huzur, సమక్షము,

**హుటాహుటి** *n.* : Swiftness, haste, వేగము, గమనవేగము. *adj.* : Rapid, quick, తీవ్రమైన, వడియైన.

**హుడుక్కు, హుడుక్క** or **హుడక్క** *n.* : n. A small drum shaped like an hour glass, ఢక్కి.

**హుతభుక్కు, హుతవహుడు** or **హుతాశనుడు** *n.* : The god who lives on sacrifices, a title of Agni.

**హుమా** or **హుమాయి** *n.* : A horse, గుఱ్ఱము.

**హుమ్మను** *v.n.* : to cry ho! హుం అని కోపమూర్ఛాదులచేత అను.

**హురుమండి, హురుమండీ, హురు మంజి** or **హుమ్మంజి** *n.* : The name of a country. fine reddish pearl.

**హురుమత్తు** or **హుర్మత్తు** *adj.* : Large, great, much, big. గొప్ప, పెద్ద. *n.* : Honor, esteem.

**హుళక్కి, హుళికి, హుళిక్కి** *n.* : A falsehood, a lie వట్టిమాట, అబద్ధము. Unreality, nothingness, అభావము.

**హుసారు, హుషారు** or **ఉషారు** *n.* : Care, carefulness. watchfulness, wariness, alertness, జాగరూకత, జాగ్రత్త.

**హూ** *n.* : The sound of a yawn. ఆవులించుట యందగు ధ్వని.

**హూణుడు** *n.* : Hun, a barbarian, a European. జాతివాడు, తెల్లవాడు, హుణదేశము Europe. హూణులు the Huns, the Europeans.

**హూతము** or **అహూతము** *adj.* : Called, summoned, invited. పిలువబడిన. **హూతి** or **ఆహూతి** *n.* : A call, calling. పిలుచుట, పిలుపు.

**హూయమానము** *adj.* : Offered as a sacrifice by fire. హోమము చేయబడే.

**హూహువు** *n.* : The name of certain singers in the heaven of Indra, స్వర్గగాయక భేదము.

**హూహూ** *n.* : A cry of "hu, hu" expressive of shivering. చలిచేత హూహూ అనడము.

**హృతము** or **ఆహృతము** *adj.* : Taken, taken away, stolen. హరింపబడిన. **హృతి** or **ఆహృతి** *n.* : Taking away by force or fraud. అపహరణము, హరణము.

**హృత్తు, హృదయము** or **హృది** *n.* : The heart, the mind, the seat of thought and feeling. అంతఃకరణము, మనస్సు. **హృద్యము** *adj.* : Amiable, dear, beloved, affectionate, kind. మనస్సునకింపైన, ప్రియమైన, వాత్సల్యము గల. **హృద్రోగము** *n.* : Disease of the mind. Grief, మనోవ్యాధి.

**హృషితము** *adj.* : Rejoiced, gladdened, surprised, తుష్టమైన, సంతోషింపడిన.

**హృష్టము** *adj.* : Rejoiced, delighted. సంతోషింపబడిన. **హృష్టి** *n.* : Joy. సంతోషము.

**హెగ్గడి** or **హెగ్గడు** *n.* : A chieftain, a headman. పెద్ద, యజమానుడు. రెడ్డి.

**హెగ్గాళ** *n.* : A kind of trumpet. ఒక ఊదువాద్యము.

**హెచ్చు** or **ఎచ్చు** *v.n.* : To increase, grow, multiply, అధికమగు. *n.* : An increase, augmentation. ఆధిక్యము. **హెచ్చరించు** or **ఎచ్చరించు** *v.a.* : To encourage, hint at, allude to, advert to, call to memory, warn, సూచనచేయు.

**హెజ్జిజ్జి** *n.* : A certain tune, రాగవిశేషము.

**హెద్దర** *n.* : the name of the river Heddora. నదీవిశేషము.

**హేజీబు** *n.* : A minster, మంత్రి.

**హేతి** *n.* : A weapon, ఆయుధము. హేతిరాజు the discus or missile weapon of Vishnu, సుదర్శనము. A flame, మంట.

**హేతువు** *n.* : Cause, reason, motive, ground, object, purpose, కారణము. **హేతుకము** *n.* : Reason, cause కారణము.

**హేమంతము** or **హేమంత ఋతువు** *n.* : The cold season, winter. మంచుకాలము, శీతకాలము, చలికాలము.

**హేమము** *n.* : Gold, బంగారు. "హేమాంగి" the golden maid.

**హేయము** *adj.* : That which is to be abandoned, abominable, disgusting, mean, base, vile. త్యాజ్యమైన, తుచ్ఛమైన, అధమమైన, అసహ్యమైన. హేయంబైన సంసారము this vile life.

**హేరంబుడు** *n.* : A proud hero. శౌర్యముచే గర్వించినవాడు. A title of Ganesa. వినాయకుడు.

**హేరవళి** or **హేరావళి** *n.* : A particolored cloth, పొడవన్నెకోక.

**హేరామి** *n.* : Oppression, persecution, annoyance, హింసించుట, ఉపద్రవపరచుట.

**హేరాళము** *adj.* : Much, excessive, great, huge. అతిశయమైన, విస్తారమైన, పెద్ద, లావాటి.

**హేల** or **హేళ** *n.* : Sport, play, wanton delliance. విలాసము, శృంగారచేష్ట, లీల. Scorn, తిరస్కారము.

**హేళి** *n.* : n. the sun. సూర్యుడు. హేళి తనూభవ the river Kalindi. కాళిందీనది.

**హేవాక** or **హేవాకము** *n.* : n. Sport, delliance. విలాసము, ప్రౌఢరీతి, ప్రకాశమాన ప్రౌఢరీతి, స్త్రీల శృంగార భావజ క్రియాభేదము, అభిజ్ఞత.

**హేవిళంబి** *n.* : The name of a Telugu year.

**హేష** or **హేషితము** *n.* : Neighing, a neigh. గుర్రపు సకిలింత.

**హైన్యము** *n.* : n. Baseness, meanness. Nonentity, non-existence. నీచత్వము, అల్పత్వము. హీనత్వము, హీనత, అభావము, లేమి.

**హైమము** *adj.* : Golden, made of gold, appertaining to gold. స్వర్ణమయమైన, స్వర్ణసంబంధమైన. **హైమంతము** adj. cold, wintry. **హైమవతి** *n.* : An epithet of Parvati or of the Ganges. పార్వతి, గంగ.

**హైయంగవీనము** *n.* : Clarified butter prepared a day before it is used, fresh butter. అప్పుడు తరచి తీసిన వెన్న, అప్పుడు వెన్న కాచిన నెయ్యి, సద్యోఘృతము.

**హైరాను** *n.* : Trouble, fatigue. ఆయాసము, శ్రమము.

**హైసరె** interj. Bravo! excellent! good! very well ! well done. శాబాసు. సరే.

**హొంత** *n.* : Trouble, పరిశ్రమము.

**హొన్ను** *n.* : gold, the gold coin called a pagoda, సువర్ణము, కాంచనము, వరహా.

**హొము** or **ఒమ్ము** *adj.* : Big, plump. స్థూలము.

**హొయలు** *n.* : Grace, charm, agreeableness, విలాసము, సొగసు.

**హొరగు** or **హొరంగు** *n.* : Grace, elegance, సొగసు, విలాసము.

**హోడము** *n.* : A ship, boat, ఓడ, నావ.

**హోత** *n.* : A priest who offers aburnt sacrifice, a reciter of the Rig Veda. ఋత్విజుడు, హోమము చేయువాడు, ఋగ్వేదగాయకుడు. **హోత్రి** *n.* : A sacrificer సోమయాజి.

**హోదా** *n.* : Office, authority, rank.

**హోమము** *n.* : a burnt offering, అగ్నియందు పేల్చడము. హోమగుండము a hole in the ground or an altar, for receiving the fire for an oblation. హోమాగ్ని sacrificial fire.

**హోర** *n.* : An expedient, contrivance : a wit, a person clever at expedients. ఉపాయము. ఉపాయశాలి. హోరగలవాడు or హోరమనిషి a clever man. సమర్థుడు, ఉపాయశాలి.

**హోర** *n.* : the twenty-fourth part of a day An hour. గంటసేపు, సమయము. part of the duration of a sign. లగ్నమధ్యభాగము, రాశ్యర్థము. లగ్నాంతము, లగ్నభేదము.

**హోరాట** *n.* : Excitement, eagerness, ఆటోపము.

**హోరాహోరి, హోరాహోరిగా** or **హోరాహోరిన్** *adv.* : Without intermission, ఎడతెగక, లెస్సగా. **హోరాహోరి** *n.* : A quarrel, dispute, రచ్చ, మహత్తయిన పోరు.

**హోరు** adj. Boisterous. *n.* : n. Boisterousness. A roar. హోరుగాలి a tempestuous wind. **హెూరన, హెూరున** or **హెూరని** *adv.* : With a great noise. మహత్తయిన ధ్వనితో.

**హోళి** or **హోలిక** *n.* : The pile (of wood, grass, & c., arranged to be kindled at the close of the Holi feast. కామునిపండుగ కడపటినాడు తగల బెట్టటమునకై పోగుచేయబడు గడ్డికంప మొదలయినవి. **హోళిపండుగ** *n.* : The Holi feast held about the beginning of March, వసంతోత్సవము, కాముని పండుగ.

**హౌత్రము** *n.* : the duty of the reciter of the Rigveda at a sacrifice. యజ్ఞములో ఋగ్వేద మెరిగిన ఋత్విజుని యొక్క కర్మము.

**హౌహూదా** or **హవుదా** *n.* : n. A seat fixed on the back of an elephant, a howdah, అంబారి.

**హౌసు** or **హవుసు** *n.* : Beauty, సొగసు, విలాసము.

**హ్రదము** *n.* : A lake, a large sheet of deep water, నదీమధ్యాగాధ జలాశయము, లోతుమడుగు.

**హ్రస్వము** *adj.* : Short, low in stature, dwarf, little, short, as a vowel; small; less. వామనమైన, పొట్టి, దీర్ఘముకాని, లఘువైన, అల్పమైన.

**హ్రాదితము** *adj.* : Delighted, సంతోషింపబడిన.

**హ్రాదిని** *n.* : Lightning, a thunderbolt, మెరుపు, వజ్రాయుధము. A river, ఏరు.

**హ్రీ** *n.* : Shame, modesty, bashfulness, సిగ్గు, లజ్జ. **హ్రీణము** or **హ్రీతము** *adj.* : Ashamed, bashful, modest, సిగ్గుపడిన.

**హ్రేష** : Same as హేష.

**హ్లాదము** or **హ్లాదనము** *n.* : Joy, pleasure. సంతోషము, సంతోషించుట.

✤ ✦ ✤

